# బాలసాహితీ వికాసం

ఈ రచన
ఆంధ్రా యూనివర్శిటీ
పి హెచ్.డి. డిగ్రీని
త్రిపురనేని గోపీచంద్ మెమోరియల్
స్వర్ణ పతకాన్ని
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ
అవార్డును
పొందిన స్వయశోధిత పరిశోధనా సంహిత

బాలలే విజ్ఞాన హేతువులు
నేడు రేపుల మధ్య సేతువులు
చంద్ర బంధుర సుధా శీతువులు
మానవత్వ వికాస హేతువులు

— శ్రీ శ్రీ

# బాల సాహిత్య ప్రకాశం

డాక్టర్ వెలగా వెంకటప్పయ్య

ప్రతులకు :

సిద్ధార్థ పబ్లిషర్స్

ఏలూరు రోడ్ • విజయవాడ-2

# మనవి

తెలుగు బాల సాహిత్య వికాసం – తెలుగు నాట బాలల గ్రంథాలయ ప్రగతి – అనే విషయం మీద ఆంధ్రా యూనివర్సిటీలో 1977–1980 లో పరిశోధన చేసి పి హెచ్ డి. ని పొందిన సిద్ధాంత వ్యాసంలో తొలి అంశానికి చేర్పులు మార్పులతో ఇది పుస్తకరూపం. రెండో అంశంపై గ్రంథం వీలువెంట వస్తుంది. ఈ సందర్భంలో సహకరించిన పలువురు పెద్దలకు కృతజ్ఞతలు సమర్పించడం నా బాధ్యత. ముఖ్యంగా—

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారం, పరిశోధనా సంస్థ పక్షాన పరిశోధన చేయడానికి అనుమతించిన ఆంధ్రా యూనివర్శిటీకి, పరిశోధన మార్గదర్శకులు డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య, డాక్టర్ లకంసాని చక్రధరరావు గార్లకూ—

పరిశోధనకు అనుమతించి ప్రోత్సహించిన ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ శాఖ సంచాలకులు ఎ. సత్యనారాయణ, సి. గోపీనాథరావు గార్లకూ, పరిశోధనా కాలంలో అనేక సలహాలిచ్చి తోడ్పడిన డాక్టర్ యస్వీ. జోగారావు, డాక్టర్ కొర్లపాటి శ్రీరామమూర్తి,, డాక్టర్ బిరుదురాజు రామరాజు గార్లకూ—

రచనా ప్రణాళిక సిద్ధం చేయడంలో, మెరుగులు దిద్దడంలో తోడ్పడిన గొల్లపూడి ప్రకాశరావు, కవిరావు, పేజెండ్ల సాంబశివరావు, అలవర్తి వెంకట సుబ్బారావు, చొక్కాపు వెంకటరమణగార్లకూ—

ఇందులో కొంత భాగాన్ని చారిత్రిక ప్రగతి ప్రధానంగా రాయగా "తెలుగులో బాల సాహిత్యం" అనే అంశానికి 1979-80 సంవత్సరం తాలూకు ఉత్తమ గ్రంథంగా బహుమతి నిచ్చిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారికీ, అకాడమీ అధ్యక్షులు డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి, కార్యదర్శి డాక్టర్ ఇరివెంటి కృష్ణమూర్తి గార్లకూ—

1981 లో తెలుగులో ఉత్తమ సిద్ధాంత వ్యాసంగా నిర్ణయించి త్రిపురనేని గోపీచంద్ మెమోరియల్ స్వర్ణపతకానికి అర్హమైనదిగా నిర్ణయించిన ఆంధ్రా యూనివర్శిటీకి—

సిద్ధాంత గ్రంథ ప్రచురణకు ఆర్థిక సహాయం చేసిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంస్కృతిక శాఖ మంత్రివర్యులు ఖాట్టం శ్రీరామమూర్తి, సంచాలకులు డాక్టర్ పి. యస్. ఆర్. అప్పారావు గార్లకూ—

పరిశోధనా కాలంలో అవసరానికి ఆదుకున్న ఎందరో రచయితలు, గ్రంథపాలకులు, అభిమానులు ముఖ్యంగా, అత్తలూరి, ఎల్. ఎస్, కొమ్మన, మండవ, మోహన్ ప్రసాద్, ఏడిద, చేకుమళ్ళ, వేములపల్లి లోకేశ్వరరావు గార్లకూ—

పుస్తకం ఇంత అందంగా ముద్రించిన విక్టరీ ప్రెస్ వారికీ—
రచయిత సర్వదా కృతజ్ఞుడు.

# విషయ సూచిక

# బాలలు - భారతదేశం

బాలల మనసు - బాలల వయసు
అంకెల్లో పిల్లలు - పిల్లల హక్కుల ప్రకటన
భారత సంవిధానం : పిల్లలు - బాలల జాతీయ విధానం

# బాలల మనసు

పండిట్ జవహర్‌లాల్ నెహ్రూకు పిల్లలంటే అభిమానం. ప్రేమ. పిల్లల మనః ప్రవృత్తులను గురించి పండిట్ నెహ్రూ ఇలా అంటారు. "అపార సంఖ్యలోగల పిల్లలు చూపులకు రకరకాలుగా కనిపిస్తారు. వివిధ భాషలు మాట్లాడుతారు: రంగు రంగుల బట్టలు వేసుకుంటారు. ఐనప్పటికీ వారంతా ఒకే మోస్తరుగా ఉంటారు. ఒక చోట చేరితే ఆడుకుంటారు, పాడుకుంటారు. లేదా పోట్లాడుకుంటారు. వారి పోట్లాట కూడ ఒక ఆటగా ఉంటుంది. వారు తమలో తాము రంగు, వర్ణం, హోదాలకు సంబంధించిన తేడాల గురించి ఆలోచించరు. నిజానికి వారు తమ తల్లిదండ్రుల కంటె తెలివైనవారు..."[1] ఇది వారి సహజ సుందరమైన మనోనైజం. విశ్వ వ్యాప్తంగా గల బాలల విషయంలో అంగీకరించవలసిన నగ్న సత్యం. పండిట్ జీవలె పలువురు పండితులు, కవులు, రచయితలు, సామాజికవేత్తలు పిల్లలను గురించి ఎంతో ఊహించారు. ఎలా ఊహించినా పిల్లల మనసు ఒకటే, వారిలో అంతరాలు లేవు. అరలు లేవు, ముగ్ధ మోహన స్వరూపులు వారు.

జాతి చరిత్రలో బాలలకు అత్యధిక ప్రాధాన్యం ఉంది. బాలల ఉనికి దేశానికి జీవ నాడి. బాలలు బాగుపడనిదే దేశం బాగుపడదు – ఇది జగమెరిగిన సూక్తి. అమెరికన్ రచయిత జేమ్స్ ఎలెన్ మరి కాస్త ముందుకు పోయి – "బాల్యం, యవ్వనాల ప్రాధాన్యత మానవజాతి ప్రాముఖ్యత."[2] అనే వరకు సాహసించాడు. కనుక మానవ జాతి మనుగడ సజావుగా కొనసాగడానికి బాలల జీవితాలను క్రమబద్ధంగా తీర్చిదిద్దవలసి ఉందని అంగీకరించక తప్పదు. అది జరిగిననాడు అమెరికన్ సామాజికవేత్త హార్డెన్‌బర్గ్ చెప్పినట్లు "పిల్లలు ఎక్కడ ఉంటే అక్కడ స్వర్ణ యుగం కాగల"[3] దనటంలో సందేహంలేదు. ఈ యుగంలో "నేటి బాలలు రేపటి పౌరులని నానుడి. నిన్నటి బాలలు నేటి నేతలని న్యూనుడి" అని ఆరుద్ర ఉవాచ. కనుక నేటి నేతలు బాలలకు చేయవలసింది అనంతంగా ఉంది.

.. .. ..... . . ... . . .... .

1 J wahailal Nehru Speeches 1949-53 Delhi, Publications D vision, 1956.

2 James Alen, In "Carnelia Meig's A Critical History of Children's Literature" Macmillan, 1969.

3 Harcenberg, Eater; Anne, Thaxter. Children's Literature in Colliar's Encyclopaedia, 1976, Vol 6, P 239.

## శైశవ దశ 0 - 5

బాల్యంలో శైశవదశ ప్రాథమికమైనది. అప్పుడే తీసిన వెన్నలా మిసమిసలాడే "పసి" ప్రాయమైనది. శైశవ దశను గురించి తెలుగు కవులు ముద్దు ముద్దుగా చెప్పారు. మహాకవి శ్రీశ్రీ (1910 -) కార్మిక కర్షక లోక కడగళ్ళు చూచిన కళ్ళ తోనే - మరొక కోణంలో పసివాళ్ళలోని నిసర్గ మనోహరత్వాన్ని చూశారు సమాజం లోని కుళ్ళు కుతంత్రాలకు, కక్షలు కార్పణ్యాలకు దూరంగా ఉండాలని - ముఖ్యంగా 'ఐదారేడుల' పసి పాపలను గురించి "శైశవ గీతి" అనే గేయంలో ఇలా అన్నారు.

> పాపం పుణ్యం - ప్రపంచ మార్గం
> కష్టం సౌఖ్యం శ్లేషార్థాలు
> ఏమీ ఎరుగని పూవుల్లారా
> ఐదారేడుల పాపల్లారా!

అంటూ - ప్రకృతిలో సహజంగా జరిగే మార్పులు తమకోసమే జరుగుతున్నాయని అమాయకంగా ఊహించే పాపలను గురించి -

> మెరుపు మెరిస్తే - వానకురిస్తే
> ఆకసమున హరివిల్లు విరిస్తే
> 'అవి మాకే' అని ఆనందించే - కూనల్లారా

అంటూ అమాయక హృదయాలను చూసి జాలిపడతారు శ్రీశ్రీ. వాళ్ళను చూసి స్పందిస్తారు. ఐక్యమైపోతారు. పసివాళ్ళు, అమాయకత్వం, ఆనందం, అల్లరి, ఉత్సాహం ఒక్కుమ్మడిగా లోకంలో ఉద్భవించినట్లుంటుంది. ఈ విషయాన్నే పత్రికా లోకంలో మూడు దశాబ్దాలు మునిగి తేలిన నార్ల వెంకటేశ్వరరావుగారు (1908-)ఇలా అంటారు. "పసివాళ్ళు మాత్రం ప్రకృతితోబాటు, పక్షులతోబాటు, మందానిలంతో బాటు మేల్కొంటారు. మేల్కొన్నంతనే కొత్తబలంతో, కొత్త ఉత్సాహంతో, అల్లరి ప్రారంభిస్తారు. ప్రతి వసంతంలో ప్రకృతి వెల్లివిరిసే నూతనత్వం ప్రతి ప్రత్యూషాన పసివాళ్ళలో కనబడుతుంది."[4] అది వారి ప్రత్యేకత.

---

4 వెంకటేశ్వరరావు, నార్ల. బాలానందం (కొత్త - పాత - లో) విజయవాడ, నవోదయ, 1977 100 పు.

సూర్యుడు ఉదయించక మునుపే వెలుతుర్నిస్తుంది. కన్ను తెరవక ముందే బిడ్డ ఏడుస్తుంది. అది వారి సహజగుణం. పిల్లలు అల్లరి చేయాలి. చేస్తేనే ఎంతో అందంగా ఉంటుంది. ఆనందంగా ఉంటుంది. ఆ అల్లరి హరివిల్లును గురించి ఒక బాలసాహిత్యవేత్త –

పిల్లలకే అల్లరి తెలును!
పిల్లలదే మల్లెల మనసు
అల్లరి మల్లెలు కొల్లగ జల్లి
ఎల్లరినీ రంజించుట తెలును.

అని పిల్లల అల్లరిని మల్లెమాలల కమ్మని సౌరభాలతో పోల్చి చెప్పారు.

"అజ్ఞాత శైశవ" మనే కండ శర్కరను బోలు వచన కవితా ఖండికలో కుందుర్తి ఆంజనేయులు (1920–) గారు–

కొత్తగా పుట్టిన పసికందు
నవమాసాలు చీకటిరాత్రితో పోరి
చివరకు గెలిచిన ఉదయ రవిలా ___

బాల భానునిలాగ భాసిల్లుతూ ఉంటాడని ఊహించాడు. వారే మరొక చోట –

పసివాడు ఇంటిల్ల పాదికీ
కొనకుండా దొరికిన కనకమనీ –

పసివాడి రాకతో ఇల్లంతా జిలిబిలి పలుకులతో, నిత్య దరహాసపు మెరుగులతో ఆనందోత్సాహాలతో నిత్యనూతనంగా అత్యంత శోభాయమానంగా వెలుగొందుతూ ఉంటుందనీ, నిజానికి పసివాడు –

ఇంట్లో హఠాత్తుగా వెలిగిన దీపమనీ

ముద్దు ముద్దుగా మురిసిపోతారు కుందుర్తిగారు.

శబ్ద సౌందర్యానికి ప్రతీకలైన కమ్మని కవిత అల్లిన జంధ్యాల పాపయ్య శాస్త్రి-కరుణశ్రీ (1912 –) గారు –

విరిసే పూవు రేకుల్లారా!
మెరిసే చివురాకుల్లారా !

అని అప్పుడే పూచిన పూవులారా, కొత్తగా వేసిన రెమ్మలాగ కమ్మగా ఊహించారు. చివురాకుల్లోని మెత్తదనం, పూరేకుల్లోని మార్దవం పాపల్లో ఉంటాయని వారి భావన.

డాక్టరు సి. నారాయణరెడ్డి (1928 –) గారు "శిశువు" అనే గేయంలో పాప గొప్పదనాన్ని ప్రశంసిస్తూ –

> శిశువు ముందు పశువైనా
> కొమ్ములు వంచి నిల్చునులే

అన్నారు. పాప మనోబలం ఎంతటి శక్తివంతమైనదో సి. నా. రె. ఈ రెండు పాదాల్లో సొగసుగా వివరించారు.

నవయుగ కవి చక్రవర్తి గుర్రం జాషువా (1895–1971) గారి నిశిత కవితా దృష్టి పసిపాపలపై కూడ ప్రసరించక పోలేదు. "శిశువు" అనే ఖండకవితలో ఉయ్యాలలోని పసిపాపను గురించి ఇలా ఊహిస్తారు.

> బొటనవ్రేల ముల్లోకములు చూచి లోలోన
> నానందపడు నోరులేని యోగి
> తల్లి దండ్రుల తనూవల్లరీ ద్వయికి వ
> న్నియ బెట్టు తొమ్మిది నెలల పంట
> అమృతంబు విషమును వ్యత్యాస మెఱుగ కా
> స్వాదింపఁజను వెఱ్ఱి బాగులాడు .... ....
> ............
> ఎవరెరుంగ రీతని దేదేశమోగాని
> మొన్న మొన్న నిలకు మొలచినాడు

బిడ్డను జాషువాగారు అమాయకుడైన నోరులేని యోగిగా, తల్లిదండ్రుల కనుల పంటగా, మంచి చెడ్డలు తెలియని పసికందుగా భావన చేశారు. ఏ ప్రాంతంలో నైనా, ఏ దేశంలోనైనా బిడ్డలు అలాగే ఉంటారు. వారికి దూరతీరాల అంతరం లేదు. ముగ్ధమోహన రూపం, బోసినవ్వులు, తప్పటడుగులు, ముద్దు మాటలు, తొక్కు పల్కులు-బాలల సమాన లక్షణాలు

అలాటి బిడ్డలు "తమ తల్లిదండ్రులకంటె ఉన్నతులు"[5] మారుతున్నకాలం, పెరుగుతున్న వనరులు వారికి ఎక్కువ అవకాశాలు కల్పిస్తాయి. ఏ దేశంలోనైనా "బిడ్డలు ఒక సందేశంతో ఈ ప్రపంచములో అవతరిస్తారు."[6] ఆ సందేశ ప్రచారానికి తల్లితండ్రులు తగిన దోహదం ఇవ్వాలి.

బాల్య దశ (5-14)

స్థూలంగా చెప్పాలంటే పెరిగిన పాపలను 'పిల్లలు' అనవచ్చును. తెలుగు వెలుగు గుడిపాటి వెంకటచలం (1894-1979) పిల్లలను "పువ్వులవలె, నక్షత్రాల మెత్తని కాంతివలె చూడవలె నన్నారు. పువ్వుల్లోని అందం, సువాసన, నక్షత్రాల్లోని ఆనందం బాలల్లో ఉంటాయని వారి భావన. ఈ విషయాన్ని చెబుతూ ఒకానొక కన్నతల్లి తన బిడ్డను చూసి –

పిల్లమ్మ కన్నుల్లు బీరపువ్వుల్లు
అబ్బాయి కన్నుల్లు కలువరేకుల్లు

అంటూ మురిసి పోతుంది.[7] కన్నబిడ్డ కన్నుల్లోని కాంతిని, కమ్మదనాన్ని తల్లి చూసి ఆనందిస్తుంది. అది తల్లి హృదయ మాధుర్యానికి ప్రతీక.

బాలల మనస్సులోని రమ్యహర్మ్యాలను కనుకలిగా గాంచిన నార్ల చిరంజీవి (1925-1971) గారు "సృష్టి సౌందర్యానికీ, మానవుని ఆత్మోన్నత్యానికీ ప్రతిబింబాలు, ప్రతిరూపాలు బాల బాలికలు: దేశం జాతి, సమాజం, వ్యవస్థల మంచి చెడ్డలకు ఎక్స్‌రేలు బాలలు"[8] అంటారు. చిరంజీవిగారే మరొకచోట బాలలగురించి రాస్తూ "గాలికీ, వెల్తురికీ కంపించి, కళ్ళు విప్పీ విప్పక అంతలో అల్లనల్లన కొనలు సాచి నవ్వే ఆ లేచివురుల జీవన సౌందర్యాన్ని చూడని, మనస్సుకు పట్టించుకోని మనస్తత్వం మన వాళ్ళది, అంటే మన పెద్దలది. అందుచేత మనలో సృష్టి సౌందర్యం లోపించింది.

---

5 Words Worth, William. Complete works of William Words-Worth, Oxford 1966.

6 Tagore, Rabindranath

7 ప్రభాకరశాస్త్రి, వేటూరి. బాలభాష. 1954. 22 పు.

8 చిరంజీవి, నార్ల - బాలసాహిత్యం అభ్యుదయం, జులై 1955, 155 పు.

ఆత్మోన్నత్యం కొరవడింది. బిడ్డలపట్ల విశిష్టదృక్పథం లేని మనం ..." అంటూ తన హృదయబాధను వ్యక్తంచేశారు. వారి ఆశకు, తపనకు తరువాతి తరంలో కొంత సానుభూతి, ఆదరణ లభించాయి.

బాలలు : భావనలు :

పిల్లలను గురించి కలలు గనడం, వారి చేష్టలను గురించి ఊహించడం మన కవులకు సరదా. బి. వి. నరసింహారావుగారు (1913-) పిల్లల గురించి -

పిల్లలంటే మల్లెమొగ్గలు
తల్లిమనసే విరియు వెన్నెల
లల్లుకొను జాబిల్లి సిగ్గులు ....
ఉల్లమున చిరు వూహ లెన్నో
పల్లవించె పసిడి తీగలు

అన్నారు. బాలలు పూలు, వెన్నెల, చందమామలతో పోల్చదగినవారు. వెల కట్టలేని కళాసంపద. విలువ కట్టలేని తల్లిమనసుకు ప్రతిరూపాలు. చిరు ఊహల నిలయాలైన ఆలోచనా దీపికలు.

అంతర్జాతీయ బాలల సంవత్సర (1979) సందర్భంగా ఆకాశవాణి వారు ఏర్పాటుచేసిన ఒక కవిసమ్మేళనంలో బాలలలోని ఉదాత్త లక్షణాలను ప్రశంసిస్తూ శ్రీ శ్రీ -

బాలలే విజ్ఞాన హేతువులు
నేడు రేపుల మధ్య సేతువులు
చంద్ర బంధుర సుధా శీతువులు
మానవత్వ వికాస హేతువులు

అని ఒక మహత్తరమైన ఆశాదీపం వారిలో చూస్తున్నట్లు ఆనందించారు. ఆ గేయాన్ని ముగిస్తూ శ్రీ శ్రీ "It cannot be any thing other than మానవత్వం" అన్నారు. మానవత్వ విలువలకు ఈ అంతర్జాతీయ బాలల సంవత్సరంలోనైనా ప్రాధాన్యం ఇవ్వాలని స్పష్టంచేశారు. మానవత్వ విలువలు బాలల ద్వారానే పటిష్ఠం కావాలని ఆశీర్వదించారు. తథాస్తు!

పిల్లలు : పెద్దలు :

పిల్లలు పెద్దల సంబంధాలను గురించి, అంతరాలను గురించి, ఆలోచనలను గురించి మహా దార్శనికుడు ఖలీల్ జీబ్రాన్ (1883 – 1937) చెప్పినంత బాగా మరొకరు చెప్పలేదనే అనాలి. అంత బలమైన, తీవ్రమైన ఆలోచన బాలలను గురించి మరొకరు చేయలేదనే చెప్పాలి. తండ్రులను ఉద్దేశించి ఖలీల్ జీబ్రాన్ ఇలా అన్నారు.

"మీ పిల్లలు మీ పిల్లలు కారు, వాళ్ళ స్వీయార్థమైన జీవితాభిలాషకు పుత్రులు.

వాళ్ళు మీద్వారా వచ్చారుకాని, మీనుంచి రాలేదు.

వాళ్ళు మీతోబాటే ఉంటున్నా, మీకు మాత్రం చెందరు.

వాళ్ళకు సొంత ఆలోచన లున్నవి. వాళ్ళ దేహాలకు మీరు ఆశ్రయం కల్పించ వచ్చుగాని, వాళ్ళ ఆత్మలకు కల్పించలేరు.

వాళ్ళ ఆత్మలు, మీరు కనీసం కలల్లోనైనా కాలుపెట్టలేని రేపనే యింట్లో కాపురం ఉంటవి.

వాళ్ళవలె ఉండడానికి మీరు ప్రయత్నించవచ్చు.

వాళ్ళను మాత్రం మీ మాదిరిగా చేయడానికి చూడవచ్చు.

జీవితం తిరోగమనం చేయదు.

నిన్నటి తాలేటి నడకు కుదరదు.

సజీవ శరీరాలవంటి మీ పిల్లలను ముందుకు దూకించే శరాసనాలు మీరు.... 9, 10

ఖలీల్ జీబ్రాన్ చెప్పిన విషయాలు ప్రతి తల్లి, తండ్రి గమనిక ఉంచుకొని మసలినట్లు అయితే పిల్లలు భవితవ్యం దివ్యంగా ఉండగలదు.

పిల్లలు ఆలుమగల మధ్య అనురాగం పెంపొందించే సేతువులుగా, కలతలు వస్తే సరిదిద్దే రాయబారిగా ఉంటారని శనగన నరసింహస్వామిగారు. ( 930-)

.................................

9 ఖలీల్ జీబ్రాన్ మహా దార్శనికుడు ఖలీల్ జీబ్రాన్. అను : ధనకుధరం గుంటూరు. 1977

10. KAHLIL GIBRAN. The prophet. New Delhi Allied,1976. p 20

అలుమగల నడుమ అనురాగమున పెరుగు
రాయబారి డింభ రాజమౌళి

అంటారు డింభకుడు అంతటి శక్తిగల వ్యవహారవేత్తగా స్వామిగారు ఊహించారు.

పిల్లల పెద్దల జీవితాలను మరొక బాల సాహిత్యవేత్త సాహిత్య పరంగా చక్కగా ఊహించారు "పిల్లల జీవితం సహజంగా కమ్మని కలలతో నిండిన కవితా లోకం గేయాత్మకం. పెద్దల జీవితం అనవసరంగా అనేక బాధ్యతలతో బాధలతో నిండిన బరువైన లోకం. అది గద్యాత్మకం. గద్యాత్మకమైన పెద్దల జీవితం, గేయాత్మకమైన పిల్లల జీవితం ఒరపిడి చెందితే అది నిసర్గమైన నిత్యశాంతికి నిలయమౌతుంది...[11] అని బి. వి. నరసింహారావుగారు రాస్తారు. పిల్లలు ఊహకు, పెద్దలు వాస్తవానికి చేరువగా ఉంటారని వారిభావం కావచ్చు.

**బాలలు : ప్రభుత్వం**

1979లో అంతర్జాతీయ బాలల సంవత్సరం ప్రపంచవ్యాప్తంగా జరిగింది. ఆ సందర్భంలో బాలల సంక్షేమాన్ని గురించి భారత ప్రభుత్వం సరిగా పట్టించుకో లేదని ఆరుద్రగారి అభియోగం. సంప్రదాయంగా ఒక తల్లిపాడే జోలపాట –

ఏడువకు ఏడువకు వెర్రి అబ్బాయి
ఏడుస్తే నీ కళ్ళు నీలాలు కారు
నీలాలు కారితే నే చూడలేను
పాలైన కారవే బంగారు కనులకు

పేరడీగా ఆకాశవాణి బాలల సంవత్సరంలో ఏర్పాటుచేసిన కవి సమ్మేళనంలో–

ఏడువకు ఏడువకు వెర్రి నా తండ్రీ
ఏడిస్తే ఈ ఏడె ఎత్తుకొంటారు
మీదటికి నిన్నెవ్వ రాదుకొంటారు
రోదిస్తే బలమని నొక్కి చెబుతారు.

........................................

11 నరసింహారావు, బి. వి. కోసూరి పున్నయ్యగారి 'గోరంత దీపం' "ఉన్నమాట"లో (1979)

అని తన సహజమైన అధిక్షేప ధోరణితో చెబుతూ బిడ్డల ఎడ తన ధ్యేయాన్ని సూటిగా చెబుతారు.

స్వార్థం తెలియని సంక్షేమ స్వర్గం
వార్ధక్యం తెలియని వసుధైక కుటుంబం....

కావాలనీ –

సామ్యవాదం పిల్లలకు నూరి పొయ్యడం నాలక్ష్యం
సామ్యవాదం జయించకపోతే పెద్దలకే లేదు మోక్షం

అని కుండ బద్దలు కొట్టినట్లు చెబుతారు. ఈ సామ్యవాదం పెద్దలకు, పిన్నలకు సమసమాజానికి దగ్గరగా తీసుకెళ్తుందని వారి ఆలోచన. ఏమైనప్పటికి యీ అంత ర్జాతీయ బాలల సంవత్సరాన్ని పురస్కరించుకొని ప్రభుత్వం అనేక కార్యక్రమాలు తలపెట్టింది. వాటిని ఆయా శాఖల పరంగా అమలు జరపటానికి ప్రయత్నాలు జరిగాయి.

బాలల ప్రపంచం :

బాలల ప్రపంచమే విచిత్రమైనది. అచట బాధలు లేవు. క్రోధాలు లేవు. మోసాలు లేవు. వారిది మాయ మర్మాలు తెలియని మరో ప్రపంచం. వాస్తవానికి అదో దేవ లోకం. అందుకనే పిల్లలున్నచోట దేవుడున్నా డంటారు. ఈ సందర్భానికి అతికి నట్లుగా ప్రసిద్ధ ఆంగ్లరచయిత జాన్‌పాల్ రిచర్ అంటారు – అతి చిన్న గ్రహాలు సూర్యునికి దగ్గరగా ఉన్నట్లు మరీ పసికందులు దైవానికి దగ్గరగా ఉంటారు." [12] ఆనంద లోకాలలో విహరిస్తూ ఉంటారు. అనురాగ ప్రాంగణాలలో కేరింతలు కొడుతూ ఉంటారు. బి. వి. నరసింహారావుగారు చెప్పినట్లు పసివాళ్ళు "గుండెగదిని నిండుగ కొలువుండిన దేవుళ్ళు." వారి మాటలలోనే బాలప్రపంచాన్ని గురించి ఇలా అంటారు.

ఈ లోకం శోకం
ఈ మోసం దోసం

............ ... .... ... ..... ....... ..

[12] Jean Paul Richter, From Hopkins, Libdas, Corrent Trends in Childrens Literature. New Delhi, ICB 4, 1979 P. 11.

ఈ పాపం శాపం
సోకని తాకని వాళ్లు
- పసివాళ్ళు
నిద్దపు మనసుల వాళ్ళు
ముద్దు గుల్కు దేవుళ్ళు
- పసివాళ్ళు
చిద్విలాస చిదానంద
చిన్మయ రూపులు వాళ్ళు
- పసివాళ్ళు

అద్దంలాటి నిద్దపు మనసుండడం పిల్లలకే చెల్లు. పిల్లల మనసు తడిసి ముద్దకట్టిన సిమెంట్ లాంటిడి. దానిపై ఏదిపడ్డా చెరగని ముద్రపడి గట్టిపడి పోతుంది. వారిలో తన్మయత్వం రూపుకట్టి ఉంటుంది ఈతిబాధలకు, పాపాలకు, శాపాలకు దూరంగా ఉన్న ఆనందస్వరూపులు వారు.

బాలప్రపంచంలో నిత్యం మునిగితేలే రేడియో అన్నయ్య ఏడిద కామేశ్వర రావు (1918-) గారు ఈ నూతన లోకాన్ని కమ్మని, తియ్యని, తెల్లని పాలతో పోల్చుతారు.

బాల ప్రపంచం - పాల ప్రపంచం
పాలవలె తెల్లనిది
పాలవలె తియ్యనిది
పాలవలె చిక్కనిది

పాల మెరుగడి - బాలప్రపంచం పాలబుగ్గల పసిడి బాలలకు పాలతో పోల్చడం ఎంతో ముచ్చటగా ఉంది.

కవిరావు (1927 -) గారి రచన 'బొమ్మరిల్లు' గేయకథల గ్రంధానికి పీఠిక రాస్తూ బాలల వాస్తవ జగత్తును గురించి నార్ల వెంకటేశ్వరరావుగారు - "పెద్దవారికి వారి వాస్తవిక ప్రపంచంకంటె పిల్లలకు వారి కల్పనా జగత్తే వాస్తవమైనది. అభూత కల్పనలతో అద్భుత సన్నివేశాలతో నిండిన ప్రపంచానికి పాతకాపులు" అంటారు.

ఈ విషయంలో విభేదించాల్సిన పనిలేదు. బతకడానికి అనేక మార్గాలను వెతుక్కుంటూ బతుకుసాగిస్తున్న పెద్దలకూ—అమాయకులైన పిల్లలకూగల తేడాలను వివరిస్తూ మిరియాల రామకృష్ణగారు "వడ్డీలెక్కలకీ నల్ల లాభాలకీ, కల్లమాటలకీ గల్లాపెట్టెలకీ శతయోజనాల దూరంలో, నిర్మలంగా, నిశ్చలంగా మెరిసే ఆ ప్రపంచం చూడగలిగినవాళ్ళు బాలురు"[13] అని వారి అదృష్టాన్ని అభినందిస్తారు. ఒక్కొక్కప్పుడు పెద్దల దుర్నడత పిల్లలపై ప్రభావాన్ని చూపుతుందని పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ హెచ్చరిస్తారు. పెద్దల బోధనల వలన, ప్రవర్తన వలన వారిలో కొంతశక్తి దురదృష్ట వశాత్తూ నశిస్తుంది. పాఠశాలలో ఎన్నో ఉపయోగకర విషయాలను నేర్చుకుంటారు. మానవత్వానికి దగ్గరగా ఉండడం, దయగలిగి ఉండడం, ఆనందంగా ఉండడం మొదలైన ప్రాథమిక విషయాలను క్రమంగా మరచిపోయి యితర్లకంటె తమ జీవితం సుఖప్రదం చేసుకొనే విషయం ఆలోచిస్తారు.[14] ఆ ఒరవడిని మళ్ళించి పిల్లలకు మానవత్వపు విలువలు తెలుసుకొనే అవకాశం కల్పించాలి. అది ప్రతివారి బాధ్యత.

## తెలుగు పిల్లలు

పిల్లలు ఏదేశంలో వారైనా ఏ ప్రాంతంలో వారైనా వారి మనస్సు ఒకటే. వారి ఆలోచన ఒకటే. వేష, భాషలలో మార్పు రావచ్చు. పెరిగే వాతావరణంలో తేడా రావచ్చు. కాని పిల్లలందరూ ఒకటే-తెలుగు పిల్లలు, హిందీ పిల్లలూ అంటూ ఉండరు గదా - అయినా మన బిడ్డలు మనకు ముద్దు. కనుకనే దాదాపు నాలుగు దశాబ్దాలకు పైబడి బిడ్డలతో గడిపిన రేడియో అన్నయ్య న్యాయపతి రాఘవరావుగారు తెలుగు పిల్లలను గురించి -

తెలుగు దేశపు తెలుగు పిల్లలు
తెలుగు వెలుగు లండీ
తెలుగు - బాలురు తెలుగు బాలికలు
తెలుగు సొమ్ములండీ

అని నిండు హృదయంతో ప్రశంసిస్తారు.

.................. .. .......... ............ .......

13. రామకృష్ణ మిరియాల, బాలసాహిత్యం అంటే ఏమిటి? బాలానందం. 1974 పు. 51

14 NEHRU, Jawaharlal From a message to the children's Number of SANKAR' S Weekly, December 26, 1950.

తెలుగుదేశంలో ఇంత మంచి బిడ్డలుండడానికి కారణం తెలుగు తల్లుల నోము పంట కారణమై ఉండవచ్చు. ఆ బంగరు తల్లుల పురిటి గడ్డ తెలుగు సీమ. ముగ్ధ మధుర వాఙ్మయం నిండార విలసిల్లిన తెలుగు బాలల పల్లె పాటలలో తెలుగు తల్లిని గురించి ధ్వన్యాత్మకంగా ఇలా పాడతారు

ఉత్తముని పేరేమి ఊరు పేరేమి ?
సత్యపురుషులుగన్న సాధ్వి పేరేమి?
ఉత్తముడు దశరథుడు
ఊరు అయోధ్య
సత్యపురుషులుగన్న సాధ్వి కౌసల్య

ఈ గేయంలోని సాధ్వీమతల్లి కౌసల్యాదేవి ఐనప్పటికీ అజ్ఞాత కవిదృష్టిలో మెదలుతున్నది తేనెపలుకుల అలివేణి తెలుగు తల్లి మాత్రమే ఆ తల్లిబిడ్డలు ముద్దు మురిపాల తెలుగు బిడ్డలు మాత్రమే.

సామాజిక శాస్త్రవేత్త బాతమ్ హావిట్ చెప్పినట్లు "సృష్టిలో బిడ్డలు కలగడం కేవలం జాతిని నిలిపేందుకు మాత్రం కాదు. మన హృదయాలను రంజింప జేయ డానికి, మనలో దయ, సానుభూతి, ప్రేమ పెంపొందించి-ఉన్నతాదర్శంపై మళ్ళింప జేయడానికి...[15] ఈ లోకంలో పిల్లల మనుగడలోని పరమార్థాన్ని అందరూ గమనించి—పిల్లల మనసును తెలుసుకొని నడచినప్పుడు జీవితం ఆనందమయంగా ఉంటుంది. ధన్యమౌతుంది.

బాలల వయసు

విభిన్నమైన భాషలు, మతాలు, ఆచారాలు గల భారతదేశంలో ఇటీవలికాలం వరకు బాలల వయోనిర్ణయం ఒక పెద్ద సమస్యగా నిలచిపోయింది. దీనిపై శాసన సభలలోనూ, విద్వత్ పరిషత్తులలోనూ, సభలలోనూ, సదస్సులలోనూ, గోష్ఠులలోనూ, రచయితల శిక్షణాలయాలలోనూ సిద్ధాంతపరమైన చర్చలు జరిగాయి. తీర్మానాలు చేయబడ్డాయి. అమలు పరచడానికి ప్రయత్నాలు జరిగాయి. ఒక క్రమ పద్ధతిలో అమలు పరచిన చోట విద్యావిషయికంగా, సాహిత్యపరంగా సత్ఫలితాలను ఇచ్చాయి.

---

15 –Botham Howit. From Medinus Gar [R] Readings in Psychology of parent child relations, 1965 P 10.

## 'బాల' నిర్వచనం

బాల, బాలికల నిర్వచనాన్ని గురించి తెలుగు నిఘంటువులు పెద్దగా పట్టించుకోలేదు. అర్థాలిచ్చి వదిలేశారు 'బాల' అనే పదం 'బాలిక' కు పర్యాయపదంగా వాడారు. 'బాల' లేదా 'బాలిక' అంటే-పదునారేండ్లకు లోబడిన పిల్ల. 'బాలుడు' లేదా 'బాలకుడు' అంటే పదునారేండ్లకు లోబడిన పిల్లవాడు అనే అర్థాన్ని శబ్దరత్నాకరకర్త, ఆంధ్ర వాచస్పత్యకర్త దరిదాపు సమానంగా ఇచ్చారు.

పన్నెండు సంపుటాల బృహన్నిఘంటువు ఆక్స్‌ఫర్డు ఇంగ్లీషు డిక్షనరీ Child అనే పదానికినాలుగు అర్థాలను వ్యుత్పత్తులతో, ప్రయోగాలతో, భాషా విశేషాలతో అందించింది [16]

1 పుట్టని, క్రొత్తగా పుట్టిన బిడ్డ-పసిపాప-బేబీ.

2 యవ్వనం రాని బాలిక లేదా బాలుడు.

3 బాల స్వభావం గలవారు.

4 ఒకప్పుడు ప్రత్యేకంగా ఉచిత పాఠశాలలలో చదివే పిల్లలందరూ దాదాపు యిదే అర్థాన్ని వెబ్బర్సు థర్డ్ న్యూ ఇంటర్నేషనల్ డిక్షనరీ 1962అందించింది.

ఇది సాహిత్యంలో, వ్యవహారంలో గల అర్థాలకు దగ్గరగా ఉన్నది. బ్రిటానికా కర్త 'పిల్లలు' అనే పదానికి "బొమ్మల పుస్తకాలను ఆనందించడం, బిగ్గరగా చదివిన కథను వినగలిగే శక్తినుంచి 14 లేదా 15 ఏళ్ళు వయసు వచ్చేవరకు గల వారికి పిల్లలంటారు" [17] అని నిర్వచనాన్ని చెప్పింది. ఏమైనప్పటికీ భారతదేశంలో 16 ఏళ్ళలోపు వయస్సు గలవారు పిల్లలుగా పరిగణించబడతారు. భారత రాజ్యాంగం 14 ఏళ్ళలోపు వయసుగల వారిని బాలలుగా గుర్తించింది. మారుతున్న చరిత్రలో యీ తగ్గింపు తప్పనిసరి.

16 Oxford English Dictionary, 1961 Vol 2 p 341.
17 Encyclopaedia Britanica, 1978 Vol 4, P 228

## వయసుపై భిన్నాభిప్రాయాలు

భారత రాజ్యాంగం 14 ఏళ్ళ వయసు లోపువారిని పిల్లలుగా గుర్తించింది. తదనుగుణంగా భారత సంవిధానంలో పిల్లలకు కొన్ని రక్షణలు, అనుకూలతను కల్పించింది. "కేంద్ర ప్రభుత్వ శాసనాల ప్రకారం భారత దేశంలో 16 ఏళ్ళవయసు లోపు బాలురు, 18 ఏళ్ళు నిండని బాలికలు పిల్లలుగా పరిగణింపబడతారు. మధ్య ప్రదేశ్, పంజాబ్ రాష్ట్రాలలో 16 ఏళ్ళలోపువారు, గుజరాత్, పశ్చిమ బెంగాల్‌లో 18 ఏళ్ళలోపువారు, ఆంధ్రప్రదేశ్‌లో 14 ఏళ్ళలోపువారు పిల్లలుగా పరిగణింప బడతారు. [18] ఇటీవలే ఆంధ్ర ప్రదేశ్, తమిళనాడు, కర్ణాటక, పశ్చిమ బెంగాల్ మొదలైన రాష్ట్రాలు 18 ఏళ్ళ వయసు వచ్చిన వారికి ఓటు హక్కు కల్పిస్తూ ఎన్నికల చట్టాలను సవరణలు చేశాయి ఈ నిర్ణయాలను బట్టి దాదాపు 17 ఏళ్ళలోపు వయసుగలవారిని బాలలుగా గుర్తిస్తున్నట్లు ఉరామరికగా మనం నిర్ణయం చేసుకో వచ్చు. ఇవి ప్రభుత్వపరంగా జరిగిన నిర్ణయాలు.

## బాల సాహితీ పరుల భావాలు

బాలల వయో భేదాలను బట్టి రచనలు చేసిన అవి ఎంతో ప్రయోజనకరంగా, శాస్త్రీయంగా ఉంటాయని ప్రసిద్ధ బాల సాహిత్యవేత్తల అభిప్రాయం. ఈ దృష్టితో రచనలు చేయడానికి చిరకాలంగా కొందరు ప్రయత్నిస్తూ వచ్చారు. బాల సాహిత్యంలో వయో భేదాల విభజన విధానాన్ని జాతీయస్థాయిలో అనుసరింపజేయాలని ఛిల్డ్రన్స్ బుక్ ట్రస్టు, సదరన్ లాంగ్వేజెస్ బుక్ ట్రస్టు, ప్రచురణ కర్తల సంస్థలు కొన్ని ప్రయత్నాలు చేశాయి. ఆ ప్రయత్నాలు అంతగా ఫలించలేదు. దానికి ముఖ్య కారణం ప్రభుత్వమూ, రచయితలు అతిముఖ్యమైన ఈ విషయాన్ని ఏనాడూ అందరూ సీరియస్‌గా తీసుకోలేదు. దాని ఫలితం అస్తవ్యస్తమైన గ్రంధాల ప్రచురణ చూస్తూనే ఉన్నాం. ఈ విషయంలో జరిగిన కొన్ని చర్చల సారాంశాన్ని పరిశీలిద్దాం.

1964లో ఢిల్లీలో జరిగిన జాతీయ బాలసాహితీ విద్వత్ పరిషత్ సమావేశంలో

..................................

18. సుబాన్‌బాబు, ఆలూరు. మీకు తెలుసా ? ఇది అంతర్జాతీయ బాలల సంవత్సరము. ఆంధ్ర ప్రదేశ్-ఏప్రిల్ 4, 1979.

ఈ విషయం చర్చకు వచ్చినపుడు-వారు బాలసాహిత్యాన్ని ఈ దిగువ, వివరించిన తీరులో విభజనను సూచించారు.

| | | |
|---|---|---|
| 1 | 0 – 6 | ఏళ్ళ వయసు |
| 2 | 6 – 9 | ,, |
| 3 | 9 – 19 | ,, |

ఈ సదస్సు బాలల వయసును 12 ఏళ్ళ వరకే పరిమితం చేయడం అంత సమంజసంగాలేదు. బాలల వయసు 12 ఏళ్ళు అని ఏ రాష్ట్రం గుర్తించలేదు.

ఈ విషయాన్ని 1967లో ఢిల్లీలో జరిగిన అఖిల భారత బాలసాహిత్యవేత్తల మహాసభ పునఃపరిశీలించి - ఈ దిగువ నిర్ణయాన్ని చేసింది.

| | | | |
|---|---|---|---|
| 1 | 0 – 6 | ఏళ్ళ | వయసు |
| 2 | 6 – 9 | ,, | ,, |
| 3 | 9 – 12 | ,, | ,, |
| 4 | 13 – 15 | ,, | ,, |

బాలసాహితీ పరుల దృష్టిలో ఈ విభజన సమంజసంగా తోచింది. కొందరు తమ రచనలలో ఈ విభజన అమలు చేశారు.

ఆ తర్వాత 1971లో లక్నోలో జరిగిన బాలసాహితీవేత్తల సదస్సుపై నిర్ణయాన్ని తిరగ దోడింది. ఈ సమస్యను కూలంకషంగా చర్చించి కొన్ని నిర్ణయాలు చేసింది. అంతగాక విభజనలో ప్రతి అంశానికి ఒక సంకేత నామాన్ని ఏర్పరచింది.

| | | | | |
|---|---|---|---|---|
| 1 | 0... 6 | ఏళ్ళ | వయసు | శిశు |
| 2 | 6... 10 | ,, | ,, | బాల |
| 3 | 10... 12 | ,, | ,, | కిశోర |
| 4 | 12... 16 | ,, | ,, | కుమార |
| 5 | 16... ఆపైన | ,, | ,, | యువ |

ఈ విభజన హేతుబద్ధంగా కనిపిస్తున్నప్పటికీ భారత బాల సాహితీరంగంలో స్థానం ఏర్పరచుకోలేదు. కాగా, పైన నిర్ణయాలేవీ భారత ప్రభుత్వాన్ని సంతృప్తి పరచలేక పోయాయి. భారత ప్రభుత్వం బాల సాహిత్యంలో జాతీయస్థాయిలో 1952 నుంచీ నిర్వహించే పోటీలలో-సాహిత్య పరంగా బాలల వయసును రెండే విభాగాలు చేసింది.

| | | | |
|---|---|---|---|
| 1 | 3...6 | ఏళ్ళ వయసు | |
| 2 | 7...14 | " | " |

ఇది స్థూల విభజనే తప్ప శాస్త్రీయ ప్రాతిపదికతో చేసినది కాదు. ఐనప్పటికీ ఈ విభజన ఈనాటికీ సాగిపోతూనే ఉంది.

బాలల అకాడమీ నిర్ణయం

భారతీయ బాలసాహిత్య చరిత్రలో తెలుగువారికి ఒక ప్రత్యేక స్థానం ఉంది. తెలుగువారి హేతుబద్ధ నిర్ణయాలకు జాతియ స్థాయిలో గౌరవ ప్రతిపత్తు లున్నాయి. తెలుగునాటగల బాలల సర్వతోముఖాభివృద్ధికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1976 లో ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీని స్థాపించింది. తమ కార్యక్రమాలలో ఒక భాగంగా అకాడమీ అంతర్జాతీయ బాలల సంవత్సర సందర్భంగా 1979లో నాగార్జున సాగర తీరంలో బాలసాహిత్య శిక్షణ శిబిరాన్ని నిర్వహించింది. ఈ సందర్భంలో వయో పరిమితులపై చర్చ సాగింది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నిర్ణయించిన బాలల వయో పరిమితికి లోబడి బాల సాహిత్యంలో కూడా వయో పరిమితులు నిర్ణయించిన విద్యా విషయికంగా ప్రయోజనకరంగా ఉంటుందని ఈ దిగువ వివరించిన నిర్ణయం చేసింది.

| | | | |
|---|---|---|---|
| 1 | 3—6 | ఏళ్ళ వయసు | |
| 2 | 7—10 | " | " |
| 3 | 11—14 | " | " |

బాలసాహిత్య సృష్టికి ఈ విభజన అనుకూలంగా ఉంటుందని బాలసాహిత్య రచయితలు అభిప్రాయపడుతున్నారు. ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ ఈ వయో పరిమితులు అధికారికమైన గుర్తింపునిచ్చి తగిన ప్రచారం చేయవలసి ఉన్నది.

పెద్దలకు ఉద్దేశించి రాసిన సాహిత్యం మాట ఎలాఉన్నా - బాలలకోసం సృష్టించిన సాహిత్యం విధిగా వయో పరిమితులకు లోబడి ఉండాల్సిందే. ఏ రచయితా అన్ని వయోభేదాలకు సరిపడా ఒకే రచన చేయలేదు. చేసినా అది ఫలప్రదం కాదు. అందుకోసం రచనలో వయఃపరిమితులను పాటించవలసిన అవసరం కనిపిస్తుంది. త్వరగా ఈ పని జరిగిన బాలసాహిత్యం ఆశించిన ఫలితాన్ని సాధించగలదు.

# అంకెల్లో పిల్లలు

ప్రపంచ జనాభాలో బాలలకు అధిక ప్రాధాన్యం ఉన్నట్లే జనాభా లెక్కలలో పిల్లలకు సంబంధించిన లెక్కలకు అధిక ప్రాధాన్యం ఉంది. ఈ సంబంధమైన ఒక చిన్న పొత్తాన్ని విశ్లేషణాత్మక వివరణలతో భారతప్రభుత్వ గణాంక సంస్థ ప్రచురించాయి[19] అధికారికంగా ప్రచురింపబడిన ఆ లెక్కలలో నుంచి పిల్లలకు సంబంధించిన అంశాలు పరిశీలిస్తే అనేక విషయాలు తెలుస్తాయి ప్రపంచ జనాభాలో పిల్లల జనాభా 155 కోట్లు. ప్రపంచంలోని బాలలలో ప్రతి ఆరుగురిలో ఒకడు భారతీయుడు. 1971 జనాభా లెక్కల ప్రకారం భారతదేశంలో 14 ఏళ్ళలోపు వయసుగల పిల్లలు 24.8 కోట్లు. మొత్తం జనాభాలో పిల్లలు 40 శాతం. అంటే పెద్ద ప్రపంచంలో ధనవంత మైన అమెరికా దేశంలోని జనాభా 22 కోట్లుకంటె 2.8 కోట్లు ఎక్కువన్నమాట.[20] భారత బాలల జనాభాలో 6 ఏళ్ళ లోపు వయసుగల వారు 11.5 కోట్లు ఉన్నారు. ప్రపంచంలోని పిల్లల జనాభాలో మనదేశంలోని పిల్లలు 11 శాతం ఉంటారు.

జననాలు :

మనదేశంలో బిడ్డల జననాలు అపారం. ప్రతి ఒకటిన్నర సెకండుకు ఒకబిడ్డ చొప్పున జన్మిస్తున్నారు. అసంఖ్యాకమైన ఈ జననాల రేటు ప్రకారం ప్రతిఏటా 1.3 కోట్ల బిడ్డలు జన్మిస్తున్నారు. ప్రపంచంలో బాలల జనాభా ఎక్కువగా గల దేశాలలో భారతదేశం రెండవది ఇంకా విచిత్రమేమంటే 1911లో భారతదేశ జనాభా 25.2 కోట్లు. 1971 లో అమెరికా జనాభాకంటె 3.2 కోట్లు ఎక్కువ. 1977 కు అది 24.8 కోట్లకు పెరిగిందనీ జనాభా శాస్త్రవేత్తలు అంచనా వేస్తున్నారు. బాలల జనాభా ఈ శతాబ్దాంతానికి 28 కోట్లకు పైగా చేరగలదని అంచనా. ఎంతపెరిగినా మన దేశంలో పుట్టిన పిల్లలలో ఐదేండ్లకు నిండకుండా 40శాతం మరణిస్తున్నారు పుట్టిన ఏడే 5 శాతం పరలోకం చేరుతున్నారు.

---

19 Child in India 1979-Demographic profile. New Delhi, UNICEF House, 1979.

20 Srinivasan, K and others Demographic and Socio-Economic Aspects of THE CHILD IN INDIA, New Delhi, Himalaya Publishing House, 1979. pp 662.

పల్లెలలో పిల్లలు :

భారతదేశంలో పల్లెసీమలలో 81 శాతం బిడ్డలు ఉంటున్నారు. 1976 లో తీసిన లెక్కల అంచనాల ప్రకారం 18 9 కోట్ల మంది బాలలు పల్లెలలో ఉంటున్నారు. మరి 1.49 కోట్ల బిడ్డలు గిరిజన ప్రాంతాలలో ఎండకు ఎండి వానకు తడిసి జీవిస్తున్నారు. కాగా, పట్నాలలో, నగరాలలో గడిపే బిడ్డలు 4.7 కోట్లకు మించిలేరని తేలింది. ఈ అంచనాల ప్రకారం సగం మంది బిడ్డలు అనగా 48.7% శాతం ఆరేళ్ళ లోపువారు పీరి జనాభా 12.1 కోట్లు పీరిలో 8.97 కోట్లు గ్రామాలలో, 0 73 కోట్లు గిరిజన ప్రాంతాలలో, 2.42 కోట్లు పట్న, నగర ప్రాంతాలలో నివసిస్తున్నారు.

ఆర్థిక పరిస్థితి :

1976లో సిద్ధం చేసిన భారత జనాభా అంచనాల ప్రకారం 9.94 కోట్ల బాల బాలికలు అనగా మొత్తం బాలలలో ఐదింట రెండు వంతులు మంది బతకలేక బతుకుతున్నారు. ఈ బాలలలో 4.85 కోట్ల మంది అనగా దగ్గర దగ్గర సగం ఆరేళ్ళలోపు వయసు వారు 7-14 ఏళ్ళ వయసుగల బాలలు దాదాపు 5.09 కోట్లు. వీరు నిరుపేదలు. వీరిలో 8.77 కోట్లు గ్రామాలలో, 1.02 కోట్లు మంది బాలలు పట్నాలలో, నగరాలలో, ౫ కోట్లు గిరిజన ప్రాంతాలలో నివసిస్తున్నారు. 1977 ఏప్రిల్ మాసంలో తీసిన అంచనాలనుబట్టి 12 6 కోట్ల బాలలు వేతనానికి చేరువగా ఉన్నారు.

విద్య :

దేశ వార్షిక బడ్జెట్‌లో 3 శాతం, రాష్ట్ర వార్షిక బడ్జెట్‌లో 18 శాతం విద్యకు కేటాయిస్తున్నారు. ఇందులో 30 శాతం మాత్రం ప్రాథమిక విద్యకు కేటాయిస్తున్నారు. భారతదేశంలో 1950-55 లో విద్యా కార్యక్రమాలకు 115 కోట్లు వెచ్చించగా, 1977-78 లో మొత్తం 2500 కోట్లకు చేరుకుంది. 1980-81కి 3200 కోట్లకు పెరిగింది రోజు వారీగా మన దేశంలో బాలల మీద 50 పైసలు ఖర్చు పెడుతుండగా, రష్యాలో రూ. 20-00 జపాన్‌లో రూ. 25-00, మలేషియాలో, థాయ్‌లాండ్‌లో రూ. 5-00 చొప్పున ఖర్చు చేస్తున్నారు. పాఠశాలలో చేరిన ప్రతి పది మంది

విద్యార్థులలో ఒకరు మాత్రమే కాలేజీ చదువు వరకు వెళ్ళగలుగుతున్నారు. ఈ పది మందిలో ఐదుగురు పిల్లలు 8వ తరగతి లోపు, 9 మంది 11వ తరగతిలోపు చదువు మానుతున్నారు. ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ చైల్డ్ వెల్ఫేర్ అధ్యక్షుని అంచనా ప్రకారం 8 కోట్లమంది బిడ్డలు దుర్భర జీవితం గడుపుతున్నారు. వాళ్ళు ఏకారణం చేతైనా స్కూలుకుపోతే బలవంతాన మానివేయించబడతారు. [21] అదీ వాస్తవ పరిస్థితి.

మనదేశంలో పాఠశాలలలో ఒక్కొక్క తరగతిలో నిర్దేశింపబడిన 45 మందికంటే ఎక్కువగా అంటే-60 మందికి పైబడి విద్యార్థులతో తరగతులలో కిక్కిరిసి పోవడం వలన విద్యాప్రమాణాలు దిగజారి పోతున్నవని విజ్ఞులు అభిప్రాయపడుతున్నారు. మనదేశంలో 6 లక్షల ప్రాథమిక, మాధ్యమిక పాఠశాలలో 85 శాతానికి పైగా గ్రామసీమలో ఉన్నాయి. ఐతే ఆటస్థలాలు, లాబరేటరీలు, లైబ్రరీలు మొదలైన హంగులు ఏర్పాటు చేయడంలో 90 శాతం గ్రాంట్లు పట్టణ, నగర ప్రాంత పాఠశాల లకే లభిస్తున్నాయి. దేశం మొత్తం మీదగల పాఠశాలలో 40 శాతం వరకు బడి పిల్లలు మంచినీరు తాగే సౌకర్యం లేదు. మన గ్రామీణప్రాంతాలలో 20 శాతం బాలలు అసలు క్లాసురూము చూడరు.

బాల కార్మికులు

ప్రపంచంలోని అన్ని దేశాలకన్న ఎక్కువమంది బాల కార్మికులు భారత దేశంలోనే ఉన్నారు. బాల కార్మికులలో 80 శాతం బిడ్డలు వ్యవసాయరంగంలో పనిజేస్తున్నారు. పారిశ్రామిక రంగంలో 14 ఏళ్ళ వయసు నిండని పిల్లలు పనిచేయరాదని రాజ్యాంగ పరమైన రక్షణ ఉంది. అయితే వ్యవసాయ రంగానికి మాత్రం వయోపరిమితి నిబంధన వర్తించదు. బాల బాలికల సంక్షేమం కోసం పనిచేసే సంస్థలలో 80 శాతం పైగా పట్టణ, నగర ప్రాంతాల బాల, బాలికలకే తమ సేవలను పరిమితం చేశారు. భారత దేశ బాల జనాభాలో 81 శాతం గ్రామ ప్రాంతాలలో నివసిస్తున్నారు.

21 Tara Ali Baig. Our 300 Million Children. Illustrated Weekly, February, 1979

.92 కోట్లమంది బాల బాలికలు కటిక దరిద్ర పరిస్థితులలో జీవితం గడుపుతున్నారు. 1.50 లక్షలమంది బాల బాలికలు మొత్తం మీద బిచ్చగాళ్ళుగానో, దేశ దిమ్మరులుగానో కాలం వెళ్ళబుచ్చుతున్నారు. దరిదాపు 1.25 కోట్ల మంది పిల్లలు–అనగా పిల్లల జనాభాలో ఐదోవంతు ఏవో పనిపాట్లు చేసుకుంటూ జీవితం గడుపుతున్నారు.

## వైద్యం : ఆరోగ్యం

భారతదేశపు బాలలలో ప్రతినెల ఆహార లోపం వలన లక్షమంది బిడ్డలకు పైగా మరణిస్తున్నారు. 25 లక్షల మంది బిడ్డలకు 'ఏ' విటమిన్ లోపం వలన కంటివ్యాధులకు గురవుతున్నారు. అంతర్జాతీయ బాలల సంవత్సరం గుర్తులోని చక్రం, సూర్యుడు, గుర్తులు పిల్లల విద్య, ఆరోగ్యాలను సూచిస్తాయి. 1–6 సం. వయసుగల బాలలు కనీసం 1350 కాలరీల ఆహారం తీసుకోవాలని సూచించబడగా, మన రాష్ట్రంలో సగటున 550 కాలరీల ఆహారాన్ని ఇస్తూ ఏడవస్థానంలో ఉన్నాము. ఇదే విధంగా 6-12 ఏళ్ళ వయసుగల పిల్లలు 1950 కాలరీల ఆహారం తీసుకోవాలని నిర్దేశింపబడగా, 800 కాలరీల ఆహారం యిస్తూ దేశం మొత్తం మీద ఏడవస్థానంలో ఉన్నాము. ఈ తరగతి వయసుగల వారికి 1500 కాలరీల ఆహారం యిస్తూ గుజరాత్ ప్రథమ స్థానంలో ఉంది.

ఈ గణాంకాలను దృష్టిలో ఉంచుకొని ప్రభుత్వం వైద్య, ఆరోగ్య సౌకర్యాలను అందజేసిన ఎడల బిడ్డలు శారీరకంగా, మానసికంగా పెరగడానికి వీలుంది

## పిల్లల హక్కుల ప్రకటన :

అవసరాలు అనేవి అందరికీ ఒకటే పెద్దం అవసరాలు పెద్దలవి. పిల్లల అవసరాలు పిల్లలవి. ఎవరివి తీరకపోయినా ఆలోటు లోటుగానే ఉంటుంది. తర తరాలుగా అధికారాలన్నీ పెద్దల హస్తగతమై ఉన్నందున వారి అవసరాలు ఎప్పటికప్పుడు తీర్చబడుతూనే ఉన్నాయి. పెద్దల అవసరాలు తీరినంత మాత్రాన–వాటితో బాటే–వారిపై ఆధారపడిన పిల్లలవి తీరినట్లు భావించరాదు. శతాబ్దాల తరబడి పెద్దల కోసం అనేక శాసనాలు చేయబడ్డాయి. రాజ్యాంగపరంగా అనేక వసతులు కల్పించబడ్డాయి. సౌకర్యాలు ఏర్పరచబడ్డాయి. మరి పిల్లల మాటేమిటి ?

పిల్లల మంచిచెడ్డలు పట్టించుకున్నవారు దాదాపు పదునెనిమిది శతాబ్దాలుగా లేరని చెప్పవచ్చు.

## తొలి ప్రయత్నాలు

"శారీరకంగానూ, మానసికంగానూ పెరిగి పెద్దవారు కావలసి ఉన్నందున పిల్లలపట్ల శ్రద్ధాసక్తులు చూపడం అవసరం." [22] బిడ్డలపట్ల ఈ విధమైన శ్రద్ధాసక్తులు చూపవలసిన అవసరాన్ని మొదటిసారిగా జనీవాలో జరిగిన నానారాజ్యసమితి (లీగ్ ఆఫ్ నేషన్స్) 1924 లో గుర్తించింది. 1948 నాటి మానవ హక్కుల ప్రకటనలో పిల్లలను గురించి ప్రత్యేకంగా ప్రస్తావించటం జరిగింది. పై సంఘటనలను దృష్టిలో ఉంచుకొని, తదుపరి జరిగిన ప్రయత్న ఫలితంగా ఐక్యరాజ్య సమితి (యునైటెడ్ నేషన్స్) జనరల్ ఎసెంబ్లీ 1959 నవంబరు 20 తేదీన పిల్లల హక్కుల ప్రకటన (రైట్స్ ఆఫ్ చిల్డ్రన్) ఆమోదించింది. ఈ హక్కుల ప్రకటన అమలు పరచడానికి సభ్యదేశాలన్నీ ఆమోదించాయి.

## పిల్లల హక్కులు

ఐక్యరాజ్యసమితి పిల్లల హక్కులన్నిటినీ పదిసూత్రాలలో ఇమిడ్చింది. వాటి సారాంశం ఇలా ఉంటుంది.

1 జాతి, మతం, భాష, సంపద, అంతస్తు, జననం మొదలైన ఆధారాలను బట్టి పిల్లలకు హక్కుల విషయమై ఎటువంటి విచక్షణ చూపకూడదు.

2 పిల్లలకు ప్రత్యేక రక్షణ సమకూర్చాలి. వారు శారీరకంగానూ, మానసికంగానూ, నైతికంగానూ, ఆధ్యాత్మికంగానూ, సాంఘికంగానూ, స్వేచ్ఛాయుతమైన వాతావరణంలోనూ, ఆరోగ్యప్రదమైన పరిస్థితులలోనూ పెరిగి పెద్దవారయేందుకు శాసనపరంగానూ, ఇతర విధాలగానూ తగిన అవకాశాలు లభించాలి.

3 పిల్లలకు పుట్టినప్పటినుండీ స్పష్టమైన జాతీయత ఉండాలి

4 పిల్లలు సాంఘిక భద్రతా ప్రయోజనాలు పొందాలి. వారు ఆరోగ్యవంతులుగా పెరిగి పెద్దవారు కావడానికి అవకాశాలు కలిగించాలి.

---

22 రామకృష్ణరావు, గోవిందరాజుల పిల్లల హక్కులు, బాలానందం-ప్రత్యేక సంచిక-1974, 116 పు

5 శారీరకంగానో, మానసికంగానో, సాంఘికంగానో బలహీనులైన పిల్లలకు ప్రత్యేక ఆదరణ, విద్య, రక్షణ కలుగజేసేందుకు ఏర్పాట్లు చేయాలి.

6 పిల్లలు సక్రమంగా పెరిగి పెద్దవారు కావడానికి వారి ఎడల ప్రేమాదరములు చూపాలి పిల్లలు సర్వసాధారణంగా తల్లిదండ్రుల రక్షణలో పెరగాలి.

7 పిల్లలకు కనీసం ఎలిమెంటరీ దశవరకైనా నిర్బంధ ఉచిత విద్య సమకూర్చాలి. వారి తెలివితేటలు సభ్యత పెంచి, శక్తియుక్తులను పెంపొందించుకునేందుకు సమానావకాశాలు కల్పించి, వివేచనా శక్తిని, నైతిక, సాంఘిక బాధ్యతను పెంచుకుని సమాజంలో ఉపయోగకరమైన సభ్యులుగా రూపొందేందుకు దోహదం చేయాలి. పిల్లల ఆట పాటలకు పూర్తి అవకాశం ఇవ్వాలి.

8 రక్షణ సహాయం సమకూర్చే సందర్భాలలో పిల్లలకు ప్రథమస్థానం ఇవ్వాలి.

9 నిర్లక్ష్యం, క్రౌర్యం, దోపిడి పరిస్థితులకు పిల్లలు ఏ రూపంలో గురి కాకుండా ఉండాలి. ఏ పరిస్థితిలోనూ పిల్లల ఆరోగ్యానికి, శారీరక, మానసిక, నైతిక పురోగతికి ఆటంకం కలిగించే పనులలో ఉంచరాదు.

10 జాతి, మత, తదితర విబేధాలను పెంచే ఆచార వ్యవహారాలకు పిల్లలను దూరంగా ఉంచాలి. అవగాహన, సహనం, స్నేహం, శాంతి, విశ్వమానవ సౌభ్రాతృత్వం, సోదర మానవసేవా నిరతితోకూడిన వాతావరణంలో వారిని పెంచాలి.

ఐక్యరాజ్యసమితి 1959 నుంచి పిల్లల హక్కుల ప్రకటనను [23] అంగీకరించినది. అమలు పరచే దేశాలలో భారతదేశం ఒకటి. భారతదేశంలో బిడ్డల పరంగా అనేక కార్యక్రమాలు నిర్వహించడానికి ఈ ప్రకటన మూలకారణం. ప్రభుత్వపరంగానే గాక, ప్రభుత్వేతర సంస్థలద్వారా కూడ ఈ ప్రకటనలోని ఆశయాలను సాధించడానికి ఐక్యరాజ్య సమితి ప్రయత్నించడం అభిలషణీయమైన విషయం.

23 Children's Rights UNESCO House, New Delhi, 1979.

# భారత సంవిధానం : పిల్లలు

బిడ్డల సంక్షేమ విషయంలో ప్రభుత్వ పరంగా గుర్తింపు వచ్చింది అనుకోడానికి భారత సంవిధానం (రాజ్యాంగం) [24]లో పిల్లలను గురించి చేర్చిన అంశాలే ఇందుకు ప్రబల సాక్ష్యాలు. ఒకసారి బాలలను గురించి శ్రద్ధతీసుకోవాలన్న అంశం రాజ్యాంగంలో చేరాక దేశపరిపాలనా వ్యవస్థలో ఈ అంశాలు అమలుపరచడానికి తగిన విలువ, ప్రాధాన్యం ఉంటాయి కనుక వాటి ప్రభావం బిడ్డల మీద, వారి భవితవ్యం మీద తప్పక ఆధారపడి ఉంటుంది బిడ్డల సంక్షేమాన్ని గురించి భారత సంవిధానం ఏం చెప్పిందో చూద్దాం.

బిడ్డల సంక్షేమం

భారత రాజ్యాంగం 1950 జనవరి 26 తేదీనుంచి అమలులోకి వచ్చింది. దానిలో బిడ్డలకు సంబంధించిన అంశాలు ఇలా ఉన్నాయి.

1 14 ఏళ్ల వయసులోపు బిడ్డలను ఫ్యాక్టరీలోనూ, గనిలోనూ లేదా కష్టతరమైన పనిలోనూ వినియోగించరాదు. లేదా అపాయకరమైన ఏ ఇతరపనిలో ప్రవేశ పెట్టరాదు. (నిబంధన 24)

2 జాతీయ జీవితంలోని వివిధ సంస్థలలో సాంఘిక, ఆర్థిక, రాజకీయ న్యాయాలను కలుగజేసి సాంఘిక వ్యవస్థను వీలైనంత సమర్థవంతంగా కలుగజేయడం, పరిరక్షించడం ద్వారా ప్రజల సంక్షేమాన్ని పెంపొందించడం దేశం గట్టిగా కృషి చేస్తుంది. (నిబంధన 38)

3 స్త్రీ పురుష శ్రామికుల బలం, ఆరోగ్యం, లేక పిల్లలు వయస్సు చెడి పోకుండా ఉండే విధంగా ఆర్థికావసరాన్నిబట్టి, తమ వయస్సునకుగాని, బలానికిగాని అనుకూలమైన వృత్తులందు పౌరులు నిర్బంధంగా ప్రవేశ పెట్టడం, బాల్య యవ్వనాలు నైతిక, భౌతిక బాహ్యత లేకుండానూ దుర్వినియోగ పరచకుండా రక్షించులాగున నడుపుతూ ఉండాలి. (నిబంధన 39)

.............................

24 THE CONSTITUTION OF INDIA (as modified upto 15th January 1980) New Delhi, Government of India, 1980. pp. 8, 15, 25 and 27.

4 రాజ్యాంగ ప్రారంభకాలంనుంచీ పదేళ్ళ కాలంలో పిల్లలందరికీ వారికి పదు నాలుగేళ్ళు వయసువచ్చేవరకు ఉచిత నిర్బంధ విద్యను ఏర్పాటు చేయటానికి రాష్ట్ర ప్రభుత్వం ప్రయత్నించాలి.

## బాలల జాతీయ విధానం

**పిల్లల అవసరాలను క్రమబద్ధమైన ఒక శాస్త్రీయ విధానంలో తీర్చదలచి భారత ప్రభుత్వం ఆగష్టు 22, 1974 తేదీన బాలల విషయంలో ఒక జాతీయ విధానాన్ని (నేషనల్ పాలసి ఫర్ చిల్డ్రెన్) ఆమోదించింది.**[25] బిడ్డల విషయంలో ఇటు వంటి ఉదాత్తమైన జాతీయ విధానంగల కొద్ది దేశాలలో భారతదేశం ఒకటి. ఈ విధానంలో పిల్లలు దేశ భవితవ్యపు ఆస్తిగా గుర్తించబడ్డారు. దీనిని బట్టి బాలల బహు ముఖ సంక్షేమానికి భారత ప్రభుత్వ కృతనిశ్చయం స్పష్టమౌతున్నది. ఇది మన దేశ చరిత్రలో, జాతి చరిత్రలో ముఖ్యమైన ఘట్టంగా విజ్ఞులు భావిస్తున్నారు. దీని తదనంతర కార్యక్రమంగా - పిల్లల సమస్యలను గురించి చర్చించి, వారి సంక్షేమ కార్యకలాపాలను సమీక్షించి సమన్వయ పరిచే బృహత్తర కార్యక్రమం ప్రధాన మంత్రి అధ్యక్షతన ఉన్నతాధికారాలతో జాతీయ శిశు వ్యవహారాల మండలి పని జేస్తున్నది. ఈ సందర్భంలో ప్రభుత్వం ఉద్దేశించిన జాతీయ విధానాన్ని గురించి పరిశీలించడం అవసరం.

## లక్ష్యాలు

భారత ప్రభుత్వం జాతీయ విధానం రూపొందించడంలో ప్రధాన లక్ష్యం బాలలను శారీరకంగా, మానసికంగా పెరగడానికి సమాజానికి అవసరమైన విధంగా ఉత్తమ పౌరలుగా తీర్చి దిద్దడం జాతి, కుల, వర్గ, మత వివక్షతలకు దూరంగా ఉంచడం. బిడ్డలందరికీ సమాన అవకాశాలు కల్పించడం. సాంఘిక న్యాయం చేకూ

..........................

25 NATIONAL POLICY FOR CHILDREN Resolution No. 1-14/74-CDD dt. 22 August, 1974 of the Government of India, available in the papers of Andhra Pradesh State Conference on the National Policy for Children, Hyderabad 6-7 September, 1975. Organised by the Directorate of women and child welfare, Government of Andhra Pradesh.

ర్చడం. అసమానతలు తగ్గించడం, ఈదృష్టితో ఒక సమగ్రమైన బాలల జాతీయ విధానాన్ని భారత ప్రభుత్వం రూపొందించి - సాంఘిక సంక్షేమ శాఖ ద్వారా అమలు చేస్తున్నది. [26]

విధానం :

బిడ్డ పుట్టక ముందు, పుట్టాక, పెరుగుతున్నపుడు ఆ బిడ్డ భౌతికంగానూ, మానసికంగానూ, సాంఘికంగానూ పెరుగుదలకు తోడ్పడాలి. బిడ్డల పెరుగుదల క్రమంగా, నియమబద్ధంగా ఉండవలెనంటే ఈ దిగువ పద్ధతులను అనుసరించ వలసి ఉంటుంది.

1 సమగ్రమైన ఆరోగ్య పథక ప్రయోజనం పిల్లలందరకు అందించాలి.

2 బలవర్ధకమైన ఆహారాన్ని అందించే కార్యక్రమం ప్రవేశపెట్టాలి.

3 పదునాలుగేళ్ళ వయసుకలిగిన పిల్లలకు కాలబద్ధమైన కార్యక్రమంలో నిర్బంధ ఉచిత విద్యా విధానాన్ని ప్రవేశపెట్టాలి.

4 నిబద్ధ విద్యా విధానానికి నోచుకోని బిడ్డలకు - వాటికి వీలైన ఇతర విధానాలద్వారా చదువు చెప్పే ఏర్పాట్లు చేయాలి.

5 పాఠశాలలో, సామాజిక కేంద్రాలలో, ఇతర సంస్థలలో ఆటలు, వినోదాత్మక క్రీడలను ఏర్పాటు చేయాలి.

6 పల్లెలలో పట్నాలలో గల బలహీన వర్గాలవారి బిడ్డలకు, ఆర్థికంగా వెనుకబడిన వారి పిల్లలకు తగిన అవకాశాలను కల్పించాలి.

7 వికలాంగులైన బిడ్డలకు, నేరస్థులైన పిల్లలకు, దారిద్ర్యవశాన భిక్షుక వృత్తిని చేపట్టేవారికి విద్యావకాశాలను పెంపొందించి ప్రయోజనకరమైన పౌరులుగా తీర్చి దిద్దాలి.

8 బిడ్డలను అశ్రద్ధకు, క్రూరత్వానికి, దోపిడీకి దూరంగా ఉంచాలి.

9 పదునాలుగేళ్ళ లోపు బిడ్డలను కష్టతరమైన పనులలో నియోగించుట అనుమతించరాదు.

10 మానసికంగా వికలాంగులైన బిడ్డల విషయంలో ప్రత్యేక శ్రద్ధ చూపాలి.

.. ..... . . . ..

26 బాలలు - భారత ప్రభుత్వ విధానం. బాల సాహిత్య శిక్షణ శిబిర నివేదిక. సెప్టెంబరు 21-28, 1979.

11 ప్రకృతి ఉపద్రవాల వలన కలిగిన నష్టాలకు నివారణోపాయాలను కల్పించే సమయంలో బిడ్డల విషయంలో ప్రాధాన్యం ఇవ్వాలి.

12 ప్రతిభా వంతులైన బిడ్డల విషయంలో, తగిన కార్యక్రమాలు నిర్వహించాలి. అందునా బలహీన వర్గాలలోని బిడ్డల విషయంలో అధిక ప్రాధాన్యం చూపాలి.

13 తల్లిదండ్రులు - సంస్థల మధ్య లీగల్ వ్యవహారాలలో బిడ్డల అవసరాలకు అధిక ప్రాధాన్యం ఇచ్చే విధంగా చట్టాలను సవరించాలి.

దాదాపు ఈ కార్యక్రమాలన్నీ ప్రభుత్వ పరంగా స్వచ్ఛంద సంస్థల పరంగా నిర్వహింప బడుతున్నందున భవిష్యత్తులో బాలల జీవితం మరిన్ని వసతులతో ఆనంద దాయకంగా ఉండగలదనే ఆశ కలుగు తున్నది.

# బాలమనోవిజ్ఞానం - బాలసాహితి

బాలల మనః ప్రవృత్తులు - వ్యక్తిత్వ వికాసం

పుస్తకాలతో పరిచయం - చదవాల్సిన పుస్తకాలు

మ నో వి కా స ం

## బాల్యం : మనోవిజ్ఞానం

బాలల మనస్సుకు, మనోవికాసానికి సంబంధించిన శాస్త్రం బాలమనోవిజ్ఞానం (ఛైల్డ్ సైకాలజీ) అనీ, బాలల మానసిక శాస్త్రం అనీ, బాల మనశ్శాస్త్రం అనీ, పిల్లల మన స్తత్వశాస్త్రం అనీ అంటారు విశ్వజనీన విజ్ఞానంలో పదిహేడవ శతాబ్దం నుంచీ ప్రాముఖ్యం ఉన్నా - ఈ శతాబ్దంలో ప్రయోజకత్వానికి వచ్చింది. శాస్త్రీయ పరి జ్ఞానంతో బాలల సంక్షేమానికి తోడ్పడడానికి వీలుకలిగింది. బాలలను ఉత్తమ పౌరు లుగా తీర్చిదిద్దడానికి వ్యక్తిత్వ వికాసం పెంపొందించడానికి బాల మనోవిజ్ఞానం తోడ్పడుతుందని జెసిల్ తన గ్రంథంలో తెలిపాడు. [1]

అంతేగాక "బాల మనోవిజ్ఞానం పిల్లల ప్రవర్తనను, వికాస గమనాన్ని అధ్యయనం చేస్తుంది. పిల్లల సంక్షేమానికి దోహదం చేస్తుంది. ఈ విజ్ఞాన పరిధిలో వివిధ వయో దశలకు చెందిన పిల్లల లక్షణాలకు" [2] సంబంధించిన పరిజ్ఞానాన్ని తత్సంబంధ సామాన్య సూత్రాలను చేర్చవచ్చు. ఇవన్నీ కూడ పిల్లలను అర్థం చేసికోడానికి దోహ దం చేస్తాయి.

గతకాలంలోనూ, నేడూ మానసిక శాస్త్రవేత్తలు బాల్యానికి విశిష్టస్థానం ఇస్తూవచ్చారు. మనోవిశ్లేషణ (సైకో ఎనాలిసిస్) సిద్ధాంత కర్త సిగ్మడ్ ఫ్రాయిడ్ పసివాడు పెద్ద వాడయ్యాక - అతడు తీర్చి దిద్దబడే తీరు అతని బాల్యంమీదే ఆధారపడి ఉంటుంది అన్నాడు. [3] అంటే బాల్యంలో పడిన పునాదిమీదే — వారి వ్యక్తిత్వం ఆధారపడి ఉంటుందని ఫ్రాయిడ్ భావన. ఈ ఆలోచనా సరళిలో బాల్యానికి విశేషమైన ప్రాము ఖ్యంను ఇచ్చిన వారిలో కొమేనియస్, లాక్, రూసో, పెసల్టిలైడ్‌మెన్, విలయం ప్రేయర్, స్టాన్లీ హాల్, విల్మెర్ మొదలైన మనస్తత్వ శాస్త్రవేత్తలు ముఖ్యులు.

---

1 Gesell, A. Infant and Child in the Culture of Today Philadelphia, Loppincot, 1950. P. 143.

2. రెడ్డి, యన్. యమ్ బాలమనోవిజ్ఞానం. 'విజ్ఞాన దీపికలో' హైదరాబాదు, ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ, 1976, 888 పు.

3. Freud, Sigmund, The Interpretation of Dreams. London, George Allena & Unwin Ltd, 1954. p 94

## పిల్లల మనః ప్రవృత్తులు

బిడ్డల మనః ప్రవృత్తులను సమగ్రంగా అర్థంచేసుకోవాలంటే వారి బాహ్య, అంతః ప్రవృత్తులను రెంటినీ లెక్కలోకి తీసుకోవాల్సి ఉంటుంది. [4] పిల్లలలో బహిర్గతంగా ఆనందం, ఆవేశం, కోపం, శాంతం, బాధ, క్రోధం, ఉన్మాదం, ఉత్తేజం కనిపిస్తాయి. అనుభూతి, ప్రేరణ, ఆలోచన, అంతర్గతంగా నిక్షిప్తమై ఉంటాయి. [5]

## బాహ్యప్రవృత్తులు

బాహ్యప్రవృత్తులను బట్టి డాక్టరు ధూర్జటి సుబ్బారావుగారు[6] పిల్లల భౌతికవ్యాపారాలను ఈ విధంగా విభజించారు.

1 పుట్టుకు పూర్వదశ. వంశపారంపర్యత (హెరిడిటరీ) పరిసరాల (ఎన్విరాన్‌మెంట్) ప్రభావం శిశువు పుట్టడానికి తొమ్మిది మాసాలకు పూర్వమే మొదలౌతుంది.

2 శిశు దశ. తొలి రెండు సంవత్సరాలు.

3 పూర్వ బాల్య దశ. రెండు మొదలు నాలుగు సంవత్సరాల శిశువు.

4 తొలి బాల్యదశ. ఐదు, ఆరు, ఏడు సంవత్సరాలు.

5 మధ్యస్థదశ ఎనిమిది సంవత్సరాలు.

6 తెలియని వయస్సు. తొమ్మిది, పది, పదకొండు సంవత్సరాలు.

7 తొలి యౌవనదశ. పన్నెండు, పదమూడు, పద్నాలుగు సంవత్సరములు.

8 దాదాపు పెద్దవారు - పదిహేను, పదహారు, పదిహేడు సంవత్సరాలు.

ఈ విధంగా వివిధ దశలలో పిల్లలు పెరిగి పెద్దవారవుతారు. వ్యక్తిత్వాన్ని పెంపొందించుకుంటారు.

## అంతర ప్రవృత్తులు

అమెరికన్ మానసిక శాస్త్రవేత్త ఇ. హెచ్. ఎరిక్‌సన్ తన గ్రంథంలో 'బాల్యం –

........................................

4 Medinus, Gen R (ED) Readings in the Psychology of parent-child relations, 1965. P 76

5 Thomas, Alexander and his associates. Behavioral Individuality in Early Child-hood, 1963. P 196

6. సుబ్బారావు, ధూర్జటి. పిల్లల మనస్తత్వశాస్త్రం: విజయవాడ, విశాలాంధ్ర, 1977- 1968. 15 - 147 పు.

సమాజం'లో బాలల మనః ప్రవృత్తులను ఎనిమిది దశలుగా విభజన చేశాడు. పిల్లల భవిష్యత్తు బాహ్య ప్రవృత్తులకంటే అంతర ప్రవృత్తులమీదే ఎక్కువ ఊనిక కలిగి ఉంటుంది. [7] బిడ్డల భవితవ్యం ప్రధానంగా పరిసరాలు, ఊహలు, స్వేచ్ఛ, కల్పనా శక్తి, ఆత్మ ప్రదర్శన, ద్వంద్వాల అధిగమనం, అనుకరణ, అనుభూతి - మొదలైన అంశాలమీద ఆధారపడి ఉంటుంది. ఇది మానసిక శాస్త్రవేత్తలు మనకందించిన సత్యం. వీనిలో మొదటి అంశం -

1 ఉత్సుకత - పిల్లల్లో తెలుసుకోవాలనే ఉత్సాహం సహజంగా ఉంటుంది. తల్లి దండ్రులకంటె ప్రతిబిడ్డ తెలివైనవాడే. ఇది సోక్రటీస్ కాలంనుంచీ చెబుతున్నమాట. "తల్లిదండ్రులు వారిని పెరగవలసినంతగా పెరగనీయడం లేదు. మరొకప్పుడు పెద్దల ప్రవర్తన వలన బిడ్డలలోగల సహజమైన తెలివికి గ్రహణం పడుతుంది."[8] ఉత్సాహంతో పిల్లలు ప్రశ్నలువేస్తారు. ఆ జిజ్ఞాస వారిలో సహజంగా ఉంటుంది. ఆ జిజ్ఞాస క్రమమైన పద్ధతిలో పెడితే వారితో ప్రతిభా వ్యుత్పత్తులు పెంపొందుతాయి. వాళ్ళలో రేకెత్తే ప్రశ్నలే వారి విజ్ఞాన ప్రగతికి టోహదాలౌతాయి. వారి ప్రశ్నలు, వారి మానసికాభివృద్ధికి ప్రకృతి కల్పించిన ఆలంబన. ఒక ప్రసిద్ధ విమర్శకు డన్నట్లు - పెరిగి పెద్దవారమైనామని విర్రవీగే మనం వింత ప్రశ్నలనీ విడ్డూరపు ప్రశ్నలనీ, వెర్రి మొర్రి ప్రశ్నలనీ అడ్డుగోలు ప్రశ్నలనీ పెదవి విరిచే మన వేదవేదాంగాలకేగాక, ఆధునిక వైజ్ఞానిక శాస్త్రాలన్నిటికీ మూలకారణం 'ప్రశ్న' అన్నారు.

1 చెట్టునుంచి రాలిన యాపిల్ నేలమీదికి ఎందుకు పడాలి? ఆకసంలో ఎందుకు ఎగిరిపోరాదు. అని ఐజాక్ న్యూటన్‌కు తోచిన కుంటి ప్రశ్న గురుత్వాకర్షణ సిద్ధాంతానికి దారితీయలేదా!

2 కెటిల్ మూత కుదిపి వేయగలుగుతున్న ఆవిరికి యంత్రాలను కదిలించే శక్తిగలదా? అన్న జేమ్స్ వాట్ ప్రశ్న స్టీమ్ ఇంజన్ నిర్మాణానికి కారణం కాలేదా?

3 యురేనియం లవణాల సమీపంలో పెట్టిన ఫోటోగ్రాఫిక్ ప్లేటు ఎక్స్పోజ్ అయిపోతున్న దేమిటి? అని ఒక ఫ్రెంచి శాస్త్రవేత్తను పీడించిన ప్రశ్న మదాం క్యూరీ రేడియం కనిపెట్టటానికి తోడ్పడలేదా! కనుక "ప్రశ్న" ప్రగతికి మూల కారణం అంటే ఆశ్చర్యపడాల్సిన పనిలేదు. కనుక పిల్లలలో ప్రశ్నించే ప్రవృత్తిని ప్రోత్సహించాల్సి ఉంది.

.. . ... ... . . .............. . . . ......... .....

7 Ericson, E. H. Childhood and Society. New York, Norton, 1963. PP-246 - 274.

8 NEHRU, JAWAHARLAL from message to the children's Number of SANKAR's WEEKLY, New Delhi, December 26, 1950.

2 స్వేచ్ఛా ప్రవృత్తి – పిల్లలు స్వేచ్ఛనే కోరుకుంటారు. కట్టడులు సహించలేరు. స్వేచ్ఛా జీవితంలోనే వారికి కొత్త ఆలోచనలు వస్తాయి. నిర్మాణశక్తి పెరుగుతుంది. ఆదశలోనే వారు మట్టిబొమ్మలు చేస్తారు. ఇసుకతో బొమ్మరిల్లు కడతారు గుడ్డపీలికలతో కొయ్య బొమ్మలకు పెండ్లిముస్తాబు చేస్తారు. స్వేచ్ఛలో పెరిగిన బిడ్డకు ఆవిధంగా నిర్మాణ స్పృహతో బాటు ఆత్మ విశ్వాసం పెరుగుతుంది. పసిబిడ్డలో స్వేచ్ఛా ప్రవృత్తిని తెలుసుకోదలచి నెపోలియన్ ఒక ప్రయోగం చేశాడు. కొద్ది మాసాలు వయసు గల పిల్లలను ఏకాంతంగా ఉంచాడు. అందరినీ ఒక గదిలో కాదు. ఎవరి గది వారిదే. వారి కవసరమైన తిండి, బట్ట అమర్చాడు. ఆరోగ్య వసతులు సమకూర్చాడు. ఏలోటూ చేయలేదు. రెండేళ్ళ తరువాత వారి పరిస్థితి గమనించాడు. బిడ్డలు శారీరకంగా బాగా ఉన్నారు ఆరోగ్యవంతులుగా వున్నారు. కానీ నోటమాట రాలేదు నమ్మరేమో! వాళ్ళందరు మూగవాళ్ళయ్యారు. స్వేచ్ఛ లేని తనం అంతటి ప్రమాదాన్ని తెచ్చిపెడుతుంది. ఒంటరితనం అంతటి భయంకరమైనది. కనుక బిడ్డలకు స్వేచ్ఛతో కూడిన సంఘ జీవితం అలవరచాలి.

3 కల్పనాశక్తి – పిల్లలలో కల్పనా ప్రవృత్తి సహజంగా ఉంటుంది. రికామీగా కూర్చోవడం వారికి చేతగాదు చెయ్యి, కాలూ ఆడుతూ ఉండాల్సిందే. ఏదో చెయ్యాలనే తపన, ఆరాటం, ఉత్సాహం–పిల్లల మనోవేగాన్ని పరిగెత్తిస్తూ ఉంటాయి. ఈ స్థితిలో పెద్దవారి భావాలు వారిపై రుద్దితే వారు పెరగలేరు. వయసులో పెరిగినా మానసికంగా తరిగిపోతారు. ఖలీల్ జిబ్రాన్ చెప్పినట్లు "నీవు పిల్లలకు ప్రేమని అందించు. నీ అభిప్రాయాలను కాదు." ఈ సూచన పాటిస్తే పిల్లలలో కల్పనాశక్తి పెరుగుతుంది. మారుతున్న లోకానికి తగినట్లు వారు ఎదగ గలుగుతారు. ఇది తల్లిదండ్రులు గుర్తించవలసిన విషయం.

4 ఆత్మ ప్రదర్శన – తల్లి జోలపాట పాడే దినాలలోనే తన బిడ్డను శ్రీకృష్ణునిగా, శ్రీరామునిగా, శ్రీ మహావిష్ణువుగా పోల్చుకుని తనలో తాను ఆనందపడుతుంది. ఉప్పొంగిపోతుంది. మనకు పెరిగాక బిడ్డపై ఆ ప్రభావం కొంత ఉంటుంది. కనుక బిడ్డను ఉబ్బేస్తే పొంగిపోతాడు. కించపరిస్తే కుంగిపోతాడు కుంగిపోవడం ఏకారణం చేతైనా కాస్త హెచ్చు మోతాదులో జరిగితే పిల్లలలో ఆలోచనాశక్తి లోపిస్తుంది. సత్వర నిర్ణయశక్తి నశిస్తుంది. పిరికితనం పెరుగుతుంది. ఈ సందర్భంలో చలంగారు అంటారు "ఈ అందమైన ప్రపంచమంతా – ప్రపంచంలో ఉండే ఉత్సాహమూ, ధర్మమూ, ఆనందమూ, బిడ్డలవిగా చేయాలి. ఈ లోకానికి బిడ్డ యువరాజై పుట్టినట్లు చూడాలి. కనుక బిడ్డల ఆత్మ ప్రదర్శనా ప్రవృత్తి తగినంతగా పెరగాలంటే వారిని తగుమోతాదులో పొగడాలి. ఆ పొగడ్త తగిన మోతాదులో ఉండాలి. కాని ఆకాశాని కెత్తేస్తే ప్రమాదం రావచ్చు" నని హెచ్చరిస్తారు.

5 ద్వంద్వ ప్రవృత్తి – పిల్లలలో పెరుగుదల వస్తున్న కొలది వారిలో ఆలోచనలు పెరుగుతాయి ఆలోచనలు ఒక స్థాయి మించితే తర్కం చోటు చేసుకుంటుంది నిర్ణయాలలో ఊగిసలాట బయలు దేరుతుంది ప్రతి పనిచేయడంలో సందిగ్ధ ప్రవృత్తికి నాంది పలుకుతుంది ఈ స్థితిలో బలవంతుడితో పోరాటానికి సిద్ధమౌతాడు చేతకాక పోతే లొంగిపోతాడు బలహీనుడిని లొంగదీసుకుంటాడు అంటే పోరాడే ప్రవృత్తి, ఎదుర్కొనే ప్రవృత్తి పెరుగుతుంది బాల మనో విజ్ఞానవేత్త జాన్ ఎండర్సన్ చెప్పి నట్లు "ఏ దేశంలో పోరాడే జాతి తక్కువగా ఉంటుందో అది తన్నుతాను కాపాడుకో లేదు ఇతరజాతులు దాని మీదపడి తన ఆధిపత్యాన్ని నిలబెట్టుకుంటాయి " ఇది చారిత్రక సత్యం

6 అనుకరణ ప్రవృత్తి – అనుకరించడం బిడ్డలకు హాబీ అనుకరిస్తూనే వారు పెరిగి పెద్దవారవుతారు. కనుక అనుకరణ ప్రభావం వారిపై మిన్నగా ఉంటుంది. తాతయ్యలాగ వంగి నడచినట్లు నడవడం, అవ్వ మాట్లాడినట్లు నటించడం వారికి సరదా. అనుకరణతోనే తోటి వాళ్లతో ఆడుకుంటారు. ఉలికిస్తారు గేలిచేస్తారు. ఏడి పిస్తారు అది పిల్లలలోకం అనుకరణ వారిలో నిక్షిప్తమైన కళాజిజ్ఞాసను ప్రేరేపి స్తుంది కళాకారుడుగా చేస్తుంది జీవిత గమనానికి తోడ్పడుతుంది.

7 అహంకార ప్రవృత్తి – ఈ ప్రవృత్తి చాలమంది పిల్లలలో పుట్టుకతో వస్తుంది ఇది ఒక స్థాయిలో ఉంటే అది వ్యక్తిత్వాన్ని నిలబెడుతుంద ఆత్మ విశ్వాసాన్ని పెంచుతుంది తను తానుగా పెరగాలనే ధైర్యాన్ని పెంచుతుంది ఈ ప్రవృత్తి చాల ప్రమాదకరమైనది ఒకప్పుడు ప్రయోజనకరమైనదికూడ కనుక యీ ప్రవృత్తిని తుంచవల సినచోట తుంచాలి. పెంచవలసినచోట పెంచాలి. "నేను అమ్మలాగ ఉన్నానంటారు నాన్ననుంచి ఊడిపడ్డావంటారు మరికొందరు. కానినేనునావలె ఉంటాను "[9] అంటాడు ఒక బాలుడు. ఆవిధమైన వ్యక్తిత్వం బాలునిలో రావాలి.

8 సానుభూతి ప్రవృత్తి – ఇది ప్రతి బిడ్డలో ఎధిగా ఉండవలసిన ఒక అనుభూతి సాటివారు గాయపడితే బిడ్డ బాధ పడతాడు. తాను చేయవలసిన సాయం ఏదైనా ఉంటే చేయాలని ఉబలాట పడతాడు. అది అతనిలో ఆర్ద్రతను, సానుభూతిని

..............................

9 Dorothy Aldis. 'Every thing and Any thing' New York, Ladders INC, 1976. P 89

పెంచుతుంది ఆగొప్పగుణాలు జీవితంలో ఎంతో ఉపకరిస్తాయి ఆదశలోనే బిడ్డ "ఇత రులనుండి వినాలని, ఇతర ప్రదేశాలు చూడాలనే అభిరుచి పెంచుకుంటాడు తాను చూసే ప్రతివస్తువుతో తన ప్రమేయం ఉండాలనీ, తాను నిర్వహించాలనీ అనుకుంటాడు. ఐతే సొంత ఆలోచనలు పూర్తిగా నచ్చవు ఇతరులను గురించి తెలుసుకోవాలనీ వారి భయాలు, ఆశలు, అనుభవాలు, విజయాలు తెలుసుకోవాలనీ - ఆరాటపడే ప్రవృత్తి పెరుగుతుంది. "[10] ఈ అనుభవం సానుభూతికి దారితీస్తుంది

వ్యక్తిత్వ వికాసం

బాహ్యాంతర ప్రవృత్తుల సమ్మేళనాలలో వయసు పెరుగుతున్న కొలదీ వ్యక్తి పెరు గుతూ ఉంటాడు పరిసరాల ప్రభావంతో వ్యక్తిత్వం వికసిస్తుంది. ఇది యస్. యమ్ రెడ్డిగారి ప్రకారం శారీరకం, మానసికం, సాంఘికం అని విభాగాలు చేయబడింది [11]

1 బిడ్డ శరీరంలోనూ, ఆకారంలోనూ ఏర్పడే పెరుగుదల, శరీర అవయవాలను నేర్పుగా ఉపయోగించగల సామర్థ్యానికి అవసరమైన పెరుగుదల, జ్ఞానేంద్రియాలను సక్రమంగా సమన్వయంతో పనిచేయించడం - మొదలైనవన్నీ శారీరక వికాసాల క్రిందకు వస్తాయి.

2 ఆలోచనా శక్తి, ప్రజ్ఞ, స్మృతి, ఉద్వేగాలు, మూర్తిత్వం మొదలైనవి మాన సిక వికాసాలు అనబడతాయి.

3 మానవుడు సంఘజీవి. ఒంటరిగా ఎక్కువకాలం బతకలేడు ఐతే సం ఘంలో ఇతర వ్యక్తులతో ఎలాంటి ఘర్షణలు పడకుండా అన్యోన్యంగా జీవనం సాగించాలంటే ఎంతో సత్సంబంధాలు పెంచుకోవాలె. వ్యక్తితో ధ్యేయాన్ని సాధిం చడం కోసం సాగే ప్రక్రియను సాంఘికీకరణం అంటారు.

పై మూడు ప్రక్రియల వికాసంలో సాహిత్యం బాగా తోడ్పడుతుంది.

..............................

10 Peter Sandiford, Mental & Physical Growth of Children, Collins, P 290

11 రెడ్డి యస్. యమ్ బాలమనోవిజ్ఞానం (విజ్ఞాన దీపిక - మొదటి సంపుటంలో 341 )

రాధాకృష్ణ పండితుడు చెప్పినట్లు సాహిత్యం జీవితానికీ, ఆలోచనకు సమన్వయం ఏర్పరచి వారధిగా నిలబడుతుంది ఆ వారధి నిర్మాణానికి తల్లిదండ్రులు పిల్లలకోసం తమ ప్రయత్నం తాము చేయాలి. అప్పుడే బిడ్డల పెరుగుదల ఆలోచన, ప్రజ్ఞ సాంఘిక జీవనం సమపాళ్లలో వికసిస్తుంది

## పుస్తకాలతో పరిచయం

చరిత్ర గతకాలాన్ని తెలుపుతుంది జీవితం వర్తమాన కాలాన్ని తెలుపుతుంది జీవిత మంటేనే ముందుకుసాగే ప్రయత్నానికి మారుపేరు. జీవిత మార్గానికి బిడ్డలను మళ్లించాలనే వారు సామాజిక స్రవంతిలో బిడ్డలను కలపడానికి వారికి పుస్తకాల పరిచయం కలుగజేయాలి. దాంతో జిజ్ఞాస పెరుగుతుంది. సాహిత్య ప్రభావం ఏర్పడుతుంది ఈ సాహిత్య ప్రభావాన్ని గురించి డాక్టరు రిచర్డ్ బాంబెర్గర్ ఇలా అంటారు "వాస్తవంగా బిడ్డ చదివే మొట్టమొదటి మంచి పుస్తకమే – భావనా ప్రపంచంలోని ఆ బిడ్డ తొలి స్వతంత్ర యాత్ర...పుస్తకం వెనుక అదృశ్యుడై ఉండే బోధకుని మాటలే హితవుగా మనస్సుకు పడతాయి.[12] తోటి వారిపట్ల ప్రేమతో ఉండాలనీ, దయ చూపాలనీ ఎన్ని ఉపన్యాసాలు దంచినా వారికి ఎక్కదు కాని ఆవు – పులి కథ, అంకుల్ టామ్ కథ చదివినప్పుడు అవి వారి మనస్సుకు హత్తుకుంటాయి సాహిత్య ప్రభావం అంతటి శక్తివంతమైనది కనుక చదివె అలవాటును పెంపొందించుకోవాలని "జీవించే కళను, జీవితోద్దేశాన్ని తెలుసుకోడానికి" చదవాలని ఎడ్గార్ బ్రూస్ వెస్లే తెలియజేస్తారు. అంతేగాక వారు "జీవితాన్ని సుఖమయం చేసుకోడానికి పుస్తకాలు మహోపకరణాలు" అని స్పష్టంచేస్తారు.

## చదవాల్సిన పుస్తకాలు

బాలలకు త్వరితగతిలో మానసిక వికాసం కలగడానికి వారికి పుస్తకాలతో పరిచయం కలుగ జేయాలనేది అందరూ అంగీకరించిన సత్యం ఐతే ఏవయసులో వారికి పుస్తకాలు అందజేయాలనేది చిరకాలంగా చర్చ జరుగుతున్నది. ఈ సందర్భంలో అనుభవజ్ఞులు బిడ్డలకు అందజేసే మోతాదును మూడు తరగతులుగా విభజించారు.

..............................

12 బాంబేర్గర్, రిచర్డ్, పుస్తకాల ప్రభావం, పుస్తక ప్రపంచం - జూన్ 1964

1 దృశ్య సాహిత్యం
2 శ్రవ్య సాహిత్యం
3 పఠన సాహిత్యం

వీటిలో 0-2 వయసుగల వారికి దృశ్య సాహిత్యం, 2-4 వయసు గలవారికి శ్రవ్య సాహిత్యం, 4-14 వయసు గలవారికి పఠన సాహిత్యం అందించాలని కొందరి భావన. అయితే "ఐదు, పదేళ్ల మధ్య వయసు గలవారికి దృశ్యసాహిత్యం మొదటిది గానూ, శ్రవ్య సాహిత్యం రెండవదిగానూ, పఠన సాహిత్యం మూడవదిగానూ ఉండాలని...[13] గొర్రెపాటి వెంకట సుబ్బయ్యగారి ఆలోచన.

1957 జూన్‌లో ఢిల్లీలో జాతీయ స్థాయిలో జరిగిన బాలసాహిత్య సదస్సులో బిడ్డలు చదవాల్సిన సాహిత్యం ఈ తీరుగా నిర్ణయించబడింది [14]. 6-7 నెలల పాపలకు పాటలు వినిపించాలి 7-14 నెలల పాపలకు రంగురంగుల బొమ్మల పుస్తకాలు చూపించాలి. 2-3 ఏళ్ల పాపలకు జంతువుల కథలు చెప్పాలి. 4-5 ఏళ్ల పాపలు బడికి వెళ్తారు. కొత్త పరిసరాలతో పరిచయం ఏర్పడుతుంది. స్నేహితులు ఏర్పడతారు అప్పుడు బాలల కథలు, మనసాంఘిక వాతావరణానికి సంబంధించిన కథలు చెప్ప వచ్చు. చదివే అలవాటు చేయవచ్చు

6-8 ఏళ్ల పిల్లలలో కొత్త ఆలోచనలు బయలుదేరుతాయి. ఆ సమయంలో వారికి దేవతల కథలు చెబితే లేదా చదివిస్తే ఆనందపడతారు అద్భుత కథలలో తాదాత్మ్యం చెందుతారు 9-12 ఏళ్లవయసులో వారికి బాగా అర్థం చేసుకునే శక్తి వస్తుంది వ్యవహార జ్ఞానం అలవడుతుంది ఆ సమయంలో వారు దేశ చరిత్ర, జీవితచరిత్ర, భూగోళం, రహస్య-గోపన కథలు, కామిక్ పుస్తకాలు చదవడానికి ఆనందపడతారు వారి కప్పుడు తగినన్ని పుస్తకాలు అందించాలి 13-15 ఏళ్ల వయసులో విజ్ఞానశాస్త్ర గ్రంథాలు, పురాణ కథలు, వారి పాఠ్యప్రణాళికకు అనుబంధంగా ఉపయోగించే పుస్తకాలు అందించాలి. క్రమబద్ధమైన ఒక వరుస క్రమంలో పిల్లలకు పుస్తకాలు అందించడం వలన వారిలో చదివే అలవాటు పెరుగుతుంది మానసిక వికాసం కలుగుతుంది

.. ....... .. .. .............

13 వెంకట సుబ్బయ్య, గొర్రెపాటి. బాలసాహిత్యం - కిన్నెర. జనవరి, 1954

14 కాలియా డి ఆర్ భారత బాలసాహిత్య సమీక్ష - పుస్తక మిత్ర, జూన్, 1957

# బాలసాహితీ ప్రగతికి దోహదాలు

సాంఘిక, రాజకీయ పరిణామాలు-భాషావిప్లవం-పుస్తకాల ప్రచురణ
పత్రికల సహకారం - ఆకాశవాణి కార్యక్రమాలు-బాలానంద సంఘాలు
వైతాళిక రచనలు

### అనుకూల వాతావరణం

పంతొమ్మిదో శతాబ్ది ప్రారంభంలో మొదలైన సాంస్కృతిక పునరుజ్జీవనం తెలుగుదేశంలో బాలసాహిత్య ప్రగతికి అంకురార్పణ చేసింది ఈ కాలపరిధిని 1800 నుంచి 1947 దాకా తీసుకోవచ్చు. సుదీర్ఘమైన యీ కాలగమనంలో గ్రంథస్థమైన భాషకు మాట్లాడే భాషకు అంతరం తగ్గింది. మతసంబంధమైన కట్టు బాట్లు తగ్గి సామాన్య మానవుడు స్వశక్తితో బ్రతకడానికి అవకాశం ఏర్పడింది విద్యావకాశాలు పెరిగాయి. పుస్తకాల, పత్రికల ప్రచురణ బాగా హెచ్చయింది. ఆకాశవాణి, బాలానంద సంఘాలు రంగంలో ప్రవేశించాయి ఈ అనుకూల వాతా వరణంలో తెలుగు దేశంలో బాల సాహితీ ప్రగతికి చక్కని దోహదాలు లభించాయి ఈ మధ్య కాలంలో దేశం విప్లవాత్మకమైన మార్పులకు లోనైంది ఆ ప్రభావం దేశంలో అన్ని రంగాలపై బడింది. అందు బాల సాహిత్యం ఒకటి.

## సాంఘిక రాజకీయ పరిణామాలు

దేశానికున్నంత చరిత్ర పిల్లలకు ఉండదు జాతికున్నంత చరిత్ర మాత్రం పిల్లలకు ఉంటుంది ఎందుచేతంటే పిల్లలు జాతీయ జీవనంలో ఒకభాగం మాత్రమే కనుక ఆ సంగతి వేలాది సంవత్సరాలుగా గుర్తించలేదు అందుచేత బిడ్డలకు ప్రత్యేక చరిత్ర లేకుండా పోయింది. చరిత్ర పుటలు తిరుగవేస్తే పిల్లల అవసరాలను భారతదేశంలో తొలిసారిగా గతశతాబ్ది తొలిపాదంలోనే గుర్తించినట్లు దాఖలాలు కన్పిస్తు న్నాయి. తత్ఫలితంగా బాలలకంటూ – ప్రత్యేకంగా ప్రాథమిక విద్య, సాహిత్య వ్యుత్పత్తి, సాంఘిక ప్రతిపత్తి సంతరించి పెట్టడానికి ప్రయత్నాలు ప్రారంభ మయ్యాయి ఈ ప్రయత్నాలు క్రమబద్ధంగా కొనసాగేందుకు వీలుగా ఆ తరుణంలో భారతీయ పునరుజ్జీవనానికి అంకురార్పణ జరిగింది మానవ చరిత్రలో యూరపులో వెలసిన పునరుజ్జీవన యుగం ఒక మహోజ్జ్వల అధ్యాయం అయినట్లుగా, భారతదేశ చరి త్రలో 19వ శతాబ్దం నవజీవనానికి నాంది పలికింది దాస్య తమస్సునుంచి ఉషో దయం తిలకించడానికి అనేక రంగాలలో భారతీయ ప్రతిభాలతకు మారాకు హత్తింది.

### సంస్కర్తల అవతరణ

యుగయుగాలుగా, తరతరాలుగా జగజగాలను తన మేధా సంపత్తితో, తాత్త్విక చింతనతో ఉర్రూత లూగించిన భారతదేశం క్రమంగా 18, 19వ శతాబ్దాల నాటికి

రాజకీయంగా, సాంఘికంగా, ఆర్థికంగా బాగా క్షీణదశకు వచ్చింది. "భారతదేశ చరిత్రలో అది అంధయుగం పాతసమాజం, పాత పాలనా వ్యవస్థ చిన్నాభిన్నమయ్యాయి ప్రాచీన వ్యవస్థ బీటలిచ్చింది దీన్ని కట్టుదిట్టం చేసేవారు లేకపోయారు నిర్జీవమైన సంప్రదాయాలు నేలలో కూరుకుపోయి శిలారూపం దాల్చిన ఆచారాలు, అర్థంపర్థంలేని ఆనవాయితీలు జాతి జీవన స్రవంతిని ఇంకిపోయేట్టు చేసాయి మత, తాత్త్విక వైజ్ఞానిక, కళారంగాలలో సృజనాత్మక ప్రజ్ఞ మృగ్యమైపోయింది"[1] ఆనాటి మన దేశ పరిస్థితులను సమీక్షించిన అరవింద మహర్షి (1871 – 1950) ఆకాలాన్ని 'మహాక్షయం' (గ్రేట్ డికే) అని అభివర్ణించారు. ఆనాటి పరిస్థితులను సమీక్షిస్తూ విఖ్యాత చరిత్రకారుడు కె యం పణిక్కర్ (1895 – 1966) "సంప్రదాయకంగా సంస్కృతి నిలయాలైన ప్రదేశాలలో భారతదేశం సొగిలపడిపోయి ఎగ ఊపిరి పీల్వ నారంభించిందని" సాధికారంగా సెలవిచ్చారు. సాక్ష్యాధారాలను సోపపత్తికంగా విశ్లేషించి చూపారు.

విజ్ఞానం, వివేకం, సంస్కృతి, నాగరికతలకు పెట్టింది పేరైన భారతదేశంలో ఎందుకిలా జరిగిందన్న అన్వేషణకూడ కష్టమైన దేనంటూ తన డిస్కవరీ ఆఫ్ ఇండియా అనే గ్రంథంలో పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ విస్తుపోయారు భారతీయుల ఉత్సాహం, ఉద్వేగం, ఉత్తేజం, దూరదృష్టి, భావనాశక్తి, కళాతృష్ణ హంసగీతం ఆలాపిస్తున్న తరుణంలో కొందరు మహనీయులు భారతీయ పునరుజ్జీవన దూతలుగా రంగ ప్రవేశం చేశారు వారిలో రాజారామ్‌మోహన్‌రాయ్ (1772 – 1833) మూలపురుషుడని చెప్పవచ్చు. "ఇటువంటి అపూర్వవ్యక్తి రాకకోసమె మన చరిత్ర ఒక సుదీర్ఘమైన రాత్రంతా వెచియుంది" అని విశ్వకవి రవీంద్రనాథ ఠాగూరు (1861–1941) అన్నమాటలలో ఎంతో వాస్తవం లేకపోలేదు. అంతేగాదు రామమోహనుడే లేకపోతే అంతటి ప్రజ్ఞావంతులైన ఈశ్వరచంద్ర విద్యాసాగర్ (1820–1891) రవీంద్రనాథ ఠాగూరు – వంటి వారు ఆవిర్భవించడం సాధ్యమయ్యేది కాదని బెంగాల్ సాహిత్య చరిత్రకారుడు సుకుమార్‌సేన్ (1900–1978) అనడం ఎంతో సమంజసంగా ఉంది రాజారామ్ మోహనరాయ్ – తన దైన ఒక కొత్తమార్గంలో జీవితాన్ని మానవతా దృక్పథంతో పరిశీలించారు. ఇంతకుముందెవ్వరూ ప్రయత్నించని రీతిలో ప్రాక్పశ్చిమ

..............................

1 రామలింగం, డి. భారతీయ పునరుజ్జీవనం – సికింద్రాబాదు, యువభారతి, 1980. 18 పు

సంస్కృతుల సమన్వయానికి కృషిచేశాడు. తరతరాలుగా కరుడుగట్టిన, రాటుదేలిన సాంఘిక దురాచారాల నిర్మూలనకు నడుంబిగించాడు. ఆధునిక విజ్ఞాన విశేషాలను అవలోకన చేయడానికి ఆంగ్లవిద్య నేర్చుకోవడం అవసరమనే - కనువిప్పు కలిగించారు. నాడు అవసరమైన అన్ని ప్రజోద్యమాలకు బీజావాపన చేశారు. అన్నిటికీ వెన్నుదట్టి దన్నుగా నిలచారు. పునరుజ్జీవనానికి బలమైన పునాదులు వేశారు. ఆ మార్గంలో యావద్భారతదేశమూ, తెలుగు దేశమూ పయనించాయి.

## తెలుగు నాట నవ చైతన్యం

జాతీయ పునరుజ్జీవన తరంగాలు బెంగాలు విభజన ఉద్యమం (1905) ఆసరాగా చేసుకొని లాలా లజపతిరాయ్ (1865- 1928), బాలగంగాధరతిలక్ (1856 - 1920) బిపిన్ చంద్రపాల్ (1866 - 1932) గారి మహోజ్జ్వలమైన, ఉత్తేజపూరితమైన ఆవేశభరితమైన ఉపన్యాసాలద్వారా తెలుగు నేల నలుచెరగులా వ్యాపించాయి. ఆ ఉపన్యాసాలకు యువతరం నవచైతన్యంతో మోసులెత్తి మహోత్సాహంతో నిండారబారిన అఖండ గోదావరిలా ఉప్పొంగిపోయింది.

ఒకవైపున సంఘ సంస్కరణ ఉద్యమాలైన బ్రహ్మ సమాజం, ప్రార్థన సమాజం, ఆర్య సమాజం, దివ్యజ్ఞాన సమాజం, రామకృష్ణ మిషన్ తెలుగుదేశంలో తగిన ప్రభావాన్ని కలిగించాయి. ఈ ఉద్యమాల ప్రభావంతో "మానవతావాది, అకళంక దేశభక్తుడు, నీతివర్తనుడు, బోద్ధ, దాత, త్యాగి,పరోపకారి, ఏకేశ్వరోపాసకుడు, కులవర్గ, వర్ణ మత వివక్షల కతీతుడు, సంఘోద్ధరణకై తనువెత్తిన పుణ్యమూర్తి - తెలుగు దేశమందు ప్రబలిన సాంఘిక చైతన్యానికి మూల పురుషుడు"[2] కందుకూరి వీరేశలింగం పంతులుగారూ, వారి సమకాలికులు తెలుగుదేశంలో సాంస్కృతిక పునరుజ్జీవనానికి తోడ్పడ్డారు. మరోవైపున వందేమాతరం, ఉప్పు సత్యాగ్రహం, సహాయ నిరాకరణ, క్విట్ ఇండియా, గ్రంథాలయోద్యమం, సహకారోద్యమం, ఆంధ్రోద్యమం, జాతీయోద్యమాలద్వారా రాజకీయ పునరుజ్జీవనం కలిగింది.

ఈ ఉద్యమాలతో ప్రజలు చైతన్యవంతులు కావడానికి అవకాశం ఏర్పడింది. ఈ తరుణంలో ప్రజలు సులభంగా చదువుకొని అర్థంచేసుకోడానికి వీలైన రచనలు వచ్చాయి. కొన్ని స్వచ్ఛందసంస్థలు ఉత్తమ గ్రంథాలు ప్రచురించి ప్రజానీకంతో

2. రమాపతిరావు, అక్కిరాజు. వీరేశలింగం పంతులు - సమగ్ర పరిశీలన, 1972

చదివే అలవాటును పెంపొందించడంద్వారా అభ్యుదయ భావాలు రేకెత్తించాయి. తెలుగు సాహిత్యం, కళలు కొత్త చివుళ్లు సంతరించుకున్నాయి ప్రజానీకపు ఆలోచనలలో మార్పు, చదివే అలవాటు, పుస్తకాల ప్రచురణ, గ్రంథాలయాల స్థాపన బాల సాహిత్య రచనకు దోహదం చేశాయి.

## స్కూల్ బుక్ సొసైటీ

కంపెనీ ప్రభుత్వం (1757 - 1857) విద్యావిధానంలో మార్పులను తీసుకు రాదలచి మద్రాసు స్కూల్ బుక్ సొసైటీని 1820 లో ఏర్పరచింది. ఈ సొసైటీలో అదాలత్ కోర్టులో ఇంటర్ప్రేటర్‌గా ఉన్నత పదవిలో వున్న వెన్నెలకంటి సుబ్బారావు (1784 – 1839) గారిని సభ్యులుగా నియమించింది తన సభ్యత్వాన్ని అంగీకరిస్తూ సుబ్బారావుగారు స్కూల్ బుక్ సొసైటీకి సుదీర్ఘమైన, చారిత్రాత్మకమైన లేఖను (1820) నవంబరు 22 తేదీన రాశారు.[3] అంతవరకు తెలుగులో విద్యాబోధన పంచకావ్యాలు, ఛందస్సు, నిరుక్తం, జ్యోతిషం – మొదలైన శాస్త్ర గ్రంథాలకు పరిమితమై ఉండేది కాని సుబ్బారావుగారు తమలేఖలో ఇంగ్లీషు విద్యావిధానాన్ని, శాస్త్రీయ గ్రంథాలప్రచురణను, వచన రచనల అవసరాన్ని వివరించారు[4] దాదాపు ఇవే భావాలను దేశంలో వ్యాపింప జేయాలని రాజారామ్ మోహన్‌రాయ్ 1823 లో గవర్నరు జనరల్‌కు లేఖ రాశారు. సుబ్బారావుగారి ప్రతిపాదనలు స్కూల్ బుక్ సొసైటీ ఆమోదించడం వలన వచన రచనకు ఆదరం లభించి పుస్తకాల ప్రచురణకు దోహదం చేసింది. సుబ్బారావుగారు వచన శైలిలో "వెడుక కథలు" రాయగా 1823 లో ఈ సొసైటీ ప్రచురించింది. ఆ తర్వాత సులభ వచన శైలిలో రచనలు రావడానికి ఈ సొసైటీ తోడ్పడింది. జనరంజక గ్రంథాలు రావడానికి, బాలసాహిత్యానికి ఒక మార్గం ఏర్పడింది.

## భాష - భావ విప్లవం

ఎవరు ఎలా సమర్ధించినా రాసేభాషకు, కూసేభాషకు తేడా ఉన్నంత కాలం ఆ భాష

................................

3 వెన్నెలకంటి సుబ్బారావు జీవయాత్రా చరిత్ర. అను.: అక్కిరాజు రమాపతిరావు, సికింద్రాబాదు, భారతీ ప్రచురణలు, 1976. 49 పు.

4 Vithal Rao, Y. Education and Learning in Andhra Under the East India Company, 1979. 53 p.

అభివృద్ధి చెందదు. అది ప్రజలలోకి చొరబడి పోలేదు ఆ భాష జాతి ప్రగతికి దోహదం చేయలేదు ఈ తేడా శతాబ్దాల తరబడి ఉంటూ వచ్చింది కనుకనే సామాన్య ప్రజానీకం దాదాపు పూర్తిగా రాసేభాషకు, సాహిత్య సౌరభానికు దూరమై పోయింది ఈతేడాను తగ్గించడానికి తొలిసారిగా రావిపాటి గురుమూర్తి శాస్త్రిగారు ద్వాత్రింశత్సాల భంజిక కథలు 1819 లోనూ, పంచతంత్ర కథలు 1836 లోనూ వ్యావహారిక భాషలో ప్రచురించారు పలువురు పండితులు ఈ మార్గంలో పయనించారు గిడుగు వెంకట సీతాపతిగారు "వ్యవహారిక భాషలో 1850 కి పూర్వము రచితములైన వచన గ్రంథములు వందలకొలదిగా ఉండెను," అన్నదానిని బట్టి ఎంత ప్రబలంగా ఈ తేడా పోగొట్టడానికి ప్రయత్నం జరిగిందో అర్థమౌతుంది ఈ మార్పు ఆట్టేకాలం కొనసాగలేదు పరవస్తు చిన్నయ సూరి (1806–1862) 1848లో గ్రంథ కరణ సభకు అధ్యక్షుడు కావడం, 1855 లో ప్రెసిడెన్సీ కళాశాల (మద్రాసు) లో తెలుగుశాఖ అధిపతి కావడం కాలగతిని మార్చివేశాయి ఆయన 1853 లో నీతి చంద్రిక, 1855 లో ప్రచురించిన బాలవ్యాకరణం శాఖాధిపతుల స్వప్రయోజనాభిమానాలకు నిరూపణగా పాఠ్య గ్రంథాలై అంతకు ముందున్న సంప్రదాయ మార్గాన్ని తప్పుదోవ పట్టించింది ఈ పరిస్థితిని అప్పారావు కమిటీ "ప్రాచీన సంప్రదాయం స్థానంలో పరవస్తు సంప్రదాయం నిలదొక్కుకుని పాఠ్యగ్రంథాలలో గ్రాంథికభాషకు పట్టాభిషేకం చేసింది"[5] అని అభిప్రాయపడ్డారు. ఆ ప్రభావం చాల కాలం సాగింది. ఆ పరిస్థితి మార్చడానికి గిడుగు వెంకట రామమూర్తిగారు ఒక మహోద్యమం చేపట్టవలసిన అవసరం ఏర్పడింది

## బోధనా భాషగా తెలుగు

ఆ ఉద్యమానికి ముందుగా సామినేని ముద్దు నరసింహము నాయుడుగారు 1862 లో 'హితసూచని' అనే గ్రంథాన్ని ప్రచురించారు. ఆనాటి సాంఘిక సమస్యలకు దర్పణంగా గురజాడ అప్పారావుగారు 'కన్యాశుల్కం' సాంఘిక నాటకం 1893 లో ప్రచురించారు ఆ దినాలలో మరికొన్ని గ్రంథాలు వ్యావహారిక భాషలో వచ్చాయి. మార్పుకోసం అర్రులుసాచే ఆతరుణంలో – అనగా 1906 – 10 గిడుగు వెంకట

..............................

5 రాధాకృష్ణ, బూదరాజు. పాఠ్య గ్రంథాల్లో తెలుగుభాష. అభ్యుదయ. ఏప్రిల్ 1970. 26 పు.

రామమూర్తి పంతులు, జె. ఎ. ఏట్సు, గురజాడ అప్పారావు, పి. కె. టి శ్రీనివాస అయ్యంగారు – రంగంలో ప్రవేశించారు తొలి విజయంగా "ఇంటర్మీడియెట్ స్థాయి పాఠ్య పుస్తక నిర్ణయంలోనూ, విద్యార్థులు అనువాదం, వ్యాసరచనా విషయికంగా పాటించాల్సిన శైలి సంబంధంగానూ కొన్ని మార్పులు ప్రవేశపెట్టారు[6]" ఆ తర్వాత కొందరు పండితులు విద్యార్థుల వ్యవహారిక భాషలో పరీక్షాపత్రాల సమాధా, నాలు రాయడానికి అనుజ్ఞలభించడం దేశానికి అరిష్టం దాపురించడమేనని గగ్గోలు చేశారు. తత్ఫలితంగా ప్రభుత్వం ఆ ఉత్తర్వులను ఉపసంహరించుకుంది

1913 ఏప్రిల్‌లో మద్రాసు విశ్వవిద్యాలయంవారు 'కాంపోజిషన్ కమిటీ' వేశారు. ఆ కమిటీ ఆగష్టు 2, తేదీన ప్రథమ సమావేశం జరిపింది కమిటీవారు ఆధునికాంధ్ర మనేది లేదని తీర్మానించారు. దానిపై 1914 లో గురజాడ అప్పారావుగారు డిసెంట్ పత్రాన్ని మద్రాసు విశ్వవిద్యాలయానికి సమర్పించారు.[7] అప్పారావుగారు డిసెంట్ పత్రంలో "చర్చించిన అంశాలు ప్రధానంగా విద్యార్థుల వ్యాసరచనా భాషకు సంబంధించినవి కేవలం సరళ గ్రాంధిక భాషయని పేరుపెట్టి విసంధితో రాసే కృతకభాష అటు ప్రాచీన వ్యాకరణ సంప్రదాయానికి విరుద్ధం ఇటు ఆధునిక వాగ్వ్యవహారానికి విరుద్ధం కనుక, అది పనికి రాదు దేశంలో ఎన్నో మాండలికాలు ఉన్నప్పటికీ, ఈనాడు అన్నిప్రాంతాలవారికీ, సుపరిచితమైన శిష్ట వ్యవహారిక భాష ఒకటి ఉంది. అదే ఆధునిక వచన రచనకు ప్రయోగ యోగ్యమైనది భాష ఎప్పటికీ కరుడుగట్టుకొని ఉండిపోదు కాలానుగుణంగా, ప్రజా వ్యవహారాన్ని బట్టి మనమూ దాన్ని సంస్కరించుకుంటూ ఉండాలి ఈనాడు వార్తా పత్రికల్లోనూ, రేడియోలోనూ, సినిమాల్లోనూ ప్రయోగింపబడుతున్నదే ఆధునిక భాష అటువంటి భాషలో వ్యాసరచన చేసేందుకు విద్యార్థులకు అనుమతి – ఇవ్వాలంటూ అప్పారావు గారు తమ వాదాన్ని డిసెంట్ పత్రంలో పొందుపరచారు.

డిసెంట్ పత్రాన్ని విద్యాశాఖ బుట్టదాఖలు చేసినప్పటికీ – తరువాతి తరం కవులపై, రచయితలపై దీని ప్రభావం ఎంతో ఉంది[8] "నిత్య ప్రవాహినీ దేశ్యా"

..............................

6 రమాపతిరావు, అక్కిరాజు. వాడుక భాషా ఉద్యమం - పూర్వాపరాలు, అభ్యుదయ ఏప్రిల్ 1980 75-76 పు.

7 The Minute of Dissent of the Report of the Telugu Composition sub-committee, 1914

8 దక్షిణామూర్తి, పోరంకి. డిసెంట్ పత్ర పరిచయం - డిసెంట్ పత్రం విజయవాడ, విశాలాంధ్ర, 1968

అనడంచేత మన తెలుగు భాష నిత్యంగా వాడే భాషేఐనా ఏటిలో నీరులాగా దశలుగా మారుతూ ఉంటుందని స్పష్టమైనది. ఈ స్థితిగుర్తించి కాలాన్ని బట్టి నడచిన తిరుపతి వెంకట కవులు –

కాలము బట్టి దేశమును
గాంచి ప్రభుత్వము నెంచి దేశ భా
షా లలితాంగి మారుటది
సత్కవి సమ్మత మౌట

తథ్యమని సెలవిచ్చారు. ఆ తర్వాత భాషలో వచ్చిన విప్లవాన్ని అంగీకరించి పెద్దల కోసం పలువురు కవిపండితులు రచనలు చేశారు పిల్లలకోసం కందుకూరి వీరేశలింగం, గిడుగు వెంకటసీతాపతి, వెంకట పార్వతీశ్వరకవులు, చింతా దీక్షితులు మొదలైనవారు ఎందరో సరళమైన భాషలో రచనలు చేసి ముందుతరాలకు మార్గదర్శకులయ్యారు.

## పుస్తకాల ప్రచురణ

సాహిత్య ప్రగతికి దోహదమివ్వగల సాధనాలలో పుస్తకాలకు మించినది మరిలేదు బిడ్డల బుద్ధి వికసించడానికి, విజ్ఞానం సంపాదించడానికి గ్రంథాలెంతగానో ఉపయోగిస్తాయి. ముద్రిత గ్రంథ సాయంతోనే మానవుడు ఆకాశంలో విహరించగలిగాడు. సముద్ర గర్భంలోకి పోగలిగాడు ప్రకృతిని వశంచేసుకోగలిగాడు. విజ్ఞానపులోతులను తెలుసుకోగలుగుతున్నాడు. అందుకనే కాళోజీ నారాయణరావు (1914–) అన్నారు–

అక్షర రూపందాల్చిన
ఒక్క సిరా చుక్క

లక్ష మెదళ్ళకు కదలిక–అని. అంతేగాదు. వెంకటపార్వతీశ్వరకవుల దృష్టిలో –

మదికుదురజేసి చల్లని మాటచెప్పి
కలకనెడలించి, ధైర్యంబు కలుగజేసి
తల్లి దండ్రులను బోలి పెద్దలను బోలి
సదుపదేశంబు చేయు బుస్తకమె నీకు

అని పుస్తకం వలన కలిగే సత్ప్రయోజనాన్ని వివరించారు.

ఐతే 18వ, శతాబ్దంవరకు మన గ్రంధాలన్నీ తాటియాకులమీద, రాగి రేకుల మీద, చేతి కాగితం మీద ఉంటూ వచ్చాయి. అవి సామాన్య మానవునికి అందుబాటులో లేవు. రాజుల, మంత్రుల, సామంతుల, మఠాధిపతుల వద్దనో వారి ప్రాపకం సంపాదించిన వారి వద్దనో లభించేవి రాత ప్రతులకు పుత్రికలను అందంగా రాసే లేఖకులకు "జొన్నలో, బియ్యమో, కొన్ని వరహాలో ఇచ్చి మహారాజులు, సామంతులు, సంపన్నులు తమకు కావలసిన గ్రంధాలు రాయించుకొనేవారు. ఆనాటి రచనలకు సామాన్య మానవుడు అర్థం చేసుకోగలగడం అంతం మాత్రం. పైగా నాటి సామాన్యమానవుని ఆర్థిక, సాంఘిక పరిస్థితులు, పుస్తకాలను చదువుకుని విజ్ఞానవంతుడు కావడానికి అల్లంత దూరంలో ఉంచారు. ఈ పరిస్థితిని అధిగమించడానికి యాత్రికులు, క్రైస్తవ మిషనరీలు కృషిచేశారు

## తొలి తెలుగు ముద్రణ

జాన్ ఫ్రేయర్ అనే యాత్రికుడు తొమ్మిదేళ్ళ పాటు తూర్పు దేశాలలో పర్యటించి "న్యూ ఎకౌంట్ ఆఫ్ ఇండియా అండ్ పర్షియా" అనే గ్రంధాన్ని రాసి 1698లో ప్రచురించాడు. ఈ గ్రంధంలో తెలుగు లిపిలో వాక్యాలున్నాయి. ఈ గ్రంథం ఢిల్లీలోని నేషనల్ ఆర్కైవ్స్‌లో ఉంది ఇదే తొలి తెలుగు ముద్రణ. ఆ తర్వాత క్రైస్తవులు తమ మత ప్రచారం కోసం-మతాన్ని సామాన్య మానవుని చెంతకు తీసుకువెళ్ళే నిమిత్తం ముద్రణా సౌకర్యాన్ని బాగా వినియోగించుకున్నారు బెంజిమన్ షూల్జ్ అనే కంపెనీ ఉద్యోగి తెలుగు, తమిళం, హిందూస్తానీ నేర్చుకొని బైబిల్‌ను ఆయా భాషలలోకి అనువాదంచేశారు 1741లో జర్మనీ వెళ్ళి, ఈ గ్రంధాల ముద్రణకు ప్రయత్నంచేసి హాలీ అనే గ్రామంలో 1746లో "సత్యమైన వేదంలో వుండే జ్ఞాన ఉపదేశాలయొక్క సంక్షేపం" 1747లో "నూరు జ్ఞానవచనాలు" మొదలైన మత గ్రంథాలను ప్రచురించారు [10] ఆ తర్వాత తెలుగు ముద్రణ మద్రాసుకు, కలకత్తా సమీపంలోని సెరాంపూరుకు బదిలీ అయింది.

.............................

9 సోమశేఖరశర్మ, మల్లంపల్లి. ముద్రణము (తెలుగు విజ్ఞాన సర్వస్వము) 4 సం లో 1959. 979 పు

10 Mangamma, J Book Printing in India–With special reference to the contribution of European scholars to Telugu (1746–1857) Nellore, Bangorey Books, 1975 34 P

దీనికి ముందు ఒక విచిత్ర సంఘటన జరిగినట్లు తెలుస్తుంది. నైజాం ప్రభువును తృప్తిపరచే నిమిత్తం కెప్టెన్ సైడెన్ హామ్ అనే బ్రిటీషు ప్రతినిధి ప్రభువుగారికి ఒక చిన్న గాలిపంపు, ప్రింటింగు ప్రెస్, యుద్ధవీరుని ప్రతిమను బహూకరించాడు ఈ విషయం బ్రిటీష పాలకులకు నచ్చలేదు ప్రమాదకరమైన ముద్రణయంత్రాన్ని బహుమతి ఇచ్చినందును కెప్టెన్‌గారిని మందలించడం జరిగింది[11] ఇది నైజాం ప్రభువు ఈ బహుమతులకు అట్టే విలువ ఇవ్వలేదు ఎక్కడో పెట్టేశారు ఈ విషయాన్ని బ్రిటీషు పాలక వర్గానికి తెలియపరిచినపుడు వారు సంతృప్తి చెందారట. కెప్టెన్‌గారు బతికి బయటపడ్డారు ముద్రణయంత్రం అంటే పాలకులకు ఆనాడు ఉండే భయానికి ఇది ప్రబల సాక్ష్యం కనుక ముద్రణను తొలిదశలో ప్రభుత్వం ప్రోత్సహించలేదు మిషనరీల ద్వారా పరోక్ష దోవన చొచ్చుకొని వచ్చింది[12].

కదిలే అచ్చులసాయంతో ముద్రణ మద్రాసు, సెరాంపూర్‌లలో దాదాపు ఒకేసారి ప్రారంభమైంది సెరాంపూర్ ముద్రణాలయం ప్రధానంగా మత గ్రంథాల ముద్రణకు ఏర్పడింది అనతికాలంలోనే అగ్నికి ఆహుతైంది క్రైస్తవ మతాధిపతులు దాన్ని పునరుద్ధరించారు. ఇతర ప్రాంతాలలో ముద్రణాలయాలను స్థాపించారు వ్యాపార దృష్టితో కొందరు ఉత్సాహవంతులు రంగంలోకి దిగారు తత్ఫలితంగా తెలుగు వ్యాకరణం (1807), తెలుగు బైబిలు, (1811) క్యాంబెల్ తెలుగు వ్యాకరణం (1814), విలియం బ్రౌన్ తెలుగు-ఇంగ్లీష నిఘంటువు (1818), రావిపాటి గురుమూర్తిశాస్త్రిగారి విక్రమార్క-కథలు (1819) మొదలైన పుస్తకాలు వెలువడ్డాయి. పుస్తకాల ప్రచురణకు రవంతదారి ఏర్పడింది

## జన రంజక గ్రంథాల ప్రచురణ

తెలుగు ముద్రణ యంత్రాలు బాగా ప్రచారంలోకి రావడం, తెలుగు బోధన భాషగా పాఠశాలలో పెట్టడం వలన ప్రజలను జాగృతం చేసే ఉద్యమాల వలన యువతరంలో విద్యావంతులు తగినంత మంది వచ్చారు వారిలో చదివే అలవాటును పెంపొందిం

..............................

11 SeshagiriRao, K.R. Introduction to the Studies in the History of Telugu Journalism. Delhi -Narla Shashtybda-purty Celebration Committee, 1968 VIII P

12 Hemachandra Prasad Ghose The Newspaper in India Calcutta, University of Calcutta, 1952 3-4 PP

చేందుకు విజ్ఞాన చంద్రికా మండలి, వెగుచుక్క గ్రంథమాల మొదలైన సంస్థలు బయలు దేరాయి. వచన రచనాశైలి క్లిష్ట గ్రాంధికం నుంచి సులభ గ్రాంధికంలోకి, ఆ తర్వాత వ్యవహారికంలోకి మారింది మారుతున్న కాలంలో గ్రంథాలయోద్యమం, వ్యవహారిక భాషోద్యమం వచ్చి చౌకగా పుస్తకాలు అందించే ప్రయత్నానికి కొంతంత బలాన్నిచ్చాయి. ప్రజలలో చదివె అలవాటు పెరిగింది సులభ శైలిలోని కల్పనా సాహిత్యాన్ని, సామాజిక విషయపరమైన రచనలను ఎక్కువగా ఆదరించాయి. ఆ ఊపులో చెదురు మదురుగా బాలలు చదివె రచనలూ వచ్చాయి

## పత్రికల సహకారం

తెలుగులో సాహిత్యపరమైన రచనలు 6-7 శతాబ్దాల నుంచి సాగుతున్నట్లు శాసన పరమైన ఆధారాలున్నాయి 10-11 శతాబ్దాల నుంచి ఆంధ్ర గ్రంథ రచన క్రమ పద్ధతిలో సాగుతూ ఉన్నా, పత్రికల ప్రచురణ 19వ, శతాబ్ది రెండో పాదంలోగాని పాదం మోపలేకపోయింది లభిస్తున్న సమాచారాన్ని బట్టి 1818 లో బెంగాల్ మిషనరీలు 'దిగ్ దర్శన్' అనే మాస పత్రికను ప్రారంభించారు [14] ఆ పత్రిక ప్రేరణతో దక్షిణ దేశంలోని మిషనరీలు 1831 జూన్‌లో తమిళంలో త్రైమాస పత్రిక మద్రాసులో ప్రారంభించారు [15] అదే సంవత్సరం తెలుగు పత్రిక ప్రారంభించిన దాఖలా లేదు 1832లో పత్రికా ప్రచురణలో అభిరుచిగల స్థానికులు మద్రాస్ క్రానికల్ అనే పత్రికను తెలుగు, తమిళ భాషలలో ప్రచురించడానికి మద్రాసు గవర్నర్‌కు దరఖాస్తు చేశారు [16], తత్ఫలితంగా అక్టోబరు 1832లో మద్రాసు క్రానికల్-వార్తాపత్రిక రెండు భాషలలో వెలువడింది [17] ప్రెస్ కమీషన్

..............................

14 Priolkar, Anant Kakba The Printing Press in India Bombay, Marathi Samshodhana Mandala, 1958 pp.5-11

15 Arudra Beginnings of Telugu Journalism (In Studies in the History of Telugu Journalism) Delhi, Narla Shashtyabdapurty Celebration Committee, 1968 pp. 6-23

16 Natarajan, J History of Indian Journalism Report of the Press Commission-Part II pp 63-64-Delhi, Publications Division 1954. PP 63-64

17 Natarajan, J. History of Indian Journalism. Report of the Press Commission-Part II pp 63-64-Delhi, Publications, Division. 1954 PP. 63-64

నివేదికలో వివరించిన రెవరెండ్ జె. లాంగ్ రిపోర్టు ప్రకారం ఈ పత్రిక 1833లో వెలువడింది పరిశోధకులు బంగోరే మొదటి వాదాన్నే బలపరిచారు [18] ఆ తర్వాత 1835లో బళ్లారి మిషనరీలు 'సత్యదూత'లనే పత్రిక ప్రచురించినట్లు తెలుస్తుంది దీని ప్రతులు లభ్యం కావడంలేదు. పిదప అందరికీ తెలిసిన వార్తాపత్రిక వృత్తాంతిని. 1838లో మద్రాసు నుంచి వెలువడింది సంపాదకుడు మండిగల వెంకట రామశాస్త్రి. ఆ తర్వాత మరికొన్ని పత్రికలు వెలువడ్డాయి.

## సాహిత్య పత్రికలు

సాహిత్య పరిశోధకులు నిడదవోలువెంకటరావుగారి సమాచారం ప్రకారం తెలుగులో సాహిత్యవిషయాలు ప్రధానంగా గల తొలి పత్రిక 'సుజన రంజని' (1862-1867) సంపాదకుడు వింజమూరి కృష్ణమాచారియర్‌గారు. ఈ పత్రిక చూపిన బాటలో మరి కొన్నిపత్రికలు వెలువడ్డాయి.

| | |
|---|---|
| ఆంధ్ర భాషా సంజీవని | 1875—1883 |
| | 1892—1900 |
| సుధా రంజని | 1873—1880 |
| జన వినోదిని | 1875—1885 |
| అముద్రిత గ్రంథ చింతామణి | 1875—1904 |
| చింతామణి | 1890—1904 |
| మంజువాణి | 1898—1904 |
| కృష్ణాపత్రిక | 1902—1974 |
| అనసూయ | 1908—1910 |
| ఆంధ్ర భారతి | 1910—1915 |
| గ్రంథాలయ సర్వస్వము | 1915— |
| ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక | 1912— |
| త్రిలిఙ్గ | 1915—1955 |
| శారద | 1923—1924 |
| భారతి | 1923— |
| గృహలక్ష్మి | 1928—1960 |
| ప్రతిభ | 1936—1940 |

..............................

18 బంగోరె. బ్రౌన్ జాబులు-తెలుగు జర్నలిజం చరిత్ర 1832-1857. నెల్లూరు, 1973

తెలుగు సాహిత్య వికాసానికి కొంతవరకు బాల సాహిత్య ప్రగతికి ఈ పత్రికలు చక్కగా దోహదం చేసాయి వివిధ సాహిత్య ప్రక్రియలకు దీపికలుగా పనిజేసి, ప్రజాసామాన్యంలో సాహితీ సౌరభాలు గుబాళించడానికి ఈ పత్రికలు ఎంతగానో తోడ్పడ్డాయి వీటితోబాటు ఆంగ్లంలో ప్రచురించబడే ఇండియన్ యాంటిక్వెరీ మోడరన్ రివ్యూ, ఇండియన్ రివ్యూ, సౌత్ ఇండియన్ రీసర్చెర్ మొదలైన పత్రికలు తెలుగు బాల సాహిత్యంపై వ్యాసాలు ప్రచురించి ప్రోత్సహించాయి

## బాల సాహిత్య పరిచయం

తెలుగు బాల సాహిత్యాన్ని - అనగా పిల్లలు చదివే గేయాలు, కథలు మొదలైన వాటిని తొలిసారిగా ప్రచురించినది "జనవినోదిని" (1875 - 1885) పత్రిక అని తెలుస్తుంది ఈ పత్రికను మద్రాస్ స్కూల్ బుక్ సొసైటీ వారు ప్రచురించారు దీనిలో పిల్లలు సరదాగా పాడుకొని ఆనందించే "చిట్ల పొట్ల కాయ" చెంగు చెంగు బిళ్ళ మొదలైన గేయాలను ప్రచురించారు ఇంతకు పూర్వం ఏ పత్రిక ప్రచురించ డానికి సాహసించని - పిల్లల కథలను ఈ పత్రిక ప్రచురించడం గమనించ వలసిన విషయం [19] - అన్న సంగతి తెలిసినప్పుడు హృదయం ఉప్పొంగి పోతుంది. ఆ తర్వాత 1905లో ఇండియన్ యాంటిక్వెరీ 34వ, సంపుటంలో "ఫోక్‌లోర్ ఆఫ్ తెలుగూస్" అని జి ఆర్ సుబ్బరామయ్య పంతులుగారు కొన్ని పిల్లల జానపద కథలను ఆంగ్లంలో ప్రచురించారు అదే సంచికలో "సమ్ తెలుగు ఫోక్ సాంగ్స్" పేరున యం యన్ వెంకటస్వామిగారు కొన్ని బాలగేయాలను స్వల్పమైన వ్యాఖ్యానంతో ప్రచురించారు. వెంకటస్వామిగారు మరుసటి సంవత్సరం అదే పత్రికలో మరికొన్ని గేయాలను వ్యాఖ్యాన సహితంగా ప్రచురించారు ఈ గేయాలు రోమన్ లిపిలో ఉన్నాయి ఆంగ్ల వివరణనుబట్టి తెలుగు జానపదుల భావ శబలత, ఊహా బలం, వక్రీకరణ, పరభాషములకు తెలుస్తుంది. తెలుగువారి తేజో రేఖలు దశదిశల ప్రసరిస్తాయి.

..............................

19 Venkatarao, Nidadavolu Literary Journalism. (In the Studies in the History of Telugu Journalism.) 1968 pp 57 - 97

## పత్రికలలో బాలసాహిత్యం

క్రైస్తవ మిషనరీలు గుంటూరు నుంచి "వివేకవతి (1908 - 1910) అనే మాస పత్రికను నిర్వహించారు ఆ పత్రికలో సరళమైన భాషలో కథలు పిల్లల కోసం ప్రచురింపబడేవి అందులో అచ్చయిన కొన్ని మంచి కథలను మాక్మిలన్ కంపెనీవారు ఆ తర్వాత గ్రంథ రూపంలో ప్రచురించారు [20] ఆ పత్రికలో గిడుగు వెంకట సీతాపతిగారు 1909 లో 'రైలుబండి', 'చిలుకమ్మ పెండ్లి' మొదలైన గేయాలను ప్రచురించినట్లు చెప్పుతున్నారు సీతాపతిగారి పాటలు 'వివేకవతి' లో ప్రచురితమైన తర్వాత పిల్లలు 'గుంటూరు వీధులలో సరదాగా పాడుకుంటూ ఉండగా తాను విన్నట్లు' వారి మిత్రుడు తెలియజేశాడు [21] కాకినాడ నుంచి వింజమూరి వెంకటరత్నమ్మగారు 'అనసూయ' (1914 - 1919) మహిళల పత్రికను ప్రచురించారు ఆ పత్రికలో తన సోదరుడు దేవులపల్లి కృష్ణశాస్త్రి (1897 - 1980) గారు రచించిన బాలగేయాలను 1919 లో ప్రచురించారు బొంబాయి నుంచి దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు పంతులు (18?? - 1938) గారి ఆధ్వర్యంలో 1908 నుంచి ప్రచురించిన ఆంధ్ర పత్రిక - వార పత్రికలో బాలలకు సంబంధించిన రచనలు కొల్లలుగా ప్రచురింపబడినవి. పెద్దలచే సేకరింపబడిన బాలగేయాలు ఇందులో పందల సంఖ్యలో వచ్చాయి. ఈ విధంగా అనేక సంచికలలో పత్రికలు బాల రచనలను ప్రచురించి ప్రోత్సహించాయి 1925లో ప్రచురింపబడిన 'నవ్వులతోట', 1924 నుంచి ప్రచురింపబడిన 'బాలభారతి' విద్యా విషయిక మాస పత్రికలో వావిలికొలను సుబ్బారావుగారు తమ రచనలను అపారంగా ప్రచురించారు

## గృహలక్ష్మిలో బాల విజ్ఞాన శాఖ

ప్రసిద్ధ సాహిత్యవేత్త నందిరాజు చలపతిరావు (1876 - 1947) గారి ప్రోత్సాహంతో జాతీయోద్యమ కార్యకర్త కె. ఎన్. కేసరిగారు 1928లో 'గృహలక్ష్మి' మాసపత్రికను మహిళలకోసం స్థాపించి 1960 వరకు నిర్వహించారు తొలి సంవత్స

..............................

20 Pandurangarao, Vakati Children's Journalism (In Studies in the History of Telugu Journalism) 1968. pp 121-123

21 సీతాపతి, గిడుగు వెంకట - బాల సాహితీ మాల - పరిచయం. హైదరాబాదు, పౌర గ్రంథాలయశాఖ. 1968. 9 పు

రంలోనే స్త్రీల సంక్షేమానికి సంబంధించిన వ్యాసాలతోబాటు బాలలకు సంబంధించిన రచనలు ప్రచురించారు. 1930లో బాల వాఙ్మయ చరిత్రలో గుర్తించపలసిన సంఘటన జరిగింది ఆ పత్రికలో 1930 సెప్టెంబరు నుంచి ప్రత్యేకంగా పిల్లల కోసం "బాల విజ్ఞాన శాఖ" అనే కొత్త శీర్షిక ప్రారంభించబడింది నిజానికి ఈ శీర్షికను ఒక బాల విజ్ఞాన సర్వస్వ శాఖ అనవచ్చు బాల సాహిత్యంలో అప్పుడప్పుడే కొత్త చివుళ్లు సంతరిస్తున్న అనేక నూతన ప్రక్రియలకు స్థానం లభించింది తొక్కుపల్కులు, చిక్కు ప్రశ్నలు, పొడుపు కథలు, వినోద కథలు, చిట్టి కథలు, నీతి కథలు, పిట్ట కథలు, విజ్ఞాన విశేషాలు, పిన్ని లేఖలు – అనేకం కొన్నేళ్లపాటు ప్రతి సంచికలో దాదాపు వచ్చేవి ఈ శీర్షిక బాల సాహిత్యాన్ని కొత్తపుంతలు తొక్కించింది. ఆబాల గోపాలం ఆదరణ పొందింది ఈ శీర్షిక వలన –వి జ్ఞానాంబ, ధర్వాడ లక్ష్మీబాయమ్మ, కొత్తపల్లి శారదాంబ, శ్రీపాద శారదాదేవి, పాణకా రామమ్మ, వ్లడపట్ల శశిరేఖ, ఎస్. రామరాజ్యము, మొగసాటి అప్పలనరసమ్మ, కె. అమ్మాయమ్మ, పాకల రత్నమాల, పాకల రాజామణి, ఆచూరి లీలావతి, దరిశి సుబ్బలక్ష్మమ్మ మొదలైన విదుషీమణులు తమ సేకరణలను, రచనలను పంపి ఈ శాఖను ఫలపుష్ప భరితం చేశారు కలకత్తా నుంచి బాబూ రామానంద చటర్జీ నిర్వహిస్తున్న "మోడరన్ రివ్యూ" స్థాయిలో జాతీయోద్యమ కార్యకర్త కౌతా శ్రీరామ శాస్త్రిగారు 'శారద' (1923–1924) మాసపత్రికను నిర్వహించారు. దీనిలో నరహరిశెట్టి వెంకటరత్నం, నాళం కృష్ణరావు ప్రభృతుల బాలసాహిత్య రచనలు ప్రచురింపబడ్డాయి.

## 'భారతి'లో బాలానందం

నాగేశ్వరరావు పంతులుగారి ఆధ్వర్యంలోనే 1923 డిశంబరులో సాహిత్య, సంస్కృతుల వికాసానికి 'భారతి'ని ప్రారంభించారు. ఈపత్రిక నేటికీ నిర్విఘ్నంగా సాగుతూ సాహిత్యలోకంలో అనర్ఘరత్నంగా ప్రకాశిస్తున్నది స్థాపించిన తొలి ఏడాది నుంచీ 'భారతి'లో బాలసాహిత్యంపై అనేక రచనలు వెలువడ్డాయి గిడుగు వెంకట సీతాపతిగారు 'భారతి' పత్రికలో తొలిదశ నుంచి సంబంధం పెంచుకుంటూ 1940 ఏప్రిల్ మాసం నుంచి – ఆ పత్రికలో 'బాలానందం' అనే కొత్త శీర్షికను ప్రారంభించారు ప్రారంభిస్తూ ఒక విజ్ఞప్తిని గేయ రూపంలో చేశారు.

# ఆకాశవాణి కార్యక్రమాలు

విజ్ఞాన ప్రచారానికి దోహదం చేసే సంస్థలలో ఆకాశవాణి పాత్ర తక్కువగాదు. మంచి ప్రచార సాధనాలలో రేడియోకున్న శక్తి అపారమైనది ఎక్కువ ఖర్చులేనిదీ, సులభ సాధ్యమైనది గనుక రేడియో ప్రజలలో బాగా వ్యాపించింది. తొలుత యుద్ధ వార్తల ప్రచారానికి రేడియోను ఉపయోగించారు తదుపరి ప్రజోపయోగ కార్యక్రమాలకు వినియోగించే సమయంలో దక్షిణాది రాష్ట్రాలలో 1937లో మద్రాసులో రేడియో కేంద్రాన్ని ప్రభుత్వ పరంగా స్థాపించారు వినోద విజ్ఞాన సంబంధమైన ప్రజలకు నచ్చే కార్యక్రమాలు ఏర్పాటు చేయడం వలన త్వరలో ప్రజాదరణ పొందింది. తెలుగులో పిల్లల కార్యక్రమాలు ప్రసారం[illegible] బాలసాహిత్య ప్రగతికి దోహదం చేసింది.

## తొలి కార్యక్రమాలు

తెలుగు జాతి గర్వించదగిన విదుషీమణి దుర్గాబాయి దేశ్‌ముఖ్ (గుమ్మిడిదల దుర్గాబాయమ్మ) జాతీయోద్యమంలో అనేక ప్రజోద్యమాలలో పాల్గొని జాతిపిత మహాత్మాగాంధీ ప్రశంసలను అందుకొని సంస్థా బద్ధమైన కార్యకలాపాలను నిర్వహించే తలంపుతో 1937లో ద్వారకాసగర్ (మద్రాసు) 14వ, సంబరు ఇంటిలో స్థిర నివాసం ఏర్పరచుకున్నారు అమ్మమ్మగారు నిర్వహిస్తున్న బాలానంద సంఘ సభ్యులతో పిల్లల రేడియో కార్యక్రమాలను మొదటిసారి దుర్గాబాయమ్మగారు నిర్వహించారు ఆ తర్వాత పేకేటి శివరాం, ఏడిద రామేశ్వరరావుగారలు ఈ కార్యక్రమాలను నిర్వహించినట్లు తెలుస్తున్నది. ఈ కార్యక్రమాలలో పిల్లల పాటలు, కథలు, నాటికలు అనేకం ప్రసారం చేయబడ్డాయి కొత్త రచయితలకు ప్రోత్సాహం లభించింది. ఈ కార్యక్రమాలకు మంచి ఆదరం, ప్రశంస లభించాయి.

## అన్నయ్య, అక్కయ్యల ప్రవేశం

1939లో న్యాయపతి రాఘవరావు, న్యాయపతి కామేశ్వరి ఆకాశవాణి, మద్రాసులో బాలల కార్యక్రమాలు నిర్వహించేందుకు ప్రవేశించారు బాలల కార్యక్రమాల నిర్వహణలో అనేక ప్రయోగాలు చేసారు. తమపనిలో తాదాత్మ్యం చెందారు. గేయాలు, నాటికలు, కథలు- వారు వందల సంఖ్యలో రాయడమేగాక - అనేక మంది యువరచయితల చేత రాయించారు వేల సంఖ్యలో పిల్లలకు రేడియో కార్యక్రమాలలో పాల్గొనే

అవకాశం కలిగించి ఉత్తమ కళాకారులుగా తీర్చిదిద్దబడడానికి ఆకాశవాణి, మద్రాస్ కేంద్రం ఎంతో తోడ్పడింది.

## బాలానంద సంఘాల తోడ్పాటు

బాలల సర్వతోముఖాభివృద్ధికి తోడ్పడే స్వచ్ఛంద సంస్థలు బాల సంఘాలు. "పసిపాపల మానసికాభివృద్ధికి, వారిలో నిద్రాణమై ఉన్న అభిరుచులను, కళలను వెలుగులోనికి తీసుకురావడానికి, వారిలో చక్కటి క్రమశిక్షణ పెంపుచేయడానికి, బాలల సర్వతోముఖాభివృద్ధికి కృషిచేసే సంస్థలే బాలానంద సంఘాలు...[22] దీనికి నగరం, పట్నం, పల్లె పరిమితి లేదు. ఉత్సాహంకల పది మంది బాలురు చేరితే సరి ఒక సంఘం స్థాపించుకోవచ్చు బాలలకు వారి వారి అభిరుచులకు తగినట్లు చిత్ర లేఖనం, నృత్యం, సంగీతం, నటన మొదలైన అన్ని రంగాలలో ఇక్కడ ప్రత్యేక శిక్షణ ఆడుతూ, పాడుతూ పొందడానికి వీలుంది ఆటస్థలం, ఆడిటోరియం, ఆర్థిక వనరుల సమస్యలను పెద్దల సహకారంతో పరిష్కరించుకోవలసి ఉంటుంది స్థానికంగా ఉన్న ఉపాధ్యాయులు ముందుకువచ్చి, వదాన్యులను ప్రోత్సాహపరచి బాలానంద సంఘాల స్థాపించ వలసి ఉంది ఒకప్పుడు ఇలాగే ఈ సంఘాల స్థాపన జరిగింది

### బాల సంఘం : విద్యాలయం

నిజానికి బాలసంఘం—విద్యాలయం రెండు బాలల అభివృద్ధి కోసం తోడ్పడే సంస్థలే. ఈ రెండూ కలసికట్టుగా పనిజేసినప్పుడే బాలలకు సుందరమైన భవితవ్యాన్ని తీర్చిదిద్దడానికి అవకాశం ఉంటుంది వాస్తవం చెప్పుకోవాలంటే నేటి మన విద్యాలయాలు కళాపోషణకు నిలయాలు కావు. ప్రధానంగా విద్యా బోధన కేంద్రాలు "మానవుడు కేవలం విద్యతోనే బతకలేడు మనిషికి ఆకలితోబాటు కళాతృష్ణ నైజ గుణం. దానిని తృప్తిపరచని ఎడల, మానవ జీవితం అసంతృప్తితో అంతమౌతుంది జన్మదత్తమైన కళాభిజ్ఞత ఉన్నవాడు కళాకారుడుగా రాణిస్తాడు అలాకానివాడు కళానుభూతిని పొంది కళోపాసకు డవుతాడు; కళాపోషకు డవుతాడు.[23] విద్యాలయాల్లో లేనటువంటి ఈ లోటును పూరించే పనిని బాల సంఘాలు చేస్తున్నాయి. కనుక బాల సంఘాల స్థాపనను ఆదరించవలసి ఉంది. ప్రోత్సహించవలసిఉంది.

..............................

22 భిక్షుపతి, ఎం. బాలసంఘాల సమస్యలు. ఆంధ్రప్రదేశ్ బాలల మహాసభల ప్రత్యేక సంచిక 1977. 231 పు

23 బుద్ధ ప్రసాద్, మండలి బాలసంఘాలు ఆంధ్రప్రదేశ్ బాల మహా సభల-ప్రత్యేక సంచిక 1977. 175 పు

## తొలి సంఘం

ప్రముఖ సంఘ సేవిక దుర్గాబాయమ్మగారు మద్రాసులోని ద్వారకానగర్‌లో 1937లో స్థిరపడ్డారు. వారి యింటిముందు వెనుక విశాలమైన స్థలం ఉంది. ఆ స్థలంలో ప్రతిసాయంత్రం ఆ ప్రాంతంలోని పిల్లలు వచ్చి ఆడుకుంటూ ఉండేవారు. గంతులేస్తూ, అల్లరి చేస్తూ ఉండేవారు ఆ పరిస్థితిని దుర్గాబాయమ్మ గారి అమ్మమ్మ చెన్నూరి కృష్ణవేణమ్మగారు చూశారు పిల్లలందరినీ ఒకచోటచేర్చి, వారికి శిక్షణ ఇస్తే చక్కని పౌరులుగా తయారవుతారని ఆశపడింది ఒకరోజు సాయంత్రం ఆ వాడలోని పిల్లలందరినీ సమావేశపరిచి "లిటిల్ లేడీస్ ఆఫ్ బృందావన్" అనే బాలసంఘాన్ని స్థాపించినది [24] ఆ సంఘం తరఫున అనేక కార్యక్రమాలు నిర్వహింపబడ్డాయి. సంగీతం, చిత్రలేఖనం, రేడియో కార్యక్రమాలలో పాల్గొనడం మొదలైన అంశాలలో శిక్షణ ఇవ్వబడింది మద్రాసు ఆకాశవాణి కేంద్రంలో ఈ సంఘ బాలలు విరివిగా పాల్గొన్నారు. ఆ సంఘ కార్యక్రమాలు యిచ్చిన ప్రోత్సాహం భవిష్యత్తులో ఆంధ్ర బాలానంద స్థాపనకు దోహదం చేసింది.

## ఆంధ్ర బాలానంద సంఘం

న్యాయపతి రాఘవరావు, కామేశ్వరిగారలు రేడియో కేంద్రంలో చేరాక అచట పిల్లల కార్యక్రమాలు తీర్చిదిద్దడానికి వీలుగా 1940 లో మద్రాసులో ఆంధ్ర బాలానంద సంఘం స్థాపించారు బాలల అభివృద్ధికి ఈ సంఘాన్ని ఒక 'ప్రయోగ శాల'గా తీర్చిదిద్దారు. ఆ సంఘం తరఫున పిల్లలకు పాఠశాల బయట తొలిసారిగా నృత్యం, సంగీతం, చిత్ర లేఖనం, నటన మొదలైన కళలలో శిక్షణ ఇవ్వబడింది. సంఘ సభ్యులు రేడియో కార్యక్రమాలలో విరివిగా పాల్గొన్నారు. అనేక ప్రదర్శనలు ఇచ్చారు. ఆయా కళలలో ప్రసిద్ధులుగా రూపొందారు. మొత్తంమీద ఆంధ్ర బాలానంద సంఘ తొలి కార్యక్రమాలు తెలుగు దేశంలో బాలల పరంగా ఒక మహోద్యమం ప్రారంభం కావడానికి తోడ్పడ్డాయి. తదుపరి రాష్ట్ర వ్యాప్తంగా అనేక పట్నాలలో, పల్లెలలో బాలానంద సంఘాలు ప్రారంభించి బాలల సర్వతోముఖ వికాసానికి ఈ సంఘం తోడ్పడింది.

..............................

24 సీతాదేవి, నేతి. దుర్గాబాయి దేశ్‌ముఖ్ జీవిత చరిత్ర. హైదరాబాదు, ఆంధ్రప్రదేశ్ మహిళా సభ, 1977. 168 పు

## వైతాళిక రచనలు

ప్రపంచంలోని బాలవాఙ్మయాన్ని పరిశీలించినట్లయితే బాలసాహిత్యాకాశంలో మణి దీపాల్లాంటి ముగ్గురు వ్యక్తులు కనిపిస్తారు. గ్రీకుదేశానికి చెందిన ఈసప్, డెన్మార్కు-దేశానికి చెందిన హాన్స్ ఎండర్సన్ (1805-79), జర్మనీ దేశానికి చెందిన గ్రిమ్ సోదరులు-అనగా జేకబ్ కార్ల్ గ్రిమ్ (1785-1863), విల్ హెల్మ్ గ్రిమ్ (1786-1859) ఇద్దరు సోదరులూ జంటగా జీవించి జంటగా గ్రంథ రచన చేశారు. గ్రిమ్ సోదరులిద్దరినీ పై ఇద్దరినీ బాల వాఙ్మయ నిర్మాతలుగా పరిగణించుతారు.[25] ఈ రచయితలు ఇచ్చిన ప్రేరణతో ప్రపంచ వ్యాప్తంగా బాల సాహిత్యం అభివృద్ధి చెందినదని బాల సాహిత్య చరిత్ర వలన తెలుస్తుంది. తెలుగు బాల సాహిత్యంలో అంతటి స్థాయిగల రచయితలు గలరా? అని ఒక ప్రశ్న తెలుగు వారి రచనలు తెలుగు దేశం దాటి పోలేదు ప్రామాణికమైన అనువాదాలతో, సర్వాంగ సుందరమైన ముద్రణతో బయటి ప్రపంచాన్ని చూసి ఉంటే తెలుగువారి సత్తా తెలిసేది. మరి ఆ అదృష్టానికి మనం ఈనాటికి నోచుకోలేదు "పందొమ్మిదో శతాబ్ది ఉత్తరార్ధం వచ్చే సరికి బాల బాలికలకు, స్త్రీలు చదివి ఆనందించడానికి, మంచి పుస్తకాలు కూర్చాలన్న ఆశయం, గొప్ప గొప్ప పండితులైన వారు కూడ ప్రకటించి అందుకు పూనుకోవడం గమనార్హం అందువల్లనే గొప్ప పండితులైన వారు కూడ నీతి దీపికలు, నీతి మంజరులు, నీతి సంగ్రహాలు, వివేక సంగ్రహాలు ప్రచురించడం జరిగింది. అప్పు డప్పుడే బాలికా పాఠశాలల స్థాపనంకూడ నెలకొనడంతో ఈ విధంగా చిన్న తరగతుల బాలబాలికలకు నీతులు బోధించవలసిన ఈ పుస్తకాలు ప్రచురించారు.[26] అనుకూలమైన ఆ వాతావరణం పిల్లలకోసం ప్రత్యేకంగా రచనలు చేయటానికి, గ్రంథాలు ముద్రించడానికి అనుకూలించింది

### ఎందరో మహానుభావులు

పందొమ్మిదో శతాబ్ది తుదిపాదంలో ఆ తర్వాత-తెలుగు సాహిత్యంలో ఉద్దండులైన కవిపండితులు బాలసాహిత్యంలో రచనలు చేశారు తరువాతి తరానికి ప్రేరణ కలిగించారు. మార్గదర్శకులైనారు. వారిలో గజ్జెల రామానుజులు నాయుడు, కందుకూరి వీరేశలింగం పంతులు, వావిలికొలను సుబ్బారావు, వెంకట పార్వతీశ్వర కవులు,

..............................

25 సరస్వతీ దేవి, ఇల్లిందల- బాల వాఙ్మయ నిర్మాతలు (జీవన సామరస్యములో) - మచిలీపట్టణం, యం. శేషాచలం అండ్ కో, 1962. 121-130 పు.

గిడుగు వెంకట సీతాపతి, చింతా దీక్షితులు, దేకుమళ్ళ కామేశ్వరరావు, ఏటుకూరి వెంకట నరసయ్య, న్యాయపతి రాఘవరావుగార్లు ప్రత్యేకంగా పేర్కొనదగినవారు. వీరు తమదైన ఒక బాణిని బాల సాహిత్యంలో ప్రవేశపెట్టి మార్గదర్శకు లయ్యారు. ఆ తర్వాత తమకు అవకాశం ఉన్నపుడు బాలల కోసం సరళ సుందరమైన రచనలు చేసిన వారు ఎందరో ఉన్నారు. వారందరూ ఆయా శాఖలలో మహోన్నతమైన కృషిచేసి క్వాచిత్కంగా బాల సాహిత్యంలో రచనలు చేసి-తరువాతి తరాన్ని ప్రోత్సహించారు బాల సాహిత్యం కోసం ప్రత్యేకంగా కృషిచేసిన బాల సాహిత్య నిర్మాతలను, మార్గదర్శకులను తరువాతి తరం మరచిపోదు.

## గజ్జెల రామానుజులు నాయుడు

నాయుడుగారు 1874లో కడపలో జిల్లా మున్సిఫ్‌గా ఉండేవారు. వారు బాలల కోసం 'సతీహిత సంగ్రహం', 'వివేక సంగ్రహం' అనే రెండు పుస్తకాలు రాశారు ఇందు మొదటిది బాలికల కోసం, రెండోది బాలుర కోసం ఉద్దేశింపబడినట్లు పేర్కొన్నారు. ఈ రచనలకు శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి (1810-1920) గారి సతీహిత సంగ్రహం ప్రేరకమైనదని నాయుడుగారు కృతజ్ఞత తెలుపుకున్నారు. పైగా నాయుడుగారు తమ రచనలన్నీ ప్రముఖ వైయాకరణి కొక్కొండ వెంకట రత్నం పంతులు (1842-1910) గారిచేత పరిష్కరించడం చేత దోషరహితంగా ఉన్నవని చెప్పారు. ఈ రచనలు లోకవృత్త చిత్రణతో సరళంగా, మనోజ్ఞంగా ఉండడం చేత నాడు విశేషంగా పాఠశాలలో ప్రచారమయ్యాయి మచ్చుకు నాయుడుగారి ఒక్క పద్యం చూస్తేచాలు -

మంచివారి పొందు మానక చేసిన<br>
జాలమేల గలుగు జనులకెపుడు<br>
గంధ పంకమందు గపురంబు జేర్చిన<br>
నిండు దావి గలిగి యుండునట్లు

ఈ విధంగా నైతిక విషయాలను సుబోధకంగా పిల్లలకు అందించడం కొందరు కవులు పనిగా పెట్టుకొన్నారు.

ఐతే పిల్లలచేత కంఠతా పట్టించే సుమతీ శతకం, భాస్కర శతకాలలోని

..............................

26 రమాపతిరావు, అక్కిరాజు. బాలసాహిత్యంలో తొలి రచనలు ఆంధ్రప్రదేశ్ బాలల మహాసభలు-ప్రత్యేక సంచికలో-18 పు

పలుదోమి సేయు విడియము
తలగడిగిన నాటి నిద్ర తరుణుల తోడన్
బొలయలుక నాటి కూటమి
వెలయింతని చెప్పరాదు వినురా సుమతీ!

ఎంటి పద్యాలు—కుమారీ శతకంలోని—

పదములపై జెయి వేయక
మదవతి ః పతిచెంత నిద్ర మరిగిన, జేతుల్
గదలంగనీక కట్టుచు
గదగొని శిక్షించు యముడు కాంక్ష కుమారీ'

వంటి అసభ్యకర, అశ్లీల రచనలు ఆనాటి రచనలలో మచ్చుకైనా లేవు.

## కందుకూరి వీరేశలింగం పంతులు (1848-1919)

'ఆధునికాంధ్ర దేశం అఖండగోదావరి అయితే వీరేశలింగం పంతులుగారు నాసికత్ర్యంబకం' అన్నారు దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు అఖండమైన తెలుగు సాహిత్య సాగరంలో పంతులుగారు స్పృశించని శాఖ లేదు తెలుగు నవల, ప్రహసనం, స్వీయ చరిత్ర, శాస్త్రగ్రంథాల రచనకు ఆద్యులైనట్లు నవీన దృక్పథంతో, శాస్త్రీయ విధానంతో బాలలకోసం రచనలు చేసిన వారిలో కందుకూరి వీరేశలింగం పంతులుగారే ప్రథములని నార్లవారి అభిప్రాయం "[27] నైతిక దృష్టి లేకపోతే పిల్లలు శాశ్వతంగా పిల్లలుగానే ఉండిపోతారు. మారుతున్న సమాజంలో బాధ్యతాయుత పౌరులుగా రూపొందలేరు ఈ విషయాన్ని గమనంలో ఉంచుకొని పంతులుగారు బాల బాలికలకై నీతి దీపిక, స్త్రీ నీతి దీపిక, నీతి కథామంజరి—అనే ఈసప్ నీతి కథలు చిన్న చిన్న పద్యాలలో సులభ వచనంలో రాశారు కొన్ని పత్రికలలో 'బాదంకాయ', వరి కంకులు, బ్రాహ్మణి—ముంగిస, పరోపకారము—అనే చిన్న చిన్న కథలను రాశారు అబద్ధాలాడడం వలన వచ్చే అనర్థాలను వివరించడానికి "సత్యసంజీవని" అనే పెద్దకథ రాశారు. [28]

..............................

27 Narla, V. R. Children's Literature. (In "Traditional Indian Culture & Other Essays) Vijayawada, Vijaya Books, 1969. P. 10–114.

28 రమాపతిరావు, అక్కిరాజు. వీరేశలింగం పంతులు-సమగ్రపరిశీలన. 1972.

గిడుగు వెంకట సీతాపతి, చింతా దీక్షితులు, చేకుమళ్ళ కామేశ్వరరావు, ఏటుకూరి వెంకట నరసయ్య, న్యాయపతిరాఘవరావుగార్లు ప్రత్యేకంగా పేర్కొనదగినవారు ు తమదైన ఒకి బాణిని బాల సాహిత్యంలో ప్రవేశపెట్టి మార్గదర్శకు లయ్యారు ఆ తర్వాత తమకు అవకాశం ఉన్నపుడు బాలల కోసం సరళ సుందరమైన రచనలు చేసిన వారు ఎందరో ఉన్నారు. వారందరూ ఆయా శాఖలలో మహోన్నతమైన కృషిచేసి క్వాచిత్కంగా బాల సాహిత్యంలో రచనలు చేసి-తరువాతి తరాన్ని ప్రోత్సహించారు బాల సాహిత్యం కోసం ప్రత్యేకంగా కృషిచేసిన బాల సాహిత్య నిర్మాతలను, మార్గదర్శకులను తరువాతి తరం మరచిపోదు.

గజ్జెల రామానుజులు నాయుడు

నాయుడుగారు 1874లో కడపలో జిల్లా మున్సిఫ్‌గా ఉండేవారు వారు బాలల కోసం 'సతీహిత సంగ్రహం', 'వివేక సంగ్రహం' అనే రెండు పుస్తకాలు రాశారు ఇందు మొదటిది బాలికల కోసం, రెండోది బాలుర కోసం ఉద్దేశింపబడినట్లు పేర్కొన్నారు. ఈ రచనలకు శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి (1810-1920) గారి సతీహిత సంగ్రహం ప్రేరకమైనదని నాయుడుగారు కృతజ్ఞత తెలుపుకున్నారు పైగా నాయుడుగారు తమ రచనలన్నీ ప్రముఖ వైయాకరణి కొక్కొండ వెంకట రత్నం పంతులు (1842-1910) గారిచేత పరిష్కరించడం చేత దోషరహితంగా ఉన్నవని చెప్పారు. ఈ రచనలు లోకవృత్త చిత్రణతో సరళంగా, మనోజ్ఞంగా ఉండడం చేత నాడు విశేషంగా పాఠశాలలో ప్రచారమయ్యాయి. మచ్చుకు నాయుడుగారి ఒక్క పద్యం చూస్తేచాలు -

> మంచివారి పొందు మానక చేసిన
> జాలమేల గలుగు జనులకెపుడు
> గంధ పంకమందు గపురంబు జేర్చిన
> నిండు దావి గలిగి యుండునట్లు

ఈ విధంగా నైతిక విషయాలను సుబోధకంగా పిల్లలకు అందించడం కొందరు కవులు పనిగా పెట్టుకొన్నారు.

ఐతే పిల్లలచేత కంఠతా పట్టించే సుమతీ శతకం, భాస్కర శతకాలలోని

..............................

26. రమాపతిరావు, అక్కిరాజు. బాలసాహిత్యంలో తొలి రచనలు ఆంధ్రప్రదేశ్ బాలల మహాసభలు-ప్రత్యేక సంచికలో-18 పు.

పలుదోమి సేయు విడియము
తలగడిగిన నాటి నిద్ర తరుణుల తోడన్
బొలయలుక నాటి కూటమి
వెలయింతని చెప్పరాదు వినురా సుమతీ!

వంటి పద్యాలు—కుమారీ శతకంలోని—

పదములపై జెయి వేయక
మదవతి ! పతిచెంత నిద్ర మరిగిన, జేతుల్
గదలంగనీక కట్టుచు
గదగొని శిక్షించు యముడు కాంక్ష కుమారీ!

వంటి అసభ్యకర, అశ్లీల రచనలు ఆనాటి రచనలలో మచ్చుకైనా లేవు.

## కందుకూరి వీరేశలింగం పంతులు (1848-1919)

'ఆధునికాంధ్ర దేశం అఖండగోదావరి అయితే వీరేశలింగం పంతులుగారు నాసి కత్ర్యంబకం' అన్నారు దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు అఖండమైన తెలుగు సాహిత్య సాగరంలో పంతులుగారు స్పృశించని శాఖ లేదు. తెలుగు నవల, ప్రహసనం, స్వీయ చరిత్ర, శాస్త్రగ్రంథాల రచనకు ఆద్యులైనట్లు నవీన దృక్పథంతో, శాస్త్రీయ విధానంతో బాలలకోసం రచనలు చేసిన వారిలో కందుకూరి వీరేశలింగం పంతులుగారే ప్రథములని నార్లవారి అభిప్రాయం " [27] నైతిక దృష్టి లేకపోతే పిల్లలు శాశ్వతంగా పిల్లలుగానే ఉండిపోతారు. మారుతున్న సమాజంలో బాధ్యతాయుత పౌరులుగా రూపొందలేరు ఈ విషయాన్ని గమనంలో ఉంచుకొని పంతులుగారు బాల బాలికలకై నీతి దీపిక, స్త్రీ నీతి దీపిక, నీతి కథామంజరి—అనే ఈసప్ నీతి కథలు చిన్న చిన్న పద్యాలలో సులభ వచనంలో రాశారు. కొన్ని పత్రికలలో 'బాదంకాయ', వరి కంకులు, బ్రాహ్మణి—ముంగిస, పరోపకారము—అనే చిన్న చిన్న కథలను రాశారు అబద్ధాలాడడం వలన వచ్చే అనర్థాలను వివరించడానికి "సత్యసంజీవని" అనే పెద్దకథ రాశారు. [28]

..............................

27 Narla, V. R. Children's Literature. (In "Traditional Indian Culture & Other Essays) Vijayawada, Vijaya Books, 1969. P. 10–114.

28 రఘూపతిరావు, అక్కిరాజు. వీరేశలింగం పంతులు-సమగ్రపరిశీలన. 1972.

ఈసప్ నీతికథలను బాలల కందించింది తొలిసారిగా పంతులుగారే. పంతులు గారు కేవలం రచనతో తృప్తిపడక 158 కథలకు బొమ్మలనుచేర్చి 'నీతికథామంజరి' పేరుతో రెండు సంపుటాలలో (1893–94) ప్రకటించారు ఇంతకు పూర్వం ఈకథలు 1892–93 లో పంతులుగారు నిర్వహించిన చింతామణి (1890–1904) పత్రికలో ప్రచురింపబడ్డాయి.

పంతులుగారు బాలలకోసం 'నీతి దీపిక' ను సులభమైన గీత పద్యాలలో రాశారు ఈ పద్యాలు విశేష ప్రచారాన్నందుకున్నాయి. 1913 నాటికి ఈ పుస్తకం 17 ముద్రణలు పొందింది. పంతులుగారి సమకాలికుడు వావిలాల వాసుదేవశాస్త్రి 1851–1897 గారు వివేక వర్ధని (1874–1885) లో నీతి దీపికను గురించి ఇలా ప్రశంసించారు. "నీతి యెరుంగని మన బాలురకు దీపము వెలుగు జూపి పదార్థ జ్ఞానంబు గలిగించునట్లు నయానయ వివేకంబు బాల్యంబుననే తెలిపి, పెద్ద పెరిగిన మీదట దుర్ణయ వర్తనులు గాకుండునట్లు చేయుటకిది ముఖ్యాధార భూత మనుటకు సందేహ మొకింతయును లేదు" (అక్టోబరు 1875). పంతులుగారి బాల సాహిత్యం ముఖ్యంగా రచనా విధానంలో, భావాల సేకరణలో, భాషా శైలిలో, ముద్రణలో తరువాతి వారిని ఎంతగానో ఉత్తేజ పరిచింది

## గురుజాడ అప్పారావు (1862-1915)

పాత కొత్తల మేలికలయికల వారధి గురుజాడ అప్పారావుగారు భాషలో, భావంలో, శైలిలో నూతనత్వాన్ని ప్రసాదించిన మహాకవి గురజాడ. వారి 'జననం ఆంధ్రసాహిత్య లోకమున కరుణోదయము పిల్లలు చరిత్రల పెంజీకట్లు ముసురు కున్న రోజులలో దేశి కవితా రశ్మిని ప్రసరించిన కవిభాస్కరుడాతడు...[29] గురజాడ వారు "లోకాన్ని పరిశీలించి ఒక నిర్ణయానికి వచ్చారు ఈలోకం ఇంకా శిశుత్వంలోనే ఉందని గ్రహించారు అందుచేత ఆయన ముత్యాల సరాలవంటి దేశి కవితారీతులతో పిల్లలతో ఆడుకొన్న ట్లే–లోకంలో క్రీడించారు ఆయన పిల్లల్ని ఆకట్టడానికి ప్రధానాలైన కరుణ, హాస్యరసాల్ని చేతబట్టారు. కితకితలు పెడుతూనే లోకానికి పాఠం నేర్పారు. ఆయన చెప్పదలచుకున్న మహదాదర్శాన్ని శిశు మన స్తత్వశాస్త్రజ్ఞుని వలె లోకానికి బోధించారు 'కన్యక', 'పూర్ణమ్మకథ' ఈ విధానంలో

.............. ......... ......

29 నారాయణ రెడ్డి సి. గురజాడ అప్పారావు–ఆధునికాంధ్ర కవిత్వము–లో. 194 పు.

చెప్పినవే"[30]. ఇవిగాక బాలల కోసం గేయాలు కొన్నిరాశారు. సులభ శైలిలో రచనా విధానాన్ని ప్రచారం చేశారు. తరువాతి తరం రచయితలకు మార్గదర్శకు లయ్యారు.

## వేంకట పార్వతీశ్వర కవులు

ఈ పేరు మీద రచనలు చేసిన జంట కవులు ఓలేటి పార్వతీశ్వరకవి (1882-1955) బాలాంత్రపు వెంకటరావు (1881-1973) బాలసాహిత్యానికి తొలిదశలో బలమైన పునాదులు వేయడానికి తోడ్పడిన వారిలో వెంకట పార్వతీశ్వర కవులు ముఖ్యులు వారు 1912లో బాలలకు అత్యంత సుబోధకంగా ఉండే విధంగా బాల గీతావళిని ఐదు భాగాలలో ప్రచురించినట్లు తెలుస్తుంది ఈ విషయాన్ని బాలాంత్రపు వెంకట రావుగారు వడ్డాది అప్పారావుగారితో జరిపిన పరిచయ సంభాషణ వలన తెలుస్తుంది. ఇది రేడియోలో ప్రసారితం దీని రాతప్రతి వెంకటరావుగారి పుత్రులు నళినీ కాంత రావుగారి వద్ద ఉంది. మొదటి భాగం బాలల జానపద గేయాలు. మిగతా నాలుగు భాగాలు బాలల విద్యాస్థాయిని బట్టి 2, 3, 4, 5 తరగతులకు ఉపయోగించేవి వారి రచనోద్దేశాన్ని వెంకటపార్వతీశ్వర కవులు ఇలా వివరిస్తారు "పాఠశాలల యందలి పిల్లలకు వారి వారి వయః క్రమమును, బుద్ధి శక్తుల ననుసరించి వ్రాయబడిన పాఠ్య పుస్తకములే యావశ్యకములై యున్నవి అవి చిన్నబిడ్డలకు గృహపరిసరములందు గలిగిన యనుభవ జ్ఞానమును బరిస్ఫుటముగ వికసింపజేయుటకు సహాయభూతములై యుండ వలయునను; వానికి దెలిసిన విషయముల ననుసరించియే తెలియని విషయము లను బోధించు చుండవలయును"[31] ఈ దృష్టితోనే వారు 'బాల గీతావళి'ని- రచించి ప్రచారం చేశారు వీరి రచనలన్నీ పద్యరూపాలు "వచనం' చదవడానికి సులభంగా ఉన్న పద్యం మననం చేయడానికి అనుకూలంగా ఉంటుంది అందుకే ఈ కవులు బాలురకోసం "బాలగీతావళి" ని పద్యాలలో రాశారు.. లేత నారికేళ పాకంలో ఆటవెలది తేటగీతుల్లో రాశారు"[32] రింగు రింగున బొంగరం తిరుగుతూ ఉంటే తాను పలకమీద గీసిన సున్నాలు గుర్తుకు వచ్చి కాబోలు—

..............................

30 చిరంజీవి, నార్ల. మన బాలసాహిత్యం, అభ్యుదయ, జూలై, 1955. 164 పు

31 వేంకటపార్వతీశ్వర కవులు, బాల గీతావళి-పీఠిక. కాకినాడ, ఆంధ్రప్రచారిణీ గ్రంథనిల యము, 1940. 8పు

32 సీతామహాలక్ష్మి, వి. వేంకట పార్వతీశ్వరకవులు - బాల గీతావళి. 16-9-1978 తేదీన విశాఖపట్నం ఆకాశవాణి కేంద్ర ప్రసంగం

బడికి పోలేదు పొత్తంబు బట్టలేదు
ఎట్లు వచ్చినదో దీనికింత చదువు

అని పిల్లవాడు ఆశ్చర్యపోతాడు. ఇలాటివి వెంకట పార్వతీశ్వరకవుల రచనలలో కొల్లలు. కనుకనే వారు మలితరం రచయితలకు ఆదర్శప్రాయులయ్యారు.

## వావిలికొలను సుబ్బారావు (1863-1936)

సుప్రసిద్ధకవిగా, భక్తకవిగా, విమర్శకుడుగా పేరుపొందిన వావిలికొలను సుబ్బారావుగారు చిరకాలంగా (1904-1925) ఉపాధ్యాయ వృత్తిచేసి-చివరి దశలో 'వాసు దాసు' గా ప్రసిద్ధి చెందారు వారు బాల బాలికల కోసం సరళమైన భాషలో ఎన్నో రచనలు చేశారు. వీరు 1915 లో బాలికలకు ఆరోగ్య, సాంఘిక విషయాలను తెలియ జెప్పే "కుమారీ హితచర్య" ను సరళమైన భాషలో రాసి ప్రచురించారు. ఆ తరువాత బాలురకు శరీర శాస్త్ర సాంఘిక విషయాలను తెలియజెప్పు, 'కుమార హిత చర్య', 'బాలిక హితచర్య' మొదలైన గ్రంథాలను ఆర్య చరిత్ర రత్నావళి శీర్షిక క్రింద ప్రచురించారు వీరు 1925 లో 'నవ్వుల తోట' మాసపత్రికలలో ప్రచురించిన 'తల్లి-పిల్ల' గేయం పలువురి ప్రశంసల నందుకున్నది. సుబ్బారావుగారి బాల సాహిత్య రచనలలో మకుటాయమానమైనది. ఆర్య కథానిధి 8 భాగాలు తొలిముద్రణ 30 భాగాలలో ఉండేదని తెలుస్తుంది. ఇందు భారతీయ సంస్కృతి, చరిత్ర, సాహిత్యం చాటిచెప్పే చక్కని కథలు ఉన్నాయి. కథ చివరన నీతి పద్యాలు చేర్చబడ్డాయి. "ఆర్యకథానిధి"లో కేవలం కథలు చెప్పడమే ఆయన పరమార్థంకాదు దయా ధర్మాలు, సత్యవర్తనం, పరోపకారం మొదలైన సుగుణాలు బాల బాలికలకు ఒంట బట్టేట్లుగా కోమలమైన మనస్సుకు హత్తుకొనేట్లుగా చెప్పడం ప్రత్యేకత." [33] బాల కథావాఙ్మయానికి వారి కథలు మార్గం చూపినవి.

## గిడుగు వెంకట సీతాపతి [1885 - 1968]

పాశ్చాత్య దేశాల్లోని బాల సాహిత్యాభివృద్ధిని ఆకళింపు జేసికొని ఆధునిక

..............................

33 రామచంద్ర, తిరుమల. బాలసాహిత్య వైతాళికులు. ఆంధ్రప్రదేశ్ బాలల మహాసభలు - ప్రత్యేక సంచిక, 1977 267-271 పు.

రీతిలో బాల సాహిత్యానికి ఒకమెట్టు ముందుకు వేయించిన వారిలో డాక్టరు గిడుగు వెంకట సీతాపతిగారు ముఖ్యులు సీతాపతిగారు 12 ఏళ్ల ప్రాయంలోనే రచనలు చేశారు 1897లో విక్టోరియా మహారాణి పాలనకు వజ్రోత్సవం జరిగినప్పుడు తేట తెనుగులో సీతాపతిగారు రాసిన పద్యాలకు బాయిస్ ఓన్ యాన్యువల్ అనే ఆంగ్ల గ్రంథం బహుమతిగా లభించింది అందు బాలురకు సులువుగా బోధపడగల పద్యాలు, కథలు, ప్రసంగాలు మొదలైనవి ఉన్నాయి. ఈ రచనలు తనకు ప్రేరణ కలిగించి నట్లు సీతాపతిగారు 'బాలసాహితీ మాల' (1963) పరిచయ వాక్యాలలో చెప్పుకున్నారు ఆ తర్వాతే చిలకమ్మ పెండ్లి, రైలుబండి మొదలైన గేయాలు రాసి, అనేక ప్రయోగాలు చేశారు 1940 లో 'భారతి' సంపాదకత్వంలో చేరాక "బాలానందం" కోసం రెండుపుటలు కేటాయించి రచయితలను ప్రోత్సహించారు. బాలసాహిత్యాభి వృద్ధికి ఎన్నో ఊహలు చేశారు ముఖ్యంగా సీతాపతిగారు ఎందరో యువ రచయిత లకు రచనా విధానంలోని మెలకువలు చెప్పి, స్వతంత్ర భారతంలో బాలసాహిత్యాభి వృద్ధికి ఎంతగానో కృషిచేశారు. ఈనాటి ప్రసిద్ధ రచయితలలో అధిక భాగం వారి నుంచి సలహాలు తీసుకున్న వారే

## చింతా దీక్షితులు (1891 – 1960)

తెలుగు బాలసాహిత్యానికి ఎనలేని కృషిచేసిన వారిలో చింతా దీక్షితులు ముఖ్యులు. కనుకనే వీరిని 'బాలవాఙ్మయ బ్రహ్మ' అన్నారు. చాలకాలం ఉపాధ్యాయ వృత్తిలో ఉండే మహద్భాగ్యం లభించడంవలన "పసివాళ్ల" ప్రవృత్తిని బాగా లగ్గ పట్టిన వారు చింతా దీక్షితులు "[34] వీరు చేసిన రచనలు కొద్దిగానే ఉన్నాయి 'లక్క-పిడతలు' (1947) సూరి సీతి వెంకి (1931) బంగారు పిలక, శంపాలత, లీలాసుందరి (1933) వీరి ప్రతి రచన ఒక జాతిరత్నం. భారతీయ భాషలలో, విదేశీ భాషలలోనూ గల ఏ రచనకు తీసిపోవు.

అంతేగాక దీక్షితులుగారు పిల్లల జానపద గేయాలను అనేకం సేకరించి ఆంధ్ర వార పత్రికలో ప్రచురించారు[35] బాల సాహిత్యంలో దీక్షితులుగారి స్థానం అగ్రగణ్యమైనది.

..............................

34 రామచంద్ర, తిరుమల - 33 వది

35 కామేశ్వరరావు, టేకుమళ్ళ. చింతా దీక్షితులు - నా వాఙ్మయ మిత్రులు-లో - 1966 286. 288 పు.

## ఏటుకూరి వెంకట నరసయ్య 1911 - 1949

తనదైన ఒక ప్రత్యేక మార్గంలో తెలుగు బాలలను ఉత్తేజ పరచిన వారిలో కవిబ్రహ్మ ఏటుకూరి వెంకట నరసయ్యగారు ముఖ్యులు తెలుగు బాలలకు గేయ కథలను ముందుగా ఒక కొత్త విధానంలో అందించిన గౌరవం వెంకట నరసయ్య గారికే దక్కింది. తొలుత 'గృహలక్ష్మి' లోనూ ఆ తర్వాత 'చందమామ' లో గేయ కథలు చక్కని శైలిలో రాసి ప్రచురించారు. ఒక కొత్త బాణిలో - చందమామను గురించి -

వెండి లాంతరు బట్టి వేగవచ్చాడే
చల్లన్ని గాలిలో చందమామయ్య !
బంగారు తేరుపై పరిగెత్తినాడే
వెన్నెల జల్లంత వెలసిపోయిందే !"

అని గుగ్గిళ్ళ పాటలు కొన్ని రాశారు. ముఖ్యంగా ఏటుకూరి వారు ప్రవేశ పెట్టిన రచనాధోరణి తరువాతి కవులకు మార్గదర్శకం అయింది. వారు చూపిన మార్గంలో వందల సంఖ్యలో ఆ తర్వాత గేయకథలు వచ్చాయి.

## న్యాయపతి రాఘవరావు (1905 -)

తెలుగు బాలలకు అపూర్వమైన సేవ చేసిన వారిలో న్యాయపతి రాఘవరావు గారు అగ్రగణ్యులు. 1921 లోనే స్వాతంత్రోద్యమంలో పనిజేసి పత్రికా రచయితగా నిండు అనుభవాన్ని సంపాదించి 1939లో రేడియో ఉద్యోగంలో జేరడం ద్వారా బాలల కార్యక్రమాలతో సంబంధం ఏర్పరచుకున్నారు పిల్లలలో ఒకరుగా కలసిపోయి బాలానంద సంఘం 1940 లో స్థాపించారు 1945లో 'బాల' మాస పత్రిక ప్రారంభించారు పిల్లల పాటలు రికార్డుచేశారు. పిల్లల చలనచిత్రాలు నిర్మించారు బాలల రంగంలో తెలుగు దేశంలో వారి కృషి సంగతి చెప్పాలంటే, మిగతా వారి సంగతి చెప్పాలి [36] వారి కార్యక్రమాలన్నిటినీ తోడుగా వారి అర్ధాంగి కామేశ్వరి

..............................

36 Raghavarao, Koka. Radio Annayya — Radio Akkayya — SOUVENIR. Hyderabad, Radio Akkayya—Annayya Sanmana Sangham, 1971

గారు (1909-1980) పాలుపంచుకోవడం ఉద్యమాన్ని మరో మెట్టు పైకి తీసుకు పోవడానికి తోడ్పడింది [37].

## 'చక్రపాణి' (1908-1975)

'చక్రపాణి'గా ప్రసిద్ధిచెందిన ఆలూరి వెంకట సుబ్బారావుగారు 'చందమామ' వ్యవస్థాపకులుగా అందరికీ చిర పరిచితులు. వారు ఏమి రాశారో, ఎంతరాశారో 'చందమామ' లో పనిజేసే వారికే తెలుసు. ఎందరో ప్రశంసల నందుకున్న 'తండ్రీ కొడుకులు' అనే పెద్దకథ, ఇంకా అనేక కథలు వారే రాసినట్లు తెలుస్తుంది. కథా విధానంలో, భాషలో, భావంలో వానికిగల మాస్టరీ 'చందమామ' చదివిన వారికి, పరిశీలించిన వారికి, వారితో సంబంధమున్న వారికి తెలుసు చందమామ కథా విధా నంలో వారు పెట్టిన ఒరవడి తెలుగు బాల కథా విధానంలో కొత్త మార్పును తెచ్చి పెట్టింది చక్రపాణిగారి యాభైసంవత్సరాల సాహిత్య జీవితంలో వారికి ఒక్క సన్మా నం జరగలేదు బతికుండగా వారిని గురించి ఎవరూ రాసినట్లూ లేదు.

ఐనా వారిలో ఉండేశక్తి, వారు వేసిన బాట, వైతాళిక ప్రయత్నాలు వారిని చిరకాలం గుర్తుంచుకునేట్లు చేశాయి. వారు నడిపిన పత్రికలు, ప్రచురించిన పుస్తకాలు, నిర్వహించిన కార్యక్రమాలు వారికృషికి, శక్తికి ప్రత్యక్ష నిదర్శనాలు. ఆకాశంలో చందమామకున్న స్థానం, బాలసాహిత్యంలో చక్రపాణిగారి కున్నదనడంలో ఆశ్చ ర్యం లేదు.

## మరికొందరు

ఇంతకు ముందు వివరించిన వారుగాక, ఎందరో సాహితీ వేత్తలు బాలసాహి త్యాభివృద్ధికి దోహదం చేశారు జానపద గేయాలు, కథలు సేకరించిన వారి విషయం అలాఉంచి, తెలుగులో ప్రసిద్ధమైన కవిపండితులు బాలలకోసం అప్పుడప్పుడు రచనలు చేశారు. వారిలో అడవి బాపిరాజు (1895-1952), విశ్వనాథ సత్యనారాయణ (1895-1976), నాళం కృష్ణరావు (1890-1961), కవికొండల వెంకటరావు

..............................

37 అన్నయ్యా, అక్కయ్యల అభినందన సంచిక - హైదరాబాదు, లలితకళా కల్చరల్ అసోసియేషన్, 1977.

(1892–1968), దేవులపల్లి కృష్ణశాస్త్రి (1897–1980), వేలూరి శివరామశాస్త్రి (1892–1967), పింగళి లక్ష్మీకాంతం, (1894–1972), శ్రీరంగం శ్రీనివాసరావు (1910–), ఏడిద కామేశ్వరరావు (1918–), శె సభా (1920–1980), అడపా రామకృష్ణరావు, శిష్టేలా ఉమామహేశ్వరరావు, శ్రీవాత్సవ, మేడిచర్ల ఆంజనేయ మూర్తి, నరహరిశెట్టి వెంకటరత్నం ప్రభృతులు చెప్పుకోదగినవారు వీరంతా 1947కు పూర్వమే బాలలకోసం రచనలు చేసిన లబ్ధ ప్రతిష్టులు. మార్గదర్శకులు. తెలుగుబాలలకు వెలుగు దీపికలు.

— ం —

## బాల సాహితీ పరిచయం

బాల సాహిత్యం, బాల సాహితి, బాల వాఙ్మయం, పిల్లల సాహిత్యం, శిశు సాహిత్యం – ఈ పదాలన్నిటినీ సమానార్థకాలుగానే వాడుతున్నారు అన్నిటా 'బాల సాహిత్యం' బహుళ ప్రచారం పొందిన పదద్వయం దీని భావాన్ని పెద్దగా విడమర్చి చెప్పాల్సిన పనిలేదు అది సుబోధకం బాలల కోసం చేసిన సరళ రచనలు బాల సాహిత్యం అని చెప్పుకోవచ్చు జానపద రంగంలో బాల సాహిత్యం చిరకాలంగా ఉంది. ఆధునిక రంగంలో బాల సాహిత్య సృష్టి యిటీవలి కాలంలోదే ప్రాథమిక విద్య మన దేశంలో ప్రవేశ పెట్టడానికి విదేశీ ప్రభావం కారణమైనట్లు బాల సాహిత్యం భారత దేశంలో ప్రత్యేకంగా తెలుగులో విస్తరించడానికి విదేశీ ప్రభావం బాగా ఉంది 'బాల సాహిత్యం' లో 'సాహిత్యం' అనే పదం ప్రధాన మైనది. 'బాల' అనేది ముందున్న విశేషణం అత్యంత విస్తృతమైన పరిధి, అపార సంఖ్యలో పాఠక లోకం గలది. అంత మాత్రాన అది పెద్దలకు చెందదని – అనుకోరాదని[1] బ్రిటానికా అభి ప్రాయం ఇది వాస్తవమే. బాల సాహిత్యాన్ని పిన్నలు పెద్దలు సమంగా చదువుతారు ఆదరిస్తారు ఈ వాఙ్మయాన్ని గురించి మరొక విజ్ఞాన సర్వస్వం– "పాఠశాలకు వెళ్ళని దశ నుంచీ యవ్వనం వచ్చేవరకు గల బాలలకు నచ్చే అనంతమైన సాహిత్యం బాల సాహిత్యం అన్నది"[2] ఇందులో బాల సాహిత్య పరిధి కొంతవరకే పరిమితం చేసినప్పటికీ బాలసాహిత్య ఉద్దేశాలు, ప్రయోజనాలలో ఎట్టి భేదాభిప్రాయాలు లేవు "ఇటీవలి కాలంలో బాల సాహిత్యాన్ని గురించి చెప్పినంత ఇంతకు ముందు ఎవరూ అనుకోలేదని" అమెరికన్ విజ్ఞాన సర్వస్వం రాస్తున్నది[3] దీనిని బట్టి బాల సాహిత్యానికి ఈనాడున్న ప్రాపకాన్ని, ప్రభావాన్ని ఊహించుకోవచ్చు

## సిద్ధాంత ప్రాతిపదిక

'హితాన్ని కోరేదీ, మంచిని పెంచేదీ, సంస్కారాన్ని ప్రోదిచేసి, తరతరాలకు సంస్కృతీ సంపదను అందించేది సాహిత్యమనీ, సాహితీవేత్తలు ఏనాడో

..............................

1 ENCYCLOPAEDIA BRITANICA 1978, Vol 4. p 228

2 Literature for Children – World Book Encyclopedia Vol 12. 1978.

3 Encyclopedia American Vol. 4 1978.

చెప్పారు. అది పిల్లలకోసమే రాయబడినా, దాన్ని పెద్దలు కూడా చదువుతున్నా దాని స్వరూప స్వభావాలలో అంతరాలు, అరలు తక్కువ. అలంకారశాస్త్రవేత్తలలో ప్రప్రథముడైన మమ్మటుని నుంచి ఈనాటి బాలసాహిత్యవేత్త డాక్టరు మిరియాల రామకృష్ణ వరకు సాహిత్య లక్ష్య, లక్షణాలను గురించి అనేకులు – అనేక రీతులలో వివరించారు. చర్చలలో నిగ్గు తేల్చారు తెలుగు సాహిత్యం పుష్ప ఫలభరిత నందనోద్యానవనం. ఒడ్డుల నొరసిపారే అఖండ గోదావరి మంజుల రవాల మహనీయ మహతి ఆ మురళీ రవాల మృదు మధుర కలస్వనాలను మించి మరొక నదిలో హృదయ తంత్రులను మీటగల పదవిపంచి బాల భారతి. తెలుగుతల్లి పసిడి వన్నెను మరిపించి మురిపించగల పగడాల దండ బాలసాహిత్యం జాతిని ప్రభావితం చేయగల శక్తి స్వరూపిణి బాలసాహిత్యం ఆ "బాలసాహిత్యం నిత్యం అభివృద్ధి చెందుతూ సృజనాత్మక విషయాలతో అలరారుతున్న అపూర్వ సాహిత్య విభాగం"[4] అంటారు డెకార్డోవా తెలుగు సాహితీవేత్తలు చాలకాలం వరకు బాల సాహిత్యం విషయం పట్టించుకోలేదు చింతా దీక్షితులు (1891 – 1960) గారు చెప్పినట్లు "మన తెలుగు గ్రంథకర్తల దృష్టిలో బాలురేలేరు వారి దృష్టిలో ఉన్నది ఆత్మపాండిత్య ప్రకర్ష ఒక్కటే"[5] ఈ విధంగా ఒకప్పుడు అనాదరింపబడిన బాల సాహిత్యం మరొక తరంలో రంగు రంగుల హరివిల్లుగా వివిధ ప్రక్రియలలో విస్తరించింది ప్రాచీన, అర్వాచీన అలంకారికులెవ్వరూ బాలసాహితిని శాస్త్ర బద్ధంగా చర్చించి సిద్ధాంత ప్రాతిపదికను ఏర్పరచిన దాఖలాలు లేవు. ఈ శతాబ్దంలో బాలసాహిత్యం విరివిగా వచ్చాక – ఆ సాహిత్యంపై పత్రికలలో ప్రత్యేక సంచికలలో వచ్చిన వ్యాసాలలోని పస అంతంత మాత్రం. తెలుగు బాలసాహిత్యంలో గేయ విభాగంపై తొలిసారిగా పరిశోధన చేసిన డాక్టరు యం. కె. దేవకి (1951 –) గారు ఈ సందర్భంలో ఇలా అన్నారు "బాలసాహిత్య పరమైన వ్యాసాలు, సమీక్షలు కొన్ని పత్రికలలో వెలువడినాయి అవికేవలం ప్రాస్తావిక ప్రాయాలే తప్ప పరిశోధనా భరితం కావు"[6] ఈ విషయంలో చాల వరకు ఏకీభవించక తప్పదు ఐతే ఒక ప్రాతిపదిక ఏర్పరచేందుకు చేసే ప్రయత్నాలలో ఈ పరిశోధనా వ్యాసం ఒకటి.

..............................

4 Decordova, Frances. Children's Liteıature. In Encyclopedia of Library and Information Science Vol 4 Pp 567–615

5 దీక్షితులు, చింతా. బాల వాఙ్మయం. (ప్రజావాఙ్మయం లో) విజయవాడ, విశాలాంధ్ర, 1955. 58 పు

6 దేవకి, యం. కె. తెలుగలో బాల గేయ సాహిత్యం సవిమర్శక సమీక్ష 1978 (వ్రాత ప్రతి)

## ఏది బాల సాహిత్యం ?

బాల సాహిత్యం మనకు నాడూ ఉంది. నేడూ ఉంది రేపూ ఉంటుంది. ఉన్న రాసిలో వాసిగల సాహిత్యం ఎంత అనేదే గమనించాలి భారతీయ విద్యావిధాన సంప్రదాయం భిన్నమైనది దాదాపు గత శతాబ్దానికి పూర్వం పిల్లలకు వారి వయః పరిమితులను అనుసరించి పాఠ్య ప్రణాళిక, పాఠ్య గ్రంథాలు లేవు. అక్షరాలు నేర్పకుండానే ఆంధ్రనామ సంగ్రహం, శబ్ద మంజరి, అమరకోశం-ఇత్యాది నిఘంటు వులను, పదాల సూచికలను వల్లెవేసి క్రమంగా కావ్యాలు శాస్త్ర గ్రంథాల చెంతకు వచ్చేవారు ముద్రిత గ్రంథాలు అంటూ లేవు. బహుకొద్ది రాత ప్రతులు ఉండేవి. విద్య అంతా మౌఖికంగా జరుగుతుండేది గురువు సాయం బాగా ఉండేది. ఆ తరుణంలో వెలసిన కావ్యాలలో, వచన రచనలలో బాలసాహిత్యం పాలు తక్కువగా ఉండేది తెలుగు సాహిత్యంలో అనేక ప్రక్రియలను ఔపోసన పట్టిన కొడవటిగంటి కుటుంబరావు (1907-1980) గారు "పెద్దలసాహిత్యంలో పిల్లలకుపనికి వచ్చేదంతా పిల్లల సంప్రదాయంగా చెలామణి కావడమే మన సంప్రదాయంగా చెలామణి అయింది" [7] అన్నారు. అది జరిగిన చరిత్ర.

"బాలల కోసం రాసిన చాలగ్రంథాలు పెద్దలవిషయాలు సులభ శైలిలో రాసినవి. పిల్లలను మరుగుజ్జు మనుషులుగా ఊహించి రాసినవి ఇది బాల్యాన్ని తప్పుగా అర్థం చేసుకోవడమే. నిజానికి పిల్లలు ఒక ప్రత్యేకమైన తరగతి చెందినవారు. వారిదొక ప్రత్యేక ప్రపంచం-అది పిల్లలప్రపంచం. వారి భాష వారికే తెలుసు. అది పెద్దలకు తెలియదని – పాశ్చాత్య బాల సాహిత్య విమర్శకుల అభిప్రాయం " [8] ఇది వాస్తవానికి దగ్గరగా ఉంది. ఏ దేశంలో నైనా, ఏ భాషలో నైనా పిల్లలకోసం ఒక ప్రత్యేక విధానంలో చేసిన రచనే బాల సాహిత్యం అనిపించు కుంటుంది. ఏదో రూపంలో చేసిన రచన చదివి పిల్లలు ఆనందిస్తున్నారనేది-వేరేవిషయం.

..............................

7 కుటుంబరావు, కొడవటిగంటి. బాల సాహిత్యం (సాహిత్య ప్రయోజనం లో) విజయవాడ, విశాలాంధ్ర, 1980. 180 పు

8 **Lilian Smith. A critical Approach to Children's Literature 1969.**

దేన్ని బాల సాహిత్యం అనరాదో బ్రిటానికా ఐదు అంశాలలో స్థూలంగా సూచించింది.

1 కేవలం వ్యాపారం కోసంచేసే రచనలు-సాహిత్య విలువలులేని యువజనులను తృప్తి పరచే కామిక్ రచనలు, తదితరాలు-
2 విషయాన్ని వివరించే కొద్ది గ్రంథాలు తప్ప, దాదాపు అన్ని పాఠ్యగ్రంథాలు-
3 బాలలను ఉద్దేశించి రాయని ఉన్నత స్థాయి సాహిత్యం
4 యువజనులను ఉద్దేశించి అతి తక్కువసంఖ్యలో చేయబడిన రచనలు. ఇందలి విషయం, శైలి, దృక్పథం పిల్లలకు చెందవచ్చు. చెందకపోవచ్చు
5 కొంతవరకు కాల్పనికేతర సాహిత్యం"[9]

దీన్ని బాలసాహిత్యంగా పరిగణించాల్సిన పనిలేదు పైన ఉదహరించిన దానిని మినహా ప్రత్యేకంగా బాలలను ఉద్దేశించి ఒక విధానంలో చేసిన రచనలు బాల సాహిత్యం అనవచ్చు కొద్దిపాటి మినహాయింపులు ఎప్పుడైనా ఉంటాయి

## బాల ప్రౌఢ సాహిత్యాలు

వాస్తవానికి ప్రౌఢ సాహిత్యం అంటూ ప్రత్యేక సాహిత్య విభాగం లేదు. ఇటీవలి కాలంలో-అంటే దాదాపు నూరేళ్ళ కాలం నుంచీ ఒక ప్రత్యేక దృష్టితో బాల సాహిత్య సృష్టి జరుగు తున్నది గనుక-పిల్లల కోసం ఉద్దేశించిన రచనలను బాల సాహిత్యమనీ, పెద్దల కోసం చేసిన రచనలను పెద్దల సాహిత్యం లేదా ప్రౌఢ సాహిత్యం—అనే ప్రయోగాలు వాడుకలోకి వచ్చాయి ఇలా ఉండగా-కొన్నేళ్ళుగా ప్రత్యేకంగా కొత్తగా యువజన సాహిత్యమనీ, మహిళల సాహిత్యమనీ వారి కోసం సాహిత్య విభాగాలు అవతరిస్తున్నాయి ఇది హిస్టారికల్ వారంట్ ;

ఈ శతాబ్దం తొలి పాదం నుంచీ దేశవ్యాప్తంగా విస్తరిల్లిన సంస్కృతీ పునరుజ్జీవన ఫలితంగా బాల సాహిత్యం విశిష్టమైన రూపు రేఖలు దిద్దుకొన్నది. సిద్ధాంత మీమాంస పెరిగినా పెరగక పోయినా బాల సాహితీ లతాంతాల సుగంధం దశదిశల వ్యాపించింది. వాల్మీకి రామాయణానికి బాపూ రామాయణం-సచిత్రమైన సంగ్రహ రూపం కావచ్చు. కాని ప్రౌఢ సాహిత్యానికి బాల సాహిత్యం సంగ్రహ రూపం కాదు మినీ రూపం అంతకంటే కాదు కారాదు. దాని ప్రత్యేకత దానిది.

..............................

9 Encyclopaedia Britanica, Vol. 4. 1978. p 228.

ఐతే బ్రిటానికా ఈ అభిప్రాయాన్ని కొంత వరకు బలపరిచి-బాల సాహిత్యం సాహితీ వాహినిలో ఒక తరంగమే ఐనప్పటికీ ప్రత్యేకంగా గుర్తించ దగిన చరిత్ర కలిగి ఉన్నదనే అభిప్రాయాన్ని వెలిబుచ్చింది.[10] ఇది తెలుగు బాల సాహిత్య పరంగా చూసినా వాస్తవమైన విషయంగా స్ఫురిస్తుంది ఏతా వాతా పరిశీలిస్తే బాల సాహిత్యానికి సిద్ధాంత ప్రాతిపదిక లేదనుకోడానికి వీలులేదు. ఒక అంతర్భూతమైన సిద్ధాంతం ఉంది సామాజిక ప్రయోజనం ఉంది సమ్యక్‌దృక్పథం ఉంది. అంతే గాక ఉన్నత కవితా ప్రమాణాలకు బాల సాహిత్యం దోహదం చేసిందని వాఙ్మయ పరిశోధకులు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు అంటారు. "ఉన్నత కవితా వాహినికి బాల వాఙ్మయం ఆయుపట్టని చెప్పవచ్చు బాలభాషలో సహజముగా అంకుర ప్రాయ ముగా కన్పట్టు కవితా గుణాలే ప్రౌఢ భాషలో సంస్కృతములై బలుపొందుచున్న"వన్నారు దీనినే బి. వి. నరసింహారావుగారు బాల వాఙ్మయంలో అంకుర ప్రాయంగా కానవచ్చిన కవితా లక్షణాలే ప్రౌఢ రచనల్లో అసలు కొనలుగా అల్లుకొనివ్యాపిస్తాయి. సరళాక్షర సంపద, యతిప్రాసల పొందిక, లయగతి ఆంధ్రకవితకు అవతారంనాడే అమరివున్న సత్యం ఈ బాల వాఙ్మయం ప్రస్ఫుటం చేస్తుంది"[12] అని బలపరి చారు

## బాల సాహితీవేత్తల భావన

కమ్మని సౌరభాలను వెదజల్లే బాలసాహితీ మల్లెల మాలకు బాలసాహిత్యవేత్త లెందరో సుమ సౌరభాలు తరిగిపోకుండా చేశారు. బాలసాహిత్యాన్ని గురించి తమఅనుభవంతో వివిధ వ్యాసాలలో ప్రసంగాలలో నిర్వచనం చేసినవారిలో-బాల వాఙ్మయ బ్రహ్మ చింతా దీక్షితులు (1891-1960), ఆంధ్రప్రదేశ్ ఆస్థాన కవి డాక్టరు దాశరథి (1927-), రేడియో అన్నయ్య న్యాయపతి రాఘవరావు (1905-), ఏడిద కామే శ్వరరావు (1913-), డాక్టరు మిరియాల రామకృష్ణ (1934-), నార్ల చిరంజీవి (1925-1930), సమతారావు (1927-), మద్దులూరి రామకృష్ణ (1919-), బి. వి. నరసింహారావు (1913-), అలపర్తి వెంకటసుబ్బారావు (1934-) ఎ.

..............................

10 Encyclopaedia Britanica Vol. 4. 1978 p 228

11 ప్రభాకరశాస్త్రి, వేటూరి (సంపా) బాలభాష. 1956. 10 పు

12 నరసింహారావు, బి. వి. బాలవాఙ్మయం హైదరాబాదు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ. 1975. 1 పు

లక్ష్మీరమణ, డాక్టర్ యం.కె. దేవకి, (1951-) మెంచా ప్రభాకర్ (1932-), ప్రభృతులు ముఖ్యులు.

బాల సాహితీ పరిధి

చింతా దీక్షితులుగారు బాల సాహిత్య పరిధిని వివరిస్తూ "శిశువు జన్మించినది మొదలు బాల్యదశ వీడేవరకు కూడా వానిమనసుకు రంజకంగా ఉండేది బాల వాఙ్మయం"[13] అని చెబుతారు బాల సాహిత్యం పిల్లలను ఆనందింపజేయ గలదిగా ఉండాలని చెబుతారు ఈ నిర్ణయానికి చేరువగా ఎ. లక్ష్మీరమణగారు "బాల్యం నుంచి పదు నాలుగు సంవత్సరాల ప్రాయం వరకు వారికనువైన సాహిత్యం బాల సాహిత్యమని చెప్పుకోవచ్చునని"[14] వయోపరిమితుల నియతిని సూచించారు ఈ విషయాన్నే ఒక అమెరికన్ విజ్ఞాన సర్వస్వం ఇలా చెబుతుంది "బాల సాహిత్యం అంటే పాఠ శాలలకు వెళ్ళిన దశనుంచి యుక్తవయస్సు వచ్చేవరకు చదివె అపారమైన సాహిత్యం బాలసాహిత్యం."[15] ప్రధానంగా బాలలకు ఉపయోగించేది మాత్రమే బాల సాహిత్యంగా పరిగణించబడుతుంది

ఈ దృక్పథంలో పయనించిన డాక్టర్ యం. కె. దేవకి-"బాలల శ్రవణ పఠనాదుల నుద్దేశింపబడిన రచనలు బాలసాహిత్యం అది బాలలు నేర్చుకోదగినది లేదా వినదగిన సాహిత్యం...వయోజనులకు సంబంధించిన ప్రౌఢ సాహిత్యానికి భిన్నమైనది బాల సాహిత్యం;"[16] అని స్పష్టం చేశారు దీనిని బట్టి బాలల దృశ్య, శ్రవ్య, పఠనాదు లలో, వారి వయోపరిమితులను బట్టి ఒక క్రమపద్ధతిలో, ఒక నిర్ణీత ప్రయోజనం కోసం, ఒక సదాశయం కోసం సిద్ధం చేసిన దానిని బాల సాహిత్యం అనచ్చు ఈ విషయంలో స్వతంత్రమైన ఆలోచన చేసిన ఏడిద కామేశ్వరరావుగారు "పాపలను పెద్దలను ఆనందంలో మునకలు వేయించే ఆమాట, ఆపాట, ఆ ఆటల ఆనందం ఎలాటిదో—ఆచందం ఎంతటిదో—మనం ఊహించుకోలేము. అదే, ఆ అంద, చంద ఆనందాలతో మన హృదయాలను, రస ప్రఫుల్లము, ఆనంద పులకితము చేసే అప్పుడు

..............................

13 దీక్షితులు, చింతా. బాల వాఙ్మయం. (ప్రజా వాఙ్మయము-లో) 5 వ పాదసూచివలె- 58 పు

14. లక్ష్మీరమణ, ఎ. బాల సాహిత్యం. (మహతి-లో) సికింద్రాబాదు, యువ భారతి, 1972.

15 Literature for children (In World Book Encyclopaedia) 1973, pp 316-344. Vol. 12.

16 దేవకి, యం. కె. 6వ పాదసూచికవలె.

మధుర వ్యవస్థలో పుట్టినదే బాల సాహిత్యము"[17] అంటారు. బాలల ఆనందం కోసం వారి నుంచి ఉద్భవించిందే బాల సాహిత్యం అంటారు ఏడిద వారు పైగా ఈ సాహిత్యం బాలలు తమంతట తాము చదువుకొని అర్ధంచేసికొనే శైలిలో రాయబడి ఆకర్షణీయంగా ప్రచురింపబడాలనీ వారి అభిప్రాయం.

బాలసాహిత్యం ఉండవలసిన విధానాన్ని గురించి డాక్టరు దాశరధిగారు నిజమైన బాల సాహిత్యం తియ్యని మామిడి పండులా ఆపాత మధురంగా ఉండాలి భాష సరళంగానూ, లలితంగానూ ఉండాలి చెప్పవలసిన విషయం పండు ఒలిచి చేతిలో పెట్టినట్లుండాలి" [18] బాల సాహిత్య వేత్తలు ఈ మూల సూత్రం పాటించి నంతకాలం బాల వాఙ్మయం బాలలఆదరణ పొందుతుంది డాక్టరు మిరియాల రామకృష్ణ గారు "పిండి ఆరబోసినట్లు హాయిగా కనుపించే వెన్నెల...సముద్రతీరంలో మనవైపు పరుగెత్తుకొచ్చే కెరటాల అల్లరీ ... ఆ నవ్వులు పువ్వులూ, జాలీ, లాలీ, పని పాటా, ఉపకారం, ఉత్సాహం, హాయీ, రేయీ, పాటా-ఆటా, ఆనందం-అందం-ఇవీ బాల సాహిత్యం. అనుభూతికీ, ఆలోచనలకీ బాలల్ని అలవాటుచేసే పుస్తకాల ప్రపంచం-అదీ బాలసాహిత్యం" [19] అంటారు వారు బాలసాహిత్యం లోతులకు వెళ్ళి బాలల స్వభావాన్ని ఛాయా చిత్రంలాగ చూపించారు.

బాల సాహిత్యంలో విశేష పరిశ్రమకు చేసిన అలపర్తి వెంకట సుబ్బారావు గారు "సరాగాల పాటల్లా, సరళమైన మాటల్లో బాలల్ని విజ్ఞాన, వినోదబాటల్లో విహరింపజేసేదే బాల సాహిత్యం అన్నారు. మరో బాల సాహిత్యవేత్త బి. వి నరసింహారావుగారు బాల వాఙ్మయం ఎలా ఉత్పత్తి చెందిందో వివరిస్తూ "ప్రకృతి ప్రధమావస్థ చలనం. బాల ప్రకృతిలో ఆ చలనం అంటే లయ స్పందనం పుష్కలంగా వుంటుంది. ఊహావేశం ఉరకలు పెడుతుంది. లయ స్పందనానికి తోడైనపుడు ఆపువున కవిత్వం అప్రయత్నంగా వెలువడుతుంది సరిగా బాల వాఙ్మయ సృష్టి ఇలాగే జరిగినదని చెప్పారు." [20] ఇది భాషావేత్త లందరూ అంగీకరించిన సత్యం.

..............................

17 కామేశ్వరరావు, ఏడిద. తెలుగువారి బాల సాహిత్యం (ఆంధ్రకేసరి శత జయంతి సంచిక, తో 1974. 436 పు.

18 దాశరధి-ఆంధ్రప్రదేశ్ ఆస్థాన కవి ఇష్టాగోష్టి.. బాల-నవంబరు: 1977.

19 రామకృష్ణ, మిరియాల - బాలసాహిత్యం అంటే ఏమిటి ? హైదరాబాదు, బాలానందం 1974

20 నరసింహారావు, బి. వి. 12 వ పాదసూచికవలె.

## బాల సాహిత్యం ఎందు కోసం ?

బాల సాహిత్యం అంటే పూర్తిగా బాలల కోసమే అనుకోవాల్సిన పనిలేదు. పిల్లల పుస్తకాలను, పత్రికలను పెద్దలు చదివి ఆనందిస్తారు పంచతంత్ర కథలు, తెనాలి రామకృష్ణుని కథలు, ఈసపు నీతి కథలు, జాతక కథలు, జానపద కథలు, రాబిన్‌సన్ కూ్రిసో, టామ్‌సాయర్, డాన్ క్విక్‌సోట్, నశీరుద్దీన్ కథలు పిన్నలకు, పెద్దలకు ఎంతో ఇష్టం. చదువుతూ ఆనందించడం వారికెంతో సరదా ! నచ్చితే ఇట్టే ఆ కథలో లీనమైపోతారు. మరో లోకంలోకి వెళ్లిపోతారు. ఆ సమయంలో వారు "పిచ్చుకలతో పలకగలరు చిలుకతో మాట్లాడగలరు. కోకిలతో పాడగలరు. కీలుగుర్ర మెక్కి ఎగిరి పోగలరు మాయ తివాచీపై కూర్చుని మబ్బులలో మాయమై పోగలరు. సప్తద్వీపాలు దాటి సప్తసముద్రాల మధ్యనున్న ఖరిణిలోని తుమ్మెద పీక నులిమి, రాక్షసుణ్ణి అంతం చేసి, రాకుమార్తెను పరిణయ మాడగలరు' '[21] అపురూపము, అద్భుతమూ, అమాయకమూ, ఆనందమయమూ ఐన వారి మనోవీధులు వర్ణనాతీతాలు. ఉత్తమ బాల సాహిత్యాన్ని పిల్లలు, పెద్దలు ఎంతసేపైనా చదివి ఆనందిస్తారని సోవియట్ విజ్ఞాన సర్వస్వం తెలుపుతున్నది. ఐతే ఈ సాహిత్యం ఎంతవరకు బాలలకు ఉపయోగిస్తున్నది అనేది ఒక ప్రశ్న.

"కావ్యం యశసేర్థ కృతే
వ్యవహార విదే శివేత రక్షతయే
సద్యః పరనిర్వృతయే
కాంతా సమ్మితత యోపదేశయుజే"

అని మమ్మటుడు తన కావ్యప్రకాశమందు-కావ్యం వల్ల యశస్సు, సంపద, వ్యవహారజ్ఞానం, అమంగళ పరిహారం, సమయస్ఫూర్తి, ఉపదేశం కలుగుతాయని చెప్పారు. ఆ తర్వాత ధనంజయుడు, ఆనందవర్ధనుడు మొదలైన అలంకారికులు, నన్నయ, తిక్కనాదికవులు-ఎవరు చెప్పినా మమ్మటుడు చెప్పిందాన్నే తమ మాటలలో చెప్పారు. సాహిత్యంలో భాషా భేదాలు, భావ భేదాలు, శాఖల భేదాలు ప్రయోజనంలో అట్టే తేడాలేదు.

"బాల సాహిత్యపు మూల ధ్యేయం సత్ప్రవర్తన కలిగించడం, వారికి మాతృ

..............................

21 కామేశ్వరరావు, ఏడిద-తెలుగువారి బాలసాహిత్యం (ఆంధ్రకేసరి ప్రకాశం శత జయంతి సంచికలో) 1974. 485 పు.

భూమిని ప్రేమించే ఉత్తమ పౌరులుగా తీర్చిదిద్దడం అంటారు"[22] మద్దులూరి రామకృష్ణగారు. మన ప్రాచీన బాల వాఙ్మయం ప్రధానంగా బాలల వ్యక్తిత్వాన్ని పెంపొందించడానికే తోడ్పడేదే. ఈ విషయాన్ని జాన్ పిట్జ్ రాండోల్ఫ్ అనే అమెరికన్ బాల సాహిత్యవేత్త మరింత విపులంగా చెబుతారు. "బాల సాహిత్యం వైవిధ్యంతో కొనసాగుతూ ఉంటుంది. ప్రేమ, విశ్వాసం, న్యాయం, నిజాయితీ, నిష్కాపట్యం, పూర్తి ధైర్యం, ఆనందం, నిస్వార్థం, మంచి క్రీడాకారునికుండు ఉత్సాహం, ఆత్మ విశ్వాసం, ఆత్మగౌరవం, బాధ్యత— మొదలైన కాలాతీత విలువలుగల సద్గుణాలను బోధించడానికి తోడ్పడుతుంది"[23] ఇది జరిగిన నాడు బాలలలో అసాధారణమైన మార్పు వచ్చి ఉత్తమ పౌరులుగా తీర్చిదిద్దబడతారు. ఐతే బాలల రచనలు ఉత్తమ స్థాయికి చెందినవైతే అవి ఏ భాషకు, ఏ ప్రాంతానికి చెందిన వైనా బాలల మనోభవన కిటికీలు తెరుస్తాయి. హృదయాలను ఊయల లూపుతాయి... పలుకుబడిని నేర్పుతాయి. మాతృభాషాభిమానాన్ని, జాతీయతను రేకెత్తిస్తాయి వినడంలో, చదవడంలో, మాటాడటంలో సిగ్గునీ, సంకోచాన్ని తుడిచివేసి లోనిశక్తిని పైకి చూపిస్తాయి. జిజ్ఞాసను చైతన్యాన్ని వికసింపజేస్తాయి"[24]. అటువంటి స్థాయిగల ఉత్తమ బాల సాహిత్యాన్ని పిల్లలకు అందజేయాలి. అప్పుడే సాహితీపరులు ఉద్దేశించిన ప్రయోజనాలు నెరవేరడానికి అవకాశముంది.

## బాల సాహితీ సృజన

పిల్లలకోసం రచనలు చేయడం చాల కష్టం. రచయితలు పిల్లలతో సన్నిహిత సంబంధం ఏర్పరచుకొన్నపుడే అది సాధ్యమౌతుంది ఐతే బాలల భాష, వారి మనోభావాలు అర్థం చేసుకొంటే అంత సులభమైన రచన మరొకటి ఉండదు "రచయితకు విషయం క్షుణ్ణంగా తెలిసివుండి, చదువరులకు చేరువగా ఉండేందుకు వారితో సత్వర

..............................

22 Rama krishna, Madduluri. Books for Children (In Memento) Trivendrum Kerala Bala Sahithya Parishat 1979 P 84

23 Fitze-Randolph, Jane. writing for the Juvenile and Teenage Market, Newyork, Funk& Wagnalls. 1969

24 రామకృష్ణ మిరియాల బాల సాహిత్యం అంటే ఏమిటి?
(అఖిల భారత తెలుగు బాలల మహోత్సవాల ప్రత్యేక సంచిక- లో) 1974 51 పు.

**సంబంధం** ముందో వెనకో ఏర్పరచుకోక తప్పదు కనుక బాల సాహిత్య విషయంలో రచయితకు విస్తృతమైన విషయ పరిచయం కావాలని"[25] ఎ. ఎస్. రామన్ తెలియ జేస్తున్నారు. విషయం మీద, భాషమీద, బాలల మనః ప్రవృత్తుల మీద అధికారం లేకపోతే రచయిత సరైన రచనలు చేయలేడు – అనేది స్పష్టం.

రచయితలో ఉండవలసిన దృక్పథాన్ని గురించి సమతారావుగారు బాలసాహిత్యం "పిల్లల స్థాయిని దృష్టిలో ఉంచుకొని వారి మనస్సులలో హేతుయుక్తమైన, విప్లవాత్మకమైన నీతి సూత్రాలను, సమతాభావాలను, విశాల మానవతాభావాలను ప్రోది చేయాలని"[26] భావిస్తున్నారు. ఈ ఆలోచనలో భేదాభిప్రాయం లేదు బాల్యంలో పిల్లలకు వేమన పద్యాలు చదివించడం ఈ దృష్టితోనే ఇదే ఆలోచనా సరళి కలిగిన నార్ల చిరంజీవిగారు "పిల్లల వయసుతోబాటు, ఊహాశక్తితోబాటు, హేతువాదం విస్తరిస్తుంది అందుకు తగినట్లే మన రచనలు ఉండాలి వారిలో కల్పనా శక్తిని పెంపొందించే రచనల్లో హేతుదృష్టి సమపాళ్ల లో కొరవడకుండా పొందు పరచక తప్పదు కల్పన, హేతుత్వం సమ్మిళితం చేసినప్పుడే బాల సాహిత్యం పరిపుష్టి చెందుతుంది."[27] అని స్పష్టపరిచారు. మరోమెట్టు ముందుకు వెళ్ళిన మెండా ప్రభాకర్‌గారు పైఅంశాలకు తోడు "బాలల్లో బుద్ధి వికాసానికి, జ్ఞాన సము పార్జనకు, సాంఘిక, నైతిక ధర్మాలు తెలిసిన ఉత్తమ పౌరులుగా తీర్చిదిద్దే విధంగా"[28] బాల సాహిత్యం ఉండాలని చెబుతారు నీతిబోధకు బాల సాహిత్యంలో ఉండే ప్రాధా న్యం పెద్దయ్యాకగాని తెలిసిరాదు

ఈనాడు బాల సాహిత్యం అపారంగా వెలువడు తున్నది రాసిలో ఎక్కు వగా ఉన్నా, వాసిలో తక్కువని అంగీకరించక తప్పదు. ప్రచురణకర్తల ప్రోత్సా హం సరిగా లేదని రచయితలు చెబుతారు. ప్రతులు చెల్లే అవకాశాలు సరిగా లేవని ప్రచురణకర్తలు చెబుతారు సరైన పుస్తకాలుంటే ఎంత వెలపెట్టినా కొంటాం అంటారు పాఠకులు. ఇది విషవలయం. దాన్ని పరిష్కరించవలసింది ప్రభుత్వమూ – ప్రజలే ఐతే రచయితల బాధ్యత అంటూ ఒకటి ఉంది. ఆ బాధ్యతను వారు హృదయ గతంగా స్వీకరిస్తే ఉత్తమ రచనలు రాకపోవు తెలుగులో, ప్రాంతీయ భాషలలో,

..............................

25 Raman A.S. Calling all Children. Sunday Sept. 11, 1977.

26 సమతారావు, బాల సాహిత్యం (వ్రాతప్రతి) 1967

27 నార్లచిరంజీవి, బాల సాహిత్యం అభ్యుదయ, జూలై, 1955. 169 పు

28 ప్రభాకర్, మెండా, బాల సాహిత్యం, రచన, వ్రాతప్రతి

ఇతర భాషలలో నిలచినవి అలా - హృదయాంతరాళాల్లో నుంచి పెల్లుబికినవే. మొత్తం మీద మంచి రచనలు తక్కువనేది అంగీకరించవలసిన సత్యం ఆస్వాల్డ్ బాస్టబుల్ అనే బ్రిటిష్ రచయిత ఇలా అంటారు "పిల్లల కోసం రచనలు చేసేవారు "మరి కాస్త" తెలుసుకుంటే మంచిదని" [29] ఈ విషయాన్ని ప్రతి రచయితా పాటిస్తే ఉత్తమ రచనలు రాకపోవు. బోస్టబుల్ సూక్తి ఆంగ్ల భాషకే పరిమితంగాదు. ఏ భాషకైనా చెందుతుంది. సాహిత్య విలువలను ప్రతిష్ఠించడంలో భాషాభేదాలు అడ్డురావు. రాకూడదు.

...........................

29 Oswald Bastable. Writing for children, London, Earnod, 1969. 11. p.

# జానపద బాలసాహితి

తొలి కవితకు దోహదాలు - బుజ్జగింపు పాటలు పండుగ పాటలు -
ఆటల పాటలు - పిల్లల రచనలు పదాలు - పొడుపు కథలు

## తొలి కవితకు దోహదాలు

తెలుగు పిల్లల తొలి పాటలు ఏనాటివి? ఇదమిత్థంగా చెప్పలేము. కర్తలెవరో తెలియదు బిడ్డల మనసెరిగిన తల్లులు, తల్లి ప్రేమకు పాత్రమైన బిడ్డలు తొలి కవులుగా రచయిత లుగా పరిగణింపబడుతున్నారు. దీన్ని బలపరుస్తు చింతా దీక్షితులు (1891-1960) గారు "బాల వాఙ్మయంలోని చాల పాటలకు కథలకు తల్లి హృదయమే కర్తృత్వం వహిస్తుంది."[1] అన్నారు. దీనిలో వాస్తవం ఎంతో ఉంది "తీయని పెదవులతో బిడ్డని మనసారా స్పృశిస్తుంది తల్లి బిడ్డ కళ్ళనిండా తల్లిమొగమే కనిపిస్తుంది...ఆ మధుర హృదయం నుంచి ఏవో పిలుపులు, గుసగుసలు మాటలుగా పాటలుగా పొంగాయి... తల్లి బిడ్డల మధ్య ఆ నిముషంలో కాలాన్ని స్థంభింపచేసిన ఆ నిముషంలో, ప్రాణ కాంతిని ఒక బిందువుగా కేంద్రీకరించిన ఆ నిముషంలో వెలువడిందే బాల సాహిత్యా నికి ఆలంబనం ఆమాటలే, పాటలే ఏనాటికీ చెరగని తరగని మధుర నిధులు'[2] అం టారు నార్ల చిరంజీవి కనుకనే వాల్మీకి ఆదికావ్యానికి నాంది విషాదం ఐతే – బాల సాహిత్యానికి నాంది తల్లి నిండు హృదయం. బిడ్డ చెక్కిళ్ళపై మెరసిన ఆనందం కిళ్ళల్లో నిండిన సంతోషం ఇవి తొలినాటి బాల సాహిత్యానికి దోహదాలు

## కవితకు అనుకూల వాతావరణం

మన తొలి జానపద సాహిత్యోద్ధారకులు టేకుమళ్ళ అచ్యుతరావు (1880–1947) గారు "ప్రపంచంలో యేయే దేశపు వాఙ్మయము పరిశీలించినను ప్రథమమున పదములు పాటలు మాత్రమే కనిపించుచున్నవి. ఇవియే వాఙ్మయ వాహినిని పోషించే సెల యేళ్ళు"[3] అని రాసిన దానిలో ఎంతో సత్యం ఉంది. తెలుగు దేశంలోని తొలి సాహిత్యం అంతా అలాగే ఉంది బిడ్డల ఆలన, పాలన, లాలన ఆనాటి కవితా వస్తు వులు. వినోద వేళలు, పండుగలు, పబ్బాలు, తిరునాళ్ళు, జాతరలు, ఆచారాలు ఆనాటి సాహిత్యానికి రంగ స్థలాలు. ఆనాటి జానపద కవుల వాక్కు అసంస్కృతము. సహజము. వారి కవిత్వంలో జానుతెనుగు పాలు తక్కువ. కవితాధారి వారి సొమ్ము.[4]

..............................

1 దీక్షితులు, చింతా బాలవాఙ్మయము (ప్రజావాఙ్మయం-లో) విజయవాడ, విశాలాంధ్ర, 1955. 68 పు.

2 చిరంజీవి, నార్ల మన బాలసాహిత్యం-అభ్యుదయ. జూలై 1955. 156 పు.

3 అచ్యుతరావు, టేకుమళ్ళ, ఆంధ్ర పదములు-పాటలు, 1934. 43 పు

4 ఆదిశేషువు, హరి. జానపదగేయ వాఙ్మయ పరిచయము, గుంటూరు, నవ్య విజ్ఞాన ప్రచు రణలు, 1967, 1 పు.

కనుక జానపదులను వాచస్పత్యకారుడు -కృతప్రజ్ఞశ్చ మేధావీ, బుధో, జానపదశ్శుచిః అని యజ్ఞం చేసినవారితో పండితులతో సమానంచేసి పవిత్రులని -ప్రశంసించాడు అటువంటి రస హృదయులైన వారినుంచీ, నారీమణుల నుంచి వెలువడిన సాహిత్యం ఆపాత మధురంగా ఉంటుంది సెలయేరులా గలగల జాలువారుతుంది. మృదుమధురంగా, స్వచ్ఛంగా నిసర్గమనోహరంగా ఉంటుంది ఆనందమే ప్రధానంగా. వినోదమె ఉపాధేయంగా వెలుగొందుతుంది. సురచిరమైన తెలుగు నుడి కారపు నడకతో, వడివడిగా పరుగిడుతుంది ఈ సాహిత్యంలోని పాత్రలు నిత్యం మన కనుసన్నలలో మెలగే తల్లులు, తండ్రులు, తమ్ములు, చెల్లాయిలు, అక్కలు, బావలు, అన్నలు, వదినెలు. కాబట్టి ఈ బాంధవ్య బంధాలు ఉన్నంతకాలం తొలి తెలుగు పిల్లల పాటలైన – తొలి కాపు నిలుస్తుంది. అవధులకు, విధులకు అతీతంగా మసలుతుంది ఆచంద్ర తారార్కం వెలుగుతుంది

తెలుగు వారిని గురించి హరీంద్రనాథ్ చటోపాధ్యాయ అన్నారు "వీరూ వారూ అనే తేడా లేకుండా తెలుగు వారిని కదిలించామంటే కవితా రసం చిందుతుంది అది ఈనాడే కాదు-ప్రాచీన కాలం నుంచే ఆగౌరవం వారికి దక్కుతుంది" కనుక "ముఖే ముఖే సరస్వతీ" అన్న నానుడి మనకు చెందుతుంది. దానికి సాక్ష్యంగా తెలుగు దేశంలో వేల సంఖ్యలో గేయాలు, ఇతర రచనలు – నన్నయ్య, తిక్కనల మాట – అలా ఉంచి జానపదుల నుంచి రావడం విశేషం కాదా !

## జానపదు లంటే ?

తరతరాలుగా అనాదృతమైన ఈ సాహిత్యం కర్తల, పరిశోధకుల చేతిలో పడిన తర్వాత – జానపద సాహిత్యమనీ, ప్రజావాఙ్మయమనీ, దేశి రచనలనీ, ఆశురచనలనీ అనేక పేర్లతో పిలువబడుతుంది. ఐతే జానపద సాహిత్యమనేదే రూఢిలో నిలచి పోయింది జనపదం అంటే ఒకప్పుడు కేవలం పల్లెటూరు అనే అర్థంలో వాడారు జానపద సాహిత్యం అంటే పల్లెటూరి ప్రజలు పాడుకొనే లేదా చెప్పుకొనే సాహిత్యం అనే భావన ప్రచారంలో ఉంది. అది పూర్తి గా నిజంకాదు ప్రసిద్ధ జానపద సాహిత్య వేత్త అలన్ డన్‌డెస్ తన స్టడీ ఆఫ్ ఫోక్‌లోర్ అన్నగ్రంథంలో "... any group of people what so ever who share at common factor" అన్నాడు. జానపదులంటే ఏదైనా ఒక విషయంలోనైనా భావ సామ్యం కలిగిన జన సముదాయం అని వారి భావన. వారు ఆటవికులు కావచ్చు. పల్లీయులు కావచ్చు చివరకు నగర వాసులైనా కావచ్చు.[5] వారు వీరనక అందరిలో జానపదులున్నారనేది సారాంశం

.........................

5 సుందరం ఆర్వీయస్. జనపదం - జానపదం జానపద విజ్ఞానం జానపదం త్రైమాస పత్రిక మార్చి 1980. 2పు

పైన వివరించిన కొందరి సంకలనాలలో పెద్దల పాటలు కూడ లేకపోలేదు. ఇవన్నీ ముద్రణ రూపంలోకి వస్తే అవి బాలభారతికి సహజ సుందరమైన అలంకారాలు కాగల వనడంలో సందేహంలేదు.

## స్వరూప స్వభావాలు

సాహిత్య విమర్శకులు పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి (1890 - 1951) గారి అంచనా ప్రకారం "జానపద సాహిత్యం అంతు లేక యున్నది. విభాగాలు అనంతంగా ఉన్నవి సారం ఇసుక పాతరవోలె, నీటి చెలమలవలె తోడిపోయుచున్నకొలది యెడ తెగక ఉబుకుచుండును."[8] అని చెబుతూ దీనిని సమగ్రంగా పరిశీలించ వలసినదిగా ఏనాడో మనవి చేశారు జానపద వాఙ్మయోద్ధారకులు నేదునూరి గంగాధరం (1911-1970) గారు - "కళామధురిమకు కాణాచియైన త్రిలింగ ధాత్రిలో ఈ జీవభాష తీయని భాష మిసిమిమీగడదేరు నుడికారము, వయార మొలుకు సూక్తులు, సూక్తులలో యుక్తులు యుక్తులలో మకరందమూ చిందులాడు మాటలు కలిగి తెలుగు భాషామ తల్లి రస వాహినియై పొంగి పొరలినదని[9] వివరించారు స్వరూపాన్ని కొంతవరకు చవి చూపారు. వెటూరి ప్రభాకరశాస్త్రి (1888 - 1950) గారు ఈ ముగ్ధ మధుర వాఙ్మయం హృద్యవచోవల్లరులమయ[10] మన్నారు

డాక్టరు బిరుదురాజు రామరాజుగారు తెలుగు జానపద గేయ సాహిత్యము అనే సిద్ధాంత వ్యాసంలో జానపద గేయ సాహిత్య స్వరూపాన్ని గురించి ఈ విధంగా ప్రస్తావన చేశారు[11] ఈ సాహిత్యానికి-

1 ప్రత్యేకమైన కవి ఉండడు
2 రచనాకాలం తెలియదు
3 నియమిత స్వరూపం లేదు
4 మౌఖిక ప్రచారం ద్వారానే జీవితం

..............................

8 ఆదినారాయణశాస్త్రి, పంచాగ్నుల. తిరస్కృతాంధ్ర వాఙ్మయము గృహలక్ష్మి. అక్టోబరు 1930 593 పు

9 గంగాధరం, నేదునూరి. జానపదగేయ వాఙ్మయ వ్యాసావళి. 1961 99 పు

10 ప్రభాకరశాస్త్రి, వేటూరి, బాలబాష - పీఠిక, 1956

11 రామరాజు, బి. తెలుగు జానపద గేయ సాహిత్యము, హైదరాబాదు, 1978 16-21 పు

5 సహజ శైలి కలదు
6 పాడుకొనుటకు వీలు
7 వస్తువు జన సామాన్య పరిచితం...

పైన వివరించిన లక్షణా లుంటాయని వివరించారు

డాక్టరు వేల్చేరు నారాయణరావు (1932-) గారు తమ పరిశోధనా వ్యాసంలో మరికొన్ని లక్షణాలను ఊహించారు[12]

1 ఒక పాదం ఒక మూర్తి (యూనిట్)
2 పాద నిర్మాణంలో పడికట్టు పద్ధతి
3 పునరుక్తి (రిఫ్రెయిన్)
4 పాత్రోచిత సంభాషణ లేకపోవడం
5 కథ కొత్తది కాకపోవడం

చాంబర్స్ ఎన్‌సైక్లోపీడియా—

"అజ్ఞాత కర్తృత్వం, సామూహిక ప్రచారం, మౌఖిక సంప్రదాయం ప్రాచుర్యం, సారళ్యం అనేక మనస్సుల నాకర్షించి సంపాదించిన జాతీయత" ఈ గేయ లక్షణాలని వివరించింది ఈ మూడు సూచికలలో వివరించిన లక్షణాలలో సమాన లక్షణాలు కొన్ని ఉన్నా - వీటి సమ్మేళనం జానపద సాహిత్య లక్షణాలను తెలుపుతాయి అవే పిల్లల జానపద సాహిత్యానికి చేరువగా ఉంటాయి

## బాలగేయ స్రవంతి :

జానపద గేయ స్రవంతిలో బాల గేయాల సంఖ్య తక్కువ గాదు అచ్చయినవి వందల సంఖ్యలోనూ, అచ్చుగాక మౌఖికంగా ప్రచారమౌతున్నవి, మరుగుపడి పోయినవి వెల సంఖ్యలో ఉంటాయి ఈ గేయాలు కఠిన పదజాలాన్ని, కావ్యాలంకారాలనీ, అసహజ పాండిత్యనీ ఎరువు తెచ్చుకోక, హృదయంలో నుంచి వచ్చే ప్రేమకు, అందానికి రంగులు పూయక స్వచ్ఛంగా సూటిగా పాడిన పాటలు.

డాక్టరు యస్వీ జోగారావు (1928-) గారు జానపద గేయాలు "తత్కవి హృదయ మధుపములై తక్కిన ప్రజలకు తరతరాల వారికీ నిసర్గ మనోజ్ఞములై గాన కళతో మేళవించి, ఆ మధుమాధురులు చూరలిచ్చినవి"[13] అన్నారు ఈ గేయాలు చారిత్రక ప్రాధాన్యంతో, శాస్త్రీయ విషయాలతో, సాహిత్య విలువలతో అపూర్వ విస్తృతి, విన్నాణము సంతరించుకున్నాయి. వైవిధ్యం ఏర్పరచు కున్నాయి. ఈ

..............................

12 నారాయణరావు, వేల్చేరు తెలుగు కవితావిప్లవాల స్వరూపం 1978 7-15 పు

13 జోగారావు, యస్వీ. నేదునూరి గంగాధరంగారి జానపదగేయ వాఙ్మయ వ్యాసావళికి పీఠిక. 1950 2 పు.

ఉగ్గు పాటలు

వీటినే పాల పాటలు అని గూడ అంటారు. లాలి పాటలు కూడ కొంతవరకు ఈ కోవకు చెందినవె ఆరోగ్య విషయంలో అలాఉండి ఉగ్గుపట్టడం తల్లి అలవాటు ఉగ్గు పాటలు తల్లి సంప్రదాయం. ఉగ్గుపడుతూ తల్లి, బిడ్డను ఆశీర్వదిస్తుంది బిడ్డ పెరుగుదలను ఆశిస్తుంది.

ఊఁ ఊఁ ఉంగన్న
ఉగ్గుపాలు ఇందన్న
గంటెడుఉగ్గు కమ్మన్న
ఉమ్మక కక్కక మింగన్న — అంటూ
జీర్ణం జీర్ణం వాతాపి జీర్ణం
గుర్రాల్ దిన్న గుగ్గిళ్ళరిగి
ఏనుగుల్ దిన్న వెలక్కాయలంగ—

అబ్బాయి త్రాగిన పాలు అముదం అరగి పోయి పాప ఉల్లాసంగా ఉండాలని ఆశపడుతుంది తల్లి ఈ గేయం పాపకు అర్థంకావాలని కాదు గేయం పాడుతూ తల్లి ఒక అవ్యక్తమైన ఆనందానుభూతి పొందుతుంది. దానినే తల్లి కోరుకొంటుంది.

"రోజురోజుకు పాపాయిలో వచ్చే మార్పు మన సంస్కృతీ స్రవంతిలో మిళితం చేయడానికి ఈ పాలగేయాలు మధురమైన ఆలంబనాలు"[16] అంటారు కవిరావుగారు. ఈ గేయాలలో స్వాధారణంగా రెండే పాత్ర లుంటాయి. తల్లి – బిడ్డ. చిట్టి పొట్టి మాటలతో తల్లి బిడ్డను అలరిస్తుంది. ఇచట భాష భావానికి అతీతంగా ఉరకలు వేస్తుంది. తనకు తెలిసిందల్లా బిడ్డకు తెలియాలనే ఒక అవ్యక్తమైన తపనతో బిడ్డచేయి ఊపుతూ —

చేయి ఊచమ్మ చేయి వూచు
సంతకు పోదాం చేయి వూచు
శనగలు తిందాం చేయి వూచు
చల్లగ తింధాం చేయి వూచు— అంటుంది.

..................................

16. కవిరావు. పాలపాటలు. ఆంధ్ర ప్రదేశ్ బాలల మహాసభ ప్రత్యేక సంచిక, 1977. 222 పు.

ఇలా చేయడం తల్లికి పిల్లకు సరదాయేకాక బిడ్డకు వ్యాయామంకూడ. డాక్టరు రామరాజుగారు అన్ని ప్రాంతాలలో ప్రచారంలో ఉండే ఉగ్గుపాట ప్రయోజనాన్ని ఇలా వివరించారు "తల్లి శిశువును తన తొడలపై కూర్చుండబెట్టి ఒకచేయి బిడ్డ వీపుపైన మరొకచేయి రొమ్ముపైన ఉంచి పాటపాడుచు, ముందు వెనుకల కూపుచు తాను కుడి ఎడమల కూగును శిశువు ఊ ఊ అనుచు వెనుక ముందుల కూగును. దీనివలన శిశువు శరీరమున కంతటికీ కావలసినంత పరిశ్రమ కలుగును. . . .ఊపుతో శరీరమంతట రక్తప్రసారము జరుగునటులే ఈ పాటయందలి "గంగెద్దా'' యను అంత్యప్రాసలు లయను, రక్తము వెనువెంట శరీరమంతటను ప్రాకించును. ఈ పరిశ్రమ వలన త్రావిన పాలు జీర్ణమౌతాయి ఈ పాటగూడ–[17]

ఊగూ ఊగూ గంగెద్దా, ఉగ్గూపాలే గంగెద్దా
సోలీ ఊగే గంగెద్దా, సోలెడు పాలే గంగెద్దా
తాళీ ఊగే గంగెద్దా, తవ్వెడు పాలే గంగెద్దా
మానీ ఊగే గంగెద్దా, మానెడు పాలే గంగెద్దా
అగీ ఊగే గంగెద్దా, అడ్డెడు పాలే గంగెద్దా

అని సాగిపోతుంది. బిడ్డలో ఉత్సాహం రావడానికి ఆ తల్లి గిలిగింతలు పెడుతుంది. పెద్ద కొంత ఎదిగాక గోరుముద్దలు, గొలుసు ముద్దలు తినిపిస్తూ చందమామ ముచ్చట్లు చెబుతూ——

చందమామ రావె జాబిల్లిరావె
కొండెక్కిరావె గోగుపూలు తేవే
ఒలవని పండు ఒళ్లో ఉంచుకుని
ఒల్చిన పండు చేత బుచ్చుకొని
వెండిగిన్నెలో వెన్నపట్టుకొని
పమిడిగిన్నెలో పాలు పోసుకొని
అమ్మా, నువ్వూ తిందువుగాని
అట్టా అట్టా రావె

..........................

17 రామరాజు, బి. తెలంగాణా పిల్లల పల్లెపాటలు. సికింద్రాబాదు, చందా నారాయణ శ్రేష్ఠి, 1960

అని పాడుతూ మారాము చేస్తున్న బిడ్డకు గోరు ముద్దలు తినిపిస్తుంది తల్లి ఇలా చేయడం ఈ నాటికి తెలుగు తల్లికి సరదా తన కనుసన్నలలో పెరిగిన బిడ్డలో వ్యక్తిత్వం తనంత తానే రూపొందుతుంది ఆలోచన పెరుగుతుంది ఊహలు ఊగిస లాడతాయి బిడ్డ తానే ఒక కవి అవుతాడు గాయకు డౌతాడు పాటలు కడతాడు. పాడుతాడు. ఆనందిస్తాడు.

ఉడుతా ఉడుతా హూత్
నూకలు పెడతా మేకలు కాస్తావ్
పెద్దపులొస్తే జడవవుకా....
విద్దెం వెద్దెం పీసెడు నెయ్యి
విద్దెం చేస్తే గిద్దెడు నెయ్యి....
ఊగూ ఊగూ బసవన్నా
ఉలవలు తింటూవా బసవన్న....

ఇలా కొల్లలుగా పిల్లలు పాడతారు. ఇది తెలుగు పిల్లల ప్రత్యేక ప్రవృత్తి తెలుగు బాల జానపద గేయాల తరగని సంపద.

## జోల పాటలు

వీటిని దాదిపాటలు అని కూడ అంటారు. జోలపాటలు తెలుగు తల్లికి ప్రత్యేకత ఈ పాటలలోనే తల్లి బిడ్డకు అన్ని విషయాలు చెబుతుంది తల్లి హృదయానికి దర్పణంగా ముగ్ధ మనోహరంగా జోలపాటలు ఉంటాయి ప్రధానంగా ఇవి తల్లుల రచనలు తరతరాలుగా ఆనోట ఆనోట పాడబడడం చేత మార్పులకు చేర్పులకు గురి అయ్యాయి. తల్లి తన ముద్దుల బిడ్డను దేవతలు ఆశీర్వదించాలని వేడుకుంటూ –

శ్రీరమ్య దేహలాలీ ! మా ముద్దా చిన్నారి కూనలాలీ
గారాలకూచిలాలీ! మాయప్ప కంజాత నయన లాలీ!
సకల లోకధారుడూ – మునిమనో జలజాత సంచారుడు
అకలంక గుణపూజారుడు మమ్మ్రోచు ఆర్యామనోహారుడూ
దేవేశుడా విధాత నీకు తా దీర్ఘాయు వొసగుగాత....

అని కోరుకుంటుంది అయితే ఇది పిల్లల కోసం రాసిన పాటకాదని కృష్ణశ్రీగారి అభిప్రాయం.[18] ఇదే అభిప్రాయాన్ని ఆర్వీయస్ సుందరంగారు తమ సిద్ధాంత వ్యాసంలో కూడ వెలిబుచ్చారు.[19] ఐనా ఇది పిల్లల పాటగానే చెలామణి అవుతున్నది.

తల్లికి బిడ్డను జోకొట్టి, జోలపాడి నిద్రపుచ్చి-తాను ఆనందించడమనేది ఒక చర్య మాత్రమే గాదు. అవ్యక్తానందాన్నిచ్చే మధురాతి మధురమైన దివ్యానుభూతి. మాటలకు, ఆలోచనలకు అందనిది.

తెలుగు జోలపాటల్లో తాళ్లపాక అన్నమయ్యగారి రచన 'జో అచ్యుతానంద జోజో ముకుంద'' చాల ప్రసిద్ధమైనది. పల్లెలలో, పట్నాలలో ప్రతి గృహంలో ప్రాచుర్యం పొందింది. ఆ బిడ్డ తల్లికి కేవలం బిడ్డ మాత్రమే గాక, అచ్యుతమైన ఆనంద సంధాయకమైన ముకుందుడుగా కనుపిస్తాడు తల్లి అలా ఊహిస్తుంది ఆ తల్లి ఊహలన్నీ అమృతధారలుగా, రసవద్గంగలా ఆశువుగా ఆమె నోటి నుంచి పాటలుగా జాలువారడం మనం చూస్తుంటాము.

తొలుత బ్రహ్మాండ-బు తొట్టెగావించీ
నాలుగు వేదాలు గొలుసు లమరించీ
బలువైన ఫణిరాజు పాన్పు సవరించీ

అని పాడుతూ-తన బిడ్డను సాక్షాత్తూ బాలకృష్ణుడుగా భావించి -

లాలను పాడరమ్మా ఈ బిడ్డ, లక్ష్మీవిలాసుడమ్మా
పాదమున చక్రమమ్మా ఈబిడ్డ, వేదాంత వేద్యుడమ్మా
వేణునాదంబుతోను ఈబిడ్డ, వేదాంత వేద్యుడమ్మా
వేణునాదంబుతోను ఈబిడ్డ, వేదములు పాడునమ్మా

అని గొప్పగా అవ్యక్తానందంతో ఊహించుకుంటుంది- ఆ అమాయకపు తల్లి.

తల్లి మరొకసారి తనగారాబు బిడ్డను సాక్షాత్తూ శ్రీరామచంద్రునిగా భావించి జోలపాట పాడుతూ తన ఊహలను వ్యక్తంచేస్తుంది.

..........................

18 కృష్ణశ్రీ. దేశి సాకస్వతము-బాలగేయాలు. ఆంధ్రపత్రిక విజయ ఉగాది సంచిక, 1953-54 97 పు

19 సుందరం, ఆర్వీయస్-పిల్లల పాటలు, తెలుగు కన్నడ జానపదగేయాలు, మైసూరు, 1979. 138 పు

జోజో దశరథరాజు కుమారా
కౌసల్య వరపుత్ర కరుణా కటాక్ష
రఘుకుల భూషణ రాజపూజితుడా
సీతాంగ నా పతి శ్రీరామచంద్రా

ఈ విధంగా తెలుగు తల్లులు పాడే జోలపాటలో తెలుగు సంస్కృతీ ఛాయలు వెల్లుబుకుతూ ఉంటాయి అందలి మధురిమలు సుధా బిందువులుగా పసికందులపై వర్షించి, వారికి ఆనందాన్నిచ్చి హాయిగా నిద్రబుచ్చుతాయని కొత్త జీవితాన్ని ప్రసాదించుతాయని మనవారి నమ్మకం.

లాలిపాటలు

వీటిని ముద్దు పాటలు అనీ, ఇంగ్లీషులో లల్లబీస్ అనీ అంటారు. బిడ్డకు వయసు వచ్చాక ఏడుస్తున్నప్పుడు మాన్పించడం కష్టమౌతుంది. ఆ సమయంలో తల్లి బిడ్డను లాలిస్తుంది. ముద్దిడుతుంది. బెదిరిస్తుంది. దడిపిస్తుంది. బుజ్జగిస్తుంది బిడ్డ ఏడుపు మానదు.

పిట్టరావె పిట్టపిల్లలకు తల్లి
పిల్లలకు పాలిచ్చి పల్లెలకు పోవె
పల్లెలకు పోయొచ్చి బుట్టల్లు కోవె

అని పాడుతుంది తల్లి. కాని అప్పటికీ బిడ్డ ఏడుపు మానదు. పసిపాప కన్నీరు చూసి మాతృహృదయం ద్రవించి పోతుంది. ఆ స్థితిని భరించలేక తల్లి –

ఏడవకు ఏడవకు వెర్రి నాగన్న
ఏడిస్తే నీకనులు నీలాలు గారు
నీలాలుగారితే నేచూడలేను
పాలైనగారవే బంగారు కనుల

అని ఆశగా బాధపడుతుంది అప్పటికీ ఒకోసారి బిడ్డను ఓదార్చడం సాధ్యంకాదు. గుక్కపెట్టి ఏడుస్తుంది తల్లికి అశక్తత కనిపిస్తుంది. ఆ సమయంలో దగ్గరున్న తండ్రి తల్లి అమాయకత్వాన్ని ఇలా చమత్కరిస్తాడు –

ఊడుగు చెట్టుకు ఉయ్యాల గట్టి
ఊగుమని మీయమ్మ ఊళ్ళోకి పోయె

పందికొక్కు రావె పాలిచ్చిపోవె
ఉడుతమ్మ నువు రావె ఊకుంచిపోవె
ఎలుకమ్మ నువు రావె ఎత్తుకొనిపోవె

ఈ పాటకు తల్లి తనలో తాను నవ్వుకుంటుంది. జోలపాటలలోవలె, లాలిపాటలలో తల్లి బిడ్డలలో శ్రీ మహావిష్ణువు అంశనే చూస్తూ, ఆనందిస్తూ పాట ఎత్తుకుంటుంది

చిన్నారి గంటల్లు మూగి మూగల్లు
పన్నగశయనుడే శేషశయనుడు
పందిళ్ళ నాడుకొని పాలు తాగిపండు

అనే తల్లి ప్రవృత్తి విచిత్రమైనది. బిడ్డ తన మేనమామ అంత గొప్పవాడు కావాలని ఉప్పొంగిపోతూ, పరోక్షంగా తన పుట్టింటివారి గొప్పదనాన్ని, అన్నల గొప్పదనాన్ని చెప్పుకొని మురిసి పోతుంది.

స్వాతి వానలు గురిసె సంద్రంబు కడనూ
చిట్టి ముత్యం బుట్టె సీతకడుపునా
అందరీ మామలు చందమామల్లు
నాయన్న మామల్లు రామలక్ష్మణులూ
పాలు తాగేనాడు పారాడె నాడు
పాడియావు నంపించు నీకు నీమామ

అంటూ మేనమామల ఉదారత్వాన్ని కొనియాడుతుంది పుట్టింటివారంటే తల్లికి అపారమైన అభిమానం. ఇలా లాలిపాటలు సాగుతూ ఉంటాయి ఈ పాటలు తల్లి ఊహాలే. బిడ్డకు అర్థంచేసుకొనే శక్తి ఉండదు. తల్లి కమ్మని గొంతులోని మధుర స్వనాలు, ఆప్యాయత లాలిత్యం, మాత్రం బిడ్డ అర్థం చేసుకోవచ్చు. బిడ్డ మంత్ర ముగ్ధ ఔతుంది. అదే లాలి పాటలోని విశిష్టత.

బిడ్డలను నిద్రపుచ్చడం ఈ పాటల ప్రధానలక్ష్యం. పాటల చరణం చివర దీర్ఘం తీయడం కనిపిస్తుంది. "ఉశశశశవ హాయీ" అని దీర్ఘంతీస్తూ, "హాయీ" అనే పదాన్ని మృదువుగా అవరోహణ స్థాయిలో ఉచ్ఛరించేటప్పుడు బిడ్డకు ఆవులింతలు ప్రారంభమవుతాయి. నిద్ర వస్తుంది తల్లి లక్ష్యం నెరవేరుతుంది. తెలుగు దేశంలో లాలిపాటలు కొల్లలు. ఇందు కసుమరుగైనవి ఇన్నని చెప్పలేము.

## ఊయల పాటలు

తెలుగు నాట ప్రచారంలో ఉండే ఊయల పాటలు రెండు విధాలు. పిల్లలను నిర్భీకులను చేయడానికి తల్లి బిడ్డను రెండు పాదాలమీద కూర్చోబెట్టి, మెల్లగా కాళ్ళను ఊయలలాగ ఊపుతూ, పాట పాడి శిశువుకు ఉత్సాహం కలిగించటం –

ఉయ్యాలోయ్ జంపాలోయ్
కొత్త కొండోయ్ కూమిరెల్లోయ్
ఐలోనాయ్ మల్లన్నోయ్ అల్ల ల్ల ల్ల ల్లా

ఈ గేయంలోని 2, 3 పాదాలలో తెలంగాణా ప్రాంతంలోని ప్రసిద్ధ శైవ క్షేత్రాల పేర్లుగలవని డాక్టరు రామరాజుగారు వ్యాఖ్యానించారు.[20]

నడవలేని వయసులో బిడ్డ ఊయలలో ఉంటుంది ఐందాడే వయసులోనే బిడ్డను ఊయలలో ఉంచరు. ఊయలలో నుంచి క్రిందపడే ప్రమాదం ఉంది ఊయల పాటలలో తల్లి తన ఇష్టదైవాన్ని వివిధరూపాల్లో తలచుకుంటూ, ధ్యానించు కొంటూ పాడుతుంది. "ఉయ్యాలో" అని పల్లవి ప్రతి పాటలో ఉంటుంది.

సురలునసుర మందరా – గిరి తరచి
తరచి మధనము చేయగా
గిరికింద తాకూర్మమై – వెలసినా
సరకు బాడరె వుయ్యాలో

ఇలా సాగుతుంది. ఇవి గాక కృష్ణాష్టమి మొదలైన పండుగల సందర్భంలో పాడే ఉయ్యాల పాటలు వేరే ఉన్నాయి.

## తొక్కు పల్కులు

తెలుగు బాల సాహిత్యంలో ఎదిగిన ఒక విచిత్రమైన ప్రక్రియ 'తొక్కు పల్కులు' మిగతా భారతీయ భాషలలో ఈ విధమైన ప్రక్రియ ఉన్నట్లు కానరాదు. ఈ ప్రక్రియను తొలిసారిగా 'గృహలక్ష్మి' పత్రిక ఆదరించి ప్రోత్సహించినది.[21] ఒక పదం చివర నొక్కి పునరుక్తితో మరోపదం సృష్టించడం ద్వారా తొక్కు పల్కులు

..........................

20 రామరాజు, బి. 11 వత. 12 పు

21 గృహలక్ష్మి (మాసపత్రిక) సెప్టెంబరు 1930. 548 పు.

ఏర్పడతాయి కొత్త పదాలు త్వరగా నేర్చుకోడానికి, పలకడానికి, తద్వారా భాషా జ్ఞానం, విజ్ఞానం పెంచుకోడానికి ఇవి ఎంతగానో ఉపకరిస్తాయి. ఉత్సాహాన్ని కలిగిస్తాయి. ధారణ పెంచుతాయి.

రారా ఏమిరా బండిలు?
ఏమిబండి పెట్టె బండి?
ఏమి పెట్టె చెక్క పెట్టె?
ఏమిచెక్క ? జాజి చెక్క

ఇలా కొండవీటి చాంతాడులా సాగిపోతూ ఉంటుంది. ఆపదలచుకున్నపుడు ఆపవలసిందే గాని అంతం లేదు. ఇంచలి పదాలు దొంతర ప్రత్యేకంగా గమనించదగినది. ఈ ప్రక్రియ బాలసాహిత్యవేత్తలు ప్రచారంలోకి తీసుకు రాలేదు. ఇటీవలి కాలంలో ఇవి కాన రావడం లేదు.

పండుగ పాటలు

పిల్లలంటేనే పండుగ. పిల్ల లుంటేనే పండుగ. వారికి పండుగ లంటే ఎంతో ఇష్టం, ఎంతో ఆనందం, ఉత్సాహం ఉంటాయి. వాస్తవానికి పండుగలు, పబ్బాలు వేడుకలు మన సంప్రదాయానికి చెరగని గుర్తులు సంస్కృతీ సంపదకు నికషోపలాలు. ఆలంబనాలు. ఈతిబాధలు, నిస్సారమైన జీవితం నుంచి పండుగలు కొత్తజీవితాన్ని ప్రసాదిస్తాయి. కొత్త ఆనందాన్ని చవి చూపిస్తాయి.

వైవిధ్యవిలసితమైన హరివిల్లులాంటి తెలుగు వారి సాంఘిక జీవితంలో ఎన్నో పండుగ లున్నాయి. ఆచార వ్యవహారా లున్నాయి. పండుగలను బట్టి పాటలు, ప్రాంతాలనుబట్టి ఆచార వ్యవహారాలు మారతాయి. తరతరాలుగా ఈ పాటలన్నీ మౌఖికంగా ప్రచారంలో ఉన్నవే. నరదిరాజు చలపతిరావు, కృష్ణశ్రీ, నేదునూరి గంగాధరంగారలు పుణ్యంకట్టుకొని వందల సంఖ్యలోగల ఈ పాటలను సేకరించారు. వీటిలో పిల్లలవి తక్కువ, పెద్దలవి, తల్లులవి ఎక్కువ.

ఉ గా ది

పిల్లలకు పెద్దలకు అత్యంత ప్రీతి పాత్రమైన పెద్ద పండుగ ఉగాది. తెలుగు వారు ప్రపంచంలో ఏప్రాంతంలో ఉన్నా ఓపిసంతలో కనుల పండువుగా ఈ పండుగ చేస్తారు. చేదు పచ్చడి రుచి చూస్తూ సుఖప్రదమైన జీవితం ఏడాది పొడుగునా ఉండాలని కోరుకుంటారు.

ఉగాది పండుగ వచ్చింది
వేపా బజ్జి తిన్నాము
.......................
అమ్మానాన్న బావా అక్క
అన్నా వదినె అందరు నాడు
కొత్త బట్టలు కట్టాము
పిండి వంటలు తిన్నాము

ఇది దక్షిణ సర్కారు జిల్లాలలో ఉగాది రోజున పిల్లలు ఆనందంగా పాడుకొనే ఒక పాట. మిగతా ప్రాంతాలలో కూడా బిడ్డలు ఇలాగే పాడుకొంటారు పాటలలో కొద్ది పాటి భేదాలుండడం సహజం.

వినాయకచవితి

పిల్లలు పూర్తిగా పాల్గొని ఆనందించే పండుగ వినాయకచవితి. పిల్లలకు నిత్య జీవితంలో విఘ్నాలు కలుగకుండా చదువు సాములు కొనసాగాలని వినాయకుని మొక్కుకుంటారు. ఉదయమే లేచి స్నానాదికాలు ముగించుకొని వినాయకుడికి ఉండ్రాళ్లుపోసి, తాము విందారగిస్తారు. పూజావ్రత కల్పం పూర్తయ్యాక పిల్ల లందరూ లేచి చివరిసారి ప్రార్థన చేస్తారు

విఘ్నము లేకుండ
విద్యనియ్యవయ్య
విఘ్నేశ్వరుడ నీకు
వేయి దండాలు

విద్యాభ్యాసంగంలో ఎట్టి ఇబ్బందులు లేకుండా చేయడానికి విఘ్నేశ్వరుని ఆశీస్సు లవసరమని మన పూర్వుల అభిప్రాయం అది భారతీయుల సంప్రదాయం కూడ.

దసరా

పిల్లలు బాగా పాల్గొనే పండుగలలో దసరాను మించింది లేదు. దాదాపు రెండు దశాబ్దాలకు పూర్వం దీనికి ఎంతో ఆదరం ఉండేది నాగరికతా ప్రభావం ఈ పండు గను బాగా నొక్కి వేసింది చిట్టి తమ్ముళ్లు, చిట్టి చెల్లాయిలూ దసరా పండుగ వచ్చే సరికి "జయ విజయీభవ" అని గొంతెత్తి పాడుతూ ఉండే దినాలు గతించాయి. అందువల్లే బిడ్డలలో కలుపుగోలుతనం, ఉత్సాహం, ఉపాధ్యాయుల పై బిడ్డల తల్లిదండ్రు

లతో సంబంధాలు తరిగిపోయినవని చెప్పవచ్చు ఆర్థికావసరం కోసం కాకపోయినా పై అవసరం కోసం ఈ పండుగ సందర్భంగా తల్లి దండ్రులను ఉపాధ్యాయులు పిల్లలు కలుసుకొనే అవకాశాన్ని పునరుద్ధరించవలసి ఉంది దసరా సందర్భంగా పిల్లలు పాడే పద్యాలలో ఎన్నో ఫణితు లున్నాయి [22]

ధరసింహాసనమై నభంబు గొడుగై

తద్దేవతల్ భృత్యులై పరమామ్నాయములెల్ల వంది గణమై

ప్రార్థనా పద్యంతో ప్రారంభించి వినాయకుని మీద, సరస్వతీమీద, శివుని మీద, ఆంజనేయునిమీద పద్యాలు చెబుతారు సరే – ఆనాడుగల బ్రాహ్మణులు, రాజులు, వైశ్యుల మీద పద్యాలు చెప్పి, అయ్యవారికి ఐదువరహా లీయకపోతే—లోభివానిమీద –

బాలురము వస్త్రిమిటు – పరగ నతి ప్రేమ
మా ముద్దు చెల్లించి మము బంపవలయు
పసిబాలురము మేము బడలియున్నాము
రేపురా మాపురా మల్లిరమ్మనక
తేపతేపకు మమ్ము తిరిగి రమ్మనక
అల్లుళ్లవలె గాదు అలిగి మిమ్మడుగ
తగవు వారముగాదు దండించి యడగ–

ఇలా చెప్పుకుంటూ పోయి – ఎలాగో అయ్యవారిని తృప్తి పరచి – అందరూ కలసి –

శ్రీరస్తు విజయోస్తు దీర్ఘాయురస్తు
ధనకనక వస్తు వాహన సిద్ధిరస్తు
కారుణ్యముగ మీకు కల్యాణమస్తు
ఆశ్వయుజ శ్రీశుద్ధ మహర్నవమినాడు
శాశ్వితాశీర్వాద సత్యవాక్యములు
బాలకులదీవనలు బ్రహ్మదీవెనలు

అని దీవిస్తారు. ఇలాటి తెలుగు పండుగలు ఎన్నో ఉన్నాయి.

..........................

22 దసరా పద్యాలు. మద్రాసు, వావిళ్ల, 1949, 36 పు

## ఆటల పాటలు

తెలుగువారి సాంఘిక జీవనంలో ఆటలుపాటలు ఒక ప్రముఖమైన పాత్ర వహిస్తాయి నాగరికతా వాతావరణంలో వీటి ప్రభావం తగ్గుముఖం పట్టినా పల్లెపట్టులలో మనోహరంగా ఉన్న వాతావరణంలో పాటల ఆటలు ప్రచారంలో ఉన్నాయి.

నన్నెచోడుని కుమార సంభవం, సోమన, బసవ పురాణం, ధూర్జటి కాళహస్తి మహాత్మ్యం, శ్రీనాధుని పల్నాటి వీరచరిత్ర, శివరాత్రి మహాత్మ్యం, తాళ్ళపాక పెద తిరుమలయ్య శృంగార దండకం మొదలైన కావ్యలలో, ప్రబంధాలలో మహాభారతం మొదలుకొని నేటి వరకు గల శతాధిక రచనలలో ఆటపాటల ప్రసక్తి ఉంది. సురవరం ప్రతాపరెడ్డిగారు ఆంధ్రుల సాంఘిక చరిత్ర (1958) లో తెలుగువారి ఆటలను గురించి పలుచోట్ల ప్రస్తావించారు.

డాక్టరు తిమ్మావఝ్ఝల కోదండ రామయ్యగారు చెప్పినట్లు "వాఙ్మయంలాగే ఆటలు కూడ జాతి జీవిత ప్రతిబింబాలు. మొదటిది వాగ్రూపమైతే, రెండవది క్రియా రూపమైనది మానవునకు మానవునకు పోలికలున్నట్లే, ఆటలలోనూ క్వాచిత్కంగా పోలిక లుండవచ్చు. కాని దేశకాల చరిత్ర ప్రభావంతో జాతి సంస్కృతి సంప్రదాయాలను అనుగుణంగా అవి రూపు తీర్చుకుంటాయి. అలా రూపొందినవె తెలుగు వారి ఆటలు కూడా.[23]

తెలుగుదేశంలో వెలసిన బౌద్ధ, హిందూ క్షేత్రాలలోని శిల్పాలు, చిత్రాలలో ఆటలను సంబంధించినవి మనకు కనిపిస్తాయి పాల్కురికి సోమనకవి నాడు ప్రచారంలో ఉన్న ఆటలను కొన్ని చెప్పారు.

"పొందంగ రాగుంజ పోగుంజలాట
కుందెన గుడిగుడి గుంచంబులాట
అప్పుల విందులయాట పల్లారు
చప్పట్లు వెట్టెడు సరిగుంజలాట
చెర బొంతలయాట చుట్లు పొట్టాట
గోరెంతలాట దాగుడు మూతలాట

పైన వివరించిన ఆరు పంక్తుల పద్యంలో ఎనిమిది ఆటల ప్రసక్తి తేబడింది.

..........................

23 కోదండరామయ్య, తిమ్మావఝ్ఝల. పూర్వసాహిత్యంలో బాలల ఆటలు. ఆంధ్ర బాలల మహాసభలు ప్రత్యేక సంచిక. 1977. 5 పు

ఇలాగే తెలుగునాట నేటికి అచ్చనగండ్లు, ఆరింకి, అందలాలు, ఈలకూతలు, ఉప్పనబట్టెలు, ఓమనగుంటలు, కనుమూసి గంతలు లేదా దాగిలిమూతలు, దాగిలి మబ్బులు ఇలాగ ఎన్నో ప్రచారంలో ఉన్నాయి. ఇహ వీటితో వెలసిన పాటలు సరేసరి. ఆడుకునేటప్పుడు పాడుకోడానికి అనువు తమిళంలో రాసిన గేయాలను "అమ్మానై" అంటారు అంకెలు వరుసగా వచ్చేటట్లు గచ్చకాయలాటలో పాడే తెలుగు పాటను చూడండి.

ఒకటి ఓ చెలియా, రెండు రోకళ్లు
మూడు ముచ్చిలకా, నాలుగు నందన్నా
ఐదుం బేడళ్లు, ఆరుం జవ్వాజి
ఏడు యలమంద, ఎనిమిది మనమంద
తొమ్మిది తోకుచ్చు పది పటునేరు

ఈ ఆట ఇంట్లో ఆడుకుంటారు. అదే సమయంలో చిటపట చినుకులు చిందులేస్తున్నా యనుకోండి మరోపాట అందుకుంటారు సందర్భాన్నిబట్టి -

వానా వానా చెల్లప్ప, వాకిలి తిరుగు చెల్లప్ప
కొండమీద గుండురాయి కొక్కిరాయి కాలువిరిగె
దానికేమి మందు ?
వేపాకు పసుపు వెల్లుల్లిపాయ, నూనెలోమడ్డి నూటొక్కసారి
పూయవోయి ఒకసారి పూట కొక్కసారి

అని వైద్య విషయాలనుగూడ ప్రసక్తానుసారం చెబుతారు. మరోపాట చూడండి.

కాళ్ళాగజ్జి కంకాలమ్మ, వేపాచెక్క వెలగా మొగ్గ
మొగ్గాకాదు మోదుగ నీరు, నీరుగాదు నిమ్మలవారి
వారిగాదు వాయింటకూర కూరగాదు కుమ్మరిచట్టి
చట్టిగాదు చాగల మర్రి మట్టూ తీసి నీ మొగుడు కాలుమొత్త

ఈ పాట ఆటతో బాటు కాళ్ళకు గజ్జి పుండ్లువస్తే దానికి ముందు ఇలా చెప్పబడింది. కంకాలము, కచూరాలు, వేపచెక్క, బావంచాలు, వెలగామొగ్గ, పాదరం, మోదుగ నీరు, మోదుగ మండలు, నిమ్మలవారి నిమ్మరసం, వాయింటాకు, చాగమట్టి వీటన్నిటినీ మట్టి చట్టిలో కాచి; కలయ బెట్టి రాస్తే గజ్జి మాయమౌతుందని వెదాల

రామానుజస్వామి, డాక్టరు వేటూరి శంకరశాస్త్రిగారలు చక్కని అర్థాలను చెప్పారు.[24]

కాళ్ళగజ్జీ ఆటపాట బెంగాలీ భాషలో గూడ ఉందట.[25]

అగడుం బొగడుం, ఘోడారె డీమ్‌సాజే ....

ఘోనో ఘోనో డాటారెనామ్– చొంద్రోముఖీ గొఛెర్ నామ్

ఇలాగే ఒప్పుల కుప్ప వయారి భామ వంటి పాటలు ఉత్తరభారతంలో ఉన్నాయి. ఇటువంటి పోలికలు భారతీయభాషలలో ఎన్నో ఉన్నాయి. ఇంతకు ముందు ఒక అధ్యాయంలో వివరించినట్లు పిల్లలు ఏ ప్రాంతంలో ఉన్నా వారి భావాలు ఒకటే. మనస్తత్వం ఒకటే పిల్లలు పాడే మరోపాట–

రుంగు రుంగు బిళ్ళ–రూపాయి దండా

దండాగాదు తామర మొగ్గా–మొగ్గాగాదు మోదుగమాడ

ఈవిధమైన దేశీయ క్రీడల వివరాలను నేదునూరి గంగాధరంగారు "ఆటలు పాటలు" అనే గ్రంథంలో ఎంతో సమగ్రంగా, సచిత్రంగా వివరించారు ఆటలలోని వాడుక మాటలకు అర్థాలను కూడ వివరించారు. వాస్తవానికి తెలుగు దేశంలోని పిల్లల ఆటలు ఒకి ప్రత్యేక పరిశోధనాంశంగా స్వీకరింపదగిన పరిధిగల అంశం.

## బిత్తి తిరిగెడు పాటలు

తిరుగుతూ పాడే పాటలను తెలంగణా ప్రాంతంలో భిత్తితిరిగెడు పాటలంటారు. ఇవి ప్రధానంగా బాలికలు పాడేపాటలు. వారికి చక్కని వ్యాయామం కలిగించి దేహారోగ్యాన్ని పెంచుతాయి. 'వానా వానా వల్లప్ప–వాకిలి తిరుగు వల్లప్ప' "వెండిగిన్నె వెలగామొగ్గ'–మొదలైనపాటలు ప్రసిద్ధమైనవి బాగా ప్రచారంలో ఉన్న–

ఒప్పుల కుప్ప వయారి భామా !

సన్న బియ్యం, చాయ పప్పు!

..........................

24 శంకరశాస్త్రి, వేటూరి. బాలసాహిత్య వైద్య విషయాలు. ఆ. ప్ర. బాలలు మహాసభలు ప్రత్యేక సంచిక, 1977. 20 పు

25 తులసి, చాగంటి; అనూరాధ, ఉపద్రష్ట. ఉత్తరభారతంలో పిల్లల ఆటలు. ఆ. ప్ర. బాలల మహాసభలు ప్రత్యేక సంచిక. 1977. 88 పు

చిన్న మువ్వ, సన్నగాజు
కొబ్బరి కాయ, బెల్ల పచ్చు
గూట్లో రూపాయి, నీమొగుడు సిపాయి

అందరం ఎరిగినదే. తెలంగాణా ప్రాంతంలో ఇదే పాట ఐదోచరణం నుండి ఇలా మారుతుంది.[26]

మినపాపప్పూ మెరికా బియ్యం
పాలూ నెయ్యోడి-పాశం వొండూ
నీమొగుడు దింటే-ఆనందమంటే

అనేపాట ప్రత్యేకంగా బాలికలు పాడుకుంటారు. అదే పాటను బాలురు కొంత మార్చి పాడతారు.

ఒప్పులకుప్పా, ఒయారిభామా, మినపాపప్పు మెంతీపిండీ
తాటిబెల్లం, తవ్వెడు నెయ్యి, గుప్పెడుదింటె కులుకులాడీ
నడుముగట్టి నామాటుబట్టీ

ఈ పాటల కోవకు చెందినదే తెలుగు వారి ఇళ్ళలో సంక్రాంతి పండగ సందర్భంలో ఒక గొబ్బెమ్మను మధ్య పెట్టి ఆడపిల్లలు చుట్టూ తిరుగుతూ పాడేపాట—

సీతమ్మ వాకిట చిరు మల్లె చెట్టు,
చిరుమల్లె చెట్టేమొ చిలుకబూసింది
చెట్టు కదలాడకుండ కొమ్మ వంచండి,
పట్టి పూవు కోసి బుట్టనింపండి

ఇలా సాగుతూ ఉంటుంది

దీనిలో నాలుగు స్తంభాలాట ఎరుగని వారుండరు. పిల్లలకు అత్యంత ఆసక్తికరమైన ఆట. అయితే ఈనాటి ఇళ్ళలో స్తంభాలే కొరత కావడంచేత ఈపాట మరుగున పడి పోయింది.

నాలుగు స్తంభాలాటు, నడిమికి తొడిమికి
తానక తప్పక, తన పేరేమంటే

..........................

26 రామరాజు, బి. తెలంగాణా పల్లెపాటలు-మొదటి భాగం.

ఉట్టి మీద బెల్లం, పొట్టి కాకరకాయ
బావా బావా తొక్కులు తింటే
బరకూ బరకూ తలకొకటి (తలకట్టు)

ఇలా పాట సాగిపోతుంది ఈ పాటలు వావివరుసలను కలుపుగోలుతనాన్ని పెంచడమే గాక పల్లీయులలో ఉత్సాహాన్ని పెంచుతాయి ఇలా చుట్టూ తిరిగి ఆడుకొనే పిల్లల పాటలు ఎన్నో ఉన్నాయి ఇవి ప్రధానంగా జానపద గేయాల్లోనే ఉన్నాయి. ఇవి పెద్దల పాటలలో శకలాలై ఉండచ్చని ఒక ఆంగ్ల నిఘంటుకారుని ఉవాచ. [27] దీనికి కారణం ఈ కోవకు చెందిన పాటలు ఎక్కువ భాగం పెద్దల పాటలలో ఉండడమే.

ఎగతాళి పాటలు

వీటినే పండిత గొర్రెపాటి వెంకటసుబ్బయ్యగారు నవ్వులాటలు అన్నారు.[28] చక్కిలిగింతల పాటలూ వీటిలో ఒక భాగంగా భావించవచ్చు ప్రధానంగా ఇవి హాస్య స్ఫోరకాలు. సంప్రదాయపు గుళికలు. అక్కబావలు, మామ, అల్లుళ్ల ఇందు ప్రధాన పాత్రలు. పాడుతూ ఎదుటివారిని ఉలికించడం ఈ పాటల ఉద్దేశం. మేనమామలను గురించి ఒక బాలిక ఊహించి పాడే పాట చూడండి.

కొండమీద మా మామ ఇల్లు కట్టేడు
కోరి కొడుకులకంది మా అత్త
కొడుకులు కొండమీద కోతుల్ని పోలు
కూతుళ్ళు గుడివాడ కుక్కలను పోలు
అల్లుళ్ళు నెల్లూరి రాజులను పోలు
కోడళ్ళు గోల్కొండ చిలకల్ని పోలు

ఎవరినో ఉద్దేశించి కాకువుగా పాడే పాటలో ధ్వని స్పష్టంగా కనిపిస్తుంది

...........................

27 George Ferzog : Standard Dictionary of Folklore, Mythology & Legend. Vol. II P 1034.

28 వెంకటసుబ్బయ్య, గొర్రెపాటి నవ్వులు-పువ్వులు, విజయవాడ, దేశకవితా మండలి, 1944.

పొద్దున్నే లేచింది చిట్టెలుక, ముగము కాలు కడిగింది చిట్టెలుక
గాదెలో దిగింది చిట్టెలుక, వడ్లగింజలు కొరికింది చిట్టెలుక
పాలు అన్నం చేసింది చిట్టెలుక, మొగనికె పెట్టింది చిట్టెలుక

ఈ పాటను కోలారుజిల్లా చింతామణికి చెందిన గంగప్ప సేకరించారు.[29]

తల్లి దండ్రులకు చక్కిలిగింతలు పెట్టడం ఒకసరదా. దానివల్ల బిడ్డలో ఉత్సాహం పెరుగుతుందని ఆశ. బిడ్డ చక్కిలి గింతల ద్వారా నవ్వుతున్నపుడు ఆనందించడం మాతృమూర్తులకు ఒక సరదా తల్లి బిడ్డను అరచేత పట్టుకొని, వేళ్ళు లెక్కపెడుతూ పాడేపాట

అన్నం బెట్టి అప్ప బెట్టి,
అప్పడం పెట్టి దప్పడం బెట్టి
కూర బెట్టి నార బెట్టి,
గారె బెట్టి, బూరె బెట్టి
పాలు బోసి పరమాన్నం బోసి,
గుంట గట్టి గుంట నిండ నెయ్యిబోసి
మా అబ్బాయి అత్తవారింట్లలో లేదంటే
తాళ్ళల్ల నుంచి తంగెళ్ళ నుంచి అదే తోవ అదే తోవ చక్కిలిగిలి

పాడుతూ మొదటి ఐదు చరణాలు పాడేప్పుడు బిడ్డ ఐదువేళ్ళ లెక్కపెడతారు ఆరవ చరణం పాడేప్పుడు అరచేతిలో గుంట చుట్టునటుల గీతగీస్తారు ఏడో చరణం నుండి తమచేతిన మెల్లగా శిసువు చంక వరకు పాకించి చక్కిలిగింతలు పెడతారు ఎనిమిదో చరణం నుంచి జాగ్రత్తపడి తన చేతిన లాక్కొని నవ్వడం ప్రారంభిస్తుంది తల్లి ఆనందిస్తుంది

## కూనలమ్మ పదాలు

తెలుగువారి ఆచార వ్యవహారాలను, శ్రేష్టతను మన ప్రవృత్తులను తెలిపె పలుకుబడులు, పదాలు రాయలసీమ ప్రాంతంలో బాగా ఉన్నాయి. తమిళంలో అవ్వయ్యార్ పదాలు ఎంత విలువగలవో తెలుగులో కూనలమ్మ పదాలకు అంతటి విలువ విశిష్టత ఉంది.[30]

..........................

29 గంగప్ప, ఎన్. (సేకరణ) ఎ. గోపీనాథ్‌గారి (అనంతపురం) నుంచి సంపాదితం

30 ప్రభాకరశాస్త్రి, వేటూరి. బాలభాష, 1956. 33 పు

జప తపంబుల కన్న, చదువు సాములకన్న
ఉపకారమే మిన్న ఓ కూనలమ్మా

అన్న మిచ్చిన వాని, నాలినిచ్చినవాని
నపహాసించుట హాని ఓ కూనలమ్మా

భీష్ము డనుభవశాలి, భీముడే బలశాలి
కర్ణుడే గుణశాలి ఓ కూనలమ్మా

ఇలాంటి వింత వింత పదచిత్రాల హొయలు ఈ కవితలో ఉంటాయి.

## పెద్దల సుద్దులు

సూక్తులంటే మంచి మాటలు. మనోజ్ఞమైన పలుకులు. వీటిలో ధార్మికత్వం ఇమిడి ఉంటే సుభాషితా లంటారు సూక్తులలో విపులార్థం చిన్న వాక్యంలో ఉంటుంది. వీటిని మననం చేయడం వలన మనస్సుకు, బుద్ధికి, ఆత్మకు వికాసం కలుగుతుంది శుద్ధి కలుగుతుంది సూక్తుల సేకరణలో విశేష పరిశ్రమ చేసిన తెలుగురాజు పెను మెత్స సత్యనారాయణరాజుగారు వాటి ఉపయోగాన్ని గురించి ఈ విధంగా చెప్పారు సూక్తులు –

1 బలహీనులకు బలాన్నిస్తాయి
2 బీరువుకు ధీరత్వానిస్తాయి
3 దుఃఖితులకు సంతోషాన్ని కలిగిస్తాయి
4 లోభికి త్యాగ బుద్ధి కలిగిస్తాయి
5 దేశ ద్రోహికి దేశాభిమానాన్ని కలిగిస్తాయి
6 స్వార్థ పరునికి పరోపకార బుద్ధి నిస్తాయి
7 ద్వేష బుద్ధికి ప్రేమ అంకురింప జేస్తాయి
8 విరోధులకు అన్యోన్య మైత్రిని కలిగిస్తాయి

బాలలకు సంబంధించిన కొన్నిటిని వేటూరి ప్రభాకరశాస్త్రిగారు సేకరించి 'బాల భాషలో' చేర్చారు.

విద్య లేకుంటేను, విభవమ్ము రోత
వినయమ్ము లేకుంటే, నీ విద్యలూ రోత
ఒంటి కణతా నొప్పి – ఒరగాలి తీపు

పంటి పోటూవద్దు - పగవాడికైన
కృష్ణమ్మ వంటివాడు - కొడుకుపుడితే
కష్టాలు కడతేరు - కన్నతల్లులకు

ఇలాంటివి ప్రచారంలో ఎన్నో ఉన్నాయి వీటిని సేకరించి సమయానుకూలంగా ఉపయోగిస్తే పిల్లల, పెద్దల ప్రవర్తనలో మార్పు రావడానికి వీలుంది.

## పిల్లల రచనలు

వయస్సు వచ్చేవరకు పిల్లలలో ఊహలు పెరుగుతూ ఉంటాయి. వ్యక్తిత్వం పెరుగుతూ ఉంటుంది ఆ సమయంలో తోటి పిల్లలతో కలసి కొత్తమాటలు నేర్చు కొంటారు పాటలు కడతారు సరదాగా పాడుకుంటారు ఈ పాటలోని పదాలకు అర్థం ఉండవచ్చు, లేకపోవచ్చు. ఈ సందర్భంలో బాలలకు భావ సౌష్టవం కుదుర్చు కునేంతటి కల్పనాశక్తి ఉండదు. అందుకనే ఈ పాటలను అర్థం లేని పాటలనీ నాన్సెన్స్ రైమ్స్ అని పాశ్చాత్య పండితులు అభిప్రాయపడినట్లు స్టాండర్డు డిక్షనరీ ఆఫ్ ఫోక్ లోర్ వలన తెలుస్తున్నది. కేవలం ఈ పాటలలో అర్థమే లేదని కొట్టి పారవేయలేము. యోచన చేస్తే అర్థం ఉంటుంది అర్థం, భావం, ఊహ, కల్పన లేకపోతే గేయం నిలవదు కదా! స్థూలంగా ఈ రచనలను పిల్లల రచనలు అనచ్చు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు దీన్ని 'దుడుకు కవిత్వం' అన్నారు. పంతులు గారిని ఎగతాళిచేస్తూ పిల్లలు కల్పించిన గేయం.

పంతులు పంతులు పావుసేరు మెంతులు
కూర్లోకి చాలవు గుప్పెడు మెంతులు
మంచా మెక్కం సంచా
పంతుల్నేసి దంచా
రోట్లోవేసి రుబ్బా
రోట్టె కాల్చుకు దొబ్బా

నలుగురు పిల్లలు ఒకచోట కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నపుడు ఒకడు మెల్లగా అపానం విడుస్తాడు. ఇది గమనించిన మరొక బాలుడు ఒకపాటలో ఎగతాళి ప్రారంభిస్తాడు.

ఉసిరికాయ, ఊరు బిందె
లవ్వో, లాటో, చెంబో, బైటో,
టాంగు, టింగు, తమ్ముళ్ళు, పెద్దప్మ
తసుక్కు పుసుక్కు

మరోసారి అదే సందర్భంలో ఇలా అంటారు.

అగ్గిపెట్టె – గుగ్గిపెట్టె
కోడి కొమ్ము
పిల్ల – పిత్తు

ప్రతి పదానికి వేరు వేరు అర్థం ఉన్నా లేకపోయినా భావాన్ని పిల్లలు గమనించి నవ్వుకుంటారు కొల్లలు కొల్లలుగా గల ఈ కోవకు చెందిన పాటలలో–గోట్టిబిళ్ళ, ఆడునపుడు "చిర్రి" అను బద్దీయున్న చోటికి గోనెతో కొలత వేసేటప్పుడు పాడేపాట.

ఒంటికాలు, చిటుముటూల్
మూడో ముచ్చి, నాల్గో నడ్డి
ఐదో పెద్ది ఆరో కన్ను, ఏడో పొల్ల

పైన వివరించిన ఏడంకెలకు సంగ్రహరూపంలో ఒంటి, చిచ్చి, ముచ్చి, నడ్డి, పెద్ది, కన్ను, పొల్ల–అని ఏడు సంకేతాలు వివరిస్తూ ఉంటారు. ఈ రెండు పాటలను డాక్టరు రామరాజుగారు సేకరించారు పిల్లల రచనలు వారి కల్పనాశక్తికి ప్రతిరూపాలు. ప్రధానంగా నాద సౌందర్యానికి ఆట పట్టులు. వీటిని సమగ్రంగా సేకరించాల్సిన అవసరం ఎంతో ఉంది

## పొడుపు కథలు

తెలుగు బాల సాహిత్యంలో పొడుపు కథలకు ఒక విశిష్టమైన స్థానం ఉంది. కథలు చెప్పచ్చు వినచ్చు, వినిపించచ్చు కథలోని అన్ని సొంపులూ, మెలకువలూ, వినేవాడు తెలుసుకున్నాడా అనే ఆలోచనే రాదు. కాని వినేవాడి నుండి సమాధానం రాబట్టడంలోనే పొడుపు కథలో చమత్కారం ఉంది. స్ఫూర్తి ఉంది. కథకాని కథ పొడుపు కథ. ప్రాచీన కాలంలో మంచి పొడుపు కథలు ప్రచారంలో ఉన్నవి. క్రీస్తుకు పూర్వంనాటి వేదాలలో వీటి ప్రసక్తి ఉంది. అతి ప్రాచీనమైన వేదాలలో వీటి ప్రసక్తి ఉంది. ఋగ్వేదంలోని–

ద్వాసుపర్ణా సయుజా సఖాయా సమానం
వృక్షం పరిష స్వజాతే తయోరన్యః
పిప్పలం స్వాద్వత్తి అన్యోఒనశ్నన్నభి చాకశీతి

అన్న పొడుపు కథ బాగా ప్రచారంలో ఉంది. ఇవిగాక పురాణాలలో, బౌద్ధ, జైన, గ్రంథాలలో పొడుపు కథలు ఎన్నో ఉన్నాయి. ఇక పాణిని, అష్టాధ్యాయి తెలుగు భారతం ప్రబంధాలు, కావ్యాలు, చాటువులలో గల పొడుపు కథలు అసంఖ్యాకం. కథా సరిత్సాగరం, భేతాళ పంచవింశతి—ఇత్యాది గ్రంథాలలో పొడుపు కథా రూపంలో ఉండే పొడుపు కథలు చాల కనిపిస్తాయి వీటిని సమస్యాత్మక కథలు అంటారు. బైబుల్ పవిత్ర గ్రంథంలో ఆధ్యాత్మిక చింతనతో మిళితమైన కొన్ని కథలు కనిపిస్తాయి ఇక జానపద సాహిత్యంలో ఇవి అసంఖ్యాకంగా కనిపిస్తాయి. పొడుపు కథలు దాదాపు ప్రతి భాషలో ఉన్నాయి. వీటిని ఆయాభాషలలో ఈ దిగువ పేర్లతో పిలుస్తారు. 31

| | | |
|---|---|---|
| ప్రాకృతం | — | పహేళీ, హిమాలయా |
| హిందీ | — | పహెలీ, భుల్ భులైయా |
| సంస్కృతం | — | బ్రహ్మోదయం, ప్రశ్నలేక ప్రత్యుత్తర కూట ప్రవహేలిక, వివాద, సమస్యాగూఢ హృదయాలికా, ఇత్యాది |
| తమిళం | — | విడకట్టై, వుడుర్ |
| మలయాళం | — | విడకద, కటకద |
| కన్నడం | — | ఒగటు లేక వగటు, ఒంటు, ఒడకతె బిడ్డకతె, ఒగణు |
| బెంగాలీ | — | ప్రహెలీ, దంధా, పెయ్ |
| మరాఠీ | — | ఉఖాణా, ఆహణా, ఉమణా, కులం గాదె కోడె, బయాణా |
| గుజరాతీ | — | ఉఖాణో, ఉఖాణో |
| సింధీ | — | ఉఖాణీ |
| పంజాబీ | — | పహెబీ, భుజాతా |
| బీహారీ | — | బిహా, పహెలీ |
| ఆంగ్లం | — | రిడిల్ |

································

31 మోహన్, జి. యస్. పొడుపు కథలు, తెలుగు వాణి, 1978. 26 పు

పోలికలులేని పొడుపు కథలకు ఈ విభజన వర్తించదు. కనుక ఇది ప్రచారములోకి రాదు. తెలుగులోని పొడుపు కథల సంఖ్య అపారము. వీనిని ఈదిగువ రీతిలో విభజిస్తే చాలవరకు అనుకూలంగా ఉంటుంది.

పొడుపు కథల విభజన

వాస్తవానికి పొడుపుకథలు అల్పాక్షరాలలో అనల్పార్థ రచనలు. హెచ్చుగా ఇందు హాస్యరచన లున్నాయి. **"Riddles are probably the oldest extent forms of humour"** అని బ్రిటానికా చెప్పడంలో వీటి ప్రాచీనత దేశదేశాల వ్యాప్తి వ్యక్తమౌతుంది. ఇవి హరివిల్లులాగ వింత హొయలు ఒలక పోస్తాయి.

1 సాధారణాలు :

అంబులో పుట్టింది, జంబులో పెరిగింది
అరచేతి కొచ్చింది అంతరించి పోయింది (పేను)
ఆరాజు కూతురు అధిక చక్కనిదట
గోరంత కొప్పుబెట్టి గొలుసులు దిగవేసింది (వరివెన్ను)

2 వృత్తులు

చలిలేక నిప్పులో కాలేవాడు తాపంలేక చెరువులో నానేవాడు
బతికుండి గోతిలో కూర్చొనేవాడు
(కంసాలి, చాకలి, సాలె)

ఇంటికి వెనుక కుప్పవేసి కుప్పకు నిప్పుపెట్టి
కుప్పకాలిపోతే అప్పు తీరిపోయె దాని పేరే.... (కుమ్మరావం)

3 ప్రకృతి

అంతులేని కొమ్మకు అరవై కొమ్మలు
కొమ్మ కొమ్మకు కోటి పువ్వులు
అన్ని పువ్వుల్లో రెండే కాయలు
(ఆకాశం, చుక్కలు, సూర్యచంద్రులు)

నల్లచీర చిన్నది, నాజూకు ఉన్నది
ముగ్గు పెట్టుతున్నది, ముద్దు లాడుతున్నది
(ఆకాశం)

4 చిక్కు ప్రశ్నలు

పిల్లికి ముందు రెండు పిల్లులు, పిల్లికి వెనుక రెండు పిల్లులు
పిల్లికి పిల్లికి మధ్య ఒక పిల్లి మొత్తం పిల్లులెన్ని (తొమ్మిది)

5 శాస్త్ర విషయాలు

మనుజుడేమిగాదు మాటలాడగనేర్చు, కథలు పెక్కు జెప్పు
కాదు జేజి మామయ్య (రేడియో)
రారండని పిలిచేది పో పొండని తరిమేది (సైరన్)

6 దాగిన పదాలు

అంతా బేలు కోసం, ఎదురు చూస్తున్నారు (తాబేలు)
ఆ వుత్తరం సీకా నాక (ఆవు)

7 కాని పదాలు

కారుకాని కారు (షికారు)
పతికాని పతి (భూపతి)
యంత్రంగాని యంత్రం (సాయంత్రం)

8 చిత్ర శబ్దాలు

పామేల దుముకు (కప్పకై)
గుడినేల కురియు (కప్పుకై)
బర్రెలతన్ను (చేపకై)
కొంగేల పొంచు (చేపకై)

వంకర టింకర సొ శొంఠి
వాని తమ్ముడు అ అల్లం
నల్లని మిల్లా మి మిరియాలు
నాలుకాళ్లు మె మె మెంతులు
నాకేమిస్తావు తే తేనె

9 గొలుసు కథలు

విసనగిరి పట్నాన వీధెంత సక్కన (చాలు)

వీధిలో ఉండే పాపెంత సక్కన (ఆముదపుచెక్క)

పాప తొడిగిన పావడెంత సక్కన (కాయ)

10 తాత్త్విక మైనవి

ఉదయం నాలుగు కాళ్లతో నడిచేది (పసితనం)

మధ్యాహ్నం రెండు కాళ్లతో నడిచేది (మధ్యవయసు)

సాయంత్రం మూడుకాళ్లతో నడిచేది (ముసలితనం)

11 యక్ష ప్రశ్నలు

భూమి కంటె బరువైనది ఏది (తల్లి)

ఆకాశం కంటె పొడవైనది ఏది (తండ్రి)

గాలికంటె వేగం గలది (మనసు)

12 పద్యరూపంలో

కనులు మూడు గలవు కాదు త్రినేత్రుండు

పక్షిగాదు చెట్టుపైన నుండు

జలము దాల్చియుండు నీల మేఘుండు గాడు

దీని భావ మేమి తిరుమలేశ (టెంకాయ)

ఈ పద్యాన్ని పోలింది సంస్కృతంలో శ్లోకం కూడ ఉంది.

వృక్షాగ్రవాసీ నచ పక్షిరాజః

చర్మాంగధారీ నచ సోమయాజీ

త్రినేత్రధారీ నచ శూలపాణిః

జలంచ బిభ్రిన్న ఘటోనమేఘః

13 సినిమాల్లో

ఒంటికాలిపై నుండీ, హఠ యోగ ముద్రలో నుండీ

గుట్టుగ పని సాధించినది వివరిస్తావా? చిన్నదానా! (కొంగ)

ఇలాగ తరచిన కొద్దీ యివి పెరుగుతూ ఉంటాయి. ప్రాంతాలను బట్టి మారుతూ ఉంటాయి.

### ఇతరభాషల్లో పొడుపు కథలు

తమిళంలో ఇంటికీ, ఇంట్లోని వస్తువులకూ సంబంధించిన కథలు చాల కని పిస్తాయి. ఇవి చాల వరకు స్త్రీలకు, పిల్లలకు సంబంధించినవి.

వింత చెరువులో అందాల చిలక
తోకతో నీరు తాగే మొలక (దీపం)
తడుస్తుంది వానలో ఆరుతుందీ ఎండలో
ఒళ్లు విరుస్తుంది బయటు, ముడుచు కుంటుంది లోగిట (గొడుగు)
చెక్కని స్తంభం చేతికందదూ
చెయ్యని కుండ పొయ్యనినీళ్లు
వెయ్యని సున్నం తియ్యంగా (కొబ్బరి)

ఇలాటిది కన్నడంలో ఇలా ఉంటుంది

ఆగస మాడిద మడియల్లకు చార మాదిత మడికెల్ల
సూర్యన కణ్ణిగే హోళపెల్ల (కొబ్బరి)

హిందీలో ఇలా ఉంటుంది.

హల్ హోల్ తథా, దహి జమ్ తథా
దిల్ తరజ్ తాథా హాత్ నహీ పమాబ్ తథా, క్యాహై (నారియల్
తూచల్ హై ఆయా! క్యాహై (దర్వాజా)

ఇలా ఎన్నైనా చెప్పవచ్చు వాచ్యం ఉపమానంగా, సూచ్యం ఉపమేయంగా ఉంటుంది. అల్పాక్షరాలతో అనల్పార్థభావం, శక్తి కలిగి ఉంటుంది.

### పొడుపు కథల ప్రభావం

ప్రచారంలో ఉన్నట్లు కేవలం పొడుపుకథలు హాస్య గుళికలు కావు. ఆలోచనా ప్రేరకాలు జ్ఞాపక శక్తికి దోహదాలు. లోకజ్ఞతకు బుద్ధికుశలతకు ఆయువు పట్టులు మరొక దృష్టితో అవి కాలక్షేపం కోసం, వినోదం కోసం అనుకున్నా – అవి మరొక వైపు ఎదుటి వాడి కుతూహలాన్ని ప్రేరేపిస్తాయి. వావి వరుసలు పెంచు తాయి వ్యంగ్యాన్ని, వ్యవహార జ్ఞానాన్ని పరిరక్షిస్తూ మానసిక వికాసానికీ, భావ సమై

క్యతకు తోడ్పడతాయి. పదాలలోని క్రమబద్ధత భాషా నైపుణ్యాన్ని పెంచుతుంది ఇవి పిల్లలకేగాక ఎల్లరకు ఉపాధేయులు పఠనీయాలు. ఆలోచనీయాలు నాగరికా ప్రభావానికి ఇంకా పూర్తిగా లోనుకాని రాయలసీమ ప్రాంతంలో పొడుపు కథలు ఈనాటికీ ఎక్కువగా కనిపిస్తుంటాయి ఒక కవి, కాలం, రచయిత, విషయం ప్రాంతం ప్రక్రియల పరిమితి ఇతమిద్ధంగా లేనందున ఇవి కాలగమనంలో ఎన్నో రకాలుగా విచ్చి విప్పారి సంస్కృతీ సుమ సౌరభాలను దశదిశలా వ్యాపింపజేశాయి [37] పదంలో అర్థంలో, పొడుపులో, విడుపులో, కుదింపులో, మదింపులో అనేక మార్పులకు లోనయ్యాయి మరికొన్ని పూర్తిగా అంతరించి పోయాయి మిగిలిన వాటిని భద్రపరచడం మన బాధ్యత.

## సాహితీ భద్రత

పిల్లల జానపద బాల సాహిత్యం చాల భాగం కాలయవనిక మరుగున అదృశ్యమై పోయింది. "మన పురిటిగడ్డ పల్లెటూళ్ల పుట్ట ... పల్లె సీమల యందలి ప్రతి యణువును జీవత్తు, ప్రతి జానపదమును ఒక వాఙ్మయ ఘటిక" అంటారు డాక్టరు తూమాటి దొణప్ప. ఆ ఘటికను జాతి భవితవ్యం కోసం పది కాలాలపాటు భద్ర పరచు కోవలసి ఉంది. ఈ విషయాన్ని దేవేంద్ర సత్యార్థి మరింత బలంగా గుర్తు చేస్తారు "భారతీయ బాలల జానపద గేయాలు అనేక ఆటుపోటులకు లోనయ్యాయి. భారతదేశ సంపదను విదేశీయులు కొల్లగొట్టారు భారతీయ చిన్నారి బాలల గేయాలను ఎవరు తీసికొనిపోగలరు? పిల్లల దేశీయక్రీడలను, ఇంటింటా పాడుకొని ఉన్న పాటలను ఎవరు తీసికొనిపోగలరు ..." [38] కనుకనే ఆ పాటలు ఈనాటికీ నిలచి ఉన్నాయి మనపై మనకు గౌరవం ఉన్నంతకాలం నిలిచి ఉంటాయి ఇది చారిత్రక సత్యం.

..............................

37 దొణప్ప, తూమాటి జానపద కళాసంపద, 1975. 1 పు.

38 "Indian children's rhymes and chants survived many a national storm. The wealth of the country was plunged by the invaders, but who could carry off these rhymes and chants from India's little sons and daughters? The people were the victims of great catastrophies, but none could kill the children's indigenous games and home spun songs".

Devendra Sathartbi. Indian children's Rhymes and chants. Modern Review, Oct. Nov. 1936. p 39.

# గేయ సాహిత్యం

**కావ్యావలోకం - పద్యకావ్యాలు - ఖండకావ్యాలు - నీతి శతకాలు - గేయాలు - గేయకథలు - అభినవ కథా గేయాలు - పిల్లల రచనలు - అప్రశుతులు**

## కావ్యావలోకనం

తెలుగు బాల సాహిత్యంలోని పద్య కావ్యాలు, ఖండ కావ్యాలు, గేయ కావ్యాలు, శతకాలూ, ఇతర పద్య రచనలు ఈ వ్యాస పరిధిలోకి వస్తాయి. కవి అనే శబ్దం తొలుత ఋషి పరంగా ప్రయుక్తమైందని చెబుతారు. దానిని బట్టే "నానృషిః కురుతే కావ్యం" "కవయః క్రాంత దర్శినః" అను నానుడు లేర్పడ్డాయి సంస్కృత ఆలంకారికుల మత ప్రకారం కవిత్వం, కావ్యం సమానార్థకాలే. గద్య, పద్య నాటకాలన్నీ కావ్యాలే. కావ్యాన్ని గురించి పలువురు ప్రాచీనులు నిర్వచనాలు చేశారు. "దోషరహితంగానూ, గుణ సహితంగానూ, అలంకారయుక్తంగానూ, ఉన్న శబ్ద సముదాయాన్ని కావ్యం" అన్నారు మమ్మటుడు "రసాత్మకమైన వాక్యమే కావ్యం" అన్నారు విశ్వనాథుడు. "రమణీయమైన అర్థం ప్రతిపాదించు శబ్దం కావ్యం" అన్నారు జగన్నాథుడు ఇది దండి "ఇష్టార్థమైన పదాల సముదాయమే కావ్యం" అనే దానికి దగ్గరగా ఉంది ఇష్టార్థమంటే రమణీయార్థమేగదా! వీనిలో జగన్నాథుని నిర్వచనమే సర్వదా యోగ్యంగా ఉన్నదని విజ్ఞుల నిర్ణయం

భారతీయ ఆలంకారికుల వలెనే పాశ్చాత్య సాహితీ వేత్తలు కావ్యాన్ని గురించి కొన్ని నిర్వచనాలు చేశారు. వారి దృష్టిలో కావ్యమంటే పద్యకావ్యమే. "సదాధర్మానికి ప్రాతినిధ్యం వహించేది కవిత్వం" అన్నారు అరిస్టాటిల్ "ప్రకృతి, మానవుని బింబ ప్రతిబింబ భావమే కవిత్వం. కవి ప్రశాంత చిత్తంతో నున్నపుడు పునరావర్తనం చెందు భావోద్రేకం నుండి జనించు నిరాటంక ప్రవాహమే కవిత్వం. సర్వజ్ఞానానికి పరమావధియై భావుక హృదయ మెంత అమరమో అంత అమరమైనట్టిది కవిత్వం" అన్నారు ప్రఖ్యాత ఆంగ్ల కవి విలియం వర్డ్స్‌వర్త్. "భావనా సమ్మిశ్రితమైన బుద్ధి గమ్యమైన సత్యానందాల కళాత్మక సంయోగమే కవిత్వం" అన్నారు ఆంగ్ల నైఘంటికుడు శామ్యూల్ జాన్సన్. "స్వభావ పూర్వకమైన పదాల సంయోజనమే కవిత్వం" అన్నారు జాన్ స్టూవర్ట్ మిల్. ఇది ఇంచుమించు విశ్వనాథుని నిర్వచనానికి దగ్గరగా ఉంది కార్లయిల్ "సంగీతాత్మకమైన ఆలోచనే కవిత్వం" అన్నారు. ఇది జగన్నాథుని నిర్వచనానికి దగ్గరగా ఉంది కాల భేదాలు, దూరతీరాలు ఉన్నా భావనాలోకంలో ప్రాచ్యపాశ్చాత్యులు ఒకే మార్గంలో పయనించినట్లు తెలస్తుంది.

పోతే ఇక బాల సాహిత్య దృష్టితో కావ్యాన్ని, కావ్యరచనా రీతిని పలువురు ఆధునిక సాహిత్య వేత్తలు పరిశీలించారు. "చల్లని, చక్కని మాటలు కలంలోంచి రావాలి. తియ్యని వెచ్చని భావాలు హృదయంలోంచి పొటమరించాలి" అదే బాలల కవిత్వం

అనిపించు కుంటుంది అంటారు ఆంధ్రప్రదేశ్ ఆస్థానకవి డాక్టర్ దాశరథి బాలల కోసం రచనలు చేసే కవికిగల పరిమితులను తెలియజేస్తూ డాక్టర్ సి నారాయణరెడ్డి "కవి తాను ఎంత కొమ్ములు తిరిగిన వాడైనా పిల్లల ఆలోచనలకు అనుభూతులకు అనుగుణంగా ఇమిడిపోవాలి అంటే రాజమార్గంలో నడయాడే పట్టపుటేనుగు-ముచ్చటగా ముక్కాలి పీటపై తిరగ గలగాలి" అన్నారు. అంటే బాలల కోసం రచనా విధానం అంతటి క్లిష్టమైన దన్నమాట. అందుకనే చలంగారు మొన్నెన్నడో-"పిల్లలకు పాటలు రాయడమంటే సామాన్యమైన పనిగాదు మహాకవి కావడం సులభమైన పని దానికన్న" అన్నారు బాలలకు రచనలు చేయడం సులభంకాదు. సమాస భూయిష్ట రచనలకంటె సరళమైన రచనలు, తికమకలు కంటె సూటి రచనలను వారు కోరతారు ఈ విషయాన్నే చలంగారు "బాల గేయాలలో ఎంతో లాలిత్యం హృదయ నైర్మల్యం, భావ పరిమళం నిండి ఉంది. హృదయం లోంచి వచ్చే ప్రేమకి అందానికి రంగులు పూయక సూటిగా పాడిన పాటలకన్న వేరొక కవిత్వం ఏముంటుంది?[1] అంటారు. కనుక బాలల కవిత్వం ఎట్టి ముసుగు లేకుండా నిసర్గంగా నిర్మలంగా ఉండాలంటారు. ఈ మార్గంలో కొంత దూరం పయనించిన డాక్టర్ మిరియాల రామకృష్ణ-బాలల కవిత్వంలో ఉండవలసిన ప్రమాణాలను గురించి చెబుతూ-కవిత్వం "జ్ఞాపకానికి నిలవడం, చదివిన కొద్దీ నూతనానుభూతి కలిగించడం, అందరికీ అర్థంకావడం, అందం, ఆవేశం, ఆనందం, అభ్యుదయం"[2] అన్నీ ఒక్కుమ్మడిగా ఒనగూడాలంటారు. చెప్పడానికేం అరిస్టాటిల్ అంతటివారు "ఈ జాతికి కావలసిన పాటలుమాత్రం నన్నుతయారు చేయనివ్వండి"[3] అని చెప్పడం తేలికే-కాని పిల్లలపాటలు రాయడం కష్టమైన పని "అందుకు అనువైన హృదయం, మనస్సు, ఉత్సాహం, ఆలోచన, పరిశీలన, లయతాళగతి

..............................

1 చలం. చింతా దీక్షితులుగారి ప్రజా వాఙ్మయానికి ప్రస్తావన. విజయవాడ, విశాలాంధ్ర, 1955

2 రామకృష్ణ, మిరియాల. బాల సాహిత్యం అంటే ఏమిటి ? అఖిల భారత తెలుగు బాలల మహోత్సవ సంచిక, 1974.

3 Aristotle. "Let us Make the Songs to the Nation. I Care Not Who Makes its Laws."

జ్ఞానం ఉండాలి." [4] ఈ దృష్టితో రాసినవి, నిలచినవీ పిల్లల పద్యాలు, పాటలు కొన్ని లేకపోలేదు. వాటిని పరిశీలనలోకి తీసుకోవలసి ఉంది. స్థూలంగా చూస్తే యీ విభాగ స్వరూపం ఈ తీరుగా ఉంటుంది.




# పద్యకావ్యాలు

## ఉపాఖ్యానాలు

ఈ కాలంవారు అంగీకరింపక పోవచ్చును, గాని మనుచరిత్ర, వసుచరిత్ర, పారిజాతాపహరణం మొదలైన కావ్యాలను ఉపనయనం అయింతర్వాత విద్యాభ్యాసం

4 నరసింహారావు, బి వి. బాలల గేయాలు అన్నయ్య, అక్కయ్యల అభినందన సంచిక 1977. 11 పు.

ప్రారంభించే సమయంలో-అనగా శబ్ద మంజరి, ఆంధ్ర నామ సంగ్రహం ఇత్యాది పూర్తి చేశాక మన పూర్వులు చదివారు. అర్థ ప్రధానంగా కంటె, శబ్ద ప్రధానంగా చదివారు ఈ పని దాదాపు పందొమ్మిదో శతాబ్ది రెండో పాదందాకా సాగుతున్నది. నవీన విధానంలో పాఠశాలలు పెరిగాక ఈ పాత విధానం మరుగున పడింది ఐతే నూతన విద్యా విధానంలో పాఠ్యాంశాలతోబాటు గజేంద్ర మోక్షం, రుక్మిణీ కల్యాణం, అంబరీషో పాఖ్యానం మొదలైన ఉపాఖ్యానాలు టీకా తాత్పర్యాలతో ప్రవేశ పెట్టారు. పిల్లలు వీటిని శ్రద్ధగా చదివి భాషా జ్ఞానం బాగా పెంచుకున్నారు వ్యవహార జ్ఞానం అలవరచుకున్నారు.

మన కావ్యాలు రచనలు ఆనందం కోసం రాశారనుకున్నా-ప్రతి రచనలో ఉపదేశం విధిగా ఉంటుంది కనుకనే లాక్షణికులు "కాంతా సమ్మిత మోపదేశ యుజే" అన్నారు ఈ ఉపదేశాలు భారత, రామాయణాది ఇతిహాసాలలో, భాగవతాది పురాణాలలో, ప్రబంధాలలో, కావ్యాలలో ఉపకథలు రూపంలో ఉంటాయి "కథలను, ఉపాఖ్యానాలను పఠించునపుడు బాలబాలికల హృదయములందు కావ్యరసముతో పాటు ఉపదేశసారము కూడ హత్తుకొనిపోవుచుండును.[5] అంటారు డాక్టరు దివాకర్ల వెంకటావధానిగారు

మన ప్రాచీన రచనలలో ఉపాఖ్యానాలు అసంఖ్యాకంగా ఉన్నాయి భారతంలో ఉదంకోపాఖ్యానం, గురుడోపాఖ్యానం, కచ దేవయాని, లుబ్ధ కపోతోపాఖ్యానం, హంస కాకీయోపాఖ్యానం, పాల్కురికి సోమనాధుని బసవపురాణంలోని బెజ్జ మహాదేవి కథ, మంచన కేయూర బహుచరిత్ర, కొరవి గోపరాజు సింహాసన ద్వాత్రింశకలోని ఉపకథలు, బమ్మెర పోతరాజు భాగవతంలోని గజేంద్ర మోక్షం, ప్రహ్లాద చరిత్రం, ధ్రువోపాఖ్యానం, అజామిళో పాఖ్యానం, వామన చరిత్రం, అంబరీషో పాఖ్యానం, రుక్మిణీ కల్యాణం మున్నగునవి అమృత కలశాలవంటి ఉపకథలు. వీటిలో అనంతామాత్యుని భోజరాజీయంలోని ఉపకథలు బాలబాలికలకు మరింత దగ్గరగా ఉంటాయి. కనుక "బాల బాలిక లందరూ భాగవతమందలి ఉపాఖ్యానములను తప్పక చదువవలెను. అది వారి తెలుగు తనమునకు వన్నెకూర్చును. భావి జీవితమునకు పెంపు కలిగించును" అంటారు మరోచోట డాక్టరు వెంకటావధానిగారు. మన చదువుల విధానంలో మార్పువచ్చినా ఉపాఖ్యానాలు చదవడంలో అవసరం తగ్గలేదు.

..............................

5 వెంకటావధాని, దివాకర్ల ప్రాచీన సాహిత్యములో బాలల పఠనీయాంశములు. ఆంధ్ర ప్రదేశ్ బాలల మహాసభలు-ప్రత్యేక సంచిక, 1977. 8 పు

తెలుగులో కథాకావ్యం అన్నది ఒక విలక్షణమైన ప్రక్రియ. తిక్కనకు సమకాలికుడైన మూలఘటిక కేతన ఈ ప్రక్రియకు శ్రీకారం చుట్టారు సంస్కృతంలో దండి 'దశకుమార చరిత్ర'ను కేతన పద్యకావ్యంగా తెలుగులో రాశారు. కేతన ప్రారంభించిన పద్ధతిలో అనేక చక్కని కావ్యాలు వచ్చాయి. వాటిలో అనంతామాత్యుని భోజరాజీయం మంచి ప్రసిద్ధి పొందింది. ధారా నగరాన్ని పాలించిన భోజరాజుకు సంబంధించిన కథే భోజరాజీయం. ఇందులోని ఒక ఉపకథ ఆవూ-పులి.

ఒకరోజు ఒక ఆవు అడవిలో మేస్తుండగా పులి దాన్ని పట్టుకొన్నది. "ఇంటివద్ద లేగదూడ ఉంది. పాలిచ్చి కడసారి దాన్ని కళ్ళారా చూచివస్తాను. సంతోషంగా నీకు ఆహారమౌతాను" అని అర్థించింది ఆవు. పులిలాంటి దుష్ట జంతువు మనసును కరగించి, దాని విశ్వాసాన్ని చూరగొని, ఇంటికి వెళ్ళి, దూడకు పాలిచ్చి, నీతిచెప్పి, దుఃఖోపశమనంచేసి, తిరిగి పులివద్దకు వస్తుంది గోవు సత్యసంధతను చూచి పులి నివ్వెరపోతుంది ఇంటికి వెళ్ళి సుఖపడమని అనుగ్రహిస్తుంది కాని "ఇచ్చిన మాట తప్పడానికి వీల్లేదు. నీ నోటి వెంట నాకు స్వర్గధామాన్ని అనుగ్రహించు" అంటూ ఆవు దగ్గరి కొస్తుంది సత్యవాక్పరిపాలనంపట్ల ఆవుకున్న అనురక్తినీ, పులి కరుణాంతరంగాన్ని చూచి దేవతలు జయధ్వానాలు చేస్తారు. విష్ణుమూర్తి ప్రత్యక్షమై అనుగ్రహిస్తాడు ఈ కథ ఆబాల గోపాలానికీ తెలిసిందే. దాన్ని మొదటిసారిగా కావ్యంచేసిన ఘనత అనంతామాత్యునికే దక్కింది ఆవు బిడ్డకు పాలిచ్చి తాను పులికి ఆహారంగా వెళుతున్నానని చెప్పి దుఃఖోపశమనం కలిగించే తీరు హృదయ విదారకంగా ఉంటుంది.

ఆడకు మసత్యభాషలు
కూడకు కొఱగాని వాని, గొంకకయొరు లె
గ్గాడిన నెదురుత్తర మీఁ
జూడకు, విని విననివానిచొప్పున చనుమా.

ఒంటి చరింపకు పొలమున
నింటికి కడు ప్రొద్దు గలుగ ఏతెంచుచు రా
వెంటఁబడి పోడుచు గోవుల
చంటిఁజనకు, క్రయ్యఁబడకు సందడి యగుచోన్.

చులుకన జలరుహ తంతువు
చులుకన తృణకణము, దూది చుల్కన సుమ్మీ

యిలనెగయు ధూళి చుల్కన
చులుకన మఱి తల్లిలేని సుతుడు కుమారా!

చివరి మాటలు విన్న ఎవరికైనా కనుల వెంట నీరు రాకమానవు కరుణరస ప్రధానమైన ఈ కథ చదివినపుడు బిడ్డలపై గోవుకుగల "సత్యవాక్శుద్ధి, కృపాసమగ్ర బుద్ధి '' ప్రభావం పడకపోవు. అది ఉపాఖ్యానాల ప్రయోజనం.

## పద్య, గేయకావ్యాలు

తెలుగులో పిల్లలకోసం రచింపబడిన పద్య, గేయ కావ్యాలు చాల తక్కువ ఐనప్పటికీ 'గంగిగోవు పాల' వంటివి బాలల కావ్యాలు నిర్మాణ పద్ధతిని గురించి ఉత్పల సత్యనారాయణచార్యులుగారు యిలా అంటారు "పిల్లలకు తెలిసి, ఇంకా తెలుసుకోవలసిన విధంగా కావ్యం ఉండాలి. అది భావచాతురిలోనూ, వ్యంగ్యంలోనూ, నిర్మాణ చాతురిలోనూ కనబరచాలి కొన్ని కొన్ని శబ్దాలలోనూ వెల్లడించాలి. ఆ కావ్యం ప్రాచీనకావ్య సౌధానికి సోపానంగా ఉపకరించాలి.''[6] అలా ఉన్నపుడే కావ్యపరనం పిల్లలకు ప్రయోజనకరంగా ఉంటుంది ఈ కావ్యములకు ఉండవలసిన లక్షణాలను గురించి డాక్టరు దివాకర్ల వేంకటావధానిగారు ఇలా అంటారు "అవి సాధారణముగా పాడుకొనుటకు అనువగు గేయములుగా నుండును అందలి భాష సరళమై సుబోధమై, వ్యవహారమునకు దగ్గరగా నుండును. భావములు సుకుమారములై లేత హృదయములలో కూడ అద్భుత స్పందనము కలిగింప వలసి యుండును[7] వ్వానిలో పునరుక్తి దోషముకాదు. దాదాపు యీ లక్షణాలన్నీ ఉత్పలవారి కావ్యాలలో ప్రతిబింబించబడినందున అవి విశేష ప్రచారాన్ని అందుకున్నవి. ఉత్పలవారు 'గంగావతరణము' (1958) కావ్యంతో ఈ వాఙ్మయానికి శ్రీకారం చుట్టారు ఆ తర్వాత క్షీరసాగర మథనము (1962), శమంతకమణి (1962), దక్షయజ్ఞము (1967), పార్వతీ కల్యాణము (1967), కుమార సంభవము (1967) మను చరిత్ర (1975), అర్జునుడి తీర్థయాత్ర (1976), చిన్నికృష్ణుడు (1979) ప్రపంచాచు ప్రచారంలో ఉన్న పురాణ కథలను స్వీకరించి, తెలుగు నుడికారాన్ని చేర్చి, కథలలో అచటచట కొద్దిపాటి మార్పులను చేసి పురాణకథలు చదివేప్పుడు పిల్లలకు కలిగే సందేహాలను తొలగించడానికి ప్రయత్నించారు.

..............................

6 సత్యనారాయణాచార్య, ఉత్పల. బాలలకోసం పద్యకావ్యాలు. ఆంధ్రప్రదేశ్ బాలల మహా సభలు ప్రత్యేక సంచిక, 1977. 180 పు.

7 వెంకటావధాని, దివాకర్ల బాలసాహిత్యంలో రసవత్కావ్య సృష్టి. ఆంధ్రప్రభ దినపత్రిక 11-2-1982.

నగరు డనెడి మహారాజు
చాల గొప్ప బలవంతుడు
అతనికి ఇద్దరు భార్యలు,
అఱువైవేల కుమారులు,
ఆ రాజొక అశ్వమేధ
యాగమ్మును చేయదలచి
గుఱ్ఱమ్మును పూజచేసి
కొడుకులతో సాగనంపె

ఇలా చక్కని కథాకథన శైలితో ప్రారంభమవుతుంది 'గంగావతరణ' కావ్యం. సర్వ ప్రసన్నమైన శైలితో, రమణీయ వర్ణనలతో, చక్కని పాత్ర పోషణతో రచన సాగుతుంది రచనలో ఎడనెడ కవిగారు వాడిన ఉపమానములు అద్భుతములని దివాకర్ల వారి అభిప్రాయం. శమంతకమణి కావ్యంలో-చవితినాటి చంద్రుని వారు "రేయి చుక్కల త్రోవలో నారింజతొనవలె చంద్రుడొప్పెనని వర్ణించినారు సూర్యుడు సత్రాజిత్తు ముందు ప్రత్యక్షమయ్యెను. అప్పుడు "సంద్రమెల్ల బంగారపు ఛాయలతో మెరసిపోయె-దిక్కులందు జలతారపు తెరలు దించినట్లాయె " అని కవిగారు చేసిన వర్ణన హృద్యంగా ఉంది. 'అర్జునుడి తీర్థయాత్ర' కావ్యంలో ఉత్పలవారు భారత దేశంలోని ప్రసిద్ధ స్థలాలను మనోజ్ఞంగా చిత్రించి పిల్లలలో చారిత్రక, సాంస్కృతిక స్పృహ కల్గించడానికి దోహదం చేశారు. కావ్య రచనలో ఉత్పల వారిది తలమానికమైన కృషి అనితర సాధ్యమైన ప్రయత్నం

కావ్య రచనను గేయ రూపంలో మరొక ప్రముఖుడు అలపర్తి వెంకటసుబ్బారావుగారు ఏకలవ్యుడు (1946), స్నేహధర్మం (1974) ఏకలవ్య, కుచేల కథలను కొత్త పద్ధతిలో రాశారు. వీరి భాష, భావం, శైలి పిల్లలు ఉత్సాహపడి చదివేట్లుగా ఉంటుంది స్నేహధర్మం కావ్యాంతంలో బాలలను ఉద్దేశించి ఇలా చెబుతారు.

మంచి మిత్రుని ఎంచుకొనుడు
ఎంచి చెలిమిని పెంచుకొనుడు
కష్ట సుఖములు పంచుకొనుడు
ఇష్ట సఖు లనిపించుకొనుడు

ఇలాంటి సదుపదేశాల ప్రభావం బాలలమీద ఎంతో ఉంటుందనడంలో సందేహంలేదు. కవుల ఆంజనేయశర్మ (1932-) గారు దక్షయజ్ఞం (1960) చక్కని గేయకావ్యంగా మలిచారు. మరొక గేయకావ్యం బి. ఎన్. శాయిగారి పాపాయి పతనం (1963). గేయ కావ్యాలు మొత్తము పదికి మించిలేదు. కవులు యీ శాఖను ఇంకా పరిపుష్టం చేయవలసి ఉంది

## ఖండ కావ్యాలు

తెలుగు సాహిత్య చరిత్రలో ఖండకావ్య సృష్టి ఒక ప్రత్యేక ప్రతిపత్తిని కలిగి ఉంది. సాహిత్యాన్ని ప్రజలలోకి తీసుకుపోవడానికి ఈ ప్రక్రియ బాగా ఉపకరించింది. "ఆధునికాంధ్ర కవిత్వంలో ఖండకావ్య ప్రక్రియ రాయప్రోలుతో పొటమరించినా, పుష్పించింది జాషువా కవిత్వంలోనే ! ఖండకావ్యం వ్రాసి అఖండ కావ్య స్ఫూర్తిని అందించిన కీర్తి జాషువాకే దక్కింది"[8] అంటారు నారాయణరెడ్డిగారు. "నవ్యాంధ్ర సాహిత్యాన్ని ప్రభావితం చేసిన భావ కవిత్వోద్యమం నుంచి ఖండకావ్య ప్రక్రియను వేరు పరచలేము భావ కవిత్వంలో అంతర్లీనమై పోయిన ఆ ప్రక్రియ దానితోబాటు స్ఫుటమైన రూపురేఖలను దిద్దుకొన్నది నవ్యాంధ్ర కవిత్వం లోకంలో ఉత్తమ కవులుగా లబ్ద ప్రతిష్ఠులైన వారందరూ చక్కని ఖండకావ్యాల్ని వెలయించిన వారే." [9] వీరిలో చాలమంది అనగా-వెంకట పార్వతీశ్వర కవులు, దేవులపల్లి కృష్ణ శాస్త్రి, అడవి బాపిరాజు, నాయని సుబ్బారావు, పింగళి లక్ష్మీకాంతం, నాళం కృష్ణ రావు, కవికొండల వెంకటరావు, కనుపర్తి వరలక్ష్మమ్మ, యస్వీ జోగారావు, వడ్ల మూడి గోపాలకృష్ణయ్య గారలు ప్రత్యేకంగా పేర్కొనదగినవారు

బాలల కోసం చక్కని ఖండకావ్యాలను బాల గీతావళి పేరుతో వెంకట పార్వతీశ్వర కవులు రాశారు. అవి పాఠ్యగ్రంథాలుగా నిర్ణయించబడి మరింత ప్రచారంలోకి వచ్చాయి. గున్న మామిడి చెట్టు ఇచ్చే బహుళ ప్రయోజనాలను వెంకట పార్వతీశ్వర కవులు ఇలా వర్ణించారు.

చివురు లిచ్చు చుండె జిన్నకోయిలకు
ఫలము లిచ్చు చుండె జిలుకలకును

..............................

8 నారాయణరెడ్డి, సి. ఆధునికాంధ్ర కవిత్వం, 1977. 165 పు

9 భాస్కరచౌదరి, వి. జాషువ జీవిత కవితా ప్రస్థానం, 1979. 57 పు

సీడ లిచ్చుచుండె నీకును నాకును
తనకు మామిడేమి దాచుకొనియె !
కోకిల సుఖింప దనకేమి కూడివచ్చె ?
చిలుక దనివొంద దనకేమి కలసివచ్చె ?
ఇతరులు సుఖింప దనయొడి యేమినిండె ?
గున్నమామిడి యేమనుకొనెనోగాని

అంటూ గున్నమామిడి ఇతరులను సుఖపెట్టి ఎలా తృప్తి పొందుతున్నదో వివరించారు. దీనిలో 'పరులమేలు మన మేలుగా' బిడ్డల కిచ్చిన సందేశం మరువరానిది.

ప్రకృతి సహజంగా వచ్చే గాలి వానకు పశుపక్ష్యాలు ఎలా గూడూ నీడా పోగొట్టుకుంటాయో గిడుగు వెంకట సీతాపతిగారు ఒక పద్యంలో చెబుతారు.

జువ్వి చెట్టుమీద గువ్వ పిట్టలు రెండు
గూడు కట్టుకొనెను జోడుగూడి !
రివ్వున సుడిగాలి ఉవ్వుచూ వచ్చింది
గువ్వలెగిరిపోయె, గూడు పోయె!

గాలి పటాలంటే పిల్లలెంతో సరదా పడతారు. తెలంగాణా ప్రాంతంలో వీటిని "పతంగులని" పిలుస్తారు గాలి పటాలు కేవలం వినోదం కోసం ఎగుర వేసినా కొన్ని సందర్భాలలో మత్సరాలకు దారితీస్తాయి. ఇరువురు బాలుర మధ్య వచ్చిన ఒక చిన్న పేచీని "గాలి పడగల వేట" అనే ఖండకావ్యంలో నాయని సుబ్బారావుగారు వివరించారు.

ఏల గాలిపటము నెగురవేయగ సమో
త్సాహ మొలుకఁబోసెదవు కుమార?
'నింగి నాధి పరపతంగమ్ము లచ్చటు
నెగసె యాడుటది సహింపనేను....

ఈ రవల పడగ నడపెడు
దారము చూచితివె, పుసుపుదాళ్ళై యిద్దిళ్ళున్ . ....
వైరి పతంగా ధారపు
దారమ్ములు గోయు, వజ్రధారా నిభమై !

ఇసుకలో బొమ్మరిల్లు కట్టుకొని ఆడుకొనే తీరును డాక్టరు యస్వీ జోగారావుగారు 'బొమ్మరిల్లు' ఖండికలో వివరించారు

బడి విడచునంత నింటికి పరుగులెత్తి
పలక బలపాలు గూటిలో పదిల పఱచి
అమ్మయిచ్చిన పప్పు బెల్లమ్ము దినుచు
నాడుకొనబోదు నీవు సాయంతనమున

ఊరి దాపుల నొక సెలయేఱు గలదు
కల దిసుక పసకలు దాని గట్టుమీద
ఇచ్చవచ్చిన మచ్చున నీ వచటను
ఈడు జోడైన వారితో నాడుకొనుము

డాక్టరు వల్లమూడి గోపాలకృష్ణయ్యగారు 'మాతృపూజ' అనే ఖండకావ్యంలో

ఉగ్గుపెట్టు వేళ 'నుంగా' యటంచు నే
నుమ్మి వేయుచుండ నొక్క 'చిటుక'
బుగ్గమీద వేసి 'యుగ్గు' పెట్టిన యట్టి
తల్లి బూజనేతు నెల్లవేళ

పండుకొనగబెట్టి పాదాలపై నన్ను
వెన్న రాచి సున్నిపిండి రాచి
తోమి తోమి యుష్ణతోయముల్ వోసిన
తల్లి బూజ సేతసేతు నెల్లవేళ

ఇలా తల్లిని పూజించి తల్లి ఋణాన్ని తీర్చుకొనవలసినదిగా వల్లమూడివారు ఆదేశిస్తారు [10] పత్రికలలో ఈ విధమైన ఖండకావ్యాలు చాల ప్రచురింపబడినాయి.

## నీతి శతకాలు

దాదాపు వెయ్యి సంవత్సరాల నుంచి కనిపిస్తున్న తెలుగు శతకాలు వేలసంఖ్యలో ఉన్నాయి. అందు ఒక విభాగమైన నీతి శతకాలు వంద దాకా ఉన్నాయి భారతీయ సంప్రదాయంలో నీతివర్తనకు ఎంతో ప్రాధాన్యం ఉంది అందుచేత బిడ్డలకు చిన్నతనం నుంచే జీవిత సూత్రాలను చక్కని నీతుల ద్వారా చెబుతారు. భావాలతోబాటు, వారికి

..............................

10 ఆంధ్రపత్రిక - వారపత్రిక 30-11-1949

మంచి భాష, స్వర జ్ఞానం అలవడాలని దాశరథీ శతకం మొదలైనవి ముందుగా ప్రారంభిస్తారు. ఆ తర్వాత సులభశైలిలో సుమతీ శతకం, కుమార శతకం మొదలైనవి అందిస్తారు తెలుగు శతకములలో ప్రధానముగా పాటింపబడిన లక్షణము లివి సంఖ్యా నియమము, మకుట నియమము, ఛందో నియమము, రస నియమము, ఆత్మాశ్రయ కవితా ధర్మము[11] మొదలైనవి వీటికి అదనంగా శతకాల్లో భాష సాధారణంగా సరళంగా ఉంటుంది ఏ పద్యాని కాపద్యం వేరుగా ఉంటుంది అన్ని శతకాలలో ఈ నియమా లన్నీ పూర్తిగా ఉండవు కొన్ని కొరవలు ఉంటాయి. ప్రత్యేకంగా పిల్లలను దృష్టిలో ఉంచుకొని రాసిన శతకాలు ఇటీవలి కాలందాకా లేవని చెప్పవచ్చు. వేమన శతకంలో సులభశైలి, సరళ భావంగల కొన్ని పద్యాలు పిల్లలకు పనికివచ్చేవి లేకపోలేదు. చిల్లరిగె యోగానందంగారు 'బాల శతకం' (1915) ప్రచురించారు. విద్య, లక్షణాలు, వ్యసనాలు ఇందు వర్ణించబడ్డాయి. ఆ తర్వాత 'బాల నీతి శతకం' (1916) వెలువడింది. చిలక్కా- వెంకట కృష్ణయ్యగారు కుమార శతకం (1915), సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి గారు కుమారీ శతకం (1920) ప్రచురించారు. ఆ తర్వాత బహుకొద్దిగా బాలశతకాలు వచ్చాయి. పిల్లల పుస్తకాలకు ఆదరం, గిరాకి పెరిగాక శతక పరంపర ప్రారంభమైనది. 'బాల' పత్రిక ప్రారంభించిన రోజులలో (1946 ఏప్రిల్) ముళ్లపూడి వెంకటరావు, (వెంకటరమణ) 'బాల శతకాన్ని' ప్రారంభించి అసంపూర్తిగా వదిలేశారు.

ఛందస్సు గణాల్ లేకే
నేరాసిన పద్యములను సైరించుచు న
న్నుత్సాహ పరుపగోరెద
నాజేజేలవిగో - నీకు గైకొను బాలా!

స్నేహితులతో తగవాడక
గురువులపై భక్తియుంచి తగునేర్పుగ నీ
చదువుల నెల్ల గ్రహించుచు
తగువేళకు ఇల్లుచేరు సుఖముగ బాలా

"తెలుగు సంస్కృతితో బాటు అనేక విషయాలు సరళంగా పిల్లల మనస్సు లకు హత్తుకొనేట్లు" నార్ల చిరంజీవిగారు రాసినది "తెలుగుపూలు, (1954). ఈ పూలు బాలసాహితికి సుమసౌరభాలు సమకూర్చుతాయి.

..............................

11 గోపాలకృష్ణరావు, కె. ఆంధ్రశతక వికాసము, 1976. 7 పు

దేశమేదన్నచో తెలుగు దేశ మనుము
జాతియేదన్నచో తెలుగు జాతి యనుము
వంశ మేదన్నచో తెలుగు వాడ ననుము
తెలుగు కీర్తిని చాటుము తెలుగు బిడ్డ

ఇలా తెలుగుబిడ్డ తెలుగు దేశం, జాతి యెడల స్ఫూర్తిని కలిగిస్తూ – మన నేతలైన వీరేశలింగం, గిడుగు, గురజాడలను గుర్తుచేస్తారు.

విప్లవ గుణశాలి వీరేశలింగము
పెంకె పండితులకు పిడుగు గిడుగు
మన మహామనీషి మనవాడు గురజాడ
తలచుకొనుము వీరి తెలుగు బిడ్డ

జననీ జన్మభూమిశ్చ, స్వర్గాదపీ గరీయసీ' అన్న సూత్రాన్ని –

జన్మభూమికంటే స్వర్గంబు వేరేది
మాతృభాషకంటే మధురమేది
కన్నతల్లికంటె ఘనదైవమింకేది
తెలియుమయ్య నీవు తెలుగుబిడ్డ

అని బోధిస్తారు. ఈ శతకంలోని ప్రతిపద్యం ఒక జాతి రత్నం
లలిత సుగుణబాల ! తెలుగుబాల ! మకుటంతో జంధ్యాల పాపయ్యశాస్త్రి కరుణశ్రీ (1912–) తెలుగుబాల (1953) శతకాన్ని రాశారు. ఇది బాగా ప్రచారమైన శతకం. ముదిగొండ జ్వాలాపతి లింగశాస్త్రిగారు తెలుగు బిడ్డ (1954) శతకాన్ని, బృందావనం రంగాచార్యగారు తెలుగుబోధ (1954) శతకాన్ని రాశారు బాల వాఙ్మయంలో అత్యంత శోభాయమానంగా వెలుగులోకి వచ్చిన శతకం కవిరావు (1927–)గారి 'ముద్దుపాప' (1956), పాపలకు చక్కని సదుపదేశం చేస్తుంది ఈ శతకం.

బడికి వేళ కేగి పాఠాలు వల్లించి
కొత్తవాని నేర్చు కొనగ వలయు;
క్రమము తప్పకుండ శ్రమ జేసితేనియు
వృద్ధి పొందగలవు ముద్దుపాప!

పిల్లలు బడిలో మెలగవలసిన విధానాన్ని ఇలా తెలియజేస్తారు.

అయ్యవారు ప్రశ్నలడుగుచున్నపుడు
తెలియకున్న అడిగి తెలుసుకొనుము
తెలియకున్నగాని తెలిసినట్లు నటించి
మోసగించుకొనకు ముద్దుపాప !

ఇలాగే ప్రతిపద్యం చక్కని నీతి బోధతో నిక్షిప్తమై యుంటుంది. ఈ కోవకు చెందిన మరొక శతకము వత్సోపదేశము (1963) చలసాని లక్ష్మీనారాయణ రవివర్మ గారి రచన. 'శ్రీరామ కందము (1972) ల పేరుతో పి వి.ఎస్ పాత్రో గారు బిడ్డలకు చక్కని హితోపదేశము చేశారు. అంతర్జాతీయ బాలల సంవత్సర సందర్భంగా వెలువడిన రచనలలో రెడ్డి రాఘవయ్య (1938) గారి 'బాలనీతిమాల' (1979) మంచి రచన. 'తెలుసుకొనుము నీవు తెలుగుబాల' మకుటంతో తెలుగుబాలలు నేర్చుకోవలసిన విషయాలు తేటపరిచారు.

తెలుగు వాడివి నీవు తెలుగు దేశము నీది
తేనెలొలుకు పలుకు తెలుగు నీది
తెలిసి మెలగవలయు తెలుగు జాతి చరిత్ర
తెలిసి కొనుము నీవు తెలుగు బాల!

జీవితంలో నీతి వర్తనకుగల ప్రాముఖ్యతను తెలుపుతూ శతకం సాగిపోయింది. డాక్టరు త్రిపురనేని వెంకటేశ్వరరావు (1919–) గారు తెలుగు బిడ్డ మకుటంతో బిడ్డలకు ఒక శతకం రాశారు ఇంకా కర్రా సూర్యనారాయణ శాస్త్రిగారి 'బాల శతకం' దుర్గానంద్ గారి 'తేనె టీగ' (1979) చెప్పుకోదగిన శతకాలు. తేనెటీగ – బాలలకు అందించే సందేశం చూడండి.

పొద్దునె లేర ! బాలుడ
అద్దములా ముఖము కడుగరా – వెచ్చని పాల్
ముద్దుగ త్రాగరా, పైపై
దిద్దుక జులపాలు బడికి తీరుగ పోరా!

ఈలాగే హితోక్తులతో యీరచన సాగుతుంది.

# గేయాలు

ప్రార్థనా గేయాలు

భారతీయులకు, తెలుగువారికి ప్రార్థన చేసి పని ప్రారంభించడం ఒక సంప్రదాయం. సంపుటీకరించుకొన్న సంస్కృతిలో అదొక భాగం నిండు మనసుతో ప్రార్థన చేశాక ప్రారంభించిన పనులు జయప్రదం కాగలవని మనవారి ఆశ. అందు చేత తెలుగు బాల వాఙ్మయంలో అసంఖ్యాకంగా ప్రార్థనగీతాలు వచ్చాయి. ఏడిద కామేశ్వరరావుగారు "అభయహస్తం" అనే గీతంలో –

పిలిచితే పలుకుతావట !
నా పిలుపులో కులుకుతావట !
ఆపద మొక్కుల స్వామి
నీ సన్నిధి నా పెన్నిధీ                    పిలిచితే
అభయ హస్తమున్నదట
అభయమూర్తి నీవేనట
అభయ దానమిచ్చి నాకు
భవతరణ పథమ్ము జూపు                    పిలిచితే

అని ఆపద మొక్కుల స్వామి శ్రీ వెంకటేశ్వరుని ప్రార్థనా గేయాన్ని బిడ్డలకు అందించి బహుళ ప్రచారం చేశారు. ఇలా ప్రతి దేవుని మీద కవులు భక్తి గేయాలు ఆలాపన చేశారు.

క్రైస్తవ విద్యార్థులు నిత్యం పాడుకొనే ఒక గేయం 'కీర్తనలు – పల్లవులు' (1962) అనే గ్రంథం నుంచి స్వీకరింపబడినది.

ఓ యేసు ప్రభువా
చిన్న పిల్లలను కాపాడుడీ
మొర్ర పెట్టుకొంటిని
చిన్న పిల్లలను - నా
మొరాలకించండి - చిన్న పిల్లను
కోడి తనరెక్కల క్రింద పిల్లను దాచినట్లు
నేడు మీ రెక్కల క్రింద
మమ్మల దాయండయ్యా - చిన్నపిల్లను

ఈ గేయం రాగితాళ యుక్తంగా పాడితే మనోహరంగా ఉంటుంది. ఇలాగే మతాల వారీగా కొన్ని గేయాలు కలవు.

విద్యార్థులు పెద్దల యెడల చూపవలసిన భక్తి ప్రపత్తుల గురించి – జాతి, మత, కుల, వర్గ ప్రమేయం లేకుండా అందరి యెడల చూపవలసిన గౌరవాన్ని ——

దణ్ణాలో! దణ్ణాలో!
అమ్మకు, నాన్నకు దణ్ణాలో!
అవ్వకు, తాతకు దణ్ణాలో!
అన్నకు, అక్కకు దణ్ణాలో!
అయ్యవారికి దణ్ణాలో!

నిత్యం నమస్కరించవలసిన పెద్దల గురించి పి. రాజగోపాలనాయుడుగారు ఈ గేయంలో వివరించారు

ఏనాటినుంచో ఉన్నా మొదటి ప్రపంచ తెలుగు మహాసభల అనంతరం బాగా ప్రచారంలోకి వచ్చిన ప్రార్థనా గీతం ——

మా తెలుగు తల్లికి మల్లెపూదండ
మాకన్న తల్లికి మంగళారతులు
కడుపులో బంగారు కనుచూపులో కరుణ
చిరునవ్వులో సిరులు దొరలించు మాతల్లి

శంకరంబాడి సుందరాచారిగారి రచనను ఈనాడు ప్రతి పాఠశాలలో గానం చేస్తున్నారు. తెలుగు వారి ప్రతిభ, ప్రతిష్ఠ, ప్రాభవం చూపగల గేయాలలో ఇది ఉత్తమమైనది. ఇది గాక తెలుగు తల్లిపై చాల గేయాలు వచ్చాయి [12] ప్రాథమిక విద్యను మరింత ప్రయోజనకరం చేయాలని తలపెట్టిన పథకాలలో అభ్యుదయ ప్రాథమిక పాఠశాలల పథకం ముఖ్యమైనది. ఈ పాఠశాలకు ఒక ప్రార్థనా గీతాన్ని ఆంధ్ర ప్రదేశ్ ఆస్థానకవి దాశరథిగారు రూపొందించారు.

తల్లి భారతి వందనం
తల్లి భారతి వందనం
నీ యిల్లే మా నందనం

..................................

12 సుబ్రహ్మణ్యం, జి. వి. తెలుగుతల్లి—కవితా సంకలనం. హైదరాబాదు, ప్రపంచ తెలుగు మహాసభలు, 1975

మేమంతా నీపిల్లలం
నీ చల్లని ఒడి మల్లెలము
మేమంతా నీపిల్లలం
నీచల్లని ఒడిలో మల్లెలము

ఇలా సాగుతుంది ఈ గేయం. ప్రతి చరణంలో సోదర భావాన్ని, మమతను, మానవత్వాన్ని, తెలుగు జాతి అభ్యుదయాన్ని చాటిచెబుతూ —

భావి పౌరులం మనం మనం
భారత జనులకు జయం జయం

అను - పల్లవితో ఈ పాఠశాల గీతం సందేశాత్మకంగా ముగుస్తుంది.

**బడి- పాటలు**

తల్లి ఒడి వదిలాక పిల్లవాడు స్థిరంగా కూర్చునే ప్రదేశం బడి. బాల్యజీవితంలో విద్యాలయ వ్యాసంగానికున్న ప్రాధాన్యం మరి దేనికీలేదు. విద్యాలయపు బడిలో పిల్లలు తీర్చి దిద్దబడతారు అందుచేతనే "దేశభవిష్యత్తు విద్యాలయాలలోనే తీర్చి దిద్దబడు తుందని" పెద్దలు చెప్పారు. విద్యాలయ వాతావరణానికి అనువైన గేయాలు ఎన్నో ఉన్నాయి. చిన్ని, చిన్ని, ముద్దు ముద్దు పదాలతో అభినయ పూర్వకంగా యివి ఉంటాయి. వీటిని పాడుకోడానికి పిల్లలు ఉత్సాహంగా ఉంటారు.

చిన్న తరగతి పిల్లలము
నిన్ననె బడికి వచ్చితిమి
అ ఆ ఇ ఈ దిద్దితిమి
ఆనందమ్మును పొందితిమి

—కొత్త ఆంధ్రవాచకము

బడిలో పిల్లలు పాడుకొనే పాటను దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు ఇలా రాశారు.

ఇది మాబడి, ఇది మాగుడి
ఇది మా అమ్మబడి
మామనసులకు వెలుగులిస్తుంది
మా బ్రతుకులకు వెలుగులిస్తుంది
పగలూ రేయీ కనిపెట్టి
పదిలంగా కాపాడుతుంది....ఇది మాబడి—

పిల్లవాడికి బడికి వెళ్లడం ఎంతో ఆనందంగా ఉంటుంది. లెఫ్ట్ రైట్ ! లెఫ్ట్ రైట్ ! అన్నంత సరదాగా ఉంటుందంటారు బాలలలో ఒక బాలుడైపోయిన బాలసాహిత్య వేత్త వేజండ్ల సాంబశివరావుగారు. వారు మరోచోట అంటారు —

నిద్దుర లేచా ! పొద్దునుచూచా, చద్దిని మెక్కా
పలకా బలపం, చేతను బట్టా
ఇటే అడుగూ, ముందుకు పెట్టా
లెఫ్ట్ రైట్ ! లెఫ్ట్ రైట్ —

నడుస్తూ బడికి వెళ్తాడు బాలుడు. ఇలా బుద్ధిగా ఒద్దికగా ఉన్న బాలుడికి విద్యా బుద్ధులు మిన్నగా అబ్బుతాయి.

పాపలు బడిలో చేరాక "అ ఆ" లు దిద్దుకోవడం, గణింతాలు నేర్చుకోవడం, వారాలు మాసాలు తెలుసుకోవడం, కూడికలు - తీసివేతలు నేర్చుకోవడం — మొద లైన అంశాలన్నీ మనకవులు చక్కని గేయాలలో పొదిగారు. ఏడిద కామేశ్వరరావు గారు "ఓనమాలు" అనే గేయంలో -

బడికి వెళ్ళావా? బాలా !, బరులు దిద్దావా ?
ఓం నమశ్శివాయ, సిద్ధం నమః అంటూ బాలా ॥బ॥
అ ఆ లొచ్చాయా నీకు, ఇ ఈ లొచ్చాయా?
అ ఆ ఇ ఈ లొచ్చాయంటే, అచ్చు లొచ్చినట్టే బాలా —
క ఖ లొచ్చాయా - నీకు, గ ఘ లొచ్చాయా?
క ఖ గ ఘ లొచ్చాయంటే, హల్లు లొచ్చినట్లే బాలా !

ఇలా అక్షరాలు చెబుతూ "అక్షరాలే అన్ని విద్యలకు ఆధారాలే కాదా బాలా" అంటూ విద్యా ప్రయోజనాన్నిగూడ తెలియజేస్తారు. డాక్టరు గిడుగు వెంకట సీతా పతిగారు ఒక అరటిచెట్టు కథ చెబుతూ వారాల పేర్లను ఆ కథతో యిముడ్చుతారు. అరటి చెట్టును గురించి తెలియగానే వారాల పేర్లు నోటికి వస్తాయి

ఆదివారమునాడు పుట్టె నీ అరటి మొక్క
సోమవారమునాడు సొంపుగా పెరిగింది
మంగళవారాన మరికొంత పెరిగింది
బుధవారమందున బుద్ధుగా, పెరిగింది

గురువారమందున గుజ్జగా పెరిగింది
శుక్రవారమునాడు సోలి వాలింది మరి
శనివార ముదయమే చచ్చి పోయింది.

విద్యాబోధనలో, విజ్ఞాన ప్రచారంలో యిదొక నూతన ప్రక్రియ, ఈ విధానం అనుసరిస్తే విద్యార్థి త్వరగా విజ్ఞానవంతుడు కావడానికి వీలుంది. జనవరి, ఫిబ్రవరి మొదలైన ఇంగ్లీషు మాసాల పేర్లను గేయంలో రాసేపనికి ఏ కవీ ఎందుచేతో పూనుకున్నట్లు లేదు. తెలుగు మాసాల పేర్లను మాత్రం దాశరథిగారు చక్కని ఉప మానాలతో గేయంలో యిముడ్చారు.

చైత్రమాస మేగుదెంచె, చక్కని వేప ప్రసాదం
వైశాఖం వచ్చె నేడు, పసందైన మామిడిలూ
జ్యేష్టమాసమేతెంచెను, చెప్పరాని ఎండలతో
ఆషాఢం ఆగమించె, ఆషా మాషీ జల్లులతో
శ్రావణ మాసం వచ్చెను, చల్లని వానలు వచ్చెను

ఇలా సాగిపోతుంది. ఇందు మాసాల పేర్లతోబాటు ఆయా మాసాలలో ప్రకృతిలో కలిగే మార్పుగూడ తెలుపడం విజ్ఞానదాయకమైన విషయం. అంకెలు వచ్చే సూత్రాన్ని డాక్టరు చల్లా రాధాకృష్ణశర్మగారు నాలుగే పంక్తులలో పది అంకెలను ఒక గేయంలో వివరించారు

ఒకటి రెండు మూడు నాలుగైదు,
నీవు దైవభక్తి కలిగియుండు
ఆరు ఏడెనిమిది తొమ్మిది పది
దైవమెపుడు నిన్ను బ్రోచుచుండు

వివరణలో ఇదొక కొత్త పద్ధతి అంకెలు బాలలకు రావడానికి సులభ మార్గం. ఎక్కాలు కూడికల విషయంలో టి ఎం. ఎస్ సుజనకుమార్‌గారు వీటిని పాట రూపంలో, హాస్య ధోరణిలో రాసి చక్కని ప్రయోగం చేశారు.

ఒకటి ఒకటి రెండు, గాజు గోళీ గుండు, తాత బోడి గుండు
రెండు రెండు నాలుగు, బిచ్చగాని మూలుగు
గుంటనక్క నీలుగు, తేనె వంటి తెలుగు

ఇలా సాగుతుంది యీగేయం. రంగులు తెలిపే రీతిలో ఆలపర్తి వెంకట సుబ్బారావుగారు గేయం రాశారు.

తెలుసుకోవె బాలా! ఇవి
తెలుసుకోవె బాలా!!
ముగ్గు తెలుపు రంగూ! మసి
బొగ్గు నలుపు రంగూ!!
మబ్బు నీలిరంగూ; చే
మంతి పసుపు రంగూ!!
తిలక మెరుపురంగు!! రా
చిలుక ఆకుపచ్చా!!
వంగపూవు ఊదా! ఇవి
రంగులివే ఏడూ!!

అని ఇంద్ర ధనస్సులోని ఏడు రంగులను గురించి యీ గేయంలో తెలుపుతారు. ఈ విధంగా బడి పాటలు ఆనందాయకంగా, విజ్ఞాన దాయకంగా, చదువులో ఒక భాగంగా వెలిశాయి అది మన బిడ్డల అదృష్టం.

ఆటల పాటలు

తెలుగు బాల సాహిత్యంలో పిల్లల ఆటపాటల శాఖ చాల పెద్దది. చిరకాలంగా ఆటాడే విధానం పాటలో పొందు పరచి ఆడుకుంటూ - పాడుకుంటూ ఆనందించడం మన పిల్లలకు సరదా. ఆ సరదాతోనే ——

ఆటలంటె మాకిష్టం
పాటలంటె మాకిష్టం
ఆడుకుంటూ పాడుకుంటు అలా ఉండుటిష్టం"

అంటారు. అలా ఇష్టమైన పాటలు పాడేందుకు దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు 'అనసూయ' (1919) పత్రికలో —-

రామన్న రావోయి! సోమన్న రావోరి! నీ
కన్నతల్లి - చంకనెక్కి చిన్న పాప దా!
ఆడుకొందాము రా పాడుకొందాము రా
మేడలెక్కి కొండలెక్కి చిన్న పాప దా!

అనే గేయం ద్వారా బిడ్డలను ఆటలకు పిలిచారు. ఈ పాటలు పసిపాపల మొదలు పద్నాలుగు సంవత్సరాల పిల్లలకు వేరు వేరుగాను, అందరికీ చెందినవీ ఉంటాయి. ఏడాది వయసుగల బిడ్డను తల్లి రెండు కాళ్ళమీద పరుండ బెట్టుకొని, కాళ్ళు ఊపుతూ —

ఏనుగెక్కి మనం ఏ వూరెళదాం
ఏనుగెక్కి మనం ఏలూరెళదాం!
గుర్రమెక్కి మనం ఏవూరెళదాం
గుర్రమెక్కి మనం గుంటూరెళదాం

అని ప్రశ్న, సమాధానం — రెండూ తల్లి చెబుతుందనీ గురజాడ అప్పారావుగారు తన గేయంలో వివరించారు. పిల్లలకు పొగబండి ఆట అంటే బలే యిష్టం. పదిమంది పిల్లలుచేరి ఒకరు యింజన్‌గాను మిగతా వారు వెనుక పెట్టెలుగా నిలబడి వరుసగా పరుగెత్తు తుంటారు. ఈ సందర్భంలో పిల్లలు పాడుకోటానికి వీలుగా డాక్టరు గిడుగు వెంకట సీతాపతిగారు —

వడి వడి గా దడ దడ గా
మన పొగ బండి మన రైలు బండి
జఫ్ జఫ్ జ జ జఫ్
జ జ జ జ జ జ జఫ్
పరుగెడుతున్నది పరుగెడుతున్నది
మరియొక స్టేషన్ వస్తూ ఉన్నది.

రైలు బండి పాట అందించారు ఈ పాట పాడుకుంటూ పిల్లలు వడివడిగా నడచి, తర్వాత పరుగెత్తుతారు రైలు సౌకర్యం లేని పల్లెటూరి పిల్లలు ఈపాట అంటే ఎంతో యిష్టపడతారు పల్లెటూరి పిల్లలు ఆనందించే పాటలలో ఏనుగుపాట ఒకటి. పల్లెటూరుకు ఏనుగు ఎప్పుడోగాని రాదు అధిక సంఖ్యాక గ్రామాలకు ఏనుగువచ్చే అవకాశమే లేదు. కనుక ఏనుగు స్వరూపాన్ని ఊహించుకొని, పిల్లలు పాడుకొనే పాటలను షూరి ఆదిశేషువుగారు రూపకల్పన చేశారు.

అదిగో
ఇదిగో
ఏనుగు!

ఇదిగో
అదిగో
ఏనుగు !

తెల్లని కొమ్ముల ఏనుగు, నల్లని రూపు ఏనుగు
చిన్ని కాళ్ళ ఏనుగు, చిన్ని తోక ఏనుగు
చేట చెవుల ఏనుగు, తొండం గలిగిన ఏనుగు !

ఇలా పాట పాడుతుండగానే – ఏనుగును చూడకపోయినా వారికి ఏనుగు స్వరూపం తెలుస్తుంది పిల్లలకు 'డీ డిక్కు' పాట అంటే చాలాఇష్టం. కాస్త నొప్పి తగిలేలా ఒకరి తల ఒకరి నొసలు వద్ద కొట్టుకొని ఈ పాట పాడుతూ ఆడుకుంటారు.

అనగా అనగా ఒకకోతి, కోతికి కలదూ ఒక మూతి
మూతిపైనే ఒక ముక్కు, ముక్కూ ముక్కూ టిక్కు
డీ డీ డీ డీ డిక్కు

ఈ పాటను రేడియో అన్నయ్య న్యాయపతి రాఘవరావుగారు రేడియోలో, ప్రదర్శనలలో వందలసార్లు పాడి, ఆడి వినిపించారు. ఈ పాటకు మరో మలుపు ఇచ్చారు బాలాంత్రపు రజనీ కాంతారావుగారు.

డీ డీ డీ డీ డిక్కు
డీకా డీకా వేడెక్కు
పాపబుర్రా, నాన్నబుర్రా
డీకొంటున్నా యెల్లా గర్రా
పాముబుర్రా మంచి బుర్రా
ఎవరయినా చెప్పండర్రా

అని బిడ్డను కాళ్లపై పడుండబెట్టుకొని తండ్రి కాళ్ళను ఊపుతూ బిడ్డలకు తన తలకు కొట్టుకొని తండ్రి పాడతాడు. వాన వచ్చేముందు, చిట పట చినుకులు పలచగా పడుతున్న సమయంలో పిల్లలు పాడుకొనేందుకు వీలుగా పిలకా గణపతిశాస్త్రి, బాలాంత్రపు రజనీకాంతరావు, డాక్టరు చల్లా రాధాకృష్ణశర్మ ప్రభృతులు చక్కని పాటలు రాశారు. శర్మగారి గేయం ఇలా ఉంటుంది.

వానా వానా వల్లప్పా
కురవకు కురవకు వల్లప్పా

బడికి వెళ్ళెను వల్లప్పా
మా చిట్టి తమ్ముడు వల్లప్పా
వానకు తడిసిన వల్లప్పా
పడిసెము పట్టును వల్లప్పా
పిమ్మట వచ్చును వల్లప్పా
జ్వరము వచ్చును వల్లప్పా

అని ఆరోగ్య సూత్రాలను గూడ ఈ పాటలో పంచదార మాత్రలుగాచేసి అందించారు 'దోబూచి' అనే ఒక క్రీడా విశేషాన్ని తీసుకొని తాళ్లపాక అన్నమాచార్యుల (1408-1503) వారు దోబూచి పదాలను మన కందించారు. తల్లులు తమ కళ్ళకు చేతులు అడ్డంపెట్టుకొని 'దోబూచీ' అంటూ గప్పున తెరచి బిడ్డలను ఆశ్చర్యంలో ముంచెత్తుతారు తల్లి అంటుంది

బండి విరిచి పిన్నపాపలతో నాడీ
దుండగీడు వచ్చె దోబూచీ

పెరుగు వెన్నలును బ్రియమున వే
మరు ముచ్చిలించు మాయకాడు
వెరువున దన విధము దాచుకొని
దొర దొంగ వచ్చె దోబూచీ -

గొల్లపల్లెలో యిల్లిల్లు జొచ్చి
కొల్లలాడిన కోడెకాడు
మెల్లయినా వేంకటేశునిడిదే
తొల్లిటి దొంగవచ్చె దోబూచి

అంటూ చేయి అడ్డంతీసి కళ్ళు తెరువగానే బిడ్డ ఆనందంతో ఉరకలు వేస్తుంది దోబూచి- ఆటపై తెలుగు కవులు ఎందరో పాటలు రాశారు వాటిలో మరో మంచి పాట బాలాంత్రపు రజనీకాంతరావు గారిది-

దోబూచి, దోబూచి కళ్లూ రెండూ మూచేచి
అమ్మకొంగు దాచేచి దోబూచి, దోబూచి
నాన్నా ఏడీ పాపాయి కన్నా డీడీ కన్నాడు
బూచాడు బూచాడు బూచాడంటే బయమేచి

కళ్ళకి గంతా తీచేచీ....
చీ చీ చీ, చీ చీ చీ చీ చీ అంఖే చిగ్గేచి
పక పక పక పక నవ్వేచి దోబూచి దోబూచి

అనగానే బిడ్డ కళ్ళు తెరచి ఆశ్చర్యంతో తల్లి ఒడిలో వాలుతుంది. ఇలాటి ఆటే 'దాగిలిముచ్చు' లేదా 'దాగుడుమూత'. తల్లి దొర దొంగకళ్ళు మూయగా తోడు దొంగలు దాక్కుంటారు దొర దొంగ వారిని పట్టుకోవడమే ఈ ఆటలో విశేషం. తాళ్ళపాకవారి 'కూగూగు పదం' ఇలాటి బాల క్రీడా విశేషాన్ని వర్ణిస్తుందని వేటూరి ఆనందమూర్తిగారు రాశారు. [13]

పిల్లలకు ఆటలతోబాటు ఆటబొమ్మలూ చాలా యిష్టం. నార్ల వెంకటేశ్వరరావుగారు తన అసంపూర్తి గేయంలో తనబిడ్డ కొయ్య బొమ్మను అలంకరిస్తూంటే-ఎందుకమ్మా —అని ప్రశ్నిస్తాడు.

కొయ్య బొమ్మకు కోక లెందుకు
మురియుగా అది ముద్దు తల్లీ
కోకకట్టిన, రైక తొడిగిన
కులుకుతూ అది పలుకునమ్మా! ముద్దుతల్లీ!

తండ్రి హేతువాదం, కూతురు అమాయకత్వం ఈ గేయంలో వివరించబడ్డాయి.

### పండుగ పాటలు

పిన్నలకు, పెద్దలకు ఆనందాన్ని చేకూరుస్తాయి పండుగలు. పండుగలు మన సంస్కృతీ స్రవంతిలో ఒకభాగం పిల్లలు, పండుగలు లేకపోతే జీవితం నిస్సారంగా ఉంటుంది తెలుగు పండుగలపై బాల సాహిత్య వేత్తలు చాల గేయాలు రాశారు.

రమ్ము రమ్ము ఓ ఉగాది !
రమ్మాదరి కొక్కసారి !!
కులాసాల దిలాసాల
కోకిలముల కుహుకుహుల, వీనులార వినగా

..........................

13 ఆనందమూర్తి, వేటూరి. బాలక్రీడాగానము (తాళ్ళపాకకవుల పదకవితలు-లో) 1976 382 పు

అంటూ అలప్ర్తి వెంకట సుబ్బారావుగారు తెపి, చేదుల ఉగాది గీతాన్ని ఆలపించారు. వారు దాదాపు అన్ని పండుగలపై పాటలు రాశారు ధాన్యరాసులు ఇంటికి వచ్చిన వేళ రైతుల పండుగగా ప్రసిద్ధిగన్న సంక్రాంతి పండుగనాడు బాలలు ఎలా పాడుకుంటారో తంగెళ్ళ పాండురంగ శర్మగారు—

సంక్రాంతి పండుగ వచ్చింది!
మంటలు రేగినవి–భోగి మంటలు రేగినవి
తెల్లవారినది పాపల్లా ? మీ
రెల్లరు వేగమె తలంటుకోండి
మంచి దుస్తులతో ముస్తాబై యిక
పండుగ పాటలు పాడుకోనండి

అని చక్కని పాటలను బిడ్డలకు అందించారు టపాసులు, మతాబాలతో ఇంటిల్లిపాదీ పాల్గొనే దీపావళి పండుగ పాటను ఎల్లోరా గారు ఇలా పాడతారు

వచ్చింది వచ్చింది దీపావళి
రండోయి రండోయి ఆడుకుందాము!
అమ్మ దీపాలు పెట్టేటి చోటు
అక్క, బావలు మనల చూచేటి చోటు
గుంపులా దీపాలు వెలిగేటిచోటు

రండోయి పాపలు కాకర్ల తోటి
రంగులా కాకర్లు కాల్చుకుందాము !"

ఇలా పాడుకుంటూ మతాబులు కాల్చుకుంటూ ఆనందంగా గడిచిపోతుంది దీపావళి. దీపావళి పండుగను గురించి ఒక కవి ఇలా చమత్కరిస్తాడు.

అనగా అనగా ఒక చిచ్చు
దీపావళికే అది వచ్చు, వస్తే మనకెంతో డబ్బు ఖర్చు

ఇలాటి చమత్కార చంద్రికలు బాలసాహిత్యంలో అసంఖ్యాకంగా ఉన్నాయి. అసలు సిసలైన పిల్లల పండుగ దసరా ఈ పండుగ సమయంలో ఉపాధ్యాయులు పిల్లలు తల్లిదండ్రుల ఇండ్లకు దసరా పద్యాలు పాడుకుంటూ తిరిగే దినాలుగతించాయి. ఈ పండుగ దినాలలో ఇంటివద్ద ఉండి పిల్లలు పాడుకొని ఆనందించే పాటను డాక్టరు దివాకర్ల వెంకటావధానిగారు మన కందించారు

దసరా పండుగ వచ్చినది
ధరణి మోము వికసించినది
నభమున మబ్బులు వచ్చినవి
నలుగడ కాంతులు హెచ్చినవి

ఇలా సాగుతుంది పాట దసరా సందర్భంలో విచ్చుకొన్న ప్రకృతి సౌందర్యాన్ని గూడ అవధానిగారు ప్రదర్శిస్తారు.

**ప్రకృతి**

"కావ్యమొక రమ్యమైన కల్పనారూపం. భావుకత దానికి ప్రాణం. ఆ ప్రాణానికి ప్రేరణ నిచ్చే సౌందర్య విధానం ప్రకృతి ... కవి భావనా గుణగౌరవానికి నాటికీ నేటికీ గీటు రాయి ప్రకృతి తెలుగు కవుల భావుకతకూ విషయ వైశద్యానికీ పాండిత్యానికీ అద్దం పట్టే అందాల కావ్యహస్తాలు ప్రబంధాలు" [14] ప్రకృతిని వర్ణించే ప్రబంధాలకు దీటైన కావ్యాలు, ఖండికలు బాల వాఙ్మయంలో కూడ లేకపోలేదు. గురజాడ అప్పారావుగారు 'ఏమని పలికిందీ?' అనే గేయంలో—

ఉరుములు మెరుపులు మెరిసే వేళా
తొలకరి వానలు కురిసే వేళా
మల్లెలు మొల్లలు పూసే వేళా
మామిడి ఫలములు పండే వేళా
బూరుగు చెట్టు చిలకలతోటి
ఏమని పలికింది ?
పండిన పండు ఎండినదూదై
పక పక నవ్వింది

ఇలా ప్రకృతి సౌందర్యాన్ని అందించే రచనలు బాలసాహిత్యానికి దీప్తిని చేకూర్చుతున్నాయి

**బోధనలు : నీతులు**

బిడ్డలకు చిన్నతనం నుంచే చక్కని వ్యవహార జ్ఞానంతోబాటు, ఆచరణీయమూ ఆలోచనాత్మకమైన నీతులు, బోధలూ తగిన సమయంలో అందిస్తే వారి జీవితం సుందరతరం కావడానికి వీలుంది ఈ మంచి ప్రయత్నాన్ని కొందరు రచయితలు దోహదం చేశారు. గంగరాజు సుశీలాదేవిగారు 'కడిగిన ముత్యాలు' అనే గేయంలో—

..........................

14 నరసింహం, అంతటి ప్రబంధములలో ప్రకృతి వర్ణనలు, హైదరాబాదు, సమతా సాహితి, 1979

తెల్లని ఉడుపులు తొడిగి, మల్లెపూలలా పిల్లలు
శుచిగా ఉండండీ, పరిశుభ్రత నేర్వండీ
ఆరోగ్యము అందము, చూచువారి కానందము

అని బిడ్డలకు ఆచరణ యోగ్యమైన మంచి సలహా ఇస్తారు వక్కలంక లక్ష్మీపతిరావుగారు చదువుకు గల ప్రాధాన్యాన్ని వివరిస్తూ-

చదువులు చదవాలి పెద్ద పదవులు గెలవాలి!
పదవులు పొంది ప్రజాసేవలో ప్రథములు కావాలి. అంటూ

చదువు ప్రజా సేవకు వినియోగించి మానవ కల్యాణానికి తోడ్పడాలని ఉపదేశమిస్తూ-

పన్నిన చీకటుల్-బాపంగ నొక్క
సన్నని దీపంబు-చాలదే తెలుప అంటూగు

అన్నట్లు కోసూరు పున్నయ్యగారు 'గోరంత దీపం' (-1979) లో —

అనకూ అనకూ చెడు అనకు-
కనకూ కనకూ చెడు కనకు-
వినకూ వినకూ
చెడు వినకు -
అదే! అదే! మన
బాపూజీ అమరవాణి, అమృతవాణి -

అని బాపూజీ మూడు కోతులద్వారా మానవాళికిచ్చిన సందేశాన్ని గేయ రూపంలో బిడ్డల కందించారు పున్నయ్యగారు.

వ్యంగ్యం : హాస్యం

పిల్లలు వ్యంగ్య రచనలను ఒకొప్పుడు త్వరగా గ్రహించ లేరు. హాస్య రచనలను బాగా అర్థం చేసుకుంటారు ఆనందిస్తారు. ఐనా హాస్య కథలు, నాటికలు బాగా వచ్చాయిగాని, గేయాలు ఎక్కువగా రాలేదు వచ్చినవాటిలో మేలైనవి లేకపోలేదు. న్యాయపతి రాఘవరావుగారు 'బాల' తొలిసంచికలలో 'పొట్టిబావ' పేరుతో కొన్ని హాస్య గేయాలు రాశారు

పొట్టిబావ పొట్టిబావ! ఏ చేశాడు
ఉట్టిమీద చట్టిలో పెరుగు చూశాడు
పెరుగుచూసి నోరువూరి ఎగిరి చూశాడు
ఎగిరి ఎగిరి అందలేక క్రింద పడ్డాడు

ఇలా నవ్వు వచ్చే గేయాలు సచిత్రంగా ఉన్నప్పుడు మరింత ఆసక్తికరంగా ఉంటాయి

ఒక గ్రామంలో ఉండే మునసబు, కరణం, సర్పంచి, నాయుడు, పూజారి, సెట్టి, పిచ్చాడు, వస్తాదు, నాటు వైద్యుడు మొదలైన రకరకాల వ్యక్తులను గురించి హాస్య, వ్యంగ్య ధోరణి వారి వృత్తులన, ప్రవృత్తులను వింత చేష్టలను తెలిపే గేయాలు అలపర్తి వెంకట సుబ్బారావుగారు కొన్ని రాశారు.

ముఖ్యులు వీరు, మునసబు గారు!
తగవులు పెంచు, తలలు త్రుంచు!!
సర్పంచి గారు, దర్పంగలారు!!
ఓట్లప్పుడె వీరు, మాట్లాడతారు!!
గుళ్లో పూజారి గోవిందాచారి
పిక్కి ముప్పాలు, పెట్టు అప్పాలు!!

ఇదే ధోరణిలో రచన సాగుతుంది.

చమత్కార ధోరణిలో ఈ కోవకు చెందిన "ఎట్లా ?" అనే గేయాన్ని ఆళ్ల రాఘవయ్యగారు రాశారు.

మా చెట్టుమీద పిట్ట, మాపై వేస్తుంది రెట్ట
గుడిలో పూజారిగారు గుడి దోస్తున్నా రెట్ట!

ఈ రచనలు పిల్లలకు వినోదాన్ని కలిగించడమేగాక సమాజంలో కొందరు వ్యక్తులను అపహాస్యం చేసే తీరులో కొత్తదనం కనిపిస్తుంది

# కథాగేయాలు

## గేయ కథలు

పాపలకు, పిల్లలకు గేయాలంటే చాల యిష్టం కథను గేయంలో మలిస్తే అది గేయకథ అవుతుంది వీటినే కథాగేయాలు, పాట కథలు, చిత్ర కథా గేయాలు అని అంటున్నారు ఐనా ప్రచారనామం గేయ కథలు మాత్రమే. "కథలను కథలుగా గాక, గేయకథలుగా వ్రాయడం కవితా విన్యాసం! గేయ కథలు చదువుకోడానికి చాల హృదయం గమంగా ఉంటాయి." [15] గేయం పద్యం కంటే లయ బద్ధంగా నడుస్తుంది గనుక గేయాలకు, గేయ కథలకు మంచి ప్రచారం వచ్చింది. "గేయ కథల్లోని నీతులు పసిడి హృదయాలలో చక్కగా హత్తుకుంటాయి. ముందు ముందు వాళ్ల ఉన్నతులు కావడానికి ఉపయోగపడతాయి" [16] ఈ విషయాన్ని గమనించి బాల సాహిత్య వేత్తలు యీ ప్రక్రియ ఎడల ఆదరణ చూపి వందల సంఖ్యలో గేయ కథలు రాశారు

నేటివరకు వచ్చిన, నేడు వచ్చిన గేయ కథలలో కొత్తగా కల్పించిన కథలు తక్కువ. బాగా ప్రచారంలో ఉన్న పంచతంత్ర హితోపదేశ కథలు, ఈసపు కథలు, టాల్‌స్టాయి కథలు, లేదా జనసామాన్యంలో ప్రచారంలో ఉన్న కథలను స్వీకరించి, కొన్ని కల్పనలను చేర్చి - వీలైతే ఆ కథను కొంత మలచి గేయాలుగా రూపొందించినవి బహుళంగా ఉంటాయి. సాధారణంగా నీతి, యుక్తి, చమత్కారం - ఈ మూడు లేదా ఒకటి, రెండు ప్రతి గేయ కథలో విధిగా ఉంటాయి. అవి లేందే గేయకథ రక్తి గట్టదు. పైగా కొస మెరుపు ఉండనే ఉంటుంది.

జానపద సాహిత్యంలో గేయ కావ్యాలు చిరకాలంగా ఉన్నాయి ప్రత్యేకంగా, నిర్దిష్టంగా ఒక రచయిత పేరుమీద వచ్చిన గేయ కథలు యిటీవలి కాలంలోవే. అంటే దాదాపు యీ శతాబ్దంలోనివే దీనికి ఆద్యుడుగా డాక్టరు గిడుగు వెంకట సీతాపతి గారినే చెప్పుకోవచ్చును. సీతాపతిగారు గుంటూరు నుంచి వెలువడే క్రైస్తవ మిషనరీల పత్రిక 'వివేకవతి' లో 1909లో 'చిలకమ్మ పెళ్ళి', 'ఎలుక-పిల్లి' అనే గేయ కథలను రాసినట్లు చెప్పుకున్నారు. పైగా యీ రచనలు "గ్రాంథిక భాషలో

..........................

15 కామేశ్వరరావు, ఏడిద. బాలల గేయాలు - గేయకథలు. బాలసాహిత్య శిక్షణ శిబిరం, 1979.

16 వెంకట సుబ్బారావు, అలపర్తి. బాలల కోసం గేయకథలు. ఆంధ్రప్రదేశ్ బాలల మహాసభలు ప్రత్యేక సంచిక, 1977. 123 పు

లేవన్న కారణమున పెద్దల మన్నన పొందలేదని" [17] కూడ బాధపడ్డారు. ఐనప్పటికి 'చిలకమ్మ పెండ్లి' గేయం తొలి గేయాలలో ఒక జాతిరత్నం. ఎత్తుగడలో, నడకలో దానికదే సాటి నాటికీ, యీనాటికీ.

చిలుకమ్మ పెండ్లియని, చెలికత్తెలందరును
చెట్లు సింగారించి, చేరియున్నారు
పందిటు పిచ్చుక సందడి చేయగ
కాకులు మూకలు బాకాలూదగ

.....................

సాలీడిచ్చిన చాపు కట్టుకొని
పెండ్లికుమారుడు బింకము చూపగ
సీతాకోకల చీరకట్టుకొని
పెండ్లి కుమారిత ప్రేమచూపగా

పక్షుల కిలకిలారావాలమధ్య "చిలుకమ్మ మెడగట్టె చింతాకుపుస్తె" అని మనోహరంగా ముగుస్తుంది యీ కథ ఇలాగే సీతాపతిగారి 'ఎలుక-పిల్లి' కథ, సాలెపురుగు ఈగ కథలు మనోజ్ఞంగా ఉంటాయి.

ఆ తర్వాత గురజాడ అప్పారావుగారు తెలుగుబడికి ప్రాధాన్య మిచ్చి మిశ్ర గతిలో నడిచే దేశీ ఛందస్సులో ముత్యాలవలె ముద్దు గొలిపే ముత్యాల సరాలలో పూర్ణమ్మ (1919) కథను రాశారు. ఈ ముత్యాల సరాలు జానపద గేయాలలో ప్రసిద్ధమైన -

గుమ్మడేడే గోపితల్లి
గుమ్మడేడే ముద్దుగుమ్మా
గుమ్మడేడే కన్నతల్లి
గుమ్మ డేడమ్మా

అనే వృషభ గతిగడను పోలి ఉంటాయి 'పుత్తడి బొమ్మ పూర్ణమ్మ' అనే కరుణరస పూరితమైన గేయ కథ

మేలిమి బంగరు మెలతల్లారా!
కలువల కన్నుల కన్నెల్లారా!

...........................

17 వెంకట సీతాపతి, గిడుగు. బాల వినోదము. తెనాలి, ఓరియంట్ పబ్లిషింగ్ కంపెనీ, 1957. 8 పు

తల్లుల గన్నా పిల్లల్లారా!
విన్నారమ్మా యీ కథను?

అంటూ కథను ప్రారంభించి – హృదయ విదారకకరమైన విషాదాంత కావ్యంగా ముగిస్తారు గురజాడ. ఇది పిల్లల కోసం రాసిన కావ్యం కాకపోయినా పిల్లల మనసుకు నాటిన కావ్యం కనుక బాగా ప్రచారంలోకి వచ్చింది.

భారతి, గృహలక్ష్మి మొదలైన పత్రికలు బాలల రచనలను బాగా ప్రోత్సహించాయి. ఎన్నో గేయ కథలను ప్రచురించాయి. పిల్లల కోసం ప్రత్యేకంగా ఏర్పడిన బాల, చందమామ మాసపత్రికలు గేయ కథలకు ఇతోధికమైన ఆదరణ చూపాయి. 'బాల' వెలువరించిన కొత్తలో మహాకవి శ్రీ శ్రీ 'కప్పవైద్యుడు' – అనే మంచి గేయకథను ప్రచురించారు.

అనగా అనగా ఒక కప్ప
అది తానొక గొప్ప
వైద్యుడని భావించింది
వైద్యం చేస్తానని చాటించింది

అన్ని జంతువులు నమ్మాయి కప్ప గప్పాలు. నక్క మాత్రం నమ్మలేదు. నక్క వెంటనే అంది –

........ నీకేదో
జబ్బుంది! లేకుంటే ఒళ్ళంతా
ఆ మచ్చలేమిటి? కాళ్ళంతా
ఏమిటా వంకర టింకరలు

ముందు నీ జబ్బు మాన్పుకో. తరువాత యితర్ల సంగతి చూడొచ్చు. కప్ప సిగ్గుతో తల దించింది. బడాయికిపోయి నవ్వులపాలు కాగూడదనే నీతి యీ కథ చెబుతుంది. ఇంకా యిలాటి గేయ కథలు 'బాల పత్రిక' లో అనేకం ప్రచురితమయ్యాయి

గేయ కథలకు 'చందమామ' పత్రిక యిచ్చిన ప్రోత్సాహం యింతింత అనరానిది. తొలి దినాల నుంచి కవిబ్రహ్మ ఏటుకూరి వెంకట నరసయ్యగారు గేయ కథలకు మంచి ఒరవడి పెట్టారు 'చందమామ' లోని తొలి గేయ కథ 'రాజుగారూ – దోమ గారూ' ఎత్తుగడ ఎంత ఉత్సాహపూరితంగా ఉందో చూడండి

రాజుగారి ముక్కుమీద దోమకుట్టింది,
రాజ్యంలో ప్రజలకంతా హడలెత్తింది,
సామంతులు సర్దార్లూ బంట్లూ, సైన్యాధిపతులు
కత్తులతో ఈటెలతో
కదనానికి లేచినారు

దోమను చంపడం ఎవరికి సాధ్యం కాలేదు. దోమ మరల రాజుగారి ముక్కు మీద వాలింది.

ఏమరుపాటుగ నుండిన
దోమను గురిచూచాడు
రాజుగారి ముక్కుమీద
చేతికొద్ది గుద్దినాడు

దోమ హరీమంది : రాజు మెచ్చి అతణ్ణి మంత్రిగ చేశాడు. రాజుల ఉబుసు పోక పను లకు యిదొక మచ్చుతునక ఇదికూడ ఏటుకూరి వారు కంచిమేక, గాలి – వాన, తొట్టకప్ప – కట్టెకాలు, కోడి – కుంపటి, బడాయి మేక, ఒంటె–నక్క, ఎత్తుకు పైఎత్తు, మూకరాజు – మొదలైన అనేక గేయ కథలు రాశారు యువ బాల సాహిత్య వేత్తలకు ఉత్తేజాన్ని కలిగించారు గేయ కథలు ప్రారంభించిన రెండు సంవ త్సరాలకే వారు చనిపోక పోయుంటే – ఎన్ని వందల మంచి కథలు మన ముందుం డేయో చెప్పలేము.

చందమామ పత్రికలోనే వేటగాని సాహసం, స్నేహధర్మం, కలవారి అబ్బాయి – మొదలైన గేయ కథలను ఆలూరి బైరాగి చౌదరిగారు రాశారు. వారి కథ వేటగాని సాహసంలో – వేటగాడు బాలుణ్ణి ఎలారక్షించినదీ తెలుపుతూ – గేయం చివరలో–

సాహసముంటే చాలు, మనిషికెన్నడు ముప్పుండదు
ఇతరుల కోసం సాహసించినా తప్పుండదు

అనే నీతిని బోధిస్తారు. తొలి తరం యిచ్చిన ప్రోత్సాహంతో కవిరావు, నార్లచిరంజీవి, వి వి నరసింహారావు, బోయి భీమన్న, వేజండ్ల సాంబశివరావు, అలపర్తి వెంకట సుబ్బారావు, కె. వి. రమణారెడ్డి, కె. సభా, మధురాంతకం, నండూరి రామ మోహనరావు, శ్రీనివాస కాశ్యప, విద్వాన్ విశ్వం, మేడిచర్ల ఆంజనేయమూర్తి, ఎల్లోరా,

సమతారావు, తాళ్లపూడి వెంకటరమణ, సిద్ధాంతి మల్లికార్జునం, అడ్సుమల్లి, కమ్మిశెట్టి, వారణాసి. ఆళ్ల రాఘవయ్య ప్రభృతులు ఎన్నదగిన గేయ కథలు రాశారు.

కవిరావుగారు గేయ కథా రచనలో ప్రత్యేకమైన కృషి చేశారు. తనదైన ఒక ప్రత్యేక పంథాలో వందలాది గేయకథలు రాశారు. ప్రచారంలోగల కథలను తీసుకొని, హృదయంగమమైన ధోరణిలో చెప్పారు. 'చెలియ' అనే గేయకథలో మట్టి కడవ, రాగి కడవలతో స్నేహం వర్ణించబడింది. గేయ కథాంతంలో

నిన్ను మించినట్టివారి నేస్తమెపుడు
చేయరాదు, చేతులేసి చేటుగల్గును

అనే నీతిని బోధిస్తారు. వియ్యానికైనా, కయ్యానికైనా యీడూ, జోడూ ఉండాలంటారు. అది బిడ్డలుకూడ తెలుసుకొని మసలుకోవాలని వారి ఆకాంక్ష. 'ఎద్దులపోరు' అనే కథలో గొప్పవారి జోలికి చిన్నవారు పోతే ఇడుముల పాలవుతారని చెబుతారు

ఎప్పుడైన గొప్ప గొప్పవారల పోరు
తప్పకను మనబోంట్ల తిప్పలకై ప్రాప్తించు

ఇలా వారి రచన అత్యంత సరళంగా సాగుతుంది.

కథలు పాతవైనా కొత్త తీరులో చెప్పి, హేతు బద్ధంగా, ఆలోచనాత్మకంగా పాటకథలను రాసి చిరంజీవి యైనాడు నార్ల చిరంజీవిగారు.

తీయని మనసుల బాలల్లారా
పాటల తేలే పాపల్లారా
ఇపుడే పూచిన పూవుల్లారా
చెబుతా నేనొక కథ మీకిపుడు

అని ఎఱ్ఱగులాబి, సాహసం, ఆలోచన, తీరని కోరికలు, శేషప్రశ్న, లోభి, కోతి కొబ్బరికాయ, గొప్పవాడు మొదలైన గేయ కథల ద్వారా చక్కని సందేశ మిచ్చారు

తన పేరుకు తగ్గట్టుగా- కె సభాగారు అలతి అలతి పదాలతో కమనీయమైన గేయ కథలు చాల రాశారు 'తోడు దొంగలు' అనే కథలో –

చిటీ పటీ చిటీ పటీ చిత్తారందులో
చెన్నయ్యను నొక వ్యాపారి !
వేషం వేసి మోసం చేసి
కాసులు గొట్టె బేహారి !

మరో గేయ కథలో కలకరంఠ అనిచెప్పి ఒక పెట్టెను విశాఖకు చెందిన వీరన్న అనే వ్యాపారి కిస్తాడు. వీరన్న పంచదార అనిచెప్పి కలకండకు సరిపడా సరుకు యిస్తాడు. ఇద్దరు ఇంటికి చేరతారు విప్పిచూచుకుంటే ఒకరిగోనెలో యిసుక మరొకరి పెట్టెలో గులక రాళ్లు. ఇద్దరు మోసపోతారు. చివరకు చెబుతాడు –

చెరపకు నాయన
చెడుతా వన్నది
చెరగని భారత నీతిగదా !

అని, ఈ విధంగా వేణు విలాపం, పిట్టపోరు, నీవానది కథ, ఉడుత, తోడు దొంగలు, ఎవరిది తప్పు ?, మరువ బోకండి, ఘనులు మొదలైన ఎన్నో కథలు తెలుగు పిల్లలకు అందించారు.

ముళ్లపూడి వెంకటరమణ గారి మాటల్లో చెప్పాలంటే నండూరి రామమోహన రావుగారిది "అందమైన పలుకుబడి మీద అద్భుతమైన పలుకుబడి గల కవిత్వం... పంచతంత్ర చిత్రకథలకు ఆయన మలచిన పద్యాలలో, ఈసపు కథలను మధించి తీసిన గేయ సుధా నిధిలో– ఆయన 'కలం– కారీతనం' పసిపిల్లలకు కూడ ఉత్తేజం కలిగిస్తుంది '' అంటారు.

గ్రీసు దేశ మందు కలడు ఈసప్ అను బానిసీడు
ఏసు క్రీస్తు వలెనె వెన్న పూసవంటి మనసువాడు

అని చెప్పి –

పిట్టలపై, పిల్లులపై లొట్టిలపై, నక్కలపై
పెట్టి యతడు నీతి గట్టిపు కట్టుకథలు చెప్పుచుండు

.......................... ...

18 వెంకటరమణ, ముళ్లపూడి. కథా గేయ సుధా నిధికి - పరిచయం. విజయవాడ. నవీన గ్రంథమాల, 1962. 3 పు.

అని ఈసప్ కథలను గేయకథలుగా రూపొందించారు ఈసప్ ప్రతి కథ చివర చేర్చిన నీతిని కూడ గేయరూపంలో చేర్చారు నండూరి వారు. అనేక చక్కని ఉపమా నాలతో చేర్చి తెలుగు బిడ్డలకు 1955 లోనే వారపత్రికలో వారం వారం అందించారు.

గేయకథా రచనలో బి. వి నరసింహారావుగారికి ఒక ప్రత్యేకత ఉంది ఉపాధ్యాయు డుగా తనకుగల అనుభవాన్ని పురస్కరించుకొని పిల్లలలో సహజంగాగల హేతువాద శక్తిని ఆవూ-హరిశ్చంద్ర, ఏకలవ్యుడు, ప్రహ్లాద, జాబాలి బిడ్డ మొదలైన కథలతో అద్దం పట్టినట్లు చూపుతారు పంతులుగారొక రోజున పాఠాలైపోయాక ఆవూ-పులికథ, సత్యహరిశ్చంద్రుని కథ-రెండూ పూర్తిచేసి ఏ కథ బావుందని పిల్లలను అడిగారు. ఆవూ-పులి కథ బావుందన్నారు. ఎందుకని ? అని ప్రశ్నించారు పంతులుగారు జంకు గొంకు లేక ఒక పిల్లవాడు—

హరిశ్చంద్ర చక్రవర్తి భార్యనమ్మి బిడ్డనమ్మి
కరుణలేని వాడనన్న ఘనత కూర్చుకొనెను చాలు
ఆవుతల్లి యట్లుగాక ఆడి తప్ప లేదు పైగ
కన్నలేగ కయ్యె పాలు కడుపు నిండ యిచ్చి తిరిగి
క్రూర జంతు బలికి తాను ధీరముగ నడచి వచ్చె

అని ఆవుకున్న గొప్పదనం హరిశ్చంద్రునికి లేదని చెప్పాడు ఇటువంటి కథలు బిడ్డలలో ఆలోచన పెంపొందించడానికి కారణమౌతాయి. "నీతిని నేరుగా బోధించక కథా గర్భిత మొనర్చి, గ్రంథకర్త స్వయంగా కాకుండా పాత్రల చేత వెలిబుచ్చి నందుచేత, చదివే వారికి ఉపదేశాలు బాగా మనసు కెక్కుతాయి." [19]

ఈ దృష్టితో కె. వి. రమణారెడ్డిగారు 'కుందేలు-తాబేలు', హెచ్చు-లొచ్చు, భూతదయ, లోకులు-కాకులు, తల్లిపేరు, మృత సంజీవని, స్వామిభక్తి మొదలైన గేయ కథలు రాశారు.

## అభినయ కథా గేయాలు

గేయ కథలలో కొత్త ప్రక్రియ. ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాలలోగల

..............................

19 రమణారెడ్డి, కె. వి. గజ్జెలు - ఘంటలు పరిచయం విజయవాడ, దేశికవితా మండలి, 1956 8 పు.

ప్రాథమిక పాఠశాలలో యీ గేయాల ప్రాధాన్యం మెండు బాలలు ఈ పాటలను పాడేప్పుడు సర్వాంగాల కదలిక లయానుభూతిగల అభినయం ముఖ్యాంశాలు 'కాకి మాంసం ముక్క' అనేపాట పిల్లలు అభినయిస్తూ పాడతారు.

ఓ మంచి కాకమా, మా మంచి కాకమా
అందమైన దానివి, ఆనంద మిచ్చుదానివి

'కాకి - కూజా' అనే మరో గేయంలో -

కాకి ఒకటి నీళ్ళకై, కావు కావు మనుచును
అడవి అంత తిరుగుచు అలసి సొలసి పోయెను
చిన్నమూతి కూజా అడుగునున్న నీరు
కన్నులార చూచెను మనసార వాలెను

ఈ కథను బిడ్డలు అభినయిస్తూ వారికి కథ సులభంగా గుర్తుంటుంది నోటికి వస్తుంది శరీరానికి మంచి వ్యాయామం చేకూరుతుంది బొమ్మల సాయంతో కథలు చెప్పేవాటిని చిత్రకథా గేయా లంటారు నండూరి రామమోహనరావుగారి 'పంచతంత్రం' ఇందుకు మంచి ఉదాహరణ

పాపల గేయాలు

తల్లి తన బిడ్డను ప్రశంసించడం అనాదిగా వస్తున్న సంప్రదాయం. అది సహజ ప్రకృతి. తల్లి ప్రేమకు తార్కాణం. తల్లి బిడ్డను అల్లారు ముద్దుగా చూచుకుంటూ -

జో అచ్యుతానంద జోజోముకుంద
రావె పరమానంద రామగోవింద
తొలుత బ్రహ్మాండంబు తొట్టె గావించి
నాలుగు వేదములు గొలుసు లమరించి
బలువైన ఫణిరాజు పానుపమరించి
చెలియ డోలికలోన జేర్చి లాలించి

అని జోలపాట పాడుకుంటూ తనబిడ్డను బాలకృష్ణునిగా పోల్చుకుంటుందని తాళ్ళపాక అన్నమాచార్యులవారు తన గేయంలో వివరించారు అనంతమైన తల్లి ఆశ, ఊహ

అంతటి ఉన్నతమైనది. తల్లి ఊహలకు కపటాలు, రంగులు, నటనలు ఉండవు. అవి సహజంగా ఉంటాయి డాక్టర్ గిడుగు వెంకట సీతాపతిగారు తల్లి తన బిడ్డ అందచందాలు ఇలా ఊహించుకుంటుందంటారు.

మా పాప అందం, మతాబీల చందం
మా పాప వాక్యం, జిలేబీల చందం
మా పాప హాసం, గులాబీల వికాసం
మా పాప కోపం, పకోడీల కారం

అంటూ – తన బిడ్డకు దిష్టి తగలకుండా కొస మెరుపు చురక చేస్తుంది తల్లి నిన్న మొన్న భూమి మీదకు వచ్చిన పసిపాప నవ్వుతూ ఎంతో అందంగా ఉంటుంది. ఆనందంగా ఉంటుంది. అది——

వెన్నెల కంటె తెల్లనిదనీ
వెన్నెలంత చల్లనిదనీ

నండూరి రామమోహనరావుగారు 'మొన్న మొన్న కనువిచ్చిన చిన్నపాప చిరునవ్వు'ను గురించి చెబుతారు

చిట్టి ప్రశ్నలు

చిన్న పిల్లలకు ప్రశ్నలు చేయడం సరదా. ఆ ప్రశ్నలకు సముచిత రీతిలో సమాధానాలు చెప్పినపుడు వారిలో విజ్ఞానం వికసిస్తుంది కొత్త విషయాలు తెలుసుకోవాలనే ఆలోచన పెరుగుతుంది ఈ సదాశయాన్ని దృష్టిలో ఉంచుకొని బాలసాహిత్యాన్ని సృష్టిస్తున్న కవిపుంగవులు అనేక ప్రయత్నాలు చేశారు డాక్టర్ మిరియాల రామకృష్ణగారు 'చెట్లు' అనేగేయంలో బిడ్డలు అమాయకంగా అడిగే ప్రశ్నలు ఇలా వివరిస్తారు ——

పెద్ద పెద్ద పంఖాలవి వద్దన్నా తిరుగుతాయి
ఎవరమ్మా ! ఈ చెట్లను వీర్నా టూనరించినారు ?
తీయగ పండ్లను ఇస్తూ హాయిగ గాలిని వీస్తూ
ఈ చెట్లను మన మంటే ఇంత ప్రేమ ఏమమ్మా !
ఉపకారం చేసే ఈ ఉద్యోగంలో వీటికి
సెలవు లెప్పుడైనా మరి కలవా ? లేవా ? అమ్మా !

ఈ ప్రశ్నలకు తగిన వివరణలతో, ప్రేమతో సమాధానం తల్లి చెప్పినప్పుడే, ఆమె పైగల సాంఘిక బాధ్యత నెరవేరుతుంది. అప్పలరాజు విక్రమనేనరావుగారు 'ఎందుకు ఏమిటి' అనే గేయంలో పాప సందేహాలను ఇలా వివరిస్తారు.

పగలంతా తెల్లగా, రాత్రినంతా నల్లగా
నీళ్ళేమో చల్లగా, పళ్ళేమో పుల్లగా ఎందుకుంటాయమ్మా!

అని పాప అమాయకంగా అడిగే ప్రశ్నకు సమాధానం చెప్పాలంటే – ఆ పాపకు విజ్ఞాన శాస్త్రమంతా చెప్పాలి మరి ఆతల్లి బిడ్డను ఎలా అనునయిస్తుందో ఆమెకే ఎరుక. పసిడి హృదయాలను అర్థంచేసుకున్న 'ఎల్లోరా' (గొడవర్తి భాస్కరరావు) గారు బాలలు వేసే 'పసిడి ప్రశ్న' లను ఇలా వివరించారు

అమ్మ నా కొక్క
అనుమానమమ్మ
కోకిలా సంగీత మెపుడు నేర్పింది ?
కోకిలకు సంగీత మెవరు నేర్పారే ?
అమ్మ నా కొక్క
అనుమానమమ్మ
చిలుకమ్మ చెన్నెలా చిన్నారి ముక్కుకా
ఎర్రన్ని ఆ రంగు ఎవరు పూశారే ?

ఇలా సాగిపోతుంది గేయం. "తీర్చవే మాయమ్మ తేట పడగానూ" అని బిడ్డ చివరి సారి అడుగుతుంది. తల్లి సమాధానం చెప్పవలసి ఉంది.

డి. సుజాతాదేవి (1940 –) రైలు బండి అనే గేయంలో బిడ్డ తల్లిని ఇలా ప్రశ్నిస్తుంది.

అమ్మా ఈ రైలుబండి
అసలెక్కడ పుట్టిందే
అమ్మెవరే నాన్నెవరే
అన్న మెవరు పెడతారే

మరికొంత సాగాక —

నిప్పులనే మింగునట
నీళ్లు తాగి బతుకునట
కెవ్వున కేకేసి పిలచి
కస్సు బుస్సు మంటుందట

ఇలా పిల్లలలో ఎన్నో ప్రశ్నలు ఉదయిస్తూ ఉంటాయి. వాటిని ఆనందంతో తల్లి దండ్రులు తీర్చాలి

పాపల ఊహాలు

శిశు ప్రవృత్తి వింతగా ఉంటుంది విచిత్రంగా ఉంటుంది. మనం 'వాస్తవిక ప్రపంచంలో ఏదైతే అసాధ్యమని అనుకొంటూ ఉంటామో వారి వూహల్లో అది సాధ్యమూ, సులభ సాధ్యమూ ఐపోతూ ఉంటుంది. వారి ఊహలు అల్లినంత అవాస్తవిక, అలౌకిక, అద్భుత ప్రపంచాలను ఏ కవితా సృష్టించలేదేమో అనిపిస్తుంది[20] అమాయకమూ, అపురూపమూ, అద్భుతమూ, ఆనందమయమూ ఐనవారి భావనా ప్రపంచం భిన్నమైనది. దాన్ని పాటలలో, పద్యాలలో తెలుగుకవులు నవతరానికి అందించారు. పాత ఆలోచనల తరవిడిలో కొత్త ఆలోచనలు ప్రోదిచేసుకొనడానికి దోహదం చేశారు. పాపలు ముద్దు ముద్దుగా, గోముగా పలికే వింత పలుకులకు 'చిలక పలుకులు' (1924) గా అడవి బాపిరాజుగారు మురిపాలతో అందించారు.

నేనమ్మ తమ్ముఁలూ, నేనెవలె అక్కాయ్
నువ్వు చిత్తి పాపాయ్, నేనేమి తియ్యనే
బలికి పోల పాపాయ్, నేను బలికి వెల్లనే
తాయిలమ్ము పెల్తా, బలికి వెల్లి వత్తా

ఇలా ముద్దుపాప కోరికలు సాగిపోతూ ఉంటాయి పిల్లలకు అమ్మ, బొమ్మ అంటే ఎంత ఇష్టమో కవుల ఆంజనేయశర్మగారు "పాపాయి" ఊహను తెలియజేశారు.

అమ్మంటే ఇష్టం, బొమ్మంటే ఇష్టం
అమ్మా బొమ్మా అంటే ఎంతో నా కిష్టం

..............................

20 కామేశ్వరరావు, ఏడిద మన సంస్కృతీ స్రవంతిలో బాల సాహిత్యం ఒక ధార. బాలానందం, 1974, 71 వు

పూప పిందెలు (1954) అనే కావ్యంలో లవణంగారు పిల్లలను పూవులుగా ఊహిస్తారు.

చిన్న వాళ్లమూ మేము, ఎన్నెన్ను ఊహల్లు
ఆటల్లో పాటల్లో అందుకుంటాము
ఆనందమెప్పుడు పొందుతుంటాము
అందమైన పూలు మేము చందమామ కాంతివోలె
జగతిలోని కొచ్చినాము చందనంబు తెచ్చినాము

నార్ల చిరంజీవిగారు జాబిల్లి పాటలు (195 ) లో 'అమ్మా' అనే గేయంలో బిడ్డ ఊహలను ఇలా వర్ణిస్తారు.

అమ్మా!
నేనొక రంగుమబ్బునై ఆకాశంలో ఎగిరిపోనకే ?
దేశదేశములు తిరిగితిరిగి నే తీయని వానలు వర్షిస్తానే!

అమ్మా!
నేనొక మల్లెపూవునై, ఆకులపై నాట్యం చేస్తానే
గాల గుర్రములనెక్కి వచ్చినే, పూలను వాసన లెగ బోస్తానే !

ఇలాగ బిడ్డ తన ఊహా ప్రపంచాన్ని తల్లికి తెలియజేస్తుంది. మరొకసారి బిడ్డ తన 'ముద్దు మాటల' తో తల్లిని అలరిస్తుందని కవిరావుగారు నెలవంక (1958) లో ఊహిస్తారు.

చిలుక ననుకోవె నీ చిన్నారి ననుకో,
'కిలకిలా' మనివచ్చి పలుకరిస్తాననుకో
పట్టి పంజరములో బంధించుతావా ?
పట్టుకే నను విడిచి పెట్టి బంధిస్తావా?

రైతు కుటుంబాలలోని పిల్లలు పెద్దవాళ్లయ్యాక ఏం చేయాలనుకుంటారో - వారి ఊహలను మేడిచర్ల ఆంజనేయమూర్తిగారు తమ గేయంలో తెలిపారు

పెద్దపెద్ద రెండెద్దులు కొంటూ
బండీ నాగలి చేయించేస్తా

ఎండాకాలం బరువు తోలుతా
తొలకరి వానకు స్వాగత మిస్తా
ఏరువాకకు సంతోషిస్తా
కోడికూతతో నాగలి కడతా

ఈ గేయం చదివిన రైతుబిడ్డలో తన బాధ్యత గుర్తురాక మానదు. ఎంతైనా పిల్లలు పెద్దవారి అదుపు ఆజ్ఞలలో నడవవలసిందే. చెప్పు చేతలలో మెలగవలసిందే. ఐనా వారికి ఉండవలసిన స్వాతంత్ర్యం ఉండనే ఉంటుంది వారికే పూర్తిస్వాతంత్ర్యం వస్తే — వారికే అన్ని అధికారాలు ఇస్తే - వారు ఏం చేయదలచుకున్నారో న్యాయపతి రాఘవరావుగారు — ఈ గేయంలో వివరించారు.

పిల్లలకే స్వరాజ్యంవస్తే, పిల్లలకే స్వాతంత్ర్యం ఇస్తే
చిట్టి తండ్రిని రాజుని చేస్తాం చిట్టి తల్లిని రాణిని చేస్తాం
మాతాత ఒక బొమ్మయితేను, మా అవ్వ ఒక బొమ్మయితేను
బొమ్మల పెళ్ళికి రమ్మనమంటూ
కమ్మని విందులు 'గుమ్మ'గ తింటాం

ఇదే అంశాన్ని వెల్దుర్తి మాణిక్యాలరావుగారు 'బాలల రాజ్యం' (1946) గేయంలో ఇలా ఊహించారు.

పిల్లలకే రాజ్యం వచ్చిందంటే
చింత బరికలు చెరగ రాదనీ
బెత్తపు కర్రలు బట్టరాదనీ
తొడపాశాలు చెంప దెబ్బలూ
బుగ్గ గిల్లుడు బెదురు పెట్టుట
సాగ జాలవనీ శాసిస్తామ్

ఇలాగ పాపల వూహలు వింత వింతగా ఉంటాయి. వాటిని కవులు వూహించి మనోహరమైన విధానంలో అందించారు.

పాపల గేయాలు

ఇవి ప్రధానంగా 0—5 వయసుగల బాలలకు పాడి వినిపించే రచనలు ముఖ్యంగా

శబ్ద ప్రధాన రచనలు ఇచట బిడ్డకు గేయంలోని భావం తెలియాల్సిన పనిలేదు బిడ్డపై తల్లికిగల మమకారం, అవ్యక్తానందమైన మధురానుభూతి వ్యక్త మౌతాయి. "పాప పుట్టగానే ఏడుపుతో లీనమై అమ్మ శబ్దం ఉద్భవిస్తుంది. అమ్మ శబ్దంతోపాటు "ఆ" కారవృద్ధి చెందుతుంది. ఆ 'ఆ' కారం సంగీతమై చరచరా ప్రకటానికిగాను – అల్లుకొను ఆధారంకోసం గీతాన్ని వెతుక్కుంటుంది. ఏ తొక్కు పలుకుదొరికినా, దానిని ఆధారం చేసుకొని – సంగీతం విస్తరించు కుంటుంది. వచ్చీరాని మాటలతో, వచ్చీరాని సంగీతాన్ని మేళవించి పసిపాపలు పాడుకుంటూ ఆడుకొనే దృశ్యం – ఆ సత్యాన్ని రుజువు చేస్తుంది. అక్కడే పాటల ఉత్పత్తికి ప్రారంభోత్సవం జరుగుతుంది" [21]. ఈ పాటలను పాలపాటలు, అర్థంలేని పాటలు (నాన్‌సెన్స్ రైమ్స్) అంటారు. బిడ్డ ఆనందం యీ గేయాల ఉద్దేశం, నవీన పథంలో యీ తరగతి గేయాల రచనకు ఆద్యుడు చింతా దీక్షితులుగారు పాపలకు, పిల్లలకు వారు రచించిన గేయాలు పసిహృదయ కుహరాల దరికి చేరినట్లు మరే రచయితవీ చేరలేదు. "ఈ పాలపాటలు వినడం ద్వారానే తొలిసారిగా బిడ్డ సాహిత్యంతో పరిచయం ఏర్పరచుకుంటాడు". [22] ఆ తర్వాత సమాజ ప్రవాహంలోకి వచ్చేస్తాడు

పాపకు గోరుముద్దలు తినిపిస్తూ తల్లి ఆనందంగా పాడేపాటను బాలాంత్రపు రజనీకాంతరావుగారు "బువ్వ" అనే గేయంలో వినిపిస్తారు.

కాకీ, కాకీ హాప్, కాకీ, కాకీ, రాకే రాకే
పాపాయి బువ్వ తింటోందే, కాకీ, కాకీ హాష్
వెండిగిన్నెలో పప్పూబువ్వా గుంజు గుంజు గుంజు గుంజు
గోరు, గోరు, గోరు, గోరు....
కంచం అంచున రాసి, గోరు గుజ్జూ తీసీ
గుజ్జూ నోటికి పూసి, బుజ్జీ నోటూ అం....

ఇలా అంటూ బిడ్డకు ముద్దుముద్దుగా తినిపిస్తుంది తల్లి బిడ్డకు పాడుతూ స్వయంగా

.............................

21 కామేశ్వరరావు, ఏడిద బాలగేయలు, గేయకథలు. బాలసాహిత్య శిక్షణశిబిరం, 1979

22 First Book Jesse Wileax Smith edition of MOTHER GOOSE, 1978 P 17.

అన్నం తినిపించడం ఒక ఆనందం. అది తెలుగు సంస్కృతిలో ఒకభాగం. 'చిలక - పిలక' అంతరాలతో బి. వి. నరసింహారావుగారు పాపలు ఆనందించే గేయం రాశారు.

చింత చెట్టు తొర్రలోన చిలక ఉన్నది
తాత బోడి బుర్రమీద పిలక ఉన్నది
చిలకముక్కు తాతముక్కు తీరునున్నది
చింత తొర్ర తాత బొర్ర తీరు నున్నది
తాతకాళ్ల నున్నజోడు కిర్రుమన్నది!
చింతతొర్రలోన చిలుక తుర్రుమన్నది.

శబ్దప్రధానమైన రచనా ఒరవడిలో బిడ్డలు ఎంతో ఉత్సాహపడే 'తువ్వాయి' మువ్వల్లోని నాదమాధుర్యాన్ని యిలా వినిపించారు కవిరావుగారు.

తువ్వాయి మెడలోన మువ్వలున్నాయి
మువ్వల్ల కడుపులో రవ్వలున్నాయి
రవ్వల్లు కదిలితే మువ్వల్లుపాడు
మువ్వల్లు పాడితే తువ్వాయి ఆడు

ఈవిధంగా పాపలకు వినిపించే గేయాలన్నీ శబ్ద ప్రధానంగా నడుస్తాయి. బిడ్డలు శబ్దాల కమ్మదనంతో ఆనందించడం యీ గేయాల ఒక లక్ష్యం.

## పిల్లల రచనలు

పాపలకు, పిల్లలకు ఎన్నో సరదా లుంటాయి. వానిలో రచనలు చేయడం ఒకటి. సరదాగా పాడుకుంటూనో, ఆడుకుంటూనో - యిట్టే కవిత్వం అల్లేస్తారు. రచయితల పేర్లు తెలియనివారి కవితా ఛాయలను ఇంతకుముందు కవులూ తల్లులు పిల్లలు అనే అధ్యాయంలో వివరించడం జరిగింది. సోవియట్ రష్యాలో కజకస్థాన్‌కు చెందిన పదేళ్ల వయసుగల బాలిక "ఎస్సిదియో రోనా' రాసిన చిట్టికవితలసంపుటాన్ని 'ది క్లాక్' గడియారం అనే పేరుతో ప్రచురించారు.[23] అంతర్జాతీయ

..........................

23 బాలచంద్రిక. జూలై 1980, 20 పు

బాలల సంవత్సరం సందర్భంగా ఢిల్లీలో 1979లో ఏర్పాటు చేసిన అంతరాతీయ బాలల పుస్తక ప్రదర్శనలో మరాఠీ భాషలో ఎనిమిదేళ్ల బాలిక రాసిన కవితా ఖండికలను ప్రచురించారు. ఆంధ్రవారపత్రిక, బాల, బాలచంద్రిక పత్రికలు బాలల రచనలను బాగా ప్రోత్సహించాయి. 1949 జూన్ 1 తేదీ ఆంధ్రవారపత్రికలో నాలుగవ తరగతి చదువు తున్న పాప చిరంజీవి కాజ చినమాణిక్యం రచన 'ఏమిజరిగినది' ప్రచురింపబడింది.

అప్పన్న గుడిమీద కప్ప చచ్చింది
రారా తమ్ముడా, మోసికెళదాము
మీ ఎద్దు మాఎద్దు నీళ్ల కెళ్ళింది
తాతగా రెద్దొచ్చి తరిమి తరిమి పొడిచింది
మామగా రెద్దొచ్చి మంత్రమేసింది
ఎద్దు కొమ్ములమీద పొద్దుకూకింది
కోటి దిబ్బలమీద కోడి పందాలు

ఇలాగే పిల్లల ఆలోచనలు తెలియజేస్తే మరికొన్ని గేయాలు రాకపోలేదు. కల్పనా దీప్తి అనే పదేళ్ల పాప రాసిన మరో గేయం చూడండి.

చిన్నా బొమ్మా, కమ్మని బొమ్మా
ఎందుకు అమ్మా ఏస్తావికమ్మ
ఆ బొమ్మచూచి, ఈబొమ్మవస్తే
ఎంత బాగుంటుంది ఆహా ఆహా....

అని నవ్వుతుంది. ఇందు సహజమైన లయ, యతి సంభాషణా చాతుర్యం ఉన్నాయి. ఎందుకు అమ్మ – ఏస్తావికమ్మ అని 'ఎ ఏ' లకు యతి పాటించడం జరిగింది. అప్రయత్నంగా సాగిన రచనలో సహజ యతి అది. ఈ విధమైన రచనలను బాల చంద్రిక పత్రిక "మీకోసం ప్రత్యేకం" అనే శీర్షికలో ఎక్కువగా ప్రచురించి బాలసాహిత్య అభివృద్ధికి దోహదం చేస్తూంది. బాలల ఊహలు తెలుసుకోడానికి ఇటీవలి కాలంలో వచ్చిన కొన్ని గేయాలు చూద్దాం. జి. హెచ్. రాజ్యలక్ష్మి అనే పాప "లోకంచూస్తా" అనే గేయంలో –

గుర్రం గుర్రం పరుగుల గుర్రం
నురుగులు కక్కుచు పరుగెడు గుర్రం
గగనా నెగిరే రెక్కల గుర్రం
లోకాలన్నీ తిరిగే గుర్రం
గుర్రమెక్కుతా కళ్ళెం పడతా
స్వారీ చేస్తా లోకం చూస్తా

అందని పండ్లు పులుపు అనే సామెతను చెప్పే గేయాన్ని ఓంకారం వెంకటరాజు అనే బాలుడు రాశాడు[25] – నక్క– ఆకలి అనే గేయం పేరుతో –

ఆకలైన నక్క ఒకటి తోటలోకి పోయెను
చెట్టుమీద ఉన్న ద్రాక్ష గుత్తులను చూచెను
తినాలని అనుకొనెను, అందకుండ పోయెను
వెంట వెంట ఎగిరెను, వెల్లకిల పడిపోయెను
మంచి పండ్లుకావు అన్నీ పులుపు అని
మౌనంగా పోయెను

ఇలా సాగుతాయి గేయాలు వీటిని ప్రోత్సహించవలసిన అవసరం ఉంది

అమెరికాలో పిల్లల రచనలకు ఎంతో ప్రోత్సహిస్తారు ఇవి బాలలలో సృజనాత్మక శక్తిని, ఆలోచనాశక్తి పెంపొందిస్తాయని వారి నమ్మకం విలియమ్స్ అనే బాలుడు రాసిన గేయాలు రెండు చూడండి–

DEAR DOG
Please
for
give
me
for
eating
your
dog
biscut

THIS IS JUST TO SAY
That the dog
tore your
shoes in
to little pieces
and I let him
do it, It was quite amusing

.......................

25 బాలచంద్రిక. మే 1980

ఇలాటి గేయాలు ఆంగ్లంలో వందలు, వేల సంఖ్యలో ఉన్నాయి. ఆ పిల్లలు వీటిని ఆనందంతో పాడుకుంటూ ఉంటారు

## రికార్డులు

సినిమాలలో, రికార్డులలో పిల్లల పాటలు బాల గేయసాహిత్యంలో సినిమా పాటలు ఒక చెప్పుకోదగిన విభాగం ప్రసిద్ధ రచయితలైన ఆరుద్ర, సి నారాయణరెడ్డి, దాశరథి మొదలైన వారు పదుల సంఖ్యలో సినిమాలో పిల్లల పాటలు రాశారు వీటిలో పుస్తక రూపంలోకి వచ్చినవి అతితక్కువ ఈ పాటలలో బాలలపై తల్లులు పాడేజోలపాటలు, లాలిపాటల సంఖ్య ఎక్కువ పిల్లలు స్వయంగా పాడేవి తక్కువ "సినిమాలలో పాటలువిని లయ జ్ఞానం అలవరచుకున్న బాల లెందరో ఉన్నారు. వాటిని అనుకరించి ఆకర్షణీయంగా పాడడం నేర్చుకున్నవారూ ఉన్నారు''[26] సినిమా పాటలు స్వర ప్రధానంగా శ్రావ్యంగా ఉంటాయి గనుక పిల్లలలో బాగా ప్రచారం కావడానికి వీలుంది

'బాలానందం' పిల్లల సినిమాల్లో ఆరుద్రగారు ఆ సినిమాను ఒక పాటగా రాస్తారు.

నమస్తే నమస్తే
చాల సుదినం - చాలా సుదినం
బాలానందం చూడండి - నమస్తే నమస్తే
బాలానందం చూసే ముందర
నాలుగు మాటలు చెప్తామండి — క్షమిస్తే — క్షమిస్తే
ఏమీ ఎరుగని పిల్లలము — మే
మింకా పండని పిందెలము — మీ
వినోదానికి అడెదమండీ
సంతోషిస్తాం మా ప్రయత్నాలు ఫలిస్తే - ఫలిస్తే

ఇలా జరిగిపోతుంది గేయం "కోడలు దిద్దిన కాపురం" లోని సందేశాత్మక గేయం—

..........................

26 వరదాచార్య, జి. ఎన్. చలనచిత్రాలలో బాలగేయాలు. ఆంధ్రప్రదేశ్ బాలల మహాసభలు, ప్రత్యేక సంచిక. 1977. 257 పు

నీ ధర్మం నీ సంఘం
నీ దేశం నువు మరవద్దు
జాతిని నడపిన మహనీయులనే మరవద్దు

బాగా ప్రచారంలోకి వచ్చింది 'బడి పంతులు' అన్న చిత్రంలోని –

పిల్లలం బడి పిల్లలం
పలకా బలపం పట్టిన చేతులే
పలుగూ పారా పట్టాయి
ఓనమాలు దిద్దిన వేళ్ళే
ఒకటై మట్టిని కలిపాయి

ఇలా పిల్లలలో దీక్షను, త్యాగాన్ని పెంపొందే పాటలు కొన్ని లేకపోలేదు పాపం పసివాడు చిత్రంలో అమ్మా చూడాలి, నిన్ను నాన్నను చూడాలి అనే కరుణరసాత్మకమైన పాట, 'పెళ్ళి చేసి చూడు' చిత్రంలో 'అమ్మమ్మా నొప్పులే; అమ్మా నొప్పులే;' అనే వినోదాత్మకమైన పాట – ఇలా బాలల సినిమా పాటలు విజ్ఞాన వినోదాల హరివిల్లు

గ్రామఫోన్ రికార్డులలో వచ్చిన గేయాలను ప్రత్యేకంగా పేర్కొనాల్సిన పనిలేదు. రేడియోలో, పత్రికలలో, పుస్తకాలలో వచ్చే మంచి గేయాలే గ్రామఫోన్ రికార్డులలో వచ్చి మరింత ప్రచారాన్ని అందుకున్నాయి. న్యాయపతి రాఘవరావుగారు 1951 లో హెచ్ ఎం వి గ్రామఫోన్ కంపెనీద్వారా బుజబుజరేకుల పిల్లుందా, చందమామ రావె జాబిల్లిరావె, పిల్లలకే స్వరాజ్యం వస్తే, పొట్టిబావ చిట్టిమరదలు, మొద్దబ్బాయి, బడి చదువు, పుట్టిన రోజు మొదలైన పాటలు ఆరు రికార్డులలో వచ్చాయి ఇటీవల ఆంధ్రప్రదేశ్ బాల అకాడమీవారు అంతర్జాతీయ బాలల సంవత్సరంలో చింతా దీక్షితులు, దేవులపల్లి కృష్ణశాస్త్రి, దాశరధి, బోయి భీమన్న, న్యాయపతి రాఘవరావు, బాలాంత్రపు రజనీకాంతరావు, ఏడిద కామేశ్వరరావు, నార్ల చిరంజీవి, శిష్టా సత్యనారాయణ రాజశేఖరం, బాపురెడ్డిగారల గేయాలలో ఒక ఎల్. పి. రికార్డు రూపొందించే ప్రయత్నం దాదాపు ఫలించింది. ఇది బాలలకు ఆనందం కలిగిస్తున్నది

## అపశ్రుతులు

బాలలకోసం ఉద్దేశించిన ప్రతి రచన వారికి సులభంగా అర్థమయ్యేలాగ ఉండాలి. ఏ రచన ప్రారంభించినా చదవాలనే ఉత్సుకత పెరిగేలా రచన ఉండాలి కొత్త పదాలు ఉపయోగించినా వాటి అర్థాలకోసం నిఘంటువులు వెతకాల్సిన పరిస్థితి ఏర్పడకూడదు. సందర్భాన్ని బట్టి భావం, భావాన్ని బట్టి అర్థం స్ఫురించేట్లు ఉండాలి ఇది రచయితలు గమనికలో ఉంచుకోవాల్సిన అంశం. చింతా దీక్షితులు, నార్ల చిరంజీవి, వేజండ్ల సాంబశివరావు, అలపర్తి వెంకట సుబ్బారావు గారల రచనలలో మచ్చుకైనా క్లిష్టపదాలు కనిపించవు. "అతి ప్రౌఢపదాలు, అన్వయ క్లేశాలు, ధ్వనులు, వ్యంగ్యాలు, అంత స్సంఘర్షణలూ—ఇలాటివి బాల సాహిత్యానికి అనవసరం " అని చెప్పిన వారి రచనల్లోనే కొన్ని చోట్ల ప్రౌఢపదాలు స్పష్టంగా కనిపిస్తాయి 'పిల్లలంటే' అనే గేయంలో —

ఊసులెన్నో మోసులెత్తే
బాసకర్థము ప్రాసబద్ధము

కనిపిస్తాయి. "జాబిలి బిడ్డ" అనే గేయంలో సచ్ఛాత్రులు, బ్రహ్మవిద్య, సకలార్థ విభూతి, పరచెంతను, గలాడు, కులీనులు, మూర్ధము, మూర్కొన – మొదలైన పదాలను వాడాల్సిన అవసరం లేదు. సరళమైన పదాలను వాడవచ్చు. అలాగే బాలల స్థాయికి మించిన శబ్ద సంచయంగల పదాలు పలువురి రచనలలో దొర్లుతున్నాయి.

మరొక కవిగారి 'దసరా' అనే గేయంలో –

ఆకాశంలో వెన్నెలలు
అడవులలో క్రొన్నెలలు :

ఇంకొకరి 'పాపనిద్ర' అనే గేయంలో—

మంచులో జలకమాడిన సంధ్య స్వప్నాన
నింగిలో అపుడపుడె నిర్గమించుచున్న
చంచత్ శరన్మేఘ పంచు తెల్లను చిదిమి
నెలవంక తెలకాంతి కిరణమ్ము తెచ్చెనట

మరొకరి "దసరా" అనే గేయంలో-

మాధువు నిద్దుర ముగిసినది
మహీ చైతన్యం మెగసినది"

వేరొకరి మన సాహితి - మధు భారతి అన్న గేయంలో-

మన సాహితి, మధుభారతి, రసవాహిని, భువమోహిని
జనరంజని, శివరంజని, అఘరంజని, జ్ఞానాంజని

వంటి క్లిష్టపదాలు గుప్పించేశారు. అంతకంటే మిన్నగా ఒక కవిగారు-

'చిన్న' లోనె చిద్విలాసం
'చిన్న' లోనె మ-నోవికాసం

లాంటి ప్రాసకోసం పాకులాడే పదాలు, గూఢార్థాల పదాలు బాల సాహిత్యంలో పరిహరింప బడవలసిందే.

అనుసరణలు

కొత్తగా రచనలు చేయాలనే ఉత్సాహంగల పిల్లలు, అప్పుడప్పుడు పెద్దవారు మంచి రచనలు చేయాలనే తాపత్రయంతో ఇతరుల మంచి రచనలు కాపీ చేయడం, అనుకరించడం కద్దు ఈ దురలవాటు బాలసాహిత్యంలో హెచ్చు మోతాదులో ఉంది. వెంకటపార్వతీశ్వరకవుల సుప్రసిద్ధ గేయం బొంగరము (1923) - బాల గేయావళి రెండో భాగంలో ప్రచురింపబడింది.

రింగురింగున దిరిగినా బొంగరంబు
ఏమియో వ్రాయుచున్నదీ ఇసుకలోన
బడికి పోలేదు పొత్తంబు బట్టలేదు
ఎట్లు వచ్చెనో దీనికింత చదువు ?

ఈ గేయాన్ని ఒక ప్రసిద్ధ రచయిత యిలా అనుసరించారు దీన్ని అనుసరణ అనడంకంటే కాపీ అనడం మేలు :

రింగు రింగు తిరుగునాదు రంగు రంగు బొంగరం
ఇంగితంబు నెరుగకున్న ఇంత చక్క నేలవ్రాయు
పొత్తమైన పట్టలేదు పోవనైన లేదు బడికి
ఎపుడు నేర్చెనింత చదువు ? ఎవరు నేర్పిరింత చదువు

## "శ్రీరమణ" పేరడీ !

బాలల గేయాలు రాసిలో అపారంగా వచ్చాయి. వాసిలో తక్కువగా వచ్చాయి. వచ్చిన వాటిలో చర్విత చర్వణాలు జాస్తి. దీనిని దృష్టిలో ఉంచుకొని శ్రీరమణ పేరడీ రాశారు.

పాపల్లారా ! రారండి ! గులాబి బాల వచ్చింది
బడితోటకు దిగివచ్చింది పాపల్లారా ! రారండి
రంగుల రంగుల రేకులు రేకులు
హంగులు సోకులు సోకుల వెనుక
వున్నవి ములుకులు జాగ్రత్తర్రా ! జాగ్రత్త
జవహర్‌లాల్‌కు బాలలన్న బలె ప్రీతి
చూచారా మరి చాచా నెహ్రూ ఎదమీద
కిచకిచ నవ్వే గులాబి బాల

ఈ పేరడీని బట్టి మన గేయాల ధోరణి తెలుసుకోవచ్చు. తెలుగు బాల గేయాలలో పిష్ట పేషణత్వ ధోరణి పెరిగిపోయిందనడానికి యిదో మంచి హెచ్చరిక : మూగ దెబ్బ.

# కథా సాహిత్యం

కథావలోకనం - పురాణ, నీతి, అద్భుత, సాంఘిక, చారిత్రక.

హాస్యకథలు - పిట్ట కథలు - నవలలు

# కథావలోకనం

కల్పన ప్రధానంగాగల కథలు, నవలలు కల్పనా సాహిత్య వర్గానికి చెందుతాయి. పిల్లల కథలను, నవలలను ఎంతో ఆసక్తిదాయకంగా చదువుతారు "అనగా అనగా ఒకరాజు ... ఆ రాజుకు ఏడుగురు కొడుకులు కథలో—అనగా అనగా అనే దానితో పిల్లలను ఆకట్టుకోవడం మొదలుపెట్టి—ఆ రాజుకు ఏడుగురు కొడుకులు అనడంతోనే వాళ్ళని ఊకొట్టేలా చేస్తూ ... ఆపైన ఏడుగురు కొడుకులు వేటకు వెళ్ళడం ... ఏడు చేపలు తేవటం వరకు వచ్చేసరికి కథపట్ల ఏకాగ్రత కలిగేలా చేస్తూవచ్చి, ఒక విధమైన ఉత్సాహానికి కారణమౌతుంది పిల్లలకు. అందులో ఒకచేప ఎండక పోవడం ... అందుకు కారణం పరిశోధిస్తూ పోతే చివర్లో – అదే ఆ కొసమెరుపు చివర చీమ చెప్పే సమాధానం అందరికీ నవ్వు పుట్టిస్తుంది. ఆ విధంగా పిల్లలకథ తికమకలు లేకుండా సూటిగా ఉంటే వారి మనస్సులలో బాగా నాటుకు పోతుంది. మొత్తం మీద "కథ మొదట్లో కుతూహలాన్నీ, చివర ఆలోచనల్నీ కలిగించాలి మధ్యలో చెప్పేది రక్తికట్టిస్తూ చెప్పుకుపోవాలి" [1] అంటారు ఆరుద్ర. అలాచెప్పే కథ "తేలికైన భాషలో, సునిశితమైన హాస్యంతో బాలలకు ఆశ్చర్యాన్నీ – ఆనందాన్నీ – ఆహ్లాదాన్నీ కలిగించే కథలైతే ఆసక్తిదాయకంగా ఉంటాయి." [2] కథ కుతూహలాన్ని, ఏకాగ్రతను కలిగించాలి. వీటినే కథా లక్షణాలుగా మనం చెప్పుకోవచ్చు. ఇది వెయ్యి కథలు చదవగా ఏర్పరచుకున్న సారాంశంగా చెప్పవచ్చు. కనుకనే కథలు రాయదలచు కొన్నవారు వెయ్యికథలను పరిశీలనాదృష్టితో చదవాలన్నారు "కథకుడికి ముడి సరుకు జీవితం భక్తుణ్ణి ఎలాగైతే భగవంతుడు అనుగ్రహిస్తున్నాడో అలాగే మానవజీవితం కథకుడికి కథావస్తువును ప్రసాదిస్తోంది కనుక భగవంతుని

..............................

1 ఆరుద్ర - కాబోయే కథలకు చిట్కాలు, (కథలెలారాస్తారు లో) మద్రాసు, వసు బుక్ లింక్స్, 1975 15 పు.

2 సూరి, జి ఎన్ - పిల్లల కథలు ఎలా ఉండాలి ? ఆంధ్రప్రదేశ్ బాలల మహాసభలు ప్రత్యేకసంచిక 1977 238 పు.

యెడల భక్తుడికున్నట్లే మానవ జీవితం పట్ల కథకుడికి భక్తి, శ్రద్ధ అవసరం" [3] ఇది పెద్దల కథల యెడల, పిన్నల కథల ఎడల వర్తిస్తుంది. "జీవితం బంగారం ఎలాటిదైతే అందులో కావలసినంత మాత్రమే తీసుకుని రమణీయంగా తయారుచేసికొనే ఆభరణం లాంటిది కథ. జీవితంలో సాధారణంగా సగం కథ మాత్రమే దొరుకుతుంది. లేదా లేశమాత్రమైనా దొరుకుతుంది. మిగిలిన భాగాన్ని ఊహించి, కల్పించి కథాశరీరాన్ని సమగ్రం చేసుకోవడం కథకుడి బాధ్యత." బాల సాహిత్య కథకులుకూడ ఈబాధ్యత స్వీకరించాలి. దీనికితోడు పిల్లల కథల్లో నీతి,అద్భుతం విధిగాఉంటూ కథను ఉత్కంఠతో నడిపించాలి. "మానవ సంస్కృతి వికాసానికి దోహదంచేసే సమస్త కళలు కథ లేనిదే రాణించవు కథా పరిభ్రమణంలోనే కళా విలాసం ఆధారపడి ఉంది సాహిత్యానికి కథ ఆధారశిల. సర్వ కళా సంపన్నమైన సాహిత్య మందిరం ఆ ఆధారశిలపైనే నిర్మితమవుతున్నది. అందుచేతనే కథకు అంతటి ప్రాధాన్యత ఉన్నది." [4] కనుక జీవితాన్ని, కల్పనను కలబోసి, హాస్యాన్ని కలిపి, ఒక ధ్యేయంతో కథారచన సాగించవలసి ఉన్నది. మన సంస్కృతీ సంపన్నత కథాశరీరంలో ప్రతిబింబించవలసిఉన్నది.

కథలు : వర్గీకరణ

కల్పనా సాహిత్యం విస్తృతమైనది. వైవిధ్యం హెచ్చుగా కలది. ఇందు కథలు, పిట్ట కథలు, పొట్టికథలు, ప్రధాన విభాగాలు. వీటిని మరల సాంఘికాలు, పౌరాణికాలు, చారిత్రకాలు, వినోదాత్మకాలు మొదలైన ఉపవిభాగాలుగా చేయవచ్చును ఈ కథా సాహిత్యం ప్రధానంగా ఆనందానికి, హితోపదేశానికి, సత్కాలక్షేపానికి, లోకజ్ఞానం నిమిత్తం ఉపయోగిస్తుంది.

..............................

3 రాజారాం, మధురాంతకం. కథనరంగం. (కథలెలారాస్తారు లో ) మద్రాసు, వసుబుక్ లింక్స్, 1975. 115 పు.

4 కామేశ్వరరావు, ఏడిద అనగా అనగా - కథల సంపుటం 'మనవి' లో. 6 పు.




ఈవిధంగా ప్రక్రియవారీగా, విషయ విస్తరణ వారీగా, ప్రయోజనాల వారీగా విభజన చేయబడిన బాల కథా సాహిత్యం తెలుగులో అనంతంగా ఉంది. ఐతే కథా సాహిత్యం బాలల వయసులవారీగా విభజించడం సాధ్యంకాదు. వయసులను బట్టి రచన చేసే విధానం తెలుగులో సరిగా రాలేదు. దాదాపు రెండు దశాబ్దాల క్రితం ఈ విషయంలో శ్రీకంఠం కృష్ణరావుగారు చేసిన ప్రయత్నానికి పెద్దగా ఆదరణ లభించలేదు. 0–5 వయసుగల బిడ్డలు ఆనందించగల కథలు లేకపోలేదు. కాని వారు చదవగల కథలు చదివి ఆనందించగల కథలు బహు తక్కువనే చెప్పాలి. ఉన్న కథలన్నీ 5–14 వయసుగల వారు చదవడానికే ఉద్దేశింపబడినవి. ఆదృష్టితోనే అవి రాయబడ్డాయి. నేడు ప్రచురణలో లభ్యమౌతున్న కథలను పురాణకథలు, నీతికథలు, అద్భుత కథలు, చరిత్ర కథలు, హాస్యకథలు మొదలైన విభాగాలుచేసి పరిశీలించవలసి ఉన్నది.

## పురాణ కథలు

ప్రాచీన కథాగుచ్ఛాన్ని పురాణం అంటారు. రామాయణ, భారత కథలుగల ఇతిహాసాలు పురాణాలకు చేరువగా ఉంటాయి వేద వాఙ్మయ కాలంనుంచీ - ఇతిహాస,

పురాణ కథలు కలవని డాక్టరు దివాకర్ల వేంకటావధానిగారు చెబుతున్నారు [5]. తర తరాలుగా పురాణ కథలు జన జీవితంలో ఇంకిపోయినవి. భారతీయ ప్రజ పురాణ కథ లను ఆదరించినంత బాగా మరే కథలను ఆదరించలేదు పురాణ కథలను 1900-1948 మధ్యకాలంలో అనేకమంది ప్రచురించారు.

మాగంటి బాపినీడుగారు పిల్లల బొమ్మల భారతాన్ని 1948 లో సచిత్రంగా ప్రచు రించారు ఆ విధానం పలువురి అభిమానానికి పాత్రమైనది. ఆ తర్వాత వారు చూపిన మార్గంలో బొమ్మలతో రామాయణ, భారత, భాగవతాదులు అనేకం వచ్చాయి. డాక్టరు దాశరథి, నారాయణరెడ్డి గారలు బొమ్మల బాల భారతాన్ని (1959), రామాయణాన్ని (1961) రచించారు బూరెల సత్యనారాయణమూర్తిగారు బాలల బొమ్మల భారతం (1954), రామాయణం (1959), దశావతారాలు (1959), శ్రీకృష్ణలీలలు (1959) సిద్ధం చేశారు. బొమ్మకంటి శ్రీనివాసాచార్యులుగారు బొమ్మల రామాయణాన్ని (1956) రాశారు లింగా నాగభూషణం గుప్తగారు బాలల బొమ్మల ఉత్తర రామాయణం (1959) ప్రచురించారు. వెంకిట పార్వతీశ్వరకవులు పిల్లల బొమ్మల భారతం (1956) ప్రచురించారు బాపు కమనీయ చిత్రాలతో రామాయ ణాన్ని (1976) ప్రచురించి అంతర్జాతీయ కీర్తి సంపాదించారు. ఈ విధంగా బొమ్మ లతో ప్రచురించిన ప్రతి రచన బాల బాలికల ఆదరాన్ని సంపాదించింది

అమృతకవి అన్నపూర్ణాదేవిగారు అనసూయాదేవి (1957) దమయంతి, శకుంతల సావిత్రి మొదలైనవారి చరిత్రకథలు రాశారు. జయంతి జగన్నాథరావుగారు నారదుని కథలు (1950) ప్రచురించారు. నండూరి విఠల్ గారు బైబిలు కథలు (1956) రాశారు ఈ విధంగా శతాధికంగా పౌరాణిక కథలు వెలువడ్డాయి. పిడ్డలలో సంప్ర దాయ విజ్ఞానం పెంపొందించడానికి తోడ్పడ్డాయి.

## నీతి కథలు

తెలుగు బాల సాహిత్యంలో నీతి కథలకు సమున్నత స్థానం ఉన్నది. వెలువడిన నీతి కథలు అసంఖ్యాకం. ప్రచురింపబడిన యితర కథలు, రచనలలో గూఢ నీతి అంతర్భూతమై ఉంటూనేఉంది. భారతీయ సంస్కృతిలో నీతికి అత్యధిక ప్రాధాన్యం ఇవ్వడమే ఇందుకు కారణం. "నీతి అనేది బ్రతుకులో ఒక చక్కని రీతికి మార్గం

.................................

5 వెంకటావధాని, దివాకర్ల. అష్టాదశ పురాణములు. విజ్ఞాన సర్వస్వము 7 సం. 528 పు.

చూపుతుంది. నీతిలేని మనిషి బ్రతుకు నిరర్థకం. నీతులు కేవలం పిల్లలచేత వల్లె వేయించినంత మాత్రాన అవి వారికి ఒంట బట్టవు. జీవిత వృత్తంతో వాటిని మిళితం చేసి కథలుగా అందిస్తే పిల్లల మనస్సులలో అవి బాగా హత్తుకుంటాయి. చిన్ననాడు నాటుకున్నవి చిరకాలం నిలచి ఉంటాయి "[6] కనుక చిన్ననాటినుంచీ పిల్లలలో నీతికథల వ్యాప్తి చేయాలి. లేకపోతే పిల్లలకు లౌకిక జ్ఞానం, వ్యవహార దక్షత తెలియక ఎప్పుడు పిల్లలుగానే ఉండిపోతారు. చదువంతా స్మరణ, ధారణ, విషయ సేకరణ మీద కేంద్రీకరింప బడినప్పుడు వారిలో ఆలోచన, సృజన పెరగవలసినంతగా పెరగదు. ఈలోటు తీరడానికి పిల్లలు విధిగా నీతికథలు చదవాల్సిందే. విశేష మేమంటే ఈ నీతికథల్లో మనుష్యులు, జంతువులు, పక్షులు, క్రిమి కీటకాలు కలసి మెలిసి ఉంటాయి. మాట్లాడుకుంటాయి. అసలు ఇలా ఉండడం పిల్లలకు ఆనందం. ఇలాటి కథలంటే పిల్లలకు ఇష్టం. పిల్లలకోసమే నీతికథలు సృష్టించబడ్డాయనడానికి ఇదొక ఉదాహరణ. సత్ప్రవర్తనకు మూలకందమైన నీతి చిన్ననాటినుంచే పిల్లలలో అలవడాలని ప్రగాఢమైన ఆకాంక్ష యిందుకు కారణం.

నీతికథలకు సుదీర్ఘమైన చరిత్ర ఉంది నీతికథలలో ప్రసిద్ధాలైన పంచతంత్ర కథలు, హితోపదేశ కథలు, ఈసప్ నీతికథలు మొదలైనవి చిరకాలంగా ఉన్నాయి. ఉత్తమ నీతినీ, లోకరీతినీ అన్ని దేశాలకు అన్వయించే తీరులో సంతరించుకున్నందుకు ప్రపంచవ్యాప్తంగా ప్రచారమయ్యాయి. భారతీయ మేధాశక్తికి చెరగని గురుతుగా నిలచి పోయాయి. ఈ శక్తిని గమనించే కందుకూరి వీరేశలింగం పంతులుగారు ఈసప్ కథలను పిల్లలకోసం నీతికథామంజరి పేరుతో రెండు భాగాలలో రాశారు. ప్రతికథ చివర ఒక చక్కని నీతి పద్యం చేర్చారు "పచ్చికుండ మీద రాసిన రంగుల చిత్రం చెరగ కుండునట్లు, బాల్యంలో బోధించిన విద్య పదికాలాల పాటు నిలచి ఉంటుంపనే ఉద్దేశంతో పంతులుగారు పూనుకొన్నారు. ఆ రోజుల్లో ఈ పుస్తకాలను పిల్లలు పాఠ్యగ్రంథాలుగా నిర్ణయించడం వలన బాగా ప్రచారమయ్యాయి ఈ మార్గాన్ని అనుసరించి వావిలికొలను సుబ్బారావుగారు 'ఆర్యకథానిధి' 30 భాగాలలో రచించారు. ప్రతికథ చివర ఒక చక్కని నీతి పద్యం చేర్చారు. 'ఆడితప్పరాదు' అను హరిశ్చంద్రుని కథ చెబుతూ చివర ఈ పద్యం చేర్చారు.

................................

6 నరసింహారావు, వి. వి. బాలల జీవితం తీర్చిదిద్దే నీతికథాసాహిత్యం - ఆంధ్రప్రదేశ్ బాలల మహాసభలు - ప్రత్యేక సంచిక, 1977. 54 పు.

ధనము గోలుపడిన దనయాలుబిడ్డలు
నష్టమై, నెంతకష్టమైన
మానహీనమైన, ప్రాణంబు పోయిన,
నాడి తప్పరెప్పు డనఘమతులు

ఈ పుస్తకాలను తర్వాత ఎనిమిది భాగాలుగా ఒకటినుంచి ఎనిమిది తరగతుల విద్యార్థులు చదువుకునేందుకు వీలుగా ప్రకటించారు. అలాగే వెంకట పార్వతీశ్వర కవులు నీతి కథావళి, (1927) ఐదు భాగాలలో, పూతలపట్టు శ్రీరాములు రెడ్డిగారు సుజ్ఞాన బోధిని (1931) మూడు భాగాలలో, కనుపర్తి వరలక్ష్మమ్మగారు బాల నీతి కథావళి (1950) ని, "రాయల నీతికథల' లో మొదటి మూడు భాగాలను గిడుగు వెంకట సీతాపతిగారు, తదుపరి మూడు భాగాలను పుట్టపర్తి నారాయణాచార్యులుగారు సిద్ధం చేశారు.

ఈ కథలకు లభించిన ఆదరణతో కోగంటి దుర్వాసులుగారు నీతికథావళి (1949)ని, కాంచనపల్లి కనకాంబగారు చక్కని కథలు (1952) మూడు భాగాలలోనూ, శిష్ట్లా లక్ష్మీకాంతశాస్త్రిగారు నీతి కథామంజరి (1953) ని ఏడుభాగాలలోనూ, నార్ల చిరంజీవిగారు నీతికథానిధి (1957) ని రచించారు. ఈసప్ నీతికథలను వీరేశలింగం పంతులుగారి తర్వాత ఆదిభట్ల నారాయణదాసు (1864-1945) భమిడిపాటి కామేశ్వరరావు, మరుపూరు కోదండరామరెడ్డి ప్రభృతులు తెలుగులోకి తెచ్చారు ఇంకా పలువురి గ్రంథాలలో ఇవి చోటుచేసుకున్నాయి. పంచతంత్ర హితోపదేశ కథలను విశ్వాత్ముల నరసింహమూర్తి, లింగా నాగభూషణంగుప్త,పి.విశ్వనాథం, మోటూరి వెంకటేశ్వరరావు, వేజండ్ల సాంబశివరావు మొదలైన వారు తెలుగులోకి తెచ్చారు. ఈ నీతికథలు కాలాతీతమైన నీతిని బోధిస్తున్నందునే కలకాలం నిలచి ఉన్నాయి. ఇంకా ఉంటాయి కూడా.

అద్భుత కథలు

చాల సందర్భాలలో వాస్తవం చేదుగా ఉంటుంది. బాధగా ఉంటుంది. కల్పన ఆనందంగా ఉంటుంది అద్భుతంగా ఉంటుంది. అద్భుతాలంటే పిల్లలకు మరీ ఇష్టం. "సిందుబాదు తక్కిన నావికులతోబాటు ఒకద్వీపంలో దిగి, పొయ్యిలో నిప్పు రాజేసి, వంటచేసుకుంటుంటే ఆద్వీపం కదలడం ప్రారంభించి, కొద్దిసేపట్లో మునిగి పోయిందంటే" పిల్లలు ఎంతో ఆశ్చర్యపోతారు. ఆ తరాత వాక్యంలో సిందుబాదు, అతని బృందం

వంటచేసుకుంటున్న ప్రాంతం ఆ ద్వీపం తాలూకు భూమికాదని ఒక పెద్ద తిమింగలం తాలూకు వీపు అనీ, వంటల మంటలకు వీపు చుర్రుమనడంతో ఆ తిమింగలం బుడుంగున మునిగి పోయిందని తెలియడంతో ఆ పిల్లలు ఆనందానికి అంతు ఉండదు. ఇందులో వాస్తవం కంటే విచిత్రమైన ఊహ ప్రధానం నేడు అసంఖ్యాకంగా వస్తున్న సాహస గాథలు, దేవతల కథలు ఇలాంటివే. వీటిని చదవడం వలన పిల్లలలో భావనాశక్తి బాగా పెరుగుతుందని షార్లెట్ బుల్లార్ భావన. ఈ విధమైన భావనాలోకాన్ని చవిచూసే కథలు తెలుగులో ఎన్నో ఉన్నాయి. వాటిలో చింతా దీక్షితులుగారి 'బంగారు పిలక' ఎన్నదగినది. ఒక బ్రాహ్మణునికి బంగారు పిలక ఉండేది ఆ బ్రాహ్మణుడు సంధ్యవార్చుకొనే నిమిత్తం బంగారు పిలకను చెరువు గట్టుమీద పెట్టి చెరువులో దిగాడు. స్నానంచేసి బయటికి వచ్చి చూచేసరికి పిలకలేదు నక్క కాజేసింది కాకి, పులి సాయంతో పిలకను మరల దక్కించుకుంటాడు పులి బ్రాహ్మణుని ఆహారం చేసుకోవాలను కుంటుంది బ్రాహ్మడు చెట్టెక్కి—

మందలు మందలు, జింకల మందలు
మందలు మందలు లేళ్ల మందలు !
పచ్చని పళ్ళూ చుక్కల పళ్ళూ
సన్నని కాళ్లూ గుండ్రని కళ్ళూ
అన్నీ మందలు అవిగో మందలు

అని పాట పాడుతాడు. బ్రాహ్మణుడి పాటవిని పెద్దపులి రంయిన బయలుదేరి ఉరుకుతూ జింకలకేసి పోతుంది పులి పీడ వదిలింది బ్రాహ్మణుడు ఆనందంతో ఇల్లు చేరతాడు. ఈ విధంగా కథ కొంత వాస్తవం, కొంత కల్పనల మేళవంతో అద్భుతంగా సాగుతుంది

ఈ విధంగానే గలివర్ నౌకాయాత్రలో అరంగుళాల మరుగుజ్జు మనుష్యుల కథలను విన్నా, తొమ్మిదడుగుల ఎత్తుండే మహాకాయుల సాహసాలు విన్నా పిల్లలు ఆశ్చర్యం చెందక మానరు ఈ కథల వలన వారి ఆలోచన పైమెట్టుకు ఎదగడానికి వీలుంది.

........ ....................

7 Buhller, Sharget. Fairy Tales and the Imagination of the Child London, Sargent, 1929 p 79

అందుచేత బాల మనోవిజ్ఞానవేత్తలు పిల్లలచేత అద్భుత కథలు ఎక్కువ చదివించమని సలహా ఇస్తారు. తెలుగులో అద్భుతకథలు పత్రికలలో వేల సంఖ్యలో వచ్చాయి. కాని పుస్తక రూపంలో వచ్చినవి తక్కువ. వచ్చిన వాటిలో మండవ రఘునాథ్‌గారి మహేంద్ర మణి(1953), లక్ష్మీకాంత మోహన్‌గారి పేదరాసి పెద్దమ్మ కథలు, (1953) యం.ఎన్. మూర్తిగారి ఇంద్రజాలపు కథలు, సత్యవోలు రాజశేఖరంగారి అల్లాఉద్దీన్ అద్భుత దీపం (1958), జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారి ఆలీబాబా నలుబది దొంగలు (1959) కె. రమేశ్‌గారి మాయ గంట (1960) ప్రసిద్ధాలు.

సాంఘిక కథలు

బమ్మెర పోతరాజు చెప్పినట్లు "విబుధ వరులవలన విన్నంత కన్నంత, తెలియ వచ్చినంత తేటపరతు" అనే విషయం సాంఘిక సంబంధమైన కథల విషయంతో బాగా అన్వయిస్తుంది. సాధారణంగా ఈ కథలలో ఇల్లు, పాఠశాల రంగస్థలంగా ఉంటుంది. తల్లి, తండ్రి, అన్నదమ్ములు, అక్కచెల్లెండ్రు, స్నేహితులు, ఉపాధ్యాయులు పాత్రలుగా ఉంటారు. పాత్రలన్నీ అతి సన్నిహితంగా ఉంటూ నిత్య జీవితసమస్యలను ప్రతిబింబిస్తాయి. కనుక సాంఘిక పరమైన కథ పిల్లల మనస్సులోకి సూటిగా చేరుకుంటుంది. పిల్లలు వీటిని బాగా ఆనందిస్తారు. తెలుగు బాల సాహిత్యంలో మూడు వంతులకు పైగా ఇవి ఆక్రమించుకున్నాయంటే వీటి ప్రాపకం ఎంతగా పెరిగిందో ఊహించుకోవచ్చు. దాదాపు ప్రతికథలో ఒక చమత్కారం, వింత, నీతి ఇమిడి ఉంటాయి.

కథ ఎంత చిన్నదిగా, సస్పెన్స్‌తో కూడుకొని ఉంటుందో అది పిల్లలకు అంత బాగా నచ్చుతుంది. "అడవిలో ఒక లేడి ఆనందంగా మేస్తూ ఉంటుంది. వేటగాడు దాన్ని చూస్తాడు. గురి పెడతాడు. ఆ సమయంలో తేలు కుడుతుంది" అంతవరకు కథ చెప్పగానే 'బాగా శాస్తి జరిగింది' అని పిల్లలు ఆనందిస్తారు. కథ అంతటితో ఆగిపోలేదు. "తేలు కుట్టిన బాధలో బోయవాడు బాణాన్ని వదులుతాడు. ఆ బాణం గురితప్పి చెట్టు తొర్రలో ఉన్న పక్షి పిల్లలను భక్షిద్దామనే పాముకు తగులుతుంది పాము చస్తుంది." ఇది చదవగానే పిల్లలు మరింత ఆనందిస్తారు దుష్ట శిక్షణ, శిష్టరక్షణ జరిగినప్పుడు వారి ఆనందానికి అవధు లుండవు. పిల్లల కథ ఎంత చిన్నదైనా ఒక ఉత్కంఠ, సదుపదేశం కలిగి ఉండాలి.

మధురాంతకం రాజారాంగారి కథ 'కోతి' పరిశీలిద్దాం. స్వర్ణయోగివద్ద బంగారంచేసే విధానం తెలుసుకోవాలనే బుద్ధి పుట్టింది శిష్యుడికి. శిష్యుడికి గురువుగారు మంత్రోపదేశం చేశారు. "శిష్యా: ఇటుకరాయో, గులకరాయో ఏదో తీసుకో: చిక్కుడు ఆకును బాగా నలిపి, నేను చెప్పిన మంత్రం ఉచ్చరిస్తూ రాతిమీద పసరు పిండు. ఆ రాయి కాస్తా బంగారమై పోతుంది" అన్నాడు. శిష్యుడు పరమానందభరితుడై 'ధన్యోస్మి' అంటూ గురువు పాదాలు ముట్టుకున్నాడు 'అయితే చిన్న నియమం ఉంది' అన్నాడు యోగి. ఏమిటి? అన్నాడు శిష్యుడు. "నువు బంగారం తయారుచేసేప్పుడు కోతిని మాత్రం తలచుకోవద్దు. తలుచుకుంటే బంగారం తయారు కాదు" అన్నారు గురువుగారు.

శిష్యుడు బంగారం తయారు చేయడం ప్రారంభించాడు కోతి గుర్తుకు రావటం మానడంలేదు ప్రయత్నం ఫలించలేదు కథ ముగిసింది. ఏపని చేయాలన్నా మనస్సు నిలకడగా ఉంచుకోవాలనే సూత్రం ఈ కథ ద్వారా తెలియజేయబడింది.

భగవంతుని వారసులు అనే మధురాంతకం రాజారాంగారి మరోకథ చూద్దాం. ఒక పెద్ద ఆఫీసర్ రిటైరైనాక స్వగ్రామంలో స్థిరపడతారు. వారికి ఎదురింటి చిట్టిబాబుతో పరిచయం ఏర్పడుతుంది పరిచయం స్నేహంగా మారుతుంది. ఆఫీసర్‌గారు చిట్టిబాబుకు రోజూ కథలు చెబుతుంటారు. అదీ వారికి మంచి కాలక్షేపం ఆ తర్వాత సెలవులకు ఆఫీసర్‌గారి మనుమలంతా వస్తారు వారు చిట్టిబాబును ఆ యింటికి రానివ్వరు వీధిలో కనిపించినా అరచి అల్లరి చేస్తారు చిట్టిబాబు వాళ్ళ ఇంట్లోనే ఉండి పోతాడు. ఆఫీసరు ఇది గమనిస్తారు. పిల్లలందరు చూస్తుండగా దూరంగా గుప్పెడు అన్నం విసురుతారు ఆఫీసరుగారు. మెతుకులు చెల్లాచెదరైపోతాయి. ఒక్కొక్క కాకి వచ్చింది. అన్నికాకులు చేరాకే ఆ మెతుకులను తిన్నాయి అలాగే పిల్లలంతా కలిసి ఉండాలంటారు ఆఫీసరుగారు. మనుమలు చిట్టిబాబును కలుపుకొని ఆడుకుంటారు. అదీకథ. ఐకమత్యం, కలసి బతకడం, సమైక్యతను యీ కథ చాటుతుంది. ఇలాటి కథలు బాల సాహిత్యంలో వందల సంఖ్యలో ఉన్నాయి.

వాటిలో ఇల్లిందల సరస్వతీదేవిగారి మూడు పిల్లితాటలు (1958), తురగా జానకీ రాణి గారి బొమ్మలపెళ్ళి (1979), వార్ల చిరంజీవిగారి ఆటా- పాటా, ముగ్గురు స్నేహితులు (1961), చింతా దీక్షితులుగారి ఎన్నో చేస్తాను, నీతి సారము (1956), విద్వాన్ విశ్వంగారి చందమామ చెప్పిన కథ(1956), కనుపర్తి వరలక్ష్మమ్మగారి కొత్త పిట్ట (రాతపతి), మునిమాణిక్యం నరసింహారావుగారి గాలిపిల్లలు (1956), మద్దు

టూరి రామకృష్ణరావుగారి నాన్నకోసం (1954), మండా సూర్యనారాయణగారి బహుమతి, పాలంకి వెంకట రామచంద్రమూర్తిగారి దొంగలున్నారు జాగ్రత్త(1956) రావూరి భరద్వాజగారి పితృహృదయం (1959), మల్లంపల్లి సోమశేఖర శర్మగారి జట్కా వెంకియ్య, అలపర్తి వెంకట సుబ్బారావుగారి గాలిపటం (1956), చెప్పుకో దగినవి. సాంఘిక యితివృత్తం కొలది పత్రికలలో ప్రచురింపబడి పుస్తక రూపంలోకి రానివి అపారంగా ఉన్నాయి

చారిత్రక కథలు

పిల్లలు తొలి దశలో కల్పిత కథలు బాగా చదువుతారు. వయసు పెరుగుతున్న కొలదీ వాస్తవ గాథలంటే మక్కువ చూపుతారు. మహిమలందు మమకారం తగ్గి శాస్త్రీయ దృక్పథం వేపు మనసు మళ్ళిస్తారు. 11-14 ఏళ్ళ వయసులో యీకోవకు చెందిన గ్రంథాలంటే ఆసక్తి పెరుగుతుంది తగిన సమయంలో కథల రూపంలోగల దేశ చరిత్రలు, జీవిత చరిత్రలు వారి దృష్టికి తీసుకువెళ్తే పిల్లల భావి జీవితం సుందర తరంగా మలచడానికి వీలుంది. చరిత్రలలో, జీవిత చరిత్రలలో ఉత్తేజకర సంఘట నలు చదివి దీప్తి పొందడానికి వీలుంది. తెలుగులో కథల రూపంలో వచ్చిన ఈ శాఖకు చెందిన రచనలు తక్కువ కేతవరపు కృష్ణమూర్తిగారు "బాల కాశీ మజిలీల" ను 10 భాగాలలో భారతదేశ, ఆంధ్రదేశచరిత్ర కథలతో మనోహరంగా వివరించారు శాతవాహనులు, పల్నాటి వీరులు, కాకతీయులు, విజయ నగర మహారాజుల గురించి వివరించిన కథలు పిల్లలకు ఎంతో ఆసక్తిదాయకమైనవి. చక్కని కథ రూపంలో వివరించారు రత్నాకరం అనంతాచార్యులుగారు కళింగ దేశ కథలలో (1960) ఆదేశ చరిత్రను చక్కగా వివరిస్తాయి

పిల్లలకు అందించే జీవిత చరిత్ర కథలలో ప్రధానంగా వీరగాధలే ఉంటాయి. రంగు రంగుల చిత్రాలలో 'రసపుత్ర వీరుడు రంజిత్ (1955) బుజ్జాయి రచన బహుళ ప్రచారాన్ని పొందింది దువ్వూ శేషగిరిరావుగారి పిల్లల చరిత్ర కథలు మరొక మంచి రచన. ఇవిగాక వీరగాథల పేరుతో చలమచర్ల రంగాచార్యులు, గడియారం రామకృష్ణశర్మ, బిరుదురాజు రామరాజుగారలు బలుమూరు కొండ, సర్వాయి పాపడు, బొబ్బిలిరాజు, సదాశివరెడ్డి, దేశింగురాజు (1954) మొదలైన వారి కథలను ప్రచురించారు. ఇవి బాగా ప్రచారంలోకి వచ్చాయి. చారిత్రకనవలలో, కథలలో చరిత్ర పాలు అధికంగాను, కథ ఆకర్షణీయంగానూ ఉండేందుకు కల్పన పాలు కొద్దిగా ఉంటుంది. రచన సొంపుగా ఉండాలంటే ఈ మోతాదు తప్పదు.

## హాస్య కథలు

పిల్లలకు హాస్య రచనలంటే చాల ఇష్టం. హాస్యం వారిని ఆనందలోకాలలో ముంచెత్తు తుంది. మెదడుకు పదును పెడుతుంది తెలుగు పిల్లల పత్రికలలో హాస్య రచనలు తగినన్ని వచ్చాయి కాని ఇతివృత్తంతో హాస్యం, వినోదం మిళితమైన కథలు చాల తక్కువ వచ్చాయి అందు పుస్తక రూపంలో వచ్చినవి మరీ తక్కువ. తెనాలి రామకృష్ణుని కథలు, పరమానందయ్య శిష్యుల కథలు మనకు చిరకాలంగా ఉన్నాయి. మహేంద్రవాడ వీర గణపతిశాస్త్రిగారు బాల వినోద కథలు (1954) ప్రచురించారు. జి. వి. జి. కృష్ణగారు వినోదకథలు (1955) ప్రచురించారు. పిల్లల ఇతివృత్తాలతో న్యాయపతి రాఘవరావుగారు బాలకథలు (1952) ప్రచురించారు. పొట్టిబావ, చిట్టిమరదలు, కొంటె క్రిష్టయ్య వారు సృష్టించిన పాత్రలు. బాలసాహిత్యంలో మరపురానివి

హాస్యం ఇతివృత్తంగా రచనలు చేసిన వారిలో ముళ్ళపూడి వెంకటరమణ ముఖ్యులు. వీరి బుడుగు పలువురి ప్రశంసలకు, అభిశంసలకు పాత్రమైంది బుడుగు-ముందుగా వార పత్రికలో సీరియల్‌గా ప్రచురింపబడినప్పుడే పాఠకులను గిలిగింతలు పెట్టింది. తెలుగువారి సంప్రదాయాలు, బలహీనతలు, ముద్దుమాటలు, మురిపాల జీవితాలు ముళ్ళపూడికి తెలిసినట్లు మరొకరికి తెలియదంటే ఆశ్చర్యంలేదు. కనుకనే వారు ప్రజానాడిని పట్టుకోగలిగారు. పాఠకులను ఆకట్టుకోగలిగారు బుడుగు బాలల మనస్తత్వానికి సరి పోదని విమర్శిస్తూ రేడియో అన్నయ్య న్యాయపతి రాఘవరావుగారు "ఈ రచయిత (ముళ్ళపూడి) తన పుస్తకంలో స్వకీయ భావాలను తనహీరో నోట్లోపెట్టి రచన సాగించారు ఆడపిల్లలు అనే శీర్షిక క్రింద రచయిత వ్యక్తపరచిన భావాలు ఉద "హరిస్తున్నాను. ఆడపిల్లల గురించి కొంత చెప్పాలి ఆడపిల్లలంటే బాబాయి వాళ్ళు లౌ లెట్రు ఇస్తానంటారు-వాళ్లు సి గానపెసూనాంబ కూడ ఆడపిల్లేకాని అది బాఘా చిన్న పిల్లనుకో ...లౌ లెట్రు పెద్దవాళ్లకే ఇవ్వాల-అన్నమాట'' ఇలా సాగుతుంది ముళ్లపూడి రచన''[8] అంటారు. పైగా ముళ్లపూడి తరచుగా శబ్ద స్వరూపాలను మార్చి వాడుతుంటారు

.............................

8 రాఘవరావు, న్యాయపతి. బాలవాఙ్మయ సమీక్ష టంగుటూరి ప్రకాశ శతజయంతి సంచికలో 1974. 439 పు

ఉదా :

| | | | |
|---|---|---|---|
| పొదుల్న | — | ప్రొద్దున | కు మారుగా |
| చంల్దమామ | — | చందమామ | " |
| అకాసెం | — | ఆకాశం | " |
| రాత్తిరి | — | రాత్రి | " |
| కుంచెం | — | కొంచెం | " |
| భాఘా | — | బాగా | " |
| లౌ ల్రెటు | — | లౌ లెటర్సు | " |
| సి. గానపెసూనాంబ | — | శ్రీ జ్ఞాన ప్రసూనాంబ | " |

ఈ విధమైన శబ్ద స్వరూపాలమార్పుపై రాఘవరావుగారు తీవ్రమైన అభ్యంతరం తెలిపారు 1977లో బాలసాహిత్య సదస్సు జరిగినప్పుడు దీనిపై కొంత చర్చ జరిగింది. రచయితలు ఈ మార్పులు అంగీకరించలేదు

పిట్టకథలు : పొట్టికథలు

ఇవి ప్రధానంగా చిన్నకథలు నీతికథలు జంతువులు, పక్షులు కథలో పాత్రలుగా మానవాళికి మంచి సందేశాన్నిస్తాయి. పిట్టకథ మలుపులు, తికమకలు లేక పిన్నలకు, పెద్దలకు సులభంగా బోధపడి, మనసు కెక్కేదిగా ఉంటుంది "సోవియట్ దేశంలో కొంతకాలంపాటు పిట్టకథలను నిషేధించారు తమ చర్యవల్ల పిల్లలలో హేతువాదం నశిస్తుందని గమనించడానికి సోవియట్ పాలకులకు ఎంతో కాలం పట్టలేదు నేడు సోవియట్ బాల సాహిత్యంలో అగ్రతాంబూలం పిట్టకథలదే"[9] మనదేశంలో పిట్టకథలకు అనాదికాలంనుంచీ ఆదరం ఉంది అసలు పిట్టకథలకు పుట్టుకే మనదేశం అన్నా ఆశ్చర్యపడాల్సిన ఏమాత్రం పని లేదు. పిట్టకథలకు మూలమైన పంచతంత్ర, హితోపదేశ కథలు క్రీస్తుశకం మూడు-ఐదు శతాబ్దాలలో రాయబడి ప్రపంచ వ్యాప్తంగా ప్రచారమయ్యాయి.[10] ఇవి చాలకాలం జన జీవితంలో మౌఖిక

..............................

9 వెంకటేశ్వరరావు, నార్ల. కవిరావు బొమ్మరిల్లుకు పీఠిక తెనాలి, బాలసాహితి, 1954.

10 సుందరేశ్వరరావు, నిడదవోలు. దూబగుంట నారాయణకవి పంచతంత్రము- పరిచయంలో హైదరాబాదు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ 1960. 8 పు.

ప్రచారం ద్వారానే నిలిచాయి తెలుగులో ప్రచారంలోగల పిట్టకథలను నాయని కృష్ణకుమారిగారు ఆరు భాగాలుగా విభజించారు [11]

1 నైతికప్రవర్తనను నియమించడం. కొన్ని సూక్తుల్నీ, జీవన సత్యాలనూ కథలద్వారా తెలియజేయడం, 'అబద్ధమాడరాదు' అనే సూక్తి చెప్పడానికి ఏర్పడ్డకథ, పశువులు కాచే బాలుడు – పెద్దపులి కథ. తన తండ్రితో ఆటకాయతనంగా 'నాన్నా పులి' అని పదే పదే అబద్ధాలాడిన దోషానికి ఆ పిల్లవాడు నిజంగా పులికి తనప్రాణాన్ని పరిహారంగా చెల్లించవలసి వచ్చింది. సత్యవాక్పరిపాలన – తెలియ జెప్పడానికి ఆవు – పులి కథ

2 ఉపాయంవలన అపాయాలను తప్పించుకోవడం కోసం సింహం–కుందేలు కథ. ఆహారంగా బయలు దేరిన కుందేలు దారిలో పాతబడ్డ బావిలో ప్రతిబింబాన్ని చూచుకొని, ఉపాయం ఆలోచించి, తన శత్రువును నాశనం చేస్తుంది.

3 మూర్ఖత్వాన్ని హేళనచేసి హెచ్చరించడం – కోసం రెండు పిల్లులు – కోతి–రొట్టెముక్క – కథ పిల్లుల మధ్య పొత్తులేనందున అవి సంపాదించుకున్న రొట్టెముక్క – జిత్తులమారి కోతి నోట్లోకి పోయింది.

4 పొరపాట్లు చేసి విషమ ఫలితాల వలన పశ్చాత్తాప పడడం. ముందుచూపులేని మనుష్యుల బలహీనతనూ దానివలన కలిగే దుష్ఫలితాలను ఎత్తి చూపేందుకు ముంగిస– ఉయ్యాలలో పిల్లవాడు కథ.

5 గర్వభంగం చేసే కథలు, తమను గురించి తాము వేసుకునే అతిశయమైన అంచనాలవలన అహంకారంతో చరించే పాత్రల గర్వాన్ని ఉపాయబలంచేత అణగ దొక్కడం కుందేలు – తాబేలుకథ, నక్క – కొంగ విందు కథ అలాటివే

6 ప్రతికక్షపైన పగదీర్చుకోవడం. ఒకరు మరొకరికి అపాయం చేయగా రెండవవారు ఉపాయాలు వెదికి శత్రువు మీద పగదీర్చుకోవడం పక్షి – ఏనుగుకథ మంచి ఉదాహరణ

పిట్టకథలలో జంతువులకథలు ఎక్కువగా ఉన్నందున ఈ కథలు చదవడం వలన

..............................

11 కృష్ణకుమారి, నాయని. పిట్ట కథలు. – కట్టు కథలు. ఆంధ్రప్రదేశ్ బాలల మహాసభలు – ప్రత్యేకసంచిక, 1977. 189 పు.

పిల్లలకు ప్రకృతి పట్ల సానుభూతి, జంతువుల పట్ల అభిమానం ఏర్పడతాయి దానితో బాటు పిల్లలకు అడవులు, కొండలు, అత్యుష్ణ, అతిశీతల మండలాల గురించిన జ్ఞానం ఏర్పడడానికి అవకాశముంది కనుక ఈ కోవకు చెందిన కథలు జ్ఞానం, విజ్ఞానాన్ని అందజేస్తాయి

## పొట్టి కథలు

కథావస్తువు విస్తృతి తక్కువగా ఉండి, పది — పదిహేను పంక్తులకు మించని కథలను పొట్టి కథలు అంటారు ఇవి త్వరగా ముగుస్తాయి గనుక పిల్లలకు యివంటే చాల యిష్టం ఈ మధ్య కాలంలో పత్రికలు గూడ వీటిని బాగా ప్రోత్సహిస్తున్నాయి. అలపర్తి వెంకట సుబ్బారావు, నండూరి విఠల్, సత్యవోలు రాజశేఖరంగారలు యీ కథలను రాశారు అలపర్తివారి ఒక కథలో గోపి అమాంతం కవి అయిపోయాడని తోటివాళ్లంతా అభినందిస్తారు తీరాచూస్తే ఆ పద్యాలు మరొక కవి రాసినవి ఎందుకిలా చేశావని మిత్రులు అడిగితే ఆ పద్యాలు కంఠతా పెడదామని రాసుకున్నాను అనవసరంగా నన్ను అందరూ 'కవి' అంటూంటే యీ వ్యవహారం ఎందాకా పోతుందో వెడకగా చూద్దామని నేనే రాసింది అన్నా నిజానికి ఆ రాత నాదేగదా! అంటే మిత్రులంతా ఏస్తుపోయారు. ఇలాగే ఒక జోక్‌లాగా కథ సాగిపోతూ ఉంటుంది. ఇది అలపర్తి వెంకటసుబ్బారావుగారి 'నేనే వ్రాసింది' అనే పొట్టి కథ. ఇలాగే వారు చాలకథలు రాసి తరువాతి రచయితలకు మార్గదర్శకులైన లబ్ధ ప్రతిష్టులు

## బాలల రచనలు

పిల్లలకు రచనలు చేయడం ఒక సరదా. ఆ సరదాను క్రమబద్ధంచేసి ప్రోత్సహించినట్లయితే పిల్లలు బాల్యంలోనే చక్కని రచయితలుగా తీర్చిదిద్దబడతారు. ఆంధ్ర వారపత్రిక 1949 నుంచి బాలల రచనలను బాగా ప్రోత్సహించింది. బాల, ఆంధ్రజ్యోతి వారపత్రిక ఇటీవలి రోజులలో బాలచంద్రిక పిల్లల రచనలకు ఇస్తున్న ప్రోత్సాహం ప్రశంసనీయమైనది. వాళ్లబడి ఎలా ఉండాలో ఏడవ తరగతి చదివే బాలుడు సుందరసింగ్ ఎలా వివరిస్తాడో చూడండి[12] "మా పాఠశాలలో మాపైయిష్టంతో చదువు చెప్పే ఉపాధ్యాయులుండాలి. ప్రతిరోజు ప్రతి తరగతి ఒక లైబ్రరీ పిరీడ్

............................

12 బాలచంద్రిక. అక్టోబరు, 1987.

ఉండాలి. ఆ గ్రంథాలయంలో అందరూ చదువుకొనే వసతి ఉండాలి. ప్రతి తరగతిలో కూర్చునే బెంచీలు లేకపోయినా వ్రాసుకునే బల్ల ఉండాలి. పాఠశాల విద్యార్థులందరికీ ఒకరకం దుస్తులుండాలి... బడి బయట ఈగలు వాలిన తినుబండారాలు విక్రయించ కుండా చూడాలి. అందరికీ మంచి నీరు అందుబాటులో ఉండాలి" దీన్నిబట్టి పిల్లలు తమ అవసరాలను గురించి తాము ఎంత ఉదాత్తంగా ఊహించుకుంటున్నారో గమనించి వారి అవసరాలను తీర్చవలసి ఉంది

ఐదో తరగతి చదివే మరోపాప సీమ – ఎంత చక్కని కథ దృశ్యాత్మకంగా రాసిందో చూడండి "ఒకసారి వరద వచ్చింది. ఆ వరదలో ఒక యిత్తడి బిందె, ఒక కుండ కొట్టుకు పోతున్నాయి. "ఓ కుండా! మనం ఇద్దరం ఏదైన ఉపాయం ఆలోచించి బయట పడదామని" అంది ఇత్తడి బిందె. "వద్దు బాబూ! నీకూ నాకూ పొత్తు కుదరదు. నీవు నాకు తగిలినా నేను నీకు తగిలినా నాకే నష్టం. నేనే పగిలి పోతాను. కనుక నీకు పుణ్యం ఉంటుంది నా దగ్గరకు రాకు" అంది కుండ. ఇత్తడి బిందెకు దూరంగా ఉంటూ వచ్చింది కుండ. ప్రమాదకారులకు దూరంగా ఉండడం ఉత్తమం." ఇలాటి ఉత్తమ రచనలు నేడు అపారంగా వస్తున్నాయి. వీటిని ప్రోత్సహించవలసి ఉంది

# పిల్లల నవల

ఆధునిక యుగంలో పిన్నల పెద్దల ఆదరణ పొందిన వాఙ్మయ ప్రక్రియ నవల. వస్తు విస్తృతిలోగాని, అనేక ప్రవేశార్హతలలోగాని, వివిధ సన్నివేశాల సమయోచిత కల్పనలో గాని, వైచిత్రిలోగాని నవలను మించిన ప్రక్రియ మరి లేదంటారు తెలుగులో 'నవల' అనే పదాన్ని తొలిసారిగా కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి (1863 – 1940) గారు కందుకూరి వీరేశలింగము పంతులుగారి రాజశేఖర చరిత్రను సమీక్షిస్తూ వారాయ పైగా "నవాన్ లాతి గృహ్ణాతీతి నవలా" అను వ్యుత్పత్తిని కూడ చెప్పారు. తెలుగు దేశంలో ఆంగ్ల సాహిత్య ప్రభావం ఎక్కువగా కలిగిన తర్వాత బాగా వ్యాప్తి పొందిన ప్రక్రియ నవల ఇంగ్లీషు లో దీన్ని 'నావెల్' అంటారు. లాటిన్ భాషలో 'నావెల్లా' అనే పదం నుంచి 'నావెల్' అనే పదం వ్యుత్పత్తి చెందినదని నిఘంటుకారుల భావన. నవలలు పిల్లలకు నచ్చే ఇతివృత్తంతో, సులభశైలిలో ఉదాత్త సన్నివేశ కల్పనలతో ఉత్సుకత కల్పించేట్లు రాస్తే అది పిల్లలకు మంచి నవల అవుతుంది. "నిజమైన నవల ప్రజల జీవితకథను స్పష్టంగా చిత్రించాలి. మంచి చెడులపై వారి ప్రభావాన్ని

ఆ యుగపు దృక్పథాన్ని తెలియపరచాలి." [13] వాస్తవానికి నవల "పదబంధాలు, భాషాపాండిత్యాలు, సమాస శృంఖలాలు ఎరగని ప్రక్రియ. ఇది సామాన్యునివలె నిరాడంబరం అయింది. జీవితంవలె సత్యమైనది ప్రకృతివలె సుందరం అయింది. ఆకాశంవలె విశాలం అయింది. సూర్యునివలె తేజోవంతం అయింది వాయువువలె, సర్వవ్యాప్తం అయింది."[14] పిల్లల నవలల విషయంలో ఇదే సూత్రం అన్వయిస్తుంది. నవలలో వస్తుపరిధి విషయంలో పెద్దల నవలకు, పిల్లల నవలకు ఎంతో అంతరం ఉంది. "పెద్దలు చదివే నవలలో ఎన్నో సమస్యలు చిత్రించవచ్చు. అది సులభం. ఎందుకంటే ఆ నవలలకు కథావస్తువు పుష్కలంగా లభిస్తుంది. అమ్మాయి అబ్బాయితో ఆదిమధ్యాంతాలను అమితోల్లాసంగా చిత్రించుకోవచ్చు. పిల్లల నవల రచనా విధానమే వేరు. ఇక్కడ బాధ్యతలు కూడ ఎక్కువ. దృష్టివేరు దృక్పథం వేరు. అందుచేత ఇచట కథావస్తువులు కూడ వేరైపోతాయి." [15] పైగా పిల్లల నవలలో పిల్లలు మనఃప్రవృత్తులకే గణనీయమైన స్థానం కల్పించవలసి ఉంటుంది. రచనా విధానంలో, సాంకేతిక విలువలలో తప్ప పెద్దల, పిల్లల నవలలో సామ్యాలు కనిపించవు.

## తొలి తెలుగు నవల

తెలుగులో వచ్చిన తొలినవల 'రంగరాజ చరిత్ర' 1872 లో ప్రచురింపబడింది. ఆ తర్వాత వచ్చిన పరిపూర్ణమైన నవల 'రాజశేఖర చరిత్ర' లేదా 'వివేక చంద్రిక' (1878). ఈ రెంటికీ పేరులో చరిత్ర అనే పదం చివర ఉన్నా ప్రధానంగా ఇవి సాంఘిక నవలలు. "నాటి సాంఘిక సమస్యలను దృష్టిలో ఉంచుకొని వాటి వలన ప్రభావితమైనవి." [16] కారణం ఊహించలేం గాని తెలుగులో వచ్చిన దాదాపు ఎనభై

..............................

13 Crouch, Marcus The Children's Novel in England. London, Earnest Ben Ltd., 1972.

14 రంగాచార్య, దాశరథి. తెలుగు నవల - షష్టిక పరిణామం. అభ్యుదయ, జనవరి, 1980 2 పు.

15 సభా. కె. పిల్లల నవలలు - 1977 సంచిక, 253 పు

16 రమాపతిరావు, ఎ. ఈ దశాబ్ది తెలుగునవల అభ్యుదయ. జనవరి, 1980.

సంవత్సరం లకగాని తెలుగులో పిల్లల నవల రాలేదు. తొలి తెలుగు నవలకు ఆంగ్ల మాతృక ఉన్నట్లుగానే, ఆంగ్ల నవలాధారంగానే వి. దుర్గాప్రసాదరావుగారు "అల్లీ బిల్లీ లోకంలో అమ్మాయి కథ" ను (1951) రాశారు. అది వారపత్రికలో సీరియల్‌గా ప్రచురించినపుడే ప్రజల ఆదరాభిమానాలను చూరగొన్నది ఆ తర్వాత ముప్పయి సంవత్సరాల కాలంలో యాభై నవలలకు మించి రాలేదంటే – బాల సాహిత్యంలో మాత్రం ఈ ప్రక్రియ పెద్దగా ఆదరణ పొందలేదనిపిస్తుంది. వచ్చిన నవలలో బాగా ప్రచారంలోకి వచ్చినవి చాలతక్కువ "సాంఘిక నవలలు మరుగున పడిపోయినంత త్వరగా మరేపుస్తకం పోదు." [17] ఇదే నిరాదరణ కిథలకుమాత్రం లేదు. ఈ కాలంలో సుమారు రెండువేల కథాసంపుటాలు అచ్చాయి ఉంటాయి. వస్తురీత్యా పిల్లల నవలలను సాంఘిక నవలలు, అద్భుత నవలలు (ఫ్యాంటసీస్), చారిత్రక నవలలు అని మూడు విధాలుగా విభజింప వచ్చును. కాని పిల్లలు విశేషంగా చదివి ఆనందించే హాస్య నవలలు, శాస్త్రీయ నవలలు రాలేదనిపిస్తుంది ఐతే ఈ కోవకు చెందిన పెద్దల నవలలను పిల్లలు చదివి ఆనందించడం వేరేవిషయం.

సాంఘిక నవలలు

పిల్లల సాంఘిక నవలలు అనేసరికి వారికి తల్లి, తండ్రి, తోబుట్టువులు, బంధువులతో సంబంధాలు, పాఠశాల వాతావరణం మొదలైన అంశాలకు సంబంధించినవి ఈ నవలలో వస్తాయి కె. సభాగారు చెప్పినట్లు "పిల్లలలో అనంతమైన సమస్యలుంటాయి. అవి నవలల్లో నిక్షిప్తం కావాలంటే వాటిని పరిశీలించాలి ఇందుకు ఓపిక ఎంతో అవసరం. ఊహించి రాసే నవలల్లో సహజత్వం కన్పించదు. అవి కృత్రిమంగా తయారై సాహిత్యంలో నిలవకుండా అదృశ్యమైపోతాయి. ప్రతిపిల్లవాడికీ ఒక కథ ఉంది. అతని వెనుక ఒక చరిత్ర ఉంది. అన్నీ కాకపోయినా కొన్నయినా కథలకు ఉపకరించేవే. నవలలకు కథావస్తువులు కాదగినవి " [18] ఆవిధంగా పిల్లల జీవితంనుంచి కథకు తీసుకొని నవలగా మలచినప్పుడు అది చక్కని నవలగా

..............................

17 No book fades more quickly than a social novel CROUCH, MARCUS The children's Novel in England London, Earnest Ben, 1972. 15 p

18 సభా, కె పిల్లల నవల. బాలసాహిత్య శిక్షణ శిబిర ఉపన్యాసం, రాతప్రతి. 1979

రూపొందుతుంది. అలాంటి పిల్లల నవల కె. సభాగారి రచన 'చంద్రం' (1954) చంద్రం పేద విద్యార్థి తండ్రిలేడు. ముసలి తల్లి. తిండికే చాలీచాలని కాస్తకొంద్ర. స్కూలు ఫీజులు చెల్లించలేని పరిస్థితి. "నేను జీతం కట్టలేను సార్. జీతంలేకుండా సదువు చెప్పరా సార్' అని అయ్యవారిని ప్రాధేయపడతాడు చంద్రం. అలా వీల్లేదంటారు అయ్యవారు ఈ పరిస్థితిలో ఆదుకొనేవారు లేరు. అప్పిచ్చేవారు లేరు. ఆ దుర్భర పరిస్థితిలో తన సహాధ్యాయుడైన గోపీ ఇంట పాలేరుగా విధిలేక చేరు తాడు. గోపి తండ్రి చంద్రాన్ని వెట్టి చాకిరి చేయిస్తాడు. చివరకు "కాళ్లుపట్టమని" కోరుతాడు. ఎముకలు కరిగేట్లు ఎంత చాకిరి చేసినా ఈ విషయంలో చంద్రానికి అభిమానం అడ్డొప్పింది 'సనేమిరా' అని అంగీకరించలేదు. తనచేతిలో పనేగా అన్నట్లు గోపితండ్రి చంద్రాన్ని పాలేరుతనంనుండి పీకేశాడు. గ్రామ పరిస్థితులు చంద్రానికి నచ్చలేదు మిలటరీలో చేరిపోయాడు. ఆర్నెల్ల తర్వాత మిలటరీనుంచి సెలవలకు తిరిగి వచ్చేసరికి తల్లి లేదు విలవిలలాడిపోయాడు చేతిలో ఉన్న బెడ్డిం గుతోబాటు తనూ క్రిందపడిపోయాడు. పేదవాని జీవితానికి యీనవల చక్కని చిత్రణ. పిల్లలపై అనవసరంగా చేయి చేసుకొంటే వారు ఇల్లు విడచి పారిపోతారు ఎందుకూ కొరగాని వారౌతారు ఈ యితివృత్తంతో గీతా సుబ్బారావు (పిల్లా సుబ్బరాయశాస్త్రి 1941–) గారు రచించిన పారిపోయిన బరానీ (1970). బరాని తొమ్మిదేళ్ల విద్యార్థి చురుకైననాడు తెలివైన గడుగ్గాయి ఒకరోజు ఇంట్లో చెప్పకుండా సినిమాకు వెళ్తే చావచితక తన్నడానికి ప్రయత్నాలు చేస్తాడు తండ్రి. ఇది చూచి బరానీ పారిపోతాడు. రైలెక్కి పట్నం చేరతాడు. రౌడీల చేతిలో చిక్కుతాడు. జేబు దొంగగా తయారౌ తాడు. ఒకసారి జేబు కత్తిరిస్తుండగా పట్టుబడితే అందరూ వీపు వాయగొడతారు. పారి పోయి కాళికాలయంలో దాక్కుంటాడు అక్కడ కొందరు దొంగలు ఒక ధనవంతుని బిడ్డనుతెచ్చి బలి ఇచ్చే ప్రయత్నం చేస్తుంటారు. ఈ విషయం పోలీసులకు తెలియ జేసి ఆ పిల్లలను రక్షిస్తాడు. ఆపిల్ల తండ్రి తనతండ్రి స్నేహితుడే బరానీని తీసుకు వెళ్లి తన ఇంటివద్ద అప్పగిస్తాడు. ఆ తర్వాత తల్లితండ్రులు బరానీని ప్రేమగా చూస్తారు న్యాయపతి రాఘవరావుగారు పిల్లదొంగ (1970) అనే నవలలో బాలా నందం బాలల తమ తెలివితేటలతో కళానైపుణ్యంతో ఏవిధంగా పిల్లలు వారినుంచి తప్పించుకున్నారో వివరించబడింది.

ఆడినమాట తప్పితే ఎటువంటి తీవ్రపరిస్థితులను ఎదుర్కోవలసి వస్తుందో నార్ల చిరం జీవి నవల పీఠిగాయకుడు (1955) వలన తెలుస్తుంది. ఒక ఊళ్లో ఎలుకల బెడద

ఎక్కువగా ఉంటుంది. ఎలుకలను చంపిన వారికి వెయ్యి వరహాలిస్తానని మంగళరాయుడనే కోటీశ్వరుడు ప్రకటిస్తాడు వీధిగాయకుడు మురళి వాయించి ఎలుకలను దూర తీరాలకు తీసుకువెళ్లి వదిలేస్తాడు ఆ తర్వాత వీధిగాయకుడు మంగళరాయుని వద్దకు వచ్చి పనినెరవేర్చినందుకు వెయ్యివరహాలు యివ్వమంటాడు. మంగళరాయుడు అందుకు అంగీకరించడు వీధిగాయకుడు తన మురళి తీసుకొని–

తీయని కలలో మునిగిన పాపా
తేరుకొని యిటురావే పాపా
పెదవులు నవ్వులు చిందే పాపా
కదలి నీవిటు చూడవె పాపా
............
మత్తునిద్దురలు వీడివస్తారా
కొత్త లోకమును గనవస్తారా

అని పాడుకుంటూ వీధులవెంట నడిచి కొండమార్గం పడతాడు. పిల్లలంతా ఒకరి వెనుక ఒకరు వీధిగాయకుని అనుసరిస్తారు. కోటీశ్వరుని గారాలపట్టి అందులో ఉంటాడు. వెయ్యి వరాలిస్తానని కోటీశ్వరుడు ప్రకటిస్తాడు వీధిగాయకుడు ఈ సంగతి వినక మురళి వాయిస్తునే బాలబాలికలందరినీ చీకటి గుహలోకి తీసుకొనిపోయి పిల్లలకోసం కొత్తలోకం సృష్టించాడు కేవలం కల్పిత కథే అయినా రచయిత బిడ్డలను కూడ మరోలోకంలోకి తీసుకువెళ్లి కొత్త ఆలోచనలు కల్గిస్తాడు.

వాతావరణ పరిస్థితులు పిల్లలను ఎలా మార్చగలవో తెలియజెప్పే నవల పాలంకి వెంకట రామచంద్రమూర్తి (1910–) గారి 'చిరుకప్ప' అనే నవల ఇంటినుంచి తప్పిపోయి అడవిల్లో తోడేళ్ళవద్ద పెరిగిన పిల్లవాడు పచ్చిమాంసం తినటం తెలియక, మాటలు రాక ఎంత యిబ్బంది పడిందీ – పత్రికలో వచ్చిన ఒక వార్త ఈ కథకు ఆధారం. అడవిలోని ఒక కొండ గుహలో తోడేలు భార్య, పిల్లలతో ఉంటుంది ఒకరాత్రివేళ ప్రక్కనున్న పల్లెలో పులి ప్రవేశించి అందరినీ భయపెడుతుంది ఎటువాళ్లు అటు ప్రాణరక్షణకోసం పరుగెత్తుతారు. రెండేళ్ల పిల్లవాడు తప్పటడుగులు వేసుకుంటూ అడవిలోకి చేరతాడు. మెల్లగా గుహలోకి నడుస్తాడు. తోడేలు ఆ బిడ్డను సాకి పెద్దవాణ్ణి చేస్తుంది. చిరుకప్ప అని పేరు పెడుతుంది. తోడేళ్ళ, జంతువుల అలవాట్లు నేర్పుతుంది.

చిరుకప్ప పెద్దవాడయ్యాక నడచి దగ్గరలో ఉన్న పట్నంచేరి – అచటి అలవాట్లకు యిబ్బంది పడి – చివరకు మరల అన్నీ నేర్చుకుని సమాజంలో కలిసిపోతాడు. మనం బిడ్డలకు యిచ్చే శిక్షణను బట్టి వారిలో మార్పు వస్తుందని యీ నవల తెలియ జేస్తుంది "అతి గారాబంగా పెరిగిన పిల్లలలోను, తల్లిదండ్రులచే నిర్లక్ష్యం చేయ బడిన పిల్లలలోను ఒక 'ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్' ప్రభావం అధికంగా ఉంటుంది. అతి గారాబంగా పెరిగిన పిల్లలు యింట్లో ఒక నియంతగా తయారౌతారు వాళ్ల ఆజ్ఞ లను తల్లిదండ్రులు శిరసావహిస్తూ ఉంటారు ఈ తరహా పెంపకంలో పెరిగిన పిల్లలు విషయంలో ఆదరాభిమానాలు యిచ్చి పుచ్చుకునే వైఖరి ఉండదు. వీళ్లు పెద్దయింతర్వాత ప్రపంచంలో ఉన్న వారందరూ తమను నియంతల్లాగే గౌరవించాలనుకుంటారు."[20] ఇలాటి వాతావరణంలో పెరిగిన పిల్లవాడి జీవితకథ ఆధారంతో చొక్కాపు వెంకటరమణ (1949–) అల్లరి సూర్యం (1975) నవల రాశారు. అది ఉన్నత పాఠశాల విద్యార్థి జీవితంలోని బాలల మనస్తత్త్వం అల్లరి కళ్లకు కట్టినట్లు చూపిస్తుంది ధనవంతుల బిడ్డ సూర్యం అల్లరివాడు. చురుకైనవాడు. కాని తోటి విద్యార్థులను, ఉపాధ్యాయులను అల్లరిచేస్తుంటాడు. వాడి తోడు మరో ముగ్గురుకలసి గోపి అనే పేదవిద్యార్థిని ఏడిపిస్తారు. క్రమంగా సూర్యం రౌడీల చేతిలోపడి దెబ్బలు తిని అందవికారి అవుతాడు ఆ సమయంలో గోపి అతన్ని చేరదీసి ప్రేమగా చూస్తాడు సూర్యం వెంట తిరిగినవారు ఒక్కొక్కరే తప్పుకుంటారు. సూర్యం పరిస్థితిని గమనించి నియంత లక్షణాలు మాని అందరితో మంచిగా ఉంటాడు

ఇవిగాక పాలంకి వెంకట రామచంద్రమూర్తి గారి బంగారు తల్లి (1975) ధనంగారి అమ్మకావాలి (1975), ముద్దంశెట్టి హనుమంతరావుగారి వాసుచదువు (1955), కె సభాగారి బడిపంతులు, పావురాలు (1959), రావికొండలరావుగారి (1932–) దాసు, కనకమేడల వెంకటేశ్వరరావు (1931–) గారి అన్నదమ్ములు, (1954), రవిగారి సాహసిగోపి, మట్టెగుంట రాధాకృష్ణమూర్తి (1935–) గారి బడిపిల్లలు (1956), కొమ్మూరి వేణుగోపాలరావు (1938–) గారి పిల్లదొంగ (1954), యుగంధర్ రచన టింకూ సాహసాలు, (1979), మల్లాది అవధానిగారి పారిపోయిన పిల్లవాడు (1962), మొదలైన బాలల సాంఘిక నవలలు వెలువడ్డాయి. సాంఘిక వాతావరణానికి దగ్గరలో పాతూరి ప్రసన్నంగారి సుఖీభవ (1975), ఫిరోజమాగారి ఉడుతా ఉడతా హూత్ (1975), ఆలూరి భుజంగరావు గారి కుక్క ఆత్మకథ మొదలైన నవలలు రాశారు. తెలుగు పిల్లలకు సాంఘిక జీవితాన్ని చవిచూపారు.

..........................................

20 శ్రీరామమూర్తి, కోడూరి – తెలుగు నవలా సాహిత్యంలో మనోవిశ్లేషణ, 1993పు.

దేవతలు, మాంత్రికులు, కొత్త లోకాలు, సహజంగా వున్న విచిత్ర విషయాలను జెప్పే వాటిని అద్భుత నవలలు అంటారు. "దేవతల కథలు ఎక్కువగా చదివిస్తే - పిల్లలను ఉద్రిక్తులనుచేసి - వారి ఊహాపోహలకు దోహదంచేస్తాయని" షార్లెట్ బ్యూహ్లర్ అభిప్రాయంతో ఏకీభవించక తప్పదు ఈ దృష్టితో తెలుగులో పిల్లల నవలలు వచ్చాయి వాటిలో చింతా దీక్షితులుగారి రచన 'గోపీ మోహిని' (1955) ప్రశస్తమైనది ప్రసిద్ధమైనది శివనాయకుడు ఒక రాకుమారుడు. అతనికి ఇంద్రజాల విద్యలు నేర్చుకోవాలని ఉంది. ఒకరోజు అతనికి ఒక ముసలివాడు కనబడి "నీవు హిమాలయ పర్వతాలకు వెళ్ళితే అక్కడ ఒక ముని ఉన్నాడు అతడు ముసలి పండు. ఒక మంచుగుహలో అతను తపస్సు చేసుకుంటూ ఉంటాడు. అతని దగ్గరి కెళ్ళి, శిష్యరికం చేసినట్లయితే నీకు ఆ విద్యలు నేర్పుతాడు" అని సలహాఇచ్చాడు. ఆ ప్రకారం రాకుమారుడు అడవులనుదాటి, రాక్షసులను జయించి అనేక కష్టాలను ఎదుర్కొని హిమాలయాలను చేరుకుని అన్ని విద్యలూ నేర్చుకుంటాడు. సమీప రాజ్యంలోని 'గోపీమోహిని'ని చెరనుంచి విడిపించి ఆమెను వివాహం చేసుకున్నాడు. ఒకవ్యక్తి ఏదైనా పని సాధించడానికి ఎన్ని యిబ్బందులు ఎదుర్కోవాలో యీ నవల తెలియజెబుతుంది.

మహాభారతంలోనూ, ఎఱ్ఱన నృసింహ పురాణంలో వర్ణించిన శ్వేత ద్వీపాన్ని మనస్సులో ఉంచుకొని నోరి నరసింహశాస్త్రిగారు 'కర్పూర ద్వీపయాత్ర' నవలను రచించారు కర్పూర ద్వీపానికి ఒకనావ వస్తుంది దానిమీద వ్యామోహంచేత నాలుగు జంటల పిల్లలందులోని పక్షులై ఎక్కిపోతారు. దానివల్ల ఈలోకానికి వచ్చి విశేష పుణ్యకార్యాలు, స్వల్పమైన దుష్కార్యాలు చేస్తారు. వారి కర్మలను బట్టి స్వర్గ నరకాలకు వెళ్తారు కొన్నాళ్ళకీలోకం వినాశోన్ముఖంగా దీనావస్థలో ఉండడం చూచి, మనస్సులు కరిగి యీ లోకంలోకి అవతరిస్తారు. ఈలోకాన్ని మధురమూ, సుందరమూ, సన్మార్గ ప్రచలితమూ చేసి - మళ్ళీ కర్పూర ద్వీపానికి చేరుకుంటారు. "భారతీయ సంస్కృతి అంటే గౌరవమూ, భారత ఖండము మీదను, ప్రత్యేకంగా ఆంధ్రభూమి మీదా, ప్రేమాభిమానాలు కల్పించేట్టు నవల అల్లబడింది." ఈ శాఖలో శ్రీ వాత్సవగారి జలతారు జాబిలి గుండిమెడ వెంకటసుబ్బారావుగారి హంసద్వీపం (1951), దిగవల్లి వెంకట శేషగిరిరావుగారి విచిత్ర లోకం (1961), కె. సభాగారి మత్స్యకన్యలు (1957), అంతటి నరసింహం (1925-) గారి కోట వీరన్న సాహసం,

ఉదయగిరి పోలన్న ధైర్యం, నండూరి రామమోహనరావుగారి మయూరకన్య (1961) బి. వి. రాధారమణగుప్తగారి బాల షూంత్రికుడు (1955), కె రాజేశ్వరరావు గారి చిట్టిరాజు గూనిగుర్రం, (1975) రావూరి భరద్వాజగారి మాయలోకం (1977), రత నాలలోయ (1956), బంగారు లేడి (1957), కీలుగుర్రం (1956), ఎన్నదగినవి. ఈ నవలలు పిల్లలలో ఆలోచనా శక్తిని, ఊహాశక్తిని పెంచి ఉన్నత పథాల పయ నించడానికి తోడ్పడతాయి.

## చారిత్రక నవలలు

ప్రతి వ్యక్తికి ఒక చరిత్ర ఉంటుంది. తెలుసుకోవాల్సిన సంఘటనలు అతని జీవితంలో ఉంటాయి. తెలుసుకోవలసిన ఘట్టాలు ఉచ్ఛ, చరమదశలు ప్రతి దేశ చరిత్రలోనూ ఉంటాయి ఆ చరిత్రను తారీకుల క్రమంలో చెబితే పిల్లలకు విసుగెత్తక మానదు. ఐతే సంఘటనలకు కథలు, కథలుగా మలచి, వర్ణనలను, కొన్ని కల్పనలను చేర్చి చెబితే పిల్లలు చెవిగోసుకు వింటారు. విసుగెత్తే చరిత్ర కథగా చిరకాలం గుర్తుం టుంది. జీవిత చరిత్ర ప్రాతిపదికతో తెలుగులో వచ్చిన పిల్లల నవలలు లేవని చెప్పవచ్చు. మూలాన్ని చరిత్ర నుంచి తీసుకుని మలచిన పిల్లల నవలలు బహు తక్కువగా ఉన్నాయి.

యుగ యుగాలుగా తరతరాలుగా తన తాత్విక చింతనతో యావత్ప్రపంచాన్ని ఉర్రూత లూగించిన నాగార్జునాచార్యులను గురించి చాలమందికి తెలియదు. తెలియక పోవ డానికి బౌద్ధం తర్వాత భారతదేశంలో పాదుకున్న హైందవ మత దురహంకారులు బౌద్ధానికి సంబంధించిన ఆరామాలను, స్తూపాలను నాశనం చేయడం బౌద్ధుల గురించీ, బౌద్ధాచార్యుల గురించీ దుష్ప్రచారం చెయ్యడం కారణం నాగార్జునాచార్యులు తెలుగునాట స్థిరపడి, ఆ పర్వతప్రాంతంలో స్థిరనివాస మేర్పరచుకొని దక్షిణాపథంలో బౌద్ధప్రచారం చేసినట్లు తెలుస్తోంది, టిబెట్ బౌద్ధగ్రంథాల ఆధారంగానూ, ప్రచారంలోగల బౌద్ధకథలను బట్టి శార్వరి (వాసిలి రామకృష్ణశర్మ)గారు నాగార్జున(1960) నవలగారాశారు చారిత్రక విశేషాలతో సరళ గ్రాంథికంలో రచన చక్కగా సాగింది. పిల్లల చారిత్రక నవలలకు నాంది పలికింది మరొక నవల తాణిపాకం లింగన్నగారి శాంతి చక్రం- (1970) దేవరత్నం అనే వారపత్రికలో ధారావాహికంగా ప్రచురింపబడి 1976లో పుస్తక రూపంలోకి వచ్చింది ఇరుగుపొరుగుల మధ్య ఆ మాటకొస్తే ఇరుగు పొరుగు దేశాలమధ్య సరిహద్దు తగాదాలు చెలరేగి, కార్చిచ్చులా వ్యాపించి, ఐన వార్నీ, కానివార్నీ అమాంతం హతమారుస్తుంటే అటువంటి భీభత్సాన్నుంచి శాంతినీ, చల్లదనాన్ని మొలపించడం ఈ

నవల లక్ష్యం. ఈ లక్ష్యం శంకర్ అనే కుర్రవాని వలన నెరవేరింది. సింగంపల్లి అప్పారావుగారు గోస్వామి తులసీదాసు సామ్రాట్ అజాతశత్రువు మహారాణా ప్రతాప సింహుడు జీరెడ్డి చెన్నారెడ్డిగారి దక్షిణతార (1954) మొదలైనవి కొన్ని చారిత్రక నవలలు పిల్లలలో చారిత్రక దృష్టి పెరగడానికి యీ నవలలు మరిన్ని రావలసిన అవసరం ఉంది.

## వైజ్ఞానిక నవలలు

విజ్ఞాన విషయాలకు కల్పన జోడించి రాసిన నవలను వైజ్ఞానిక నవలలు అంటారు. ఇంగ్లీషులో హెచ్ జి వెల్స్ ఫ్రెంచిలో జూల్స్ వెర్న్ మొదలైనవారు ప్రశంసాత్మక మైన వైజ్ఞానిక నవలలు రాశారు "వైజ్ఞానిక కల్పనకు ముఖ్యావసరాలు అద్భుతం, భీభత్సం, రక్తం కరుడు కట్టించే భయం మొదలైనవి. తెలుగులో విక్రమార్కుని కథలు, కాశీమజిలీ కథలు వంటి అద్భుత రచనలను మించి ఉంటుంది వైజ్ఞానిక కల్పన. రాజ కుమార్తెలను రాక్షసులను అన్వేషిస్తూ వీరాధి వీరులు దూరప్రయాణాలు చేయడం, మాంత్రికుల సహాయంపొందడంవంటి సంఘటనలు అద్భుత గాధలకు ఆధారాలైతే ఫ్లయింగ్ సాసర్లు, పేలి పోయే నక్షత్రాలు పరస్పరం ఢీకొనే గ్రహాలు మారణ తరంగాలు ... మొదలైనవి వైజ్ఞానిక కల్పనకు కథావస్తువులు అవుతాయి.''[21] ఈ కల్పనలు గల నవలలు పిల్లలకు ఎంతో ఆసక్తిదాయకంగా ఉంటాయి. తగిన ఆదరణ ఉండదనే భావన చేతనేమో యీ తరగతి పిల్లల నవలలు అతితక్కువ వచ్చాయి. కల్పనలతో కూడినది రావూరి భరద్వాజగారి 'చిత్రగ్రహం' కొంతవరకు పిల్లల నవల అని చెప్పవచ్చు. చిత్రగ్రహం వలన ప్రజలు భయపడిన తీరు వైజ్ఞానిక కల్పన ఆధా రాలతో రచింపబడింది. కేవలం గణితశాస్త్రంలోని విచిత్రాలను తెలియజెప్పేది అవసరాల రామకృష్ణ రావుగారి గణిత విశారద అనే వైజ్ఞానిక నవల శారద ఏకైక కుమార్తె ఆమె ఎదుగుతున్న కొలదీ గణితంలో ప్రావీణ్యం సంపాదిస్తుంది. ఆమె ప్రశ్నలకు ఎవరూ సమాధానాలు చెప్పలేకపోతున్నారు చివరకు పెళ్లి ఒక సమస్యే ఔతుంది తుదకు విజ్ఞాన వర్మ ఆమె ప్రశ్నలకు సమాధానాలు చెపుతాడు. అప్పుడు గాయత్రీదేవి ప్రత్య క్షమై "శాస్త్రాలు సద్వినియోగం చెయ్యమని దీవిస్తుంది" మంచి నవల ఉత్కంఠ కలిగించే రచన. కంచి రమాదేవిగారి అనంతంలో అంతం మరో వైజ్ఞానిక నవల. ఇంతకు మించి ఈ శాఖలో మంచి రచనలు రాలేదనిపిస్తుంది

..............................

21 వెంకటరావు, వసంతరావు వైజ్ఞానిక కల్పనా సాహిత్యం, 1977 సంచిక, 54 పు.

# దృశ్య సాహిత్యం

నాటకావలోకనం - నృత్య గేయ నాటికలు - పౌరాణిక, సాంఘిక, వినోద, చారిత్రక నాటికలు - ఏక పాత్రలు - బుర్రకథలు

# నాటకావలోకనం

పిల్లలకోసం ప్రత్యేకంగా రాయబడిన నాటికలు, నాటకాలు, ఏకపాత్రాభినయాలు, బుర్రకథలు – మొదలైన ప్రదర్శన సాహిత్యాన్ని దృశ్యసాహిత్యం క్రిందకు చేర్చవచ్చు. ఈ ప్రక్రియ భారతీయ సాహిత్యంలో చిరకాలంగా చోటుచేసికొని ఉంది. దృశ్యసాహిత్యానికి మౌలికమైనది నాటకం. నాటకం దశరూపకాలలో ఒకటి. నాటకాన్ని గురించి పలువురు ఆలంకారికులు సిద్ధాంత చర్చచేశారు. అందులో ఒకరైన ధనంజయుని అనుసరించి – రూపక వైవిధ్యం వస్తుస్వభావాన్ని బట్టి, నాయక లక్షణాలనుబట్టి, రస స్వరూపాన్ని బట్టి ఉంటుంది ఇతివృత్తం ప్రఖ్యాతం, ఉత్పాద్యం అని రెండు అంశాలుగా ఉంటుంది. సహజంగా నాందీ, ప్రస్తావన, అంక విభజన, భరతవాక్యం ఉంటాయి. నాటకంలో యితివృత్తం ప్రధానమైనది. అందుచేత భరతుడు నాట్యశాస్త్రంలో 'ఇతివృత్తంతు నాట్యస్య శరీరం పరికీర్తితమ్' అన్నారు.

సాహిత్య ప్రక్రియలన్నిటిలో నాటకం రమ్యమైనది కనుక అలంకారికులు 'కావ్యేషు నాటకమ్ రమ్యమ్' అన్నారు. ఈ నాటకం లోకవృత్తాంతాన్ని గురించి చెబుతుంది గనుక 'లోకవృత్తాంత దర్శకం నాటకం' అన్నారు విజ్ఞులు. 'అన్ని కళలకు ఆద్య ప్రకృతి ప్రాథమిక మానవుని హృదయం. మొట్టమొదట ఆటవికుడిగా ఉన్న మానవుని సుకుమార హృదయం ఉప్పొంగినపుడు అతడు గంతులు వేస్తూ గొంతెత్తి పాడాడు. ఆడాడు. అప్పుడు ఆ ఆటనుండి నృత్యకళ, పాటనుండి గానకళ, మాటనుండి కవితాకళ ఉద్భవించాయి. ఈ మూడు కళలు పెరిగి పెద్దవై వయసు వచ్చిన పిమ్మట మళ్ళీ ఒకచోట నాటక కళలో తిరిగి కలిశాయి. అంతేగాక నాటక కళలో ఎన్నో కళలు – చిత్రలేఖనం – ఆహార్యం – శిల్పం – జంత్రమేళనం మున్నగునవి చేరాయి'1 అందుచేత నాటకం నవరస భరితమూ, అలంకార శోభితమూ, సకల కళాసంపన్నమూ ఐన ఒక ఉదాత్త సాహిత్య ప్రక్రియగా వర్ధిల్లుతున్నది గనుక నాటకాన్ని 'సాముదాయక కళ' అనే సమగ్ర నామంతో పిలుస్తారు. నాటకంలో అన్ని కళలు పరిపుష్టినొంది, ప్రేక్షకుల మన్ననలను బడసి పరాకాష్ఠ చెందడానికి వీలున్నది అలాచెందే గొప్ప అవకాశం ఉన్నందున ఆలంకారికులు "నాటకాంతం హి సాహిత్యం" అన్నారు. అంటే నాటకాల అధ్యయనంతోగాని సాహిత్య మథనం పూర్తికాదట. ఈ కారణంచేత

..............................

1 రామకృష్ణమాచార్య, నండూరి. న్యాయపతి రాఘవరావుగారి సంకలనం "పసిడి తెర"కు పీఠిక. హైదరాబాదు, ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి, 1979. 6 పు

మన సాహిత్య క్షేత్రంలో నాటకానికి సమున్నతమైన స్థానం ఉంది. ఇది పెద్దల నాటకాల సంగతి

బాలల నాటకాలలో అలంకారికులు చెప్పిన లక్షణాలు అన్నీ ఉండడానికి వీలులేదు, ఇవి ఇతివృత్త ప్రధానంగా రచింపబడతాయి గనుక పెద్దల నాటకాలలోని లక్షణాలు ఛాయామాత్రంగా ఉంటాయి. ఆ మాటకువస్తే బాలనాటకాల లక్షణాలే వేరు. "నాటకమన్నాకి – పసందైన విందు భోజనంలా ఉండాలి. చమత్కార సంభాషణలు. అభినయాని కవకాశం కల్పించే సన్నివేశాలు, కడుపుబ్బ నవ్వించే హాస్యం, అవసరమైన చోట్ల నృత్యాల కనుకూలమైన పాటలు, కొన్ని పద్యాలు, పిల్లలను ఆకర్షించే విచిత్ర వేషధారణ – అన్నిటికీ మించి – అతి తేలికగా అర్థమవుతూ అభ్యుదయ పథంలో వేగంగా సాగే కథ – ఇవన్నీ ముఖ్యం "[2] అని నాటక ప్రయోక్త కె. ఎల్ నరసింహారావుగారు అనుభవపూర్వకంగా చెబుతున్నారు దీనినిబట్టి సరళమైన భాష, బరువులేని భావాలతో పిల్లలు తెలుసుకోదగిన కొత్త విషయాలను పరిచయం చేసే ప్రయత్నంలో – చక్కని కథాసంవిధానంతో వినోదాత్మకంగా బాలల నాటక రచన సాగాలని పెద్దలు అభిప్రాయపడినట్లు నిర్ధారణౌతుంది ఆ పంథాలో సాగిన రచనలే జయప్రద మౌతున్నాయి.

బిడ్డలలో ఆసక్తి, అనుకరణ సహజంగా ఉంటాయి వాటిని క్రమ పద్ధతితో పెంచి పోషించినపుడు వారు ఉత్తమ కళాకారు లౌతారు. విజ్ఞాన వేత్తలు, సాహితీపరులు ఔతారు. అందుకుగాను వారికి శ్రవ్యకావ్యాలు చదివే అవకాశం, దృశ్యకావ్యాలు చూచే అదృష్టం కల్పించాలి. దృశ్యంలో హృదయానికి హత్తుకొనే మహత్తరమైన శక్తి ఉంది. ఫొటోప్లేటులాంటి ఆ శక్తి మరే సాహిత్యప్రక్రియకు లేదు. జాతిపిత మహాత్మా గాంధీజీ బాల్యంలో తన తండ్రిగారు కొనితెచ్చిన శ్రావణ పితృభక్తి నాటకాన్ని చదివాక తానుగూడ తన తల్లిదండ్రులను భక్తి విశ్వాసాలతో సేవించడం, అహింస, సత్యం, స్వార్థత్యాగం అనుదినం ఆచరణలోనుంచడం తాను అలవాటు చేసుకుంటు న్నట్లు, ఆత్మకథలో వ్రాసుకున్నారు. సత్యశోధనను తెలిపే కథ గనుక ఆ కథ మహాత్మకథ ఐంది ఆ నాటక పఠనం మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ "మహాత్మా గాంధీ" కావడానికి తోడ్పడింది వ్యక్తులను ప్రభావితం చేయగల నాటకాలు సాహిత్యంలో మణికిరీటాలు.

..................................

2 నరసింహారావు, కె .ఎల్. బాలల నాటకాలు-నాటికలు, ఆంధ్రప్రదేశ్ బాలల మహాసభలు. ప్రత్యేక సంచిక 1977, 81 పు.

తెలుగులో దాదాపు రెండు గంటలసేపు ప్రదర్శించడానికి వీలైన పిల్లల నాటకాలు ఉన్న దాఖలాలేదు. ఒకటి అరా ఉన్నా అవి కనుమరుగైపోయాయి. ఉన్నవన్నీ నాటికలే. ఆనాటికలూ యిటీవలి కాలంలో ప్రచురింపబడ్డవే దాదాపు 1925 నుంచి బాలల కోసం రచనలు ప్రకటించిన పత్రికలలో పిల్లల నాటికల జాడ కనిపించడంలేదు. న్యాయపతి రాఘవరావుగారు 1939లో మద్రాసు రేడియో కేంద్రంలో బాలల కార్యక్రమాల నిర్వహణ నిమిత్తం చేరాక బాలల నాటికల రచన, ప్రదర్శనలు ప్రారంభమైనట్లు ఆధారాలున్నాయి 1945లో 'బాల' పత్రిక పెట్టాకే తొలిసారిగా నాటికల ప్రచురణ భాగ్యం కలిగింది: ఆగస్టు 1945 బాల తొలి సంచికలో ప్రచురింపబడిన తొలి నాటిక జనమంచి రామకృష్ణగారి యమునాతీరం' అనే కృష్ణకథ. ఆ తర్వాత రేడియోలో ప్రసారమైన అనేక నాటికలు బాల పత్రికలో ప్రచురింపబడ్డాయి ప్రచారంలోకి వచ్చాయి.

తెలుగులో వెలువడిన బాలల నాటక సాహిత్యాన్ని స్థూలంగా ప్రక్రియలను బట్టి, విషయాన్ని బట్టి, వినియోగ విధానాన్ని బట్టి కొన్ని విభాగాలు చేసిన ఒక చక్రంగా రూపొందిస్తే దాని స్వరూపం యిలా ఉంటుంది.



ఈ నాటికలలో సహజంగా స్త్రీ పాత్రలు ఉంటాయి. అయితే కేవలం ఆడపిల్లలు, కేవలం మగపిల్లలుగల నాటికలు ప్రదర్శన సౌలభ్యం కోసం రాసినవి కొన్ని లేక పోలేదు.

## నృత్య, గేయనాటికలు

నాటికలలో నటీనటులు అభినయిస్తూ సంభాషణలు చెబుతారు. గేయ నాటికలలో అభినయిస్తూ పాడుతుంటారు ఒకోసారి పాట నేపథ్యంలో ఏర్పాటు చేయబడుతుంది నృత్యనాటికలలో ఆట, పాట అన్నీ ఉంటాయి. ఇందులో కథ, గేయం, సంగీతం, నృత్యం ఒకదాని కొకటి ఒరుసుకొని సలక్షణమైన కళాస్వరూపంగా పొంగి ప్రవహిస్తాయి.' [3] ఆకాశవాణిలో గేయనాటికలు ప్రదర్శించడం సాధ్య మౌతుంది జంత్రగాత్ర మేళవింపు సాధ్యమవుతుంది. నృత్య జంత్ర గాత్రాల మేళవింపు ప్రదర్శన సాధ్యంగాదు. టెలివిజన్‌లో రెండూ సాధ్యమే.

నృత్యనాటికల ప్రక్రియ ఈనాటిది కాదు. కాళిదాసు కాలంనుంచీ ఉంది. రస రంజకమైన ఈ ప్రక్రియ అన్ని కాలాలల్లో అందరి జనుల ఆమోదం పొందుతూ ఉంది. "భావయుక్తమైన భరతనాట్యాన్ని నాట్యకళకు అన్వయించి రసోద్దీపనం చేయడమే నృత్యనాటిక హృదయం."[4] ఈ నాటికలను ఆంగ్లంలో మ్యూజికల్ ఓపెరాస్ అంటారు. గేయ రచన నృత్యం, సంగీతం, అభినయం, రంగాలంకరణ, ఆహార్యం మొదలైనవన్నీ సమపాళ్లలో ఉన్నపుడు ఈ నృత్యనాటిక రక్తికడుతుంది. నృత్యనాటికలలో ఇతివృత్తం సాధ్యమైనంతవరకు పురాణ ప్రసిద్ధమైతే మంచిది. మోహిని భస్మాసుర, గిరిజాకల్యాణం, గిరికా కల్యాణం, శకుంతల, ధృవ, గౌతమబుద్ధుడు, గోపికాకృష్ణులు, శ్రీనివాసకల్యాణం మొదలైనవి అనుకూలంగా ఉంటాయి. వీటిలో కథాగమనం రసనిష్పత్తి సమంగా ఉంటాయి గనుక దానినిబట్టి అభినయం, రాగతాళ సమన్వయం సొంపుగ సమ కూర్చుకోవచ్చు. పోతే, జానపద గాథలు, జంతువుల కథలు, నిర్మాణాల కథలు పిల్లలకు వినోదాన్ని, విజ్ఞానాన్ని కలిగిస్తాయి.

..............................

3 దేవకి ఎం. కె. తెలుగులో గేయసాహిత్యం - సవిమర్శక సమీక్ష (రాసిన ప్రతి)

4 రామకృష్ణమాచార్య, నండూరి. న్యాయపతి రాఘవరావు సంకలనంచేసిన "పసిడితెర" కు పీఠిక, 1979.

పుష్టికరమైన ఇతివృత్తంతోబాటు గేయరచనలో ఎంతో మెళకువ చూపాలి. ఈ నృత్య గేయాలలో భాష భావం పాటను ఆటకు అనువుగా ఉండాలి. లయ, తాళగతులు, త్రిశ్ర, చతురశ్ర, ఖండమిశ్రలలో ఉన్నా వాటిమధ్య సమన్వయం కుదరాలి. రాగం నుంచి రాగం, తాళంనుంచి తాళం మార్పు అతి సహజంగా అలవోకగా సాగాలి. భిన్నత్వంలో ఏకత్వం ప్రస్ఫుటం కావాలి. రాగతాళాలు రమ్యమైన పగడం ముత్యాలు, రత్నాల హారంలా భాసించాలి." [5] వీటన్నిటినీ సమయోచిత ప్రజ్ఞతో సమన్వయ పరిచే అత్యంత ప్రతిభావంతుడైన ప్రయోక్త ఉండాలి. ఇవన్నీ రచయిత శ్రమకు సరైన ప్రతిఫలం చేకూర్చుతాయి. గేయ, నృత్యనాటికల ప్రదర్శనలు అత్యంత వ్యయప్రయాసలతో నిర్వహించేది కేవలం వేడుక కోసం కాదు దాని వెనుక బృహత్తరమైన ఆశయం ఉంది. "ఆడుతూ పాడుతూ మనదేశ చరిత్ర సంస్కృతీ సౌభాగ్యాలను అర్థంచేసుకోడానికి బాలలోకంలో ప్రచారం చేయడానికి ఈ నృత్య గేయ నాటికలు ఎంతగానో వారికి ఉపయోగ పడగలవు." [6] అందలి భాష, భావం, విషయం ప్రేక్షకులను ఉత్తేజ పరచ గలవు.

తెలుగు దేశంలో కొరవంజి, యక్షగానం, బహురూపం, వీధి నాటకం మొదలైన దేశి ప్రక్రియలు చిరకాలంగా ఉన్నవి. వాటి ఆధునిక రూపమే నృత్యనాటకం. నృత్య నాటికలలో పిల్లలకోసం తొలి ప్రయత్నం చేసిన వారిలో న్యాయపతి రాఘవరావుగారు ప్రథములని చెప్పవచ్చును రాఘవరావుగారు గురజాడ అప్పారావుగారి రచన - కరుణరసాత్మక విషాదాంత కావ్యం 'పూర్ణమ్మ కథ' ను కొద్దిపాటి సవరణలతో ఆకాశ వాణి మద్రాసు కేంద్రం ద్వారా మద్రాసు బాలానంద సంఘం బాలలచే సంగీత నాటికగా ప్రసారంచేసి, ఆ తరువాత పదేపదే రంగస్థలంమీద ప్రదర్శించారు రాఘవరావుగారికి రచనానుభవం, రంగస్థలాభిరుచి, బాలానంద సంఘాల నిర్వహణ - ఈ మూడు ముప్పేటగొని యుండడంచేత వారు కుందేలు - తాబేలు, చిలకమ్మ పెండ్లి, ఈగా -దోమ, మోహినీ భస్మాసుర, రాధాకృష్ణ, శ్రీరామ జననం — మొదలైన నాటికలను రాసి జయప్రదంగా ప్రదర్శించి అందరి ప్రశంసలను అందుకొనగలిగారు.

..........................

5 నరసింహారావు, బి వి. బి. వి. నరసింహారావు అభినందన సంచిక లలిత కల్చరల్ అసోసియేషన్, 1978.

6 నటరాజ రామకృష్ణ. ఏడిద కామేశ్వరరావుగారు సంకలనం చేసిన (చిరుగజ్జెలు), నృత్యనాటికలకు పీఠికలో - 4 పు

ఈ రంగంలో విశేషమైన కృషిచేసిన వారిలో పేడిద కామేశ్వరరావుగారు మరొకరు. ఆవు-పులి, పంట లచ్చిమి, విశాల భారతి, వేయి కన్నులు, విశ్వ విద్యాలయం, ఒప్పు కుప్ప మొదలైన నృత్యనాటికల రచన చేశారు. రేడియోలో ప్రసారం చేశారు రంగ స్థలం మీద ప్రదర్శించారు. అనంతామాత్యుని భోజరాజీయం - చతుర్థాశ్వాసంలోని గోవ్యాఘ్రములకథ దీనికి మూలం. కరుణరస పూరితమూ, సత్యవచన ప్రబోధితమూ అయిన ఈ కథ నృత్యనాటికగా బాల బాలికల హృదయాలను కదలిస్తుంది కంటతడి పెట్టిస్తుంది. పులి అనుమతి మీద ఆవు ఇంటికివెళ్లి బిడ్డకు పాలిచ్చి పులికి ఆహారం కావడానికి తిరిగి వచ్చినపుడు పులి –

తల్లీ నీవొక లక్ష్మీదేవివి, అన్నమాట దాటవైతివి
నిన్ను మించి నీతిపరులిల, లేరు ముమ్మాటికి
సాటిలే రెవ్వరు తల్లీ, నీకు దీటు లేరెవ్వరూ అమ్మా
ఆడిన మాట తప్పవైతివి, నిన్ను మించిన సత్యము లేదు
నిన్ను మించిన దైవము లేదు, నిన్ను చంపగ చేతులు రావు
చంపిన వారికి గతులు లేవు, నీదు కాళ్ళకు మొక్కెదు తల్లీ
నీలో నన్ను చేర్చుకో-

అంటూ ప్రాధేయపడుతుంది పులి. ఈ మాటలు విన్న ఎవరికైనా కనులవెంట నీరు రాకమానదు

బాలల నృత్యనాటికలలో బహుళ ప్రచారం పొందినది బాలాంత్రపు రజనీకాంతరావు గారి మూలస్తంభాలు అనే ప్రబోధాత్మక నాటిక. నవీన సమాజంలో విద్యార్థుల బాధ్యతలు, ఉపాధ్యాయుల విధులు తెలియజెప్పే నాటిక. ఇది పలుచోట్ల ప్రదర్శింపబడింది.

విద్యాలయ సరిహద్దుల నడుమ
విద్యలు గరిపే ఒజ్జశాలల్లా
సర్వ సమ్మతాంశముతే పార్యం
శీలవంతమౌ నడతయె ముఖ్యం

అనే భరతవాక్యం వలన ఈ నాటిక ధ్యేయం వ్యక్తమౌతోంది.

ఈ రంగంలో బాగా రక్తిగట్టిన జె. బాపురెడ్డిగారి సాగరసౌధం – నాటిక ప్రశస్త మైనది. కృష్ణానదిలోని జలసంపద అంతా అడవిగాచిన వెన్నెలైపోకుండా ఆ నదిపై నిర్మించిన నాగార్జున సాగర డామ్ నిర్మాణం యీ కథకు మూలం. ఆ డామ్‌నే సాగర సౌధం అన్నారు. ఈ సౌధనిర్మాణ వార్త విని కృష్ణవేణీమతల్లి –

బాధా మయమౌ నా చిరగాధ
పండువెన్నెలై విరిసేనా
రాలే నిండిన నా ఒడి నిండ
రత్నరాసులనే కురిసేనా
ఎవరాలించని నా వేదనలు
ఈనా డందరు విన్నారా ?

అని సంతోషపడుతుంది. తన సంపద అంతా ప్రజోపయోగానికి వినియోగపడే అవకాశం వచ్చినందుకు స్పందిస్తుంది. నాగార్జునుని కలలు పండుతాయి.

ఇంకా దాశరథిగారి వెన్నెల మడుగులు, సి. నారాయణరెడ్డిగారి తోటతల్లి, బోయి భీమన్నగారి పాతపూరు–కొత్తదారి, బి. వి. నరసింహారావుగారి నాట్యశ్రీ, కొలకలూరి ఇనాక్‌గారి సింహం–ఎలుక, పైడిపాటి సుబ్బరామశాస్త్రిగారి వరద కృష్ణమ్మ, మిరియాల రామకృష్ణగారి పగడాల దీవి, మధురాంతకం రాజారాంగారి మోహినీ భస్మాసుర, వ. పా. సా. గారి శంకరాభరణం, పురాణపండ రాధాకృష్ణగారి రాధా కృష్ణ మొదలైనవి అచ్చు ముచ్చటలు సంతరించుకొన్న కొన్ని నృత్యనాటికలు. రాత ప్రతుల రూపం ఉంటూ బయటి ప్రపంచం చూడని నాటికలు ఎన్నో కలవు.

## పౌరాణిక నాటికలు

మన సంప్రదాయ విజ్ఞానానికి పురాణాలు మౌలిక నిధులు. పురాణాలు జీవితానికి ఒక సందేశాన్నిస్తాయి. ఉదాత్త జీవితానికి మార్గం చూపుతాయనే విజ్ఞుల అభిప్రాయాన్ని కాదనలేము. పురాణాలలో కథ మనోజ్ఞంగా ఉంటుంది. పిల్లల మనస్సులలోకి బాగా నాటుతుంది. బిడ్డల హృదయాలలో ఒక సదుపదేశం పాదుకొల్పుతుంది. ఈ సదాశయంతో రచయితలు పిల్లల పౌరాణిక నాటికలను చాల రాశారు ఇందు న్యాయపతి రాఘవరావు, కామేశ్వరిగార్ల ధ్రువ మార్కండేయ, ప్రహ్లాద, మహిషాసుర మర్దని, జనమంచి రామకృష్ణగారి యమునా తీరం, వాలి–రావణ, ఎ. రమేశ్‌గారి

లవకుశ, విజయదశమి, ముద్దిపట్ల వెంకటరావుగారి నరకాసురవధ, ఎస్. మునిసుందరం గారి మహాదాత, ఇల్లిందల సరస్వతీదేవిగారి బాలవీరులు, అపకారికి ఉపకారము మొదలైనవి గమనించదగినవి.

న్యాయపతి రాఘవరావుగారు, కామేశ్వరిగారలు పురాణ ప్రసిద్ధమైన ప్రహ్లాద కథను చక్కని సందేశాత్మక నాటికగా మలిచారు. హిరణ్యకశ్యప మహారాజు తన కుమారుడైన ప్రహ్లాదుని గురువుగారి వద్ద చదవేస్తాడు — ఎలాగైనా విష్ణుభక్తి మానేస్తాడని. రాజుగారు ఒకరోజు బడికి వచ్చి గురువుగారివద్ద ఏమి నేర్చుకున్నావంటారు. అప్పుడు ప్రహ్లాదుడు —

చదివించిరి నను గురువులు
చదివితి ధర్మార్థ ముఖ్య శాస్త్రంబులు నే
జదివినవి గలవు పెక్కులు
చదువులలో మర్మమెల్ల జదివితి దండ్రీ

అది చదివి ఆ తర్వాత—

హరియను రెండక్షరములు
హరించును పాతకంబు ....

అని ప్రారంభించగానే తండ్రి ఉగ్రుడౌతాడు. చదువు మానిపించి ప్రహ్లాదుణ్ణి యింటికి తీసుకువస్తాడు. భార్య వద్దంటున్నా ప్రహ్లాదుడికి విషమిస్తాడు. బాలుడు హరినామ స్మరణ చేస్తూ తాగేస్తాడు. చావడు. తండ్రి ఆశ్చర్యపోయి నీ హరి ఎక్కడున్నాడో చెప్పమంటాడు. అందుకు ప్రహ్లాదుడు —

ఇందుగల డందు లేడని
సందేహము వలదు—చక్రి సర్వోపగతుండు
ఎందెందు వెదకి చూచిన
అందందే గలడు దానవాగ్రణి వింటే!

అలాగైతే స్తంభంలో చూప మంటాడు రాజు గదతో స్తంభాన్ని విరగ్గొట్టగానే విష్ణుమూర్తి ప్రత్యక్షమై హిరణ్యకశిపుణ్ణి కసిదీరా చంపేస్తాడు ఈ కథ బిడ్డల భక్తిని ధ్యానాన్ని ప్రబోధిస్తుంది. ధృవ, మార్కండేయ యీ విధమైన నాటికలే. దృశ్య ప్రధానంగా ఇవి రచింపబడ్డాయి.

బిడ్డలకు చక్కని హితబోధ చేసే మరో మంచి ఐతిహాసిక యితివృత్తంగల నాటిక ఇల్లిందల సరస్వతీదేవిగారి 'అపకారికి ఉపకారము'. అరణ్యవాసంలో ఉన్న పాండవులకు అపకారం చేయదలచి గోవులను రక్షిస్తామనే నెపంతో దుర్యోధనుడు మందీ మార్బలంతో ద్వైతవనం చేరతాడు అచట గంధర్వరాజు కౌరవులను పెడ రెక్కలతో రథానికి కట్టి తీసికొని పోతున్నాడు. ఆ సంగతి ధర్మరాజుకు తెలిసి కౌరవులను రక్షించమని తమ్ములను కోరతాడు. అందుకు వారు అంగీకరించరు. అప్పుడు ధర్మరాజు అంటాడు— "మనలో మనకు తగాదా వచ్చినపుడు కౌరవులు నూరుగురు—మనమైదుగురము కాని, ఇతరులతో తగాదా వచ్చినపుడు మనమందరమూ కలసి నూట ఐదుగురము! తెలిసిందా! ఇతరుల ఎదుట మన కలతలు బయట పెట్టకుండా మనను మనము రక్షించుకోవాలి. అట్లా చేయకపోతే అవ్యక్తమనిపించుకుంటుంది. అపకారికి ఉపకారం చేయడం మనధర్మం". ఆ మాటలకు తమ్ములు అంగీకరించి గంధర్వరాజునుంచి కౌరవులను రక్షిస్తారు ఈ విధమైన నాటికలు పిల్లల బాధ్యతపై మంచి ప్రభావాన్ని చూపుతాయి.

ఇవిగాక జానపద యితివృత్తంగల కె. లలితా చలంగారి దురాశ, అపాయంలో ఉపాయం నాటికలద్వారా ఆపద సంభవించినపుడు సమయస్ఫూర్తి, ఉపాయం, నేర్పు కావాలంటారు. ఈ రెండూ రంగస్థలంమీద బాగా సఫలీకృతమైన నాటికలు.

సాంఘిక నాటికలు

పిల్లలకు సంఘజీవనానికి కేంద్రాలు ఇల్లు, పాఠశాల కనుక యీ నాటికలలో చాల భాగం యీ రెంటినీ కేంద్రంగా తీసుకొని రచింపబడ్డాయి కుటుంబ సభ్యులు, ఉపాధ్యాయులు, పిల్లలు ప్రధాన పాత్రలు ఇతివృత్తం ఏదైనా హాస్యం కొంత మోతా దులో విధిగా ఉంటుంది బిడ్డలకు ఒక మంచి సందేశం అందించాలనే ధ్యేయం తప్పనిసరిగా ఉంటుంది గత నలభైఏళ్ళ కాలంలో బాలల సాంఘిక నాటికలు వందల సంఖ్యలో వచ్చాయి వాటిలో న్యాయపతి రాఘవరావుగారి కీ మరబొమ్మలు, న్యాయపతి కామేశ్వరిగారి కాసులపేరు, తెన్నేటి సూరిగారి గొడ్డకాడ, ఇల్లిందల సరస్వతీదేవిగారి సహవాస దోషము, నండూరి సుబ్బారావుగారి కంచుమోగినట్లు, బాలతగు, బృందా వనం రంగాచార్యులుగారి మారిన మనసు, అన్నపర్తి సీతారామాంజనేయులుగారి దసరా అల్లుడు, ఉన్నవ సేతుమాధవరావుగారి సన్యాసం, పొదిలి శ్రీరామమూర్తిగారి పిల్లల చదువులు, సోమంచి రామంగారి పరీక్ష, జె పూర్ణచంద్రరావుగారి దొంగ చదువు, కె సభాగారి పిర్యాదులు, అలపర్తి వెంకట సుబ్బారావుగారి చివరకు మిగిలేది,

కె ఎల్. నరసింహారావుగారి పుట్టినరోజు పండుగ, ఏడిద కామేశ్వరరావుగారి రత్న మాణిక్యాలు, కేవలం ఆడపిల్లలు పాత్రలతో రాసిన అన్నపర్తి సీతారామాంజ నేయులుగారి చేతవెన్నముద్ద, సోమంచి రామంగారి కమల — విమల, కేవలంగా మగ పిల్లలు పాత్రలుగా రాసిన పగటి వేషాలు — ప్రసిద్ధిపొందిన నాటికలు. పలుచోట్ల ప్రదర్శించడమే వీటి గొప్పదనానికి ప్రబల నిదర్శనం

పిల్లలు ఆనందించే బొమ్మల యెడల పెద్దలు ఆదరంతో, ప్రేమతో ఉండాలని తెలియ జెప్పే మంచి నాటిక న్యాయపతి రాఘవరావుగారి కీ మరబొమ్మలు పెద్దలు పిల్లల తగువులలో జోక్యం కలుగజేసుకోరాదు పిల్లలు కాసేపు ఆడుకుంటారు. పాడు కుంటారు. పోట్లాడుకుంటారు తన్నుకుంటారు. మరల వెంటనే కలసిపోతారు వారిలో కక్షలు కార్పణ్యాలు చిరకాలం ఉండవు అందుకని మధ్యలో పెద్దలు కల్పించుకోరాదు. కల్పించుకుంటే 'ఫూల్స్' అవుతారని నండూరి సుబ్బారావుగారు 'బాలతగు' నాటిక ద్వారా చెబుతారు చదువుకున్న సంస్కారులెప్పుడూ నిండుకుండలా తొణక్కుండా, బెణక్కుండా ఉంటారు చదువు సంధ్యాలేనివారు భేషజాలకుపోయి అతిగా వాగుతారు. కనకానికి కంచుకీ తేడా — చదువుకున్న వారినుంచి చదువులేనివారు తెలుసుకొని బుద్ధిగా, ఒద్దికగా, మసలాలని వారే కంచుమోగినట్లు అనే మరో నాటికలో వివరిస్తారు.

తగినంత శక్తి, ఆసక్తి ఉన్నా పల్లెలలో బాల బాలికలు విద్యావకాశాలు లేక, ఆటుపోటు లకు లోనవుతారు. అట్టివారు వృత్తిపనులు నేర్చుకొని స్వతంత్రంగా జీవయాత్ర గడపడానికి ప్రయత్నించాలనీ, స్వావలంబన విధానాన్ని బాల్యం నుంచి అలవర్చు కోవాలని ఏడిద కామేశ్వరరావుగారు రత్నమాణిక్యాలు అనే నాటికద్వారా ప్రబోధం చేశారు. పగటి వెషగాళ్ళకు పైసా యివ్వడానికి నిరాకరించిన షావుకారు పోలీసువారి చేతిలో ఎలా చిక్కుకున్నదీ వినోదాత్మకంగా వివరిస్తారు 'పగటి వేషాలు' అనే నాటి కలో మద్దిపట్ల వెంకటరావుగారు.

కొడుకుపట్ల గారాబం ఎక్కువై క్లాసులో తప్పుచేసినా సమర్థించిన తండ్రి, తర్వాత తన జేబులో డబ్బు తస్కరించినప్పుడు దండిస్తాడు. స్వార్థపరమైన తండ్రి మనః ప్రవృత్తిని తెలిపే యీ నాటిక వెర్రి గారాబం రచయిత లవణంగారు.

మనం సులభంగా లభించే వస్తువులతో ఆరోగ్యాన్ని పొందవచ్చుననే ఉద్దేశాన్ని తెలియ జెప్పే 'ఆహార విజ్ఞాన దీపిక' నాటికను బి. జే. రావుగారు రూపొందించారు.

అన్న ఇంట్లో ఉంటున్నా కాంతమ్మ - అన్న కూతురుకు సంబంధంవస్తే - ఆ సంబంధం తన పిల్లకు చేయాలని పేరాశపడి అన్న కూతురుకిచ్చే లడ్డులో నల్లమందు పెడుతుంది. చివరకు ఆ లడ్డు తన కూతురే తింటే హైరానపడిపోతుంది చివరకది నల్లమందుకాదు లేహ్యమని తెలిపోతుంది. పేరాసకు పోరాదని బోధించే 'నాయనమ్మ-నల్లమందు' నాటిక రచయిత సోమంచి రామంగారు.

ఒకప్పుడు గిద్దెసురులు చెప్పడం, ఎక్కాలు వల్లించడం, అంగడి రోజున పంతులుగారి భోజనానికి బియ్యం, దీపానికి నూనె తేవడం, బడిపెద్ద మిగతా పిల్లలందర్నీ బెదిరించడం నడుస్తుండేది కొత్త పంతులొచ్చాక అవన్నీ మాన్పించి - హరిజనులకు కూడ అందరితో సమానంగా కూర్చునే ఏర్పాటు చేస్తాడు ఆడపిల్లలు కూడ బడికి వెడతారు. ఆనాటి పల్లెల పరిస్థితి నేడు వస్తున్న మార్పును రమణీయంగా చిత్రించారు యశోదా దేవిగారు బుచ్చయ్య దెబ్బ అనే నాటికలో.

ఉపాధ్యాయుని చదువుబాధ ఎక్కువైనదని ఎదురు తిరిగిన పిల్లవాడు తండ్రి జోక్యంతోనూ, ఉపాధ్యాయుని ఓర్పుతోనూ దారి కొస్తాడు. ఈనాటి పరిస్థితులకు అనుకూలమైన నాటిక బృందావనం రంగాచార్యులుగారి 'మారిన మనసు.'

గారాబంగా పెరిగిన పిల్లలు డబ్బు విలువ తెలుసుకోకుండా మారాం చేస్తుంటే - తల్లిదండ్రులు వారికి గుణపాఠం నేర్పడానికి గమ్మత్తుగా ఆడిన నాటిక మంచిరోజులొచ్చాయి రచయిత చిలకమర్రి బదరీనాథ్. ఈ విధంగా సాంఘిక రంగంలో మంచి నాటికలు వచ్చాయి.

## వినోదనాటికలు

ఆరోగ్య ప్రదమైన హితౌషధం హాస్యం. ఆ హాస్యంలో వినోదం లాస్యం చేస్తూ వుంటుంది మిగతా ప్రక్రియలలో హాస్యం అనుషంగికంగా ఉంటూ వచ్చినా దృశ్యకావ్యాలలో ఉన్నంత ఆధికారికంగా, డైరెక్ట్‌గా మరెచ్చటా ఉండడానికి వీలు లేదు. తిక్కన రెండు రకాల నవ్వులను గురించి చెప్పినా, జంఘాలశాస్త్రి నలభైరకాల నవ్వులను గురించి చెప్పినా నిసర్గ మనోహరమైన బిడ్డల నుంచి కమ్మగా వచ్చే ఆనవ్వే నవ్వు. దానికి సాటి అదే మరొకరు నవ్వినా బిడ్డలు అంతగా ఆనందిస్తారు. అందుచేత హాస్య నాటికలంటే పిల్లలు చెవి కోసుకుంటారు. అది వారి ప్రవృత్తి ప్రకృతి.

పిల్లల నాటికలలో హాస్యనాటికలు మూడింట రెండువంతు లుంటాయి. ఈ హాస్య నాటికలకు శ్రీకారం చుట్టినవారు న్యాయపతి రాఘవరావు, న్యాయపతి కామేశ్వరిగారలు. పొట్టిబావ, చిట్టి మరదలు పాత్రలుగా సృష్టించి పొట్టిబావ ఉద్యోగ ప్రయత్నాలు, లడ్డు చోరీకేసు, టపాకాయ దుకాణం మొదలైన అనేక హాస్యనాటికలు రాశారు. ఇవిగాక గున్నయ్య గడ్డం, జబ్బుకుదిరింది, ఇంటి మందు, మడతకుర్చీ, బూరెలమూకుడు, శ్రావణ భాద్రపదాలు ప్రసిద్ధి పొందిన హాస్యనాటికలు. న్యాయపతి కామేశ్వరిగారు ఆడపిల్లలు పాత్రలతో ఇద్దరు లలితలు, మందమతి-అనే హాస్యనాటికలను రాశారు. రాయిడమేకాక రంగస్థలంమీద అనేకసార్లు ప్రదర్శించి పిల్లలను ఆనందింపజేశారు. ప్రదర్శన యోగ్యంగా నాటికలు రాయడం వీరి ప్రత్యేకత. ఆ మార్గంలో వీరు సిద్ధ హస్తులు

నండూరి సుబ్బారావుగారి దసరా అల్లుడు ఉన్నవ సేతుమాధవరావుగారి సున్నా రాయుళ్ల సంఘం, ప్రోగ్రెస్ కార్డు మొదలైన నాటికలు వెలుగులోకి వచ్చాయి.

కోస్తా ఆంధ్రప్రాంతంలో శ్రావణ, భాద్రపదమాసాల్లో ఎక్కువగా వర్షాలు కురుస్తాయి. అందుకని కొందరు రెండు మూడు మాసాలకు సరిపోయే చిల్లర సరుకులు ఇంట్లో పడేస్తారు. దూరప్రయాణాలు చేయదలచినవారు యిలాగే చేస్తారు. ఒకసారి సోమయాజులుగారు తీర్థయాత్రకు వెళ్లదలచి రెండుమాసాలకు సరిపడా సరకులు తెచ్చి శ్రావణ భాద్రపదాలొస్తాయి. అన్నీ సిద్ధంగా ఉంచుకో అని భార్యకు చెప్పి కాశీ వెళ్లిపోతాడు. సోమయాజులు మాటలు దొంగలు విని తామే శ్రావణ, భాద్రపదాలని నమ్మించి సరకులన్నీ ఎత్తుకుపోతారు. జరిగిన మోసానికి యిద్దరు బాధపడతారు మన పల్లెటూళ్లలో అమ్మమ్మలు చెప్పుకొనే యీ కథకు న్యాయపతి రాఘవరావు, కామేశ్వరిగారలు నాటికగా హాస్యభరితంగా రాశారు.

సంభాషణలలో యితివృత్తం లోహాస్యలక్షణాలుగల నాటిక బడితనిఖీ. యామర్తి గోపాల రావుగారి రచన. పరమ లౌకికుడైన హెడ్మాస్టరు, ఉడుకు రక్తపు లెక్కల మాస్టారు, కాకామాస్టరు రమణయ్య, గుర్తింపులేదో అని ఏడ్చే తెలుగు పండితుడు, ఏమి చాత కాని క్రాఫ్ట్ టీచరు, సోమరి సోషల్ స్టడీస్ టీచరు, అహంభావపు సైన్సు టీచరు, హెడ్మాస్టరు కింద గోతులు తవ్వే ఫస్ట్ అసిస్టెంటూ - ఇలా అన్ని బలహీనతలుగల ఉపాధ్యాయ బృందం డి.ఇ. ఓ గారి ముందు నిజస్వరూపాలు ప్రదర్శిస్తారు. డి. ఇ ఓ వారిని మందలించి సన్మార్గంలో పెడతారు. ఎవరు నిర్వర్తించాల్సిన విధి వారు నెర

వేస్కోవాలన్నదే యీ నాటిక చేసిన హితబోధ. ఇది చక్కని ప్రబోధాత్మక హాస్య నాటిక

న్యాయపతి రాఘవరావు, కామేశ్వరిగారి బూరెల మూకుడు నాటికను పోలినదే నండూరి సుబ్బారావుగారి నీకు రెండూ-నాకు మూడూ అనే హాస్య నాటిక. అమాయకపు భార్య భర్తలు పండక్కి ఐదు అరిశలు వండుకుంటారు. ఇద్దరి మధ్యా పంతులు కుదరక ఎవరు మాట్లాడితే వాళ్లకు రెండు, మాట్లాడకుండా ఉండి పంతం నెగ్గించుకున్న వారికి మూడు అని ఒప్పందానికి వస్తారు నోరు మూసుకుని ఉంటారు. వీళ్లకేదో దయ్యం పట్టిందని నాటువైద్యులు పొరుగింటివారి సాయంతో వాతలు పెట్టబోతారు భయపడి యిద్దరు మాట్లాడతారు తీరా అరిసెలు తిందామనేసరికి యింతకు ముందే వాటిని కుక్క తినేసింది! ఇలా నాటిక మొదటినుంచి చివరిదాకా హాస్యమే. ఇలాగే, ఛాందసపు అత్తమామల యింటికి అత్యంతాధునికమైన అల్లుడువస్తే ఎలా వుంటుందీ తెలియజెప్పే హాస్యనాటిక దసరా అల్లుడు. చొక్కా-జేబులో డబ్బుతీశాడని తండ్రి కొడుకును దండిస్తుంటే ఆ డబ్బు పాత చొక్కా-జేబులో వేసినట్లు మతి మరుపు భర్తకు భార్య గుర్తుచేస్తుంది. తీరా ఆ పాత చొక్కా కనబడకపోతే ఆ చొక్కాను గంగిరెద్దువాడి కిచ్చినట్లు భార్య జ్ఞాపకం చేస్తుంది ఇంతలో గంగిరెద్దు కూడ ఇంటి ముందు కొస్తే-ఆ పాత చొక్కా-కోసం ఆ బొంతలు విప్పబోతే అందులోంచి బడి పిల్లలు బయటపడతారు 'సస్పెన్సు' తో కూడిన చక్కని వినోదాత్మక నాటిక అనపర్తి సీతారామాంజనేయులుగారి 'గంగిరెద్దు'

సున్నా మార్కులు వచ్చే ఒక బృందం తోటలో మామిడికాయలు దొంగిలించి-దాన్ని సమర్థించుకోడానికి సున్నారాయుళ్ల సంఘంగా ఏర్పడి బాగా మార్కులు వచ్చే వాళ్లనూ తల్లి దండ్రులనూ విమర్శిస్తుంటే తోటకాపరి, ఆ పిల్లల తల్లి దండ్రులూ చాటుగా విని వాళ్ల భరతం పడతారు. ఇది ఉన్నవ సేతు మాధవరావుగారి సున్నారాయుళ్ల సంఘం నాటిక. తమాషా కోసం సేవకుణ్ణి మహారాజుగా చేస్తాడు రాజుగారు ఆ పని వల్ల-అనగా ఎవరు చేయాల్సిన పని వారు చేయనందువలన వచ్చే అనర్థాలను కె ఎల్. నరసింహారావుగారు మతిలేని మహారాజు నాటికలో చిత్రిస్తారు. ఈ విధంగా హాస్య రచనలు బాల సాహిత్యంలో చక్కని స్థానాన్ని ఏర్పరచుకున్నాయి.

చారిత్రక నాటికలు

జీవిత చరిత్రలు, దేశచరిత్రలకు సంబంధించిన నాటికలు చారిత్రక నాటికలు. చారిత్రక

విషయాలద్వారా ఓడ్డలలో ధైర్యం, త్యాగం, నైతిక వర్తన, దేశభక్తి పెంపొందించడం యీ నాటికల ఉద్దేశం. పిల్లలలో జిజ్ఞాస మెండుగా ఉంటుంది. లోకమునందలి అన్ని విషయాలను తమ చిన్నారి మనస్సులతో అర్థంచేసుకొని తమ చిన్నారి మాటలతో పలుకవలెనని తలుస్తారు. అనగా వారిలో చూచిన దానిని అనుకరించవలెననే ధ్యాస మెండుగా ఉంటుంది.[7] ఈ ధ్యాసను ఆసరాగా తీసుకొని వారి భవిష్యజ్జీవితానికి ఉపయోగపడేట్లు చారిత్రక అంశాలు పొదుకొల్పాలి. ఈ దృష్టితోనే చారిత్రక నాటికల రచన సాగుతూ వుంది.

తెలుగులో పిల్లల చారిత్రక నాటికలు తక్కువ. న్యాయపతి రాఘవరావుగారి అశోక చక్రం, పిళ్లా సుబ్బారాయశాస్త్రిగారి ధర్మశీల, అమరజీవి, తగిన శిక్ష, నండూరి సుబ్బారావుగారి పన్నా, తిమ్మరుసు, సిద్ధార్థుడు, భారవి, శాలివాహనుడు, జనమంచి రామకృష్ణరావుగారి చాంద్‌బీబీ, హర్షవర్ధన, ఖడ్గతిక్కన, అలెగ్జాండర్, ఎ రమేష్‌గారి పన్నా రాజభక్తి మొదలైనవి కొన్ని మంచి నాటికలు.

భారత జాతీయ జండాపై శాంతికి చిహ్నంగా విరాజిల్లుతున్న ధర్మచక్రం- నిర్మాణానికి మూల పురుషుడైన అశోక చక్రవర్తి రాజ్యాలు జయించి కళింగ రాజ్యంలో హింసాకాండకు పూనుకున్నపుడు ఒక అంధురాలి వలన కలిగిన పరివర్తన చక్రవర్తిని అహింసామార్గానికి పురికొల్పినట్లు తెలియజెప్పే నాటిక అశోకచక్రం. అనేక చోట్ల ప్రదర్శింపబడి పలువురి ప్రశంసలను అందుకొన్నది.

తెలుగు దేశాన్ని పాలించిన కాకతీయ రాజులలో గణపతి దేవునకు రుద్రమ దేవి ఒక్కతే కూతురు. మగసంతు లేరు. రుద్రమదేవికి ముమ్మడమ్మ అనే కూతురు పుట్టాక భర్త చనిపోతాడు. రుద్రమదేవికి గుర్రపు స్వారి, క్షత్రియుద్ధం మొదలయినవన్నీ నేర్పి పట్టాభిషేకం చేస్తారు. స్త్రీకి శిక్షణ యిస్తే ఎంత క్లిష్టతరమైన కార్యాన్నైనా నిర్వహించగలదని నిరూపించే చారిత్రిక నాటిక రుద్రమదేవి. రచయిత నండూరి సుబ్బారావు. ఈ చారిత్రక నాటికలు బిడ్డలలో చారిత్రకస్పృహను, దేశభక్తిని పెంపొందిస్తాయి. ఎందుచేతనో ఇవి తెనుగులో తగినన్ని రాలేదు. వచ్చిన కొద్ది రచనలకు తగినంతగా రంగస్థల ప్రోత్సాహంలేదు

..............................

7 ప్రభావతి, వి. పిల్లల నాటికలు ఎలా ఉండాలి ? ఆంధ్రప్రదేశ్ బాలల మహాసభలు, 1977. 104 పు.

## ఏక పాత్రలు

తెలుగుదేశంలో ఔత్సాహిక నటులు, నాటక సంఘాలు పెరిగాక వెలుగులోకి వచ్చిన ప్రక్రియలలో ఏక పాత్రాభినయాలు గమనించదగినవి. ఇందులో ఒకే నటుడు హావ, భావ ప్రదర్శనద్వారా శరపరంపరగా వెలువడిన సంభాషణలద్వారా ప్రేక్షకులను మెప్పిస్తాడు. తెలుగులో బాలల పరంగా వచ్చిన ఏక పాత్రాభినయాలు చాల తక్కువ. వాటిలో కర్పూరపు ఆంజనేయులుగారి పిట్టలదొర, సోంపల్లి బాపయ్యగారి భీష్మ, అభిమన్యు, అల్లూరి సీతారామరాజు మొదలైనవి మాత్రమే పిల్లలను ఉద్దేశించి రాయబడినవి గాజులపల్లె ఎస్. ప్రభాకర్‌గారి 'నేను చదువు కుంటాను' ఏకపాత్రా భినయంలో పన్నెండేళ్ల బాలుడు నిద్రలో కలవరిస్తాడు. తండ్రి తాగివచ్చి కుటుంబాన్ని ఎలా బాధలు పెట్టిందీ, తాను చదువుకొని పెద్దవాడై అందరినీ ఎలా మార్చదలచినదీ వివరిస్తాడు. ఈ అభినయం చూచిన బాలురలో ఒక ఆవేశం, ఆవేదన కలుగక మానవు. సాధారణంగా యీ ఏక పాత్రలు త్యాగమూర్తుల, ధీరుల, అభాగ్యుల చరిత్రలతో ఉంటాయి. ఇవి చూచినప్పుడు పిల్లలలో ఉత్సాహం, ఉద్వేగం, కరుణ జాలి తప్పక కలుగుతాయి.

పిట్టలదొర వంటి ఏకపాత్రలో హాస్యం ప్రధానంగా ఉన్నా వ్యంగ్య ధోరణిలో యీలోకంలో జరిగే అన్యాయాలను, అక్రమాలను చెరిగి తూర్పార బడతాడు. పప్పూరి రామాచార్యులుగారి వదరుబోతు, పానుగంటి లక్ష్మీ నరసింహారావుగారి సాక్షి వ్యాసాల ప్రభావం పెద్దలమీద వలె యీ ఏక పాత్రల ప్రభావం పిల్లల మీద ఉండకపోదు. ఇవి మరిన్ని రావాల్సిన అవసరం ఉంది.

## బుర్రకథలు

తెలుగుదేశంలో అత్యంత ప్రచారంగల జానపద ప్రక్రియలలో బుర్రకథ చాల ముఖ్యమైనది. బుర్రకథ వందలు, వేలాది శ్రోతలను చక్కగా ఆకట్టుకుంటుంది. పిల్లల కోసం ప్రత్యేకంగా రాసిన బుర్రకథలు చాల తక్కువ. కోలపూరు వేదగిరిరావుగారు పిల్లలు చెప్పటానికి, వినడానికి వీలుగా ఉపాధ్యాయుని జీవితాన్ని ధన్యజీవి ధర్మయ్య పేరుతో రాశారు. పాలడుగు నాగయ్యగారు దామోదరం సంజీవయ్యగారి జీవిత చరిత్రను బుర్రకథగా రాశారు. కవుల ఆంజనేయశర్మగారు బాలానంద సంఘాలను నిర్వహించవలసిన అవసరాన్ని బాలానందం బుర్రకథగా చెప్పి కథాంతంలో యీ విన్నపం చేస్తారు.

నేటి బాలలే రేపటి పౌరులు
మేటి సూక్తి ఇది వినరండి
బాలలను సత్పౌరులుగా చేయగ
బాల సంఘముల నడపండి
పెద్దలందరూ నడుం బిగించి
పిన్నల వృద్ధిని కోరండి
ఒజ్జలు అండగ నిలబడి వీటిని
ఓర్పుగ చక్కగ నడపండి! !

ఈ సందేశ ప్రభావం పిల్లల మీద, పెద్దలమీద కొంతవరకు ఉంటుందనడంలో సందేహం లేదు.

## సాహిత్యేతర రచనలు

విజ్ఞాన సర్వస్వాలు, శాస్త్ర విజ్ఞానం సాంకేతిక విజ్ఞానం, సామాజిక విజ్ఞానం, జీవిత చరిత్ర, దేశచరిత్రలకు సంబంధించిన గ్రంథాలన్నీ—యీ సిద్ధాంత వ్యాసానికి సంబంధించి నంతవరకు శాస్త్రీయ సాహిత్యం అనే విభాగంలో వివరించ బడ్డాయి. సాహిత్యేతర విభాగంలోని అంశాలన్నీ దాదాపు ఇందు పొందుపరచబడ్డాయి. భారతీయ భాషలలో, ముఖ్యంగా తెలుగు భాషలో సాహిత్యేతరమైన బాలసాహిత్య రచనలు బహు తక్కువ. బాలసాహిత్య పుష్టికి, పిల్లల అవసరాలను సమగ్రంగా తీర్చడానికి యీ విభాగాన్ని కూడ సంపన్నం చేయవలసిన అవసరం ఎంతో ఉంది. అందులకు ఉత్సాహవంతులైన రచయితలు నడుంకట్టారు. వీలైన కృషి చేశారు.

### విజ్ఞాన సర్వస్వాలు

అనేక విషయాలపై సమగ్ర శీర్షికలను ఒక నిర్ణీత క్రమంలో చేర్చి అందించిన గ్రంథాలే విజ్ఞాన కోశాలు [1] వీటినే విజ్ఞాన సర్వస్వాలు, జ్ఞానకోశాలు, విశ్వ కోశాలు అనికూడ అంటారు. దీనికి సమానార్థకమైన ఆంగ్లపదం **Encyclopaedia** ఇది గ్రీకుపదం **Enkylios** అంటే చక్రరూపమైన **Paideia** అంటే విద్య అనీ భావం. అనగా సంపూర్ణ విజ్ఞానాన్ని సమగ్రంగా యిచ్చే జ్ఞానదీపిక విజ్ఞాన సర్వస్వం ఆ విశాల పరిధిలో దీని నిర్మాణం జరుగుతుంది. తాత్త్విక చింతనతో రసమయ జగత్తును సృష్టించిన అరిస్టాటిల్ (క్రీ. పూ. 384-323) విజ్ఞాన సర్వస్వజనకు డంటారు. ఆ తర్వాత ఇంగ్లీషు, ఫ్రెంచి మొదలైన భాషలలో విజ్ఞాన సర్వస్వాలు వెలిశాయి. రూసో, వాల్టేర్, డిడిరో మొదలైన వారి ఉత్తేజకర రచనలు, ఫ్రెంచి విజ్ఞాన సర్వస్వం ప్రజానీకంలో స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం మొదలైన భావాలను ప్రచారం చేసి, కరుడుకట్టిన ఫ్రెంచి సమాజపు గోడలు బద్దలుచేసి ఫ్రెంచి విప్లవానికి దారి తీసింది [2] 1768-1771 లో తయారైన బ్రిటానికా విజ్ఞాన సర్వస్వం ఆంగ్ల విద్య, సంస్కృతులపై ప్రభావాన్ని చూపింది.

..............................

1 సుబ్బరాయన్, బి. విజ్ఞాన సర్వస్వాలు, విజ్ఞాన కోశాలు, పూర్వాపరాలు. 1977 బాలసాహిత్య సదస్సులో చదివిన వ్యాసం.

2 వెంకటప్పయ్య, వెలగా. విజ్ఞాన సర్వస్వాలు-సమాచార విజ్ఞానంలో. ఏలూరు, సంచలన సాహితి, 1972. 118 పు.

బెంగాలీలో విశ్వకోశ్ (1886-1911) గుజరాతీలో గుజరాతీ జ్ఞానచక్ర (1918) హిందీలో విశ్వకోశ్ (1916 – 1932), కన్నడంలో బాలప్రపంచ (1939), ఒరియాలో జ్ఞానమండలం (1960), తమిళంలో కలైక్కాలాంచియమ్ (1954 – 1968) యిలా భారతీయ భాషలలో విజ్ఞాన సర్వస్వాల ప్రచురణ ప్రారంభమైనది

తెలుగులో విజ్ఞాన సర్వస్వాలు అవసరాన్ని కొమర్రాజు వెంకట లక్ష్మణ రావు (1877-1923) గుర్తించారు. తొలి తెలుగు విజ్ఞాన సర్వస్వాన్ని (1912-1917) మూడు సంపుటాలలో ప్రచురించారు. ఆ తర్వాత కందుకూరి బాల సూర్యప్రసాదరావు బహద్దరు ఆంధ్ర విజ్ఞానం (1938-1941) ఏడు సంపుటాలలో, మాగంటి బాపినీడు ఆంధ్ర సర్వస్వాన్ని (1942) ఒక సంపుటంలో సంగ్రహాంధ్ర విజ్ఞానకోశ సమితి సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశాన్ని (1958-1972) ఎనిమిది సంపుటాలలో, తెలుగు భాషా సమితి విజ్ఞాన సర్వస్వాన్ని (1954-1979) 14 సంపుటాలలో ప్రచురించింది మరో రెండు సంపుటాలలో యీ విజ్ఞాన సర్వస్వం పూర్తవుతుంది

పిల్లల కోసం అర్థర్ మీ అనే ఆంగ్ల విద్యావేత్త ఇంగ్లీషులో తొలిసారిగా విజ్ఞాన సర్వస్వాన్ని 1921లో తయారుచేశారు ఆ తర్వాత ఎన్నో వచ్చాయి. భారతీయ భాషలలోనూ కులందలయ కలయి కళంజయం (1965-1975) 10 సంపుటాలలో తమిళంలోనూ, జ్ఞాన గంగోత్రి (1969-1974) 7 సంపుటాలలో కన్నడంలోనూ, అంతకు ముందే శివరామ కరంత్ కన్నడంలో బాలప్రపంచ పేరుతోనూ, యింకా యితర భాషలలో విజ్ఞాన సర్వస్వాలు ప్రచురణ జరిగింది.

తెలుగులో విజ్ఞాన సర్వస్వాన్ని పోలిన రచన పెద్దబాలశిక్ష (1845) దీనిని రచయిత పూదూరు సీతారామశాస్త్రిగారు కొద్ది మార్పులతో రచయిత పేరు లేకుండా ఇప్పటికీ ప్రచురింపబడుతున్నది. ఇందులో లేని విషయాలంటూ లేవు. అక్షరసమామ్నాయం, గుణింతాలు, సంయుక్తాక్షరాలు, వాడుకలో గల పదాలు, నీతివాక్యాలు, ప్రాస వాక్యాలు, సద్బుద్ధి శబ్దాలు, ద్వంద్వ వాక్యాలు, కాలమానాలు, కొలమానాలు, సంఖ్యా పరమైన విశేషాలు, భూగోళ విషయాలు మొదలైన ఎన్నో అంశాలున్నాయి. దాదాపు నూరు సంవత్సరాలకుపైగా ప్రచారంలో ఉండి నేటి అవసరాలకు కొంతవరకు ఉపయోగ పడుతున్నది. దీన్ని నేటి అవసరాలకు తగినట్లు సంస్కరించిన ఎడల బాలలకు యిదొక మినీ విజ్ఞాన సర్వస్వం లాగ వినియోగపడగలదు.

మాగంటి బాపినీడుగారు పిల్లలు తెలుసుకోవాల్సిన చరిత్ర, భూగోళం, సాంఘిక విజ్ఞానం మొదలైన విషయాలను చేర్చి తెలుగుతల్లి 1944 లో సంగ్రహంగా ప్రచురించారు. ఒద్దిరాజు రామచంద్రరావుగారు 'బాలవిజ్ఞాన మంజూష' (1953) వెలువరించారు దీనిలో –

1 నీటిలో చేపలు నిదురిస్తాయా ?

2 నక్షత్రాలు రాలిపడునా ?

3 కప్పకు చెవు లెచ్చట ఉంటాయి ?

4 మేఘాలకు పైన ఏమి ఉంటుంది ?

5 నీటిలో ఎందుకు చూడలేము ?

మొదలైన 103 ప్రశ్నలకు శాస్త్రబద్ధమైన సమాధానాలు చెప్పారు ఒక రష్యన్ గ్రంథం ఆధారంతో మహీధర జగన్మోహనరావు (1908–1977) గారు యక్ష ప్రశ్నలకు శాస్త్రీయ దృక్పథంతో సమాధానాలు వివరించారు.

తెనాలిలో ఓరియన్‌ట్ పబ్లిషిఙ్ కంపెనీ మొహమ్మద్ ఖాసిం ఖాన్ సంపాదకత్వంలో బాల విజ్ఞాన సర్వస్వం (1956) తొలి సంపుటం అసంపూర్తిగా ప్రచురింపబడింది. తదుపరి సంపుటాలు వెలుగు చూడలేదు. ఈ సంపుటంలో ఖగోళ శాస్త్రాంశాలు సచిత్రంగా ఉన్నాయి. ఇదిపూర్తయివుంటే బాలసాహిత్యానికి మహోపకారం జరిగిఉండేది. తెలుగు బాలసాహిత్య పరిషత్ పక్షాన 1958–60లో సాగిన ఒక ప్రయత్నం జయప్రదం కాలేదు. ఈ మధ్య ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ అంతర్జాతీయ బాలల సంవత్సర సందర్భంలో బాలవిజ్ఞాన సర్వస్వ ప్రచురణకు ఒక పథకాన్ని సిద్ధంచేసి, అది కార్యరూపం ధరించేందుకు ప్రయత్నాలు చేస్తున్నది.[3]

## విజ్ఞాన శాస్త్రాలు

పదహారో శతాబ్దంలో కోపర్నికస్ సూర్య కేంద్ర సిద్ధాంత ప్రతిపాదన విజ్ఞాన శాస్త్ర రంగంలో విప్లవాత్మకమైన మార్పులను తీసుకువచ్చింది. హేతు బద్ధమైన నవీన విజ్ఞాన

..............................

3 **Balala Vignana Sarvaswamu. Illustrated Encyclopaedia in Telugu – Project Robert. Hyderabad, Andhra Pradesh Balala Academi, 1979.**

యుగం అప్పటి నుంచే ప్రారంభమైనదని చెప్పవచ్చు. ఈ యుగంలో విజ్ఞాన ప్రయోజనాలను సాధించిన దేశాలు సంపన్నవంతమైనాయి. "కష్టపడి ఆర్జించుకొన్న స్వాతంత్ర్యం స్థిరంగా ఉండడానికి మనదేశం కూడా ప్రపంచ దేశాలలో గణుతికెక్కడానికి, మనదేశంకూడ వైజ్ఞానికంగా అభివృద్ధి చెందాలి ఇందుకు చేపట్టవలసిన కార్యక్రమంలో ముఖ్యమైన అంశం బాలబాలికల ఆలోచనా సరళిలో మార్పు తీసుకు రావడం, వారిలో వైజ్ఞానిక దృక్పథాన్ని అలవరచడం"[4] ఇందుకోసం బిడ్డలకు వారు చదవడానికి ఉత్సాహపడే విధంగా తీర్చిదిద్దబడిన శాస్త్ర గ్రంథాలు అందించాలి. పాఠ్య గ్రంథాల విషయం అలాఉంచి, పిల్లలకోసం ప్రత్యేకంగా రాసిన శాస్త్ర గ్రంథాలు 1947 నుంచే కానవస్తున్నా యని ఆంధ్రప్రదేశ్ సైన్స్ అకాడమీ వారి శాస్త్రీయ వాఙ్మయ సూచిక (1868-1965) తెలుపుచున్నది.[5] ఆ తర్వాత వచ్చిన మౌలిక రచనలు నూరుకు మించి లేవు.

తెలుగు బాలల కోసం వెలువడిన విజ్ఞాన శాస్త్ర రచనలలో ఎక్కువ భాగం ఖగోళ శాస్త్రానికి చెందినవి. ఏ.వి.ఎస్. రామారావు (1920-) గారు విశ్వ రహస్యం (1965) అంతరిక్ష యానం (1966), సూర్య కుటుంబ చరిత్ర (1966) గ్రంధాలలో ఖగోళ శాస్త్ర విషయాలను సుబోధకంగా పిల్లలకు అందించారు. వసంతరావు వెంకటరావు (1909-) చంద్రుని కథను' గేయ రూపంలో చెప్పారు. విస్సా అప్పారావుగారు 'ఆకాశం' (1960) లోని వింతలను విప్పి చెప్పారు. వేమరాజు భానుమూర్తిగారు 'భూమికథ' (1957) ను వివరించారు.

ప్రకృతిలో సహజంగా లభిస్తున్న ఉప్పు, ఇనుము, ఉక్కు, ఆయిలు మొదలైన వాటిని గురించి శ్రీ వాత్సవగారు వివరించారు. రావూరి భరద్వాజగారు నీటి కథ, రంగుల కథ, గ్రహాల కథ, అద్దం కథ, గడియారం కథ, బొగ్గు కథ, ద్రవ్య ప్రపంచం, గాలి కథ, మనిషి కథ - మొదలైన అనేక విషయాలను పఠన యోగ్యమైన కథలద్వారా వివరించారు.

..................................

4 రామారావు, ఎ వి. ఎస్. బాల విజ్ఞానశాస్త్రగ్రంథాలు 1977 సంచిక. 70 పు.

5 వెంకటప్పయ్య, వెలగా. శాస్త్రీయ వాఙ్మయ సూచిక (1868 - 1965) - హైదరాబాదు, ఆంధ్రప్రదేశ్ సైన్సు అకాడమీ, 1967.

ప్రకృతిలో సహజంగా, స్వతస్సిద్ధంగా లేని పరికరాలెన్నో నిత్యజీవితంలో శాస్త్ర విజ్ఞాన ప్రభావం చేత ప్రవేశించాయి. వాటిలో రేడియో (1962) టెలిఫోన్ (1960) టెలివిజన్ (1965) మొదలైన గ్రంథాలను వెలగా వెంకటప్పయ్యగారు రాశారు. టెలిఫోన్‌ను గురించి మరొక మంచి రచన వేమరాజు భానుమూర్తి గారు చేశారు. అంతేగాక వారు విజ్ఞాన శాస్త్రంలోని దాదాపు అన్ని విషయాలపై విజ్ఞాన దర్శిని (1957) పేరుతో చేశారు. ఇది పెద్దలకు, పిన్నలకు వినియోగపడే గ్రంథం విజ్ఞాన లోకంలోని వింతలను గురించి రెడ్డి రాఘవయ్యగారు 'విజ్ఞానోదయం' (1979) రాశారు ఏ వస్తువైనా నీళ్లలో మునిగినప్పుడు కొంత బరువు కోల్పోతుంది. అలా కోల్పోయిన బరువు దాని పరిమాణంగల నీటి బరువుతో సమానం-యీ ఆర్కిమెడీస్ సూత్రాన్ని రాఘవయ్యగారు నీళ్లతొట్టెలో లెక్కల సూత్రం అనేకథ ద్వారా చెప్పారు 'ఊగిన దీపం-చూపిన సూత్రం' ద్వారా గలీలియో లోలక సూత్రాన్ని, ఆపిల్ పండు కథ ద్వారా గ్రహాల గతులను వివరించారు శాస్త్ర విషయాలు చెప్పటానికి రాఘవయ్యగారు చక్కని విధానం అనుసరించారు

ప్రతి జంతువు తనకథ తాను చెప్పుకొనే పద్ధతిలో మద్దులూరి రామకృష్ణగారు 'మా కథ వింటారా?'(1958)రాశారు. ఇదే తీరులో వేమరాజు భానుమూర్తి గారు '[illegible] ఆత్మకథ' (1956) ను అందించారు. ఎస్.వి.ఎల్. నరసింహారావుగారు జంతుపురాణం, జంతు ప్రదర్శనం అనే రెండు గ్రంథాలు జంతువులను గురించి రాశారు. ఈ కోవకు చెందిన గ్రంథాలలో వారణాసి సుబ్రహ్మణ్యంగారి 'జంతుప్రపంచం-ఏనుగు' (1957), ప్రశస్తమైన రచన. ఏనుగులకు సంబంధించిన విశేషాలు, కథలతో యీ గ్రంథం సచిత్రంగా రూపొందించబడింది. మహేశ్ గారు 'తేనెటీగకథ'(1958)ను చాల విజ్ఞాన దాయకంగా చెప్పారు.

పిల్లలు అడిగే ప్రశ్నలకు జనమంచి రామకృష్ణగారు 'అడగండి చెబుతాను' (1955) లో వివరించారు వేమరాజు సుభద్రగారు 'చక్రవర్తికి లేఖలు' (1956)లో పిల్లలు తెలుసుకోవాల్సిన విజ్ఞాన విషయాలను లేఖల ద్వారా అందించారు. మరొక కొత్త పద్ధతిలో మానవాళికి ఉపయోగించే జీవులను గురించి 'వింతప్రకృతి' (1962) అపకారం చేసే జీవులను గురించి 'కనపడని శత్రువులు' (1958), మనం తినాల్సిన ఆహారాన్ని గురించి 'మనకు ఏమికావాలి?' (1979) మొదలైన విషయాలను తనదైన ఒక కొత్త పద్ధతిలో చెప్పారు. – గిడుగు వెంకటరామమూర్తి (మనుమడు) గారు

ఈ విధంగా శాస్త్రవిజ్ఞాన గ్రంథాల రచన ప్రచురణ సాగింది ముద్రణా విధానం మరింత తక్కువ స్థాయిలో ఉన్నందున అవసరమైన చిత్రాల సంఖ్య మరీ తక్కువగా ఉన్నందున యీ పుస్తకాలు పిల్లలను సరిగా ఆకర్షింప లేకున్నవి. ఆశించిన ప్రయోజనాన్ని అందింప లేకున్నవి. పిల్లలలో వైజ్ఞానిక వైఖరిని పాదుకొల్పలేకున్నవి. ఇది చాలవరకు వాస్తవం.

## సాంఘిక శాస్త్రాలు, కళలు

మానవుడు ఒంటరిగా జీవించలేడు. సంఘజీవి. కనుక సంఘ జీవితానికవసరమైన విషయాలు తెలుసుకోవాలి. వాటిని బిడ్డలకు నేర్పాలి. సమాజంలోని ఆచార వ్యవహారాలు, కట్టుబాట్లు, నీతివర్తన, పౌరపాలన, ప్రభుత్వ వ్యవహారాలు, రక్షణ మొదలైన అంశాలన్నీ యీ శాఖకు చెందుతాయి. పిల్లలలో ఉత్సాహం, తెలివితేటలు పెరగడానికి కళలు ఎంతగానో దోహదం చేస్తాయి. ఐతే యీ రెండు శాఖలలో బాలలకోసం పట్టుమని పది రచనలైనా వెలువడలేదు. పాఠ్య గ్రంథాలతోనే తృప్తి పడుతున్నారు.

స్వతంత్ర భారత ప్రభుత్వం ఎలా పని జేసేది, దానికి ప్రజలు సహకరించి ప్రజా సమస్యలను పరిష్కరించుకొనే తీరును ప్రజల బాధ్యతలను – హక్కులను చిలుకూరి నారాయణరావుగారు 'ప్రజాప్రభుత్వం' (1953) లో వివరించారు. వారే గ్రామపాలనా వ్యవస్థను గురించి గూడ బాలలకు బోధపడే గ్రంథం మరొకటి రాశారు. 'భారతదేశ ప్రజలు' (1954) పేరుతో ఖండవల్లి లక్ష్మీరంజనంగారు ప్రజల జీవిత విధానాన్ని సామాజిక స్థితి గతులను వివరించారు. తెలుగువారి విశేషాలను, సంస్కృతీ సంపదను మనం – మనసంగతి, (1954) అనే గ్రంథంలో సామవెదం జానకిరామశర్మ, నోరి రామశర్మ గారలు పిల్లలకు అందించారు. బుర్రా సత్యనారాయణమూర్తిగారు బిడ్డల చేతిపనులు' (1954) పిల్లలకు ఎంతో ఉపయుక్తమైనది. పిల్లల ఆటలను గురించి డి. ఎల్. నారాయణగారు (1954) లో మంచి రచన చేశారు. వంశపారంపర్యంగా పిల్లలు ఆడుకొనే ఆటలను ఆటలు పాటలు (1965) పేరుతో నేదునూరి గంగాధరంగారు ప్రశస్త రచన పాటలతో కూర్చారు.

నృత్యం, సంగీతం, చిత్రలేఖన మొదలైన విషయాలమీద బాలలు ఆనందించే రచనలు అతి తక్కువ. నాట్యకళ మీద నటరాజ రామకృష్ణ (1932–) గారు నర్తనబాల (1958) చాల ఆకర్షణీయమైన రచన చేశారు. ఇది బాల సాహిత్యంలో అలంకార ప్రాయమైన గ్రంథం. ఇందులో వివిధ నృత్యభంగిమలు, రీతులు సచిత్రంగా ఉన్నాయి.

బాలల చిత్రకళపై వెల్లటూరి పూర్ణానందశర్మ (1930–) గారు అందరూ మెచ్చే కృషిచేశారు ఏటేటా చిత్రకళ పోటీలు నిర్వహించడమేగాక చిత్రకళపై రేఖాంజలి (1977) చక్కని గ్రంథాన్ని సచిత్రంగా వెలువరించారు ఈ రంగంలో మరింత కృషి జరుగవలసి ఉంది

## జీవిత చరిత్రలు

పిల్లలకు సాహిత్యేతర విషయాలుకూడ చెప్పాలనే సద్భావన తొలిసారిగా వెన్నెలకంటి సుబ్బారావుగారికి కలిగి, ఆ అవసరాన్ని 1820 లోనే వారు ఆంగ్లేయ పాలకులకు నివేదించారు. తత్ఫలితంగా సాహిత్యేతర విషయాలు పాఠ్యాంశాలలో చేర్చబడ్డాయి. వాటిలో జీవిత చరిత్రల పఠనం విశిష్టమైనది. ప్రయోజనకరమైనది

ఒక మహోన్నత వ్యక్తి జీవిత చరిత్రే సహజంగా గ్రంథ రూపంలో వస్తుంది. అది జాతి జీవితాన్ని వెలుగుబాట వైపు మరలిస్తుంది వాస్తవానికి "జాతి సంస్కృతికీ, విజ్ఞానానికి, కళలకు, సంస్కృతికీ పునర్నిర్మాణానికి మహనీయులు చేసిన సేవలు మహోత్తేజకరమైన కథలు, గాథలుగా నిలచి ఉన్నవి. త్యాగపూరితములు, సాహసోపేతములు, నిరంతర కృషి శ్రమలకు ఆలవాలమైన కథలను, చరిత్రలను మననం చేసికొంటూ, తమ తమ జీవితాలను దిద్దుకోవడం అభ్యుదయకారక మవుతుంది... జాతికి వెన్నెల వెలుగులు పట్టవలసిఉన్న బాలలకు యిట్టి పరిచయాలను కలిగించడం చాల అవసరం." [6] ఈ దృష్టితో బాలల కోసం జీవిత చరిత్రలను రూపొందించ వలసి ఉన్నది. ఐతే బాలల కోసం వెలువడిన జీవిత చిత్రాలు తక్కువ. వచ్చిన వాటిలో బాలల హృదయానికి హత్తుకొని వారిపై ఒక ప్రభావం కలిగించగలిగినవి బహుస్వల్పం. జీవితంలో కథలుగా చెప్పగలిగిన సంఘటనలు తీసుకొని జీవిత చరిత్రలను సిద్ధం చేసినట్లయితే అవి ప్రబోధాత్మకంగా ఉంటాయి జాతి అభ్యుదయానికి దోహదమిచ్చే రీతిలో జీవిత గమనాన్ని సాగించిన మహోన్నత పురుషుల, త్యాగమూర్తుల, సంస్కృతీ పరుల జీవితాలను అందించిన పిల్లలకు మరింత ప్రయోజన కరంగా ఉంటాయి.

ఇందుకు డాక్టరు చల్లా రాధాకృష్ణశర్మ (1929–) గారు 'చరిత్రకెక్కిన చరితార్థులు'

..............................

6 కామేశ్వరరావు, ఏడిద. వెలుగు బాటలు - మనవి. హైదరాబాదు, ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ, 1979

చక్కని సంభాషణా శైలిలో రాశారు ఇందు జాతీయస్థాయి నాయకులైన గాంధీ, నెహ్రూ న్యాయశాస్త్రవేత్త, దేశభక్తుడు శ్రీనివాస అయ్యంగారు, విశ్వదాత కాశీనాధుని నాగేశ్వరరావు పంతులు, పదుగురికి కవితామృతం పంచిన జంట తిరుపతి వెంకట కవులు పిల్లలకు, పెద్దలకు కవిత చెప్పిన కవిశిఖామణి- దేశి వినాయకం పిళ్లై, రసాయనిక శాస్త్రవేత్త ప్రఫుల్ల చంద్రరే మొదలైన వారి జీవిత విశేషాలు కమ్మని కథల రూపంలో ఉన్నాయి. త్యాగమూర్తులైన ఆంధ్ర కేసరి టంగుటూరి ప్రకాశం పంతులు, భోగరాజు పట్టాభి సీతారామయ్య, చక్రవర్తుల రాజగోపాలాచారి, అమరజీవి పొట్టి శ్రీరాములుగారి జీవిత చరిత్రలను బాలలకు అందించారు. మాగంటి బాపినీడుగారు 'బాలల బొమ్మల బాపు' చిత్ర జీవితాన్ని అందించారు.

ఆచార్యగారు విక్రమ సారభాయ్, హోమీబాబా, సత్యేంద్రనాధ్ బోస్, పి.సి. రే మొదలైన భారతీయ విజ్ఞాన శాస్త్రవేత్తల విజయాలను సోదాహరణంగా అందించారు. చింతా దీక్షితులుగారు విజ్ఞానవేత్తలు (1951) సి వి రామన్, ప్రఫుల్ల చంద్రరే, జగదీశ్ చంద్రబోస్, శ్రీనివాస రామానుజం మొదలైన వారి జీవితాలను ఉత్తేజకరంగా పిల్లల శైలిలో రాశారు ఇంకా కస్తూరి సూర్య ప్రకాశరావుగారు విజ్ఞానశేఖరులు (1951), విజ్ఞాన భాస్కరులు (1951), జె. దక్షిణామూర్తిగారు శాస్త్రవేత్తలు (1960) మొదలైన గ్రంధాలను రాశారు.

భారతీయ సంస్కృతి పటిష్టతను కాపాడి పెంపొందించిన మతాచార్యుల జీవిత చరిత్రల ప్రభావం పిల్లలపై ఉంటుంది దేవులపల్లి రామానుజరావుగారు గౌతమ బుద్ధుని చరిత్రను అందించారు. వేదుల కామేశ్వరరావు గౌతమబుద్ధుని చరిత్రను సచిత్రంగా చిత్రించారు. దంటు కృష్ణమూర్తిగారు రామకృష్ణ పరమహంస, స్వామి వివేకానంద మొదలైన వారి జీవిత చరిత్రలను రాశారు.

అన్ని రంగాలలో ప్రసిద్ధులైన జీవిత చరిత్రలను కప్పగంతుల మురళీకృష్ణగారు 'ప్రతిభావంతులు' (1979) పేరుతో రచించారు. నాటి దేశకాల, సాంఘిక, సాంస్కృతిక పరిస్థితులనుబట్టి వారెలా మహాపురుషులైనదీ, లేదా పరిస్థితులను వారెలా తమ భావాలకు అనుగుణంగా లొంగదీసుకొని జాతి, దేశ శ్రేయస్సుకోసం వారు ఎలా శ్రమించినదీ, త్యాగం చేసింది ప్రతిభావంతంగా మురళీకృష్ణగారు చెప్పారు. గడియారం రామకృష్ణ శర్మ, తిరుమల రామచంద్ర, బి రామరాజు, వారణాసి రామబ్రహ్మంగారలు ప్రత్యేకంగా వీరగాథలను పిల్లలకు అందించి ఉత్తేజపరిచారు. జీవిత సంకలనాలలో కవిరావుగారు

సంకలనం చేసిన 'వెలుగుబాటలు' (1979) ప్రసిద్ధమైనది. తెలుగువారిలో వెలుగుబాట చూపిన గురజాడ, కందుకూరి, రాఘవ, మాడపాటి, టంగుటూరి, సురవరం, గిడుగు, జాషువా, సర్దార్ జమాలాపురం, కాటన్, యల్లాప్రగడ, అయ్యంకి, దామెర్ల – మొదలైన ప్రముఖుల జీవిత చరిత్రలను సంఘటనల ప్రధానంగా యిందు చిత్రించబడ్డాయి. ఆదర్శవంతమైన ఒక ప్రణాళికతో ఈగ్రంథం సిద్ధం చేయబడింది.

పింగళి లక్ష్మీకాంతంగారు చెప్పినట్లు జీవిత చిత్రాలు ఆనాటి సాంఘిక పరిస్థితినేగాక, ఆనాటి సాహితీగతులను జీవన రీతులను విశదపరుస్తాయి. అంతటితోటే ఆగిపోవు. ఆ జీవిత చిత్రాలద్వారా చారిత్రక దృష్టికూడ ఏర్పడుతుంది. ఆ దృష్టి ఏర్పడితే బాలల జీవితాలు దివ్యంగా భవ్యంగా రూపొందగలవు

## దేశ చరిత్రలు

ఆదిమస్థితినుండి నేటి వరకు జరిగిన మానవ పరిణామ గాథను చరిత్ర అంటాము. ప్రపంచ పరిణామంలో "యుగయుగాలుగా ప్రజలు చేసిన ఆలోచనలు, చేపట్టిన కార్యక్రమాలు, సంభవించిన సంఘటనలను ఎదుర్కొని విజయశ్రీని చేపట్టిన తీరు, చరిత్ర నుంచి మనం తెలిసికోగలం. మానవుడు చరిత్రనుంచి పాఠాలు నేర్చుకోవాలి గనుక చరిత్ర రచన ఎంతో వాస్తవమైనదిగా ఉండాలి. నిర్దుష్టంగా ఉండాలి. ఆ దేశపు ఆర్థిక, సాంఘిక, రాజకీయ పరిస్థితులను ప్రజల జీవన గతులను దర్పణం పట్టేదిగా ఉండాలి దానివలన పిల్లలు తగిన ప్రయోజనం పొందగలుగుతారు." [7]

పిల్లల కోసం ఉద్దేశించిన దేశచరిత్రలు చిరకాలంగా లేకపోలేదు ప్రధానంగా అవి పాఠ్య గ్రంథాలు. ఐతే ఒక ప్రత్యేక దృష్టిలో బాలల కోసం చేసిన తొలిరచన నాయని కృష్ణకుమారి (1930) గారి 'ఆంధ్రుల కథ'. తొలిసారిగా ఆంధ్రప్రభ దినపత్రిక (1948) లో ధారావాహికంగా ప్రచురించబడి అనంతరం పుస్తకరూపం (1954) లో వచ్చింది. "ఏమిటమ్మా చిట్టితల్లీ, నన్నే చెప్పమని వేధిస్తావు. నీవు చిన్నారి చిట్టి ఆంధ్ర బాలవు కనుక, నీకు చక్కని కథ చెబుతాను. వింటావా, అంటూ, 'తల్లీ నేను' ఇప్పుడు చెప్పేకథ కొన్ని వేలసంవత్సరాలకు ముందు జీవించిన మన పూర్వులకథ అని ఆంధ్రుల కథను బుల్లి బుల్లిమాటలతో చక్కని కథా రూపంలో మలచగలిగారు

..............................

7 సాంబశివరావు, వేజండ్ల. దేశచరిత్రలు జీవితచరిత్ర రచన. బాల సాహిత్య శిక్షణ శిబిర వ్యాసం (1979) రాసిన ప్రతి.

కృష్ణకుమారిగారు. అవసరమైనచోట పురాణకథలను అతికినట్టు కలిపారు నేర్పుగా. ఈ గ్రంథంలో తగినన్ని చిత్రాలు లేకపోవడం ఒకలోటే. ఆంధ్రప్రదేశ చరిత్ర సంగ్రహం (1957) లో మల్లంపల్లి సోమశేఖరశర్మ (1891—1968) గారు పిల్లలకు మంచి రేడియో ప్రసంగాలు చేశారు దేవులపల్లి రామానుజరావు (1917—) గారు తెలుగు దేశము (1956) రచించారు. పుట్టపర్తి నారాయణాచార్యులుగారు ఆంధ్రుల చరిత్ర (1968) ను సుబోధకంగా తెలియజెప్పారు ఇవిగాక చక్కని చిత్రాలతో గోదావరినది చరిత్ర, దాని ఉపనదులు, తెలుగుదేశంలోని పుణ్యక్షేత్రాల వివరణ పవిత్ర గోదావరి, (1976) చిన్న గ్రంథంలో నేలనూతుల పార్వతీ కృష్ణమూర్తిగారు వివరించారు. అలంపురం (1976) గురించి గడియారం రామకృష్ణ శర్మగారు సాధికారమైన రచన చేశారు ముఖ్య దేవాలయాల పురావస్తు సంగ్రహాలయాల వివరణ మనోజ్ఞంగా, ఛాయా చిత్రంలో చూపినంత స్పష్టంగా వివరించారు ఇంతేగాక కృష్ణచైతన్య, లీలా ముజుందార్, వళ్లియప్ప, ఎస్. బి. రహీం మొదలైనవారు మనదేశ చరిత్రమీద చేసిన రచనలకు తెలుగు అనువాదాలు వచ్చాయి.

చరిత్రకు దగ్గరగా ఉన్నదే భూగోళ విజ్ఞానం. శీతోష్ణస్థితి, నైసర్గిక పరిస్థితులు, ప్రజలు, పంటలు, నదులు, వనరులను గురించి భూగోళ విజ్ఞానం తెలుపుతుంది. 'భారతదేశం నా యిల్లు' అను అనువాద గ్రంథంలో గిడుతూరి సూర్యంగారు భారత దేశ భౌగోళిక పరిస్థితులను బాగా వివరించారు. శ్రీశైలంగారు 'బొమ్మలు చెప్పిన భూగోళం'లో పై విషయాలను చక్కని రేఖా చిత్రాలద్వారా ఆదర్శప్రాయంగా వివరించారు. కథనా విధానం పిల్లలకు నచ్చేదిగా ఉంది. తెలుగులో యీ రంగం పరిపుష్టం కావలసినంతగా కాలేదు ఆదర్శప్రాయమైన రచనలూ తగినన్ని రాలేదు.

# పత్రికా సాహిత్యం

పత్రికల అవసరం - తెలుగు పత్రికలు - పత్రికల పట్టిక
బాలచంద్రిక కొత్త ప్రయోగం - లిఖిత పత్రికలు
గోడ వార్తా పత్రికలు

## పత్రికల అవసరం

పిల్లలలో చదివే అలవాట్లను, ఆసక్తిని పెంపొందించడంలో, కొత్త విషయాలు తెలియజేయడంలో పత్రికలు ఎంతగానో తోడ్పడతాయి [1] అంతేగాక, 'సాహిత్య ప్రచారానికి గొప్ప సాధనాలు పత్రికలు. సాహిత్య సృష్టికి ప్రేరణలు. బాలల రచనాశక్తి, పఠనాశక్తి, భాషానురక్తి, జ్ఞాపకశక్తికి, భావాభివృద్ధికి పత్రికలు ఎంతగానో దోహదంచేస్తాయి.' [2] 'అందుచేత పిల్లలకు వారికోసం ప్రచురింపబడే పత్రికలను అందించాలి. వారిని సమాజ జీవితంలో భాగస్వాములుగా చేయాలి. అది పెద్ద వారి బాధ్యత

సోవియట్ దేశంలో పిల్లలకి, యువజనులకు కలిపి సుమారు 230 పత్రికలున్నాయట. అందు 'పయొనీర్‌స్కాయా' అనే పిల్లల పత్రిక సర్క్యులేషన్ 95 లక్షలు. ఇన్ని ప్రతులు చెల్లే పిల్లల పత్రిక ప్రపంచంలో మరొకటి లేదట. వారిచ్చిన ప్రోత్సాహంచేతనేమో – సోవియట్ బాల్టిక్ రిపబ్లిక్ అథుయేనియాలో 'అబువోస్' అన్న బాలలపుస్తకాల ఆంతర్జాతీయ పాత్రికేయుల అవార్డు లభించింది. బళ్లో చదివే పాఠాలతోబాటు ఫెడరల్ జర్మన్ ఫెడరల్ రిపబ్లిక్‌లో పిల్లలు అనేక పనులు నేర్చుకుంటారట అందులో పుస్తకాలు, పత్రికలు ముద్రించడం ఒకపని. పిల్లలు తమపత్రికలు తామే ముద్రించుకుంటారట. బొమ్మలు వెసుకొంటారట. "మొట్టమొదటసారి పిల్లలే నిర్వహించిన పిల్లలవారపత్రికి పేరు "లిటిల్ రివ్యూ." [3] దానిని పోలెండు దేశస్థుడైన డాక్టర్ కోర్జాక్ కృషితో వార్సాలోని అనాధ బాలలు వెలువరించారు. ఆ పత్రికలాంటిది నేటికి మరెక్కడా రాలేదనవచ్చు. 1930నుంచి ధారావాహికంగా వెలువడి 1939 లో నాజీలు వార్సాను ఆక్రమించేవరకూ పత్రికారంగంలో లిటిల్ రివ్యూ తనప్రత్యేకతను నిలుపుకొంది. దాదాపు 2000మంది బాలపాత్రికేయులు విలేకరులు ఈ పత్రిక నిర్వహించేవారు. వారంతా ఆరు ఏళ్ళనుంచి పద్దెనిమిదేళ్ళ వయసు లోపువారే ఆ పత్రికలో బాలలు తమ అనుభవాలు, ఆశయాలు, సుఖదుఃఖాలు చర్చించుకునే వారు సామాన్యంగా పెద్దలు

..........................

1 బుద్ధప్రసాద్, మండలి. తెలుగులో బాలల పత్రికలు. స్రవంతి, ఫిబ్రవరి, 1975

2 నరసింహారావు, వి. వి. బాల వాఙ్మయం. హైదరాబాదు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, 1975. 20 పు.

3 కృష్ణకుమారి, ఎం. పిల్లలు నడిపిన పత్రిక.

లెక్కచేయని పిల్లలు కోరికలు వారిని ఉత్తేజపరిచిన సంఘటనలు, ప్రభావితం చేసిన పరిస్థితుల్లాంటివి ఈ పత్రిక ప్రకటించేది.

పిల్లల మనస్తత్వాన్ని పెద్దలు అవగాహనచేసుకోవడానికి ఈ పత్రిక తోడ్పడేది ఈ పత్రిక ప్రచురణకు కారకుడైన డాక్టర్ కోర్జాక్ బాలల కోసం అనేక పుస్తకాలు రాశాడు. విద్యావిధానానికి సంబంధించి అనేక సూచనలు చేశాడు. వార్సా అనాధ బాలలకే జీవితం అంకితంచేసిన ఆ మహనీయుడు 1942లో నాజీల దురంతానికి బలి అయ్యాడు. "బాలల్ని వ్యక్తులుగా గౌరవించండి. వారిని అర్థంచేసుకోడానికి ప్రయత్నించండి" అనేదే ఆయన తపన. దాని ఫలితమే లిటిల్ రివ్యూ. ఇంకా మనం అంతముందుకు పోలేదు, ఘనది కుందేటి పరుగు !

## తెలుగు పత్రికలు

ఒకప్పుడు-భారతి, గృహలక్ష్మి, జనవినోదిని, కృష్ణాపత్రిక - మొదలైన తొలితరం పత్రికలు యిచ్చిన ప్రోత్సాహం బాలలకు ప్రత్యేకమైన పత్రికలు ప్రారంభించడానికి మార్గం ఏర్పడింది. ఆ ఉత్సాహంతో మేడిచర్ల ఆంజనేయమూర్తిగారు 'బాలకేసరి' (1940) ప్రారంభించారు. ఆ తర్వాత న్యాయపతి రాఘవరావుగారు 'బాల' (1945) చక్రపాణిగారు 'చందమామ' (1946) ప్రారంభించి బాలల పత్రికలకు శుభారంభం చేశారు. ఆ వూపులో బాలల కోసం అనేక పత్రికలు వచ్చాయి. మొత్తంమీద యీ నలభై సంవత్సరాల కాలంలో నలభైపత్రికలకుపైగా వచ్చాయి. ఈ దిగువ చూపిన పట్టికను పరిశీలించినట్లయితే పిల్లల పత్రికల పెరుగుదల స్పష్టం కాగలదు.

## పత్రికల పట్టిక

| వ. సం. | పత్రిక పేరు | సంపాదకుడు | ప్రచురణ సంవత్సరం |
|---|---|---|---|
| 1 | బాలకేసరి | మేడిచర్ల ఆంజనేయమూర్తి | 1940 |
| 2 | బాల | న్యాయపతి రాఘవరావు, కామేశ్వరి | 1945 |
| 3 | చందమామ | చక్రపాణి | 1946 |
| 4 | బాలమిత్ర | బి. వి. రాధాకృష్ణ | 1949 |
| 5 | పాపాయి | డి. అప్పారావు | 1949 |
| 6 | బొమ్మరిల్లు | జె. రాజారావు | 1949 |

| వ. సం. | పత్రిక పేరు | సంపాదకుడు | ప్రచురణ సంవత్సరం |
|---|---|---|---|
| 7 | బాల వినోదం | గోటేటి రామారావు | 1950 |
| 8 | బాలప్రభ | పాటిబండ మాధవశర్మ | 1952 |
| 9 | మన సంఘం | లవణం | 1952 |
| 10 | ఉదయ బాల | — | 1952 |
| 11 | బాలానందం | న్యాయపతి రాఘవరావు | 1956 |
| 12 | బాలప్రభ | జి. మునిరత్నం నాయుడు | 1958 |
| 13 | బాలబంధు | ఆర్. ఎస్. మూర్తి | 1962 |
| 14 | చంద్రభాను | కోటిపాటి, యం. వి. శేషయ్య | 1962 |
| 15 | బాలరాజ్యం | గోటేటి రామారావు | 1963 |
| 16 | బాలానందం | ముదునూరు రామారావు | 1964 |
| 17 | నందన | | 1965 |
| 18 | రఘుబాల | ఎ. ఎల్లయ్య | 1965 |
| 19 | పసిడిబాల | చింతా హనుమంతరావు | 1969 |
| 20 | బాలప్రపంచం | మసునా | 1970 |
| 21 | ఆనందబాల | బి. కె. విశ్వేశ్వరరావు, ఎ. ఎస్. ఆర్. ఆంజనేయులు | 1970 |
| 22 | బొమ్మరిల్లు | విజయ బాపినీడు | 1972 |
| 23 | పాలవెల్లి | గిరిజ శ్రీ భగవాన్ | 1974 |
| 24 | వసంతబాల | విశ్వప్రసాద్ | 1974 |
| 25 | పొదరిల్లు | జి. వి. రంగాచార్యులు | 1974 |
| 26 | బుజ్జాయి | గీతాసుబ్బారావు | 1975 |
| 27 | బేబి | సి. నాగేశ్వరరావు | 1977 |
| 28 | బాల | న్యాయపతి రాఘవరావు, కామేశ్వరి | 1977 |
| 29 | చంపక్ | విశ్వనాథ్ | 1978 |

| వ. సం. | పత్రిక పేరు | సంపాదకుడు | ప్రచురణ సంవత్సరం |
|---|---|---|---|
| 30 | బాల భారతి | వి. వి. నరసింహారావు, శశిభూషణ్ | 1978 |
| 31 | ప్రమోద | ధనికొండ హనుమంతరావు | 1978 |
| 32 | మాబడి | నాయుని కృష్ణమూర్తి | 1978 |
| 33 | పాఠశాల | " | 1978 |
| 34 | బాల చంద్రిక | ఏడిద కామేశ్వరరావు | 1979 |
| 35 | బాలవాణి | | 1979 |
| 36 | విద్యాబాల | కవుల ఆంజనేయశర్మ | 1979 |
| 37 | మిలియన్ జోక్సు (బాలల పత్రికగా మార్పు) | | 1979 |
| 38 | బాలజ్యోతి | నండూరి రామమోహనరావు | 1980 |

ఇంకా హరివిల్లు, చిరంజీవి, కోకిల, పొట్టిబావ మొదలైన పత్రికల వివరాలు లభించలేదు. పైన ఉదహరించిన పత్రికలలో బాలప్రభ, బాలానందం మాత్రం వార పత్రికలు పొదరిల్లు పక్షపత్రిక. విద్యాబాల త్రైమాసపత్రిక. మిగతావన్నీ మాస పత్రికలు. వీటిలో చందమామ, బాలమిత్ర, ఆనందబాల, బొమ్మరిల్లు, చంపక్, ప్రమోద, మాబడి, పాఠశాల, బాల చంద్రిక, విద్యాబాల, మిలియన్ జోక్సు, బాల జ్యోతి మొదలైన పత్రికలు నేటికీ నిర్వహింప బడుతున్నాయి. మిగతావాటి ప్రచురణ నిలిచిపోయింది. బాల, బాలప్రభ, బాల చంద్రిక తప్ప దాదాపు మిగతావన్నీ కేవలం కథల పత్రికలు. చందమామ పత్రికకు ప్రతి రూపాలు. కొత్తమార్గాలను అన్వేషించి పిల్లలకు విజ్ఞానదాయక విషయాలు హెచ్చుగా అందించే సాహసం చాలమంది చేయలేక పోయారు. న్యాయపతి రాఘవరావుగారు మాత్రం బాల పత్రికను ఉదాత్తంగా, ఆదర్శప్రాయంగా నిర్వహించి బాలల ఉద్యమానికి బలమైన పునాదులు వేశారు. పాటిబండ మాధవశర్మగారు బాలప్రభ వార పత్రికను కొత్త ఆశయాలతో ప్రారంభించారు. బాలల కవసరమైన వార్తలను కూడ యీ పత్రికలో చేర్చారు కాని, దీనికి తగినంత ఆదరం లభించలేదు. ఈ పత్రికలలో "పాఠశాల" పదవ తరగతి మాబడి ఏడవ తరగతి విద్యార్థులకు అవసరమైన పాఠ్యాంశాలతో నిర్వహింపబడుతున్నవి. విద్యార్థుల ఆదరణ పొందినవి.

## బాలచంద్రిక - కొత్తప్రయోగం

ఇటీవల వెలువడిన పత్రికలలో బాలచంద్రిక, కొత్త ప్రయోగాలు చేస్తున్నది. తెలుగు బాలలో సృజనాత్మక శక్తులు పెంపొందించడానికి ఏర్పడిన ప్రభుత్వ సంస్థ ఆంధ్ర ప్రదేశ్ బాలల అకాడమీ (1976) యీ పత్రికను నిర్వహిస్తున్నది. ఈ పత్రికలో యీ దిగువ శీర్షికలు ఉంటున్నవి.

| | | | |
|---|---|---|---|
| 1 | సంపాదకీయం | 2 | కథలు |
| 3 | నీతి కథలు (కార్టూన్ చిత్రాలతో) | 4 | నాటికలు |
| 5 | గేయాలు | 6 | మీరూ అంతవారు కావాలి |
| 7 | పద్యామృతం | 8 | బాల సమాచారం |
| 9 | విజ్ఞాన చంద్రిక | 10 | దేశాల చరిత్ర |
| 11 | మన సంస్కృతి | 12 | మీ కోసం ప్రత్యేకం |
| 13 | సరదాలు | 14 | క్రీడలు |
| 15 | జోకులు | 16 | పొడుపు కథలు |
| 17 | పోటీ కథలు | 18 | క్విజ్ |
| 19 | అకాడమీ వార్తలు | 20 | ఉత్తరాలు |
| 21 | కొత్త పుస్తకాల సమీక్షలు | 22 | ఇంకా ఎన్నో |

## బాలసాహిత్య శీర్షికలు

చిరకాలంగా తెలుగు పత్రికలు బాల సాహిత్యానికి చేస్తున్న సేవలు, దోహదాలు చిన్నవి కావు. ఈనాడు బాలల కోసం వేరుగా పత్రిక లున్నప్పటికీ కొన్ని పత్రికలు బాలల కోసం ప్రత్యేకమైన శీర్షికలు పెట్టి బాల సాహిత్యాన్ని ప్రోత్సహిస్తున్నాయి.

| పత్రిక పేరు | | శీర్షిక |
|---|---|---|
| ఆంధ్ర పత్రిక | వారపత్రిక | బాల సాహితి |
| ఆంధ్ర ప్రభ | ” | బాలప్రభ |
| ఆంధ్రజ్యోతి | ” | బాల జ్యోతి |
| ఆంధ్ర భూమి | ” | బాల భూమి |
| విశాలాంధ్ర | ” | చిన్నారి లోకం |

ఈ విధంగా మరికొన్ని పత్రికలు బాలల శీర్షికలు పెట్టి బాల సాహిత్యానికి యితోధిక మైన సేవ చేస్తున్నాయి. రచనలను అందిస్తున్నాయి.

### లిఖిత పత్రికలు

ఉత్సాహవంతులైన బాలలు లిఖిత పత్రికలను గూడ సిద్ధం చేస్తుంటారు. దీని ప్రచారం కొందరు మిత్రులను మాత్రం పరిమితం పిల్లలలో సృజనాత్మక శక్తులు పెంపొందించడానికి 'సంస్కృతీ—సాహిత్యం సరదాలు తీర్చడానికి యీ పత్రికలు ఎంతగానో ఉపయోగిస్తాయి "4 వీటిని ప్రోత్సహించవలసిన బాధ్యత పెద్దలపై ఉంది. నేడు తెలుగు దేశంలో బాలల కోసం కనీసం నూరైనా లిఖిత పత్రికలు నడుస్తూ ఉంటాయి వీటిలో పాతపట్నం నుంచి నడుపబడే 'ఉద్దీపన', నరసరావు పేటలో 'చిరంజీవి', హైదరాబాదులో 'బాలల సంబరాలు', కడపలో 'బాలవాణి' చెప్పుకోదగిన పత్రికలు

బులిటెను అంటే సంక్షిప్త వార్తలను తెలిపే ప్రసారం అనుకోవాలి. ఆలిండియా రేడియోవారు బాలానందం, బాలవినోదం కార్యక్రమాల్లో అప్పుడప్పుడు బాలవాణి పేరుతో వింతలు విశేషాలు ప్రసారం చేస్తుంటారు. ఈ పనిని కొన్ని పాఠశాలలో యీ నాటికీ ప్రసారం చేస్తున్నారు. ఈ విధమైన నిర్మాణ కార్యక్రమాలు బాలల మనో వికాసానికి తోడ్పడతాయి

### గోడ వార్తా పత్రికలు

ఏ రోజు కారోజు దేశంలో వస్తున్న వార్తలు పిల్లలకు అందించడానికి గోడ వార్తా పత్రికలు ఎంతగానో ఉపకరిస్తాయి. పత్రికలు పూర్తిగా చదివే తీరిక లేనివారు యీ పత్రికద్వారా ప్రధానాంశాలు తెలుసుకోవచ్చు. ఇంద్రగంటి సుబ్రహ్మణ్యంగారు దీన్ని 'నగరజ్యోతి' అన్నారు.5 నెల్లూరు ట్రంకురోడ్డులో తిప్పరాజు సత్రం వద్ద ఒక గోడమీద యుద్ధపు రోజులలో వార్తలను ఏగంటకా గంట తాజాగా రాసేవారు.

..............................

4 వేదగిరిరావు, కె. లిఖిత పత్రికలు బులిటెన్ బాలసాహిత్య సదస్సు, 1977 (రాసిన ప్రతి)

5 గోపీనాథ్, ఎ. గ్రంథాలయ ప్రచారం. ధర్మవరం, వినోద్ పబ్లికేషన్స్, మార్చి 1978 92 పు.

తొలుత తూములూరు అనంత పద్మనాభయ్యగారు 1935 ప్రాంతంలో ప్రారంభించారు. ఆ తర్వాత ముత్తరాజు గోపాలరావు, మునేపల్లి లక్ష్మయ్య ప్రభృతులు కొంతకాలం నిర్వహించారు. ఈ పని నేటికీ చాల ప్రాథమిక, ఉన్నత పాఠశాలలో నేటికీ సాగుతూ ఉంది. వేజండ్ల సాంబశివరావుగారు పిల్లల చేత చిన్న చిన్న కథలు నల్లబల్లమీద రాయించి– తతిమ్మా పిల్లలు చదువుకొనే అవకాశం కల్పించారు. కొన్నిచోట్ల నల్లబల్లమీద 'ఈనాటి సూక్తి' పేరుతో చక్కని సూక్తులను పిల్లలకు అందించే అలవాటు కొన్ని విద్యాలయాలలో నేటికీ సాగుతున్నది.

# బాలసాహితీ సౌరభాలు

## బాల సాహిత్యం భాష : శైలి - ఛందస్సు - అలంకారాలు
## సంగీతం - సంస్కృతి

మల్లెలు, పిల్లలు - శబ్దాలలో, భావంలో సామ్యం ఉంటుంది. సుకుమారత్వంలో, సౌరభాలు వెదజల్లడంలో పోలికలున్నాయి. అలాగే చల్లని వెన్నెలలు అందించడంలో, సుమసౌరభాలు వెదజల్లడంలో బాల సాహిత్యం మరే సాహిత్యానికి తీసిపోదు. బాలలలోని ప్రత్యేకత విశిష్టత బాల సాహిత్యంలోనూ ఉంది ఏ సాహిత్యంలో నైనా శైలి, ఛందస్సు, అలంకారాలు, సంగీత ఛాయలు, సంస్కృతీ చిత్రణ సహజంగా ఉంటాయి. ఇవన్నీ తెలుగు బాల సాహిత్యంలో సముచిత స్థానాన్ని సంతరించుకొని సాహిత్యానికి వన్నెలు చిన్నెలు చిలికి పెడుతున్నాయి మరికాస్త ముందుకు పోతే బాల సాహిత్యంలో చిత్రలేఖనం, నృత్యం ముద్రణా సౌందర్యం గూడ ఇమిడి ఉన్నాయి. అంతకంటే - పై కళలన్నీ ఒక దశలో బాల సాహిత్యం వలన అభివృద్ధి చెందు తున్నాయన్నా - ఆశ్చర్యపడవలసిన పనిలేదు అందుచేత తెలుగు బాలసాహిత్యం మరే సాహిత్యానికి శాఖగా కాక ఒక ప్రత్యేక సాహిత్య స్వరూపంగా వెలుగొందుతూంది.

## భాష : శైలి

మానవుడు యుగయుగాలుగా ప్రకృతితో, పరిసరాలతో సంఘర్షణ జరిపి సాధించు కొన్న మహత్తర సంపద-అమేయ భాషా భండారం. భాష, లిపి సృష్టిలో మానవజాతికి తప్ప మరే ప్రాణికోటికీ సాధ్యంకాలేదు. అది మానవజాతి సుకృతం. మానవ భాషలో ఓజస్వంతమైన, విశిష్టమైన వచోవల్లరి బాలభాష అది బాలల ఆనందానికి, ఉల్లాసానికి, ఉత్సాహానికీ ప్రతీక ఛందో, వ్యాకరణ ప్రయోగాలు బాలలకు పట్టవు. మనసులోని మాట పలకడమే వారికి చేతనౌతుంది. అందుచేత సహజమైన వారిభాషలో మెత్తదనం, కొత్తదనం ఉండనే ఉంటుంది ఆ నూతనత్వాన్నే గ్రీన్‌లాండ్ అనే అమెరికన్ భాషా. వేత్త "BABY TALK" అన్నారు. శిశువు కొత్త పదాలను ఉచ్చరించడానికి కొంత కాలం పడుతుంది. నేర్చుకోడానికి మరికొంతకాలం పడుతుంది బిడ్డకు "శిరము, గొంతుక వీనియందలి కండరములు కదులుటచేత ఉచ్చారణ సాధ్యమగుచున్నది ఏ కండరములు కదలునో ఏ తీరున అవి ఎంతవరకు కదలునోయను అంశముల బట్టి ఉచ్చరింపబడు ధ్వని యుండును కనుక ఉచ్చారణ క్రమముగా నుండుటకు శిశువునకు ఆయా కండర ములు స్వాధీనమున నుండవలెను శిశువు దానిని స్వాధీనము చేసికొనుటకు కొంత కాలము

పట్టును.[1] ఈ మధ్య దశలో శిశువు పదాలను తన ధోరణిలో పలుకుతుంది. అది శిశు స్వభావం.

| | | |
|---|---|---|
| అత్త | కు బదులు | అట్ట |
| పుస్తకం | ,, | పుత్తక్కం |
| బుజ్జి | ,, | బుజి |
| రోకలి | ,, | లోకలి |
| బండి | ,, | బంది |
| వెండిగిన్నె | ,, | ఎండిగిన్నె |
| సీసా | ,, | చీచా |

బిడ్డలో వయస్సు పెరుగుతున్న కొలదీ పరిసరాల పరిచయం, వ్యవహార జ్ఞానం పెరిగి మామూలు శబ్దాలు వాడుకలోకి వస్తాయి సమాజ జీవన ప్రవాహంలోకి పిల్లవాడు ప్రవేశిస్తాడు. ఇది ప్రకృతి సహజం

బాల సాహిత్య వేత్తలు బాలల హృదయాంతరాళాలను జయించి వారికి సాహిత్యాభిరుచిని కలిగించేందుకు పిల్లలు గోముగా వాడే పదాలను రచనలలో ఉపయోగిస్తుంటారు. బాల సాహిత్యంలో ఇదొక విశిష్టమైన లక్షణం. ఈ ముద్దులొలికే ముచ్చటైన పదాలు 'బాలభాష' కు వెలగట్టలేని రత్న మాణిక్యాలు.

తువ్వాయి : ఆవుదూడ

తువ్వాయి మెడలోన మువ్వలున్నాయి
మువ్వల్ల కడ పులో రువ్వలున్నాయి

— కవిరావు

బన్ని : బొమ్మ

బన్ని అంటే తెలుసు
బన్ని అంటే బొమ్మ

—బి.వి. నరసింహారావు
పాల పాటలు—11 పు

..........................

1 సూర్యనారాయణమూర్తి, కొప్పర్తి. శిశువులు - భాష. ఆంధ్ర పత్రిక - క్రోధన ఉగాది సంచిక, 1925-26 188 పు.

చిట్టి : చిన్నిపాప

చిట్టి చిట్టి రావె!
చిట్టెమ్మ రావె!
చిన్నారి రావె!

— బి. చంద్రమౌళిశాస్త్రి
చిరుగంటలు— 9పు

అప్పచ్చి : పిండివంట

గొప్పలు నీవయ్య అన్నయ్యా!
అప్పచ్చి నీదేర తమ్మయ్యా!

— బి. చంద్రమౌళిశాస్త్రి
చిరుగంటలు— 6 పు

తాయం : చిరుతిండి

ఇంద ఇంద పాపా
ఇంద తాయమంటూ
అమ్మ నావెంట వస్తుంది
అమ్మచేతిలోని తాయాన్ని చూసే
అట్టట్టే దొరికి పోతాను

— రజనీకాంతరావు, బాలాం
త్రపు — జేజి మామయ్య
పాటలు — 25 పు

ఇలాగే —

తాయిలం — తాయానికి రూపాంతరం
బురికీలు — వెల్లకిలా పడిపోవడం
ఉలుకీలు — చక్కలి గింతలు
డీడిక్కు — ఇద్దరి తలకాయలను కొట్టడం

జల్లకాయ - మొట్టికాయ
దాయి - చందమామ

మొదలైన పదాలెన్నో బాలభాషలో శాశ్వతమైన స్థానాన్ని ఏర్పరచుకుని తరతరాలుగా వర్ధిల్లుతున్నాయి ఈ పదాలనే రచయితలు, కవులు ఒక ప్రత్యేక బాణీలో ప్రయోగించి రచనకు ఒక నడకను, సొంపును, ఇంపును సమకూర్చినపుడది శైలి ఔతుంది

సూర్యరాయాంధ్ర నిఘంటువు అర్థము చెప్పెడు పద్ధతి మొదట సామాన్యముగా నర్థము చెప్పి పిమ్మట దానిని విస్తరించుట; నడవడి అనీ, ఆంధ్రశబ్దరత్నాకరం 'ఒక విషయమును వివరించు నొకపద్ధతి, కవి కావ్యరచనలో చూపెడి విశిష్టమైన మార్గం; నడవడి' అనీ శైలిని గురించిన అర్థ వివరణ చేశాయి. ఎందుచేతో 'శైలి' అనే పదం బ్రౌన్ నిఘంటువు. ఆంధ్రవాచస్పత్యం, వావిళ్ల నిఘంటువులలోకి ఎక్కలేదు

శైలిని గురించి పింగళి లక్ష్మీకాంతంగారు ఇలా రాస్తారు. '... ఈ శైలి' అను పదమును మనము ఆంగ్ల భాషలో స్టైల్ అను దానికి పర్యాయపదంగా కల్పించుకొన్నదే కాని మన భాషలోని శబ్దం కాదు. ఇది మన అలంకారశాస్త్రంలో ఎచ్చటనూ లేదు. మన పూర్వులెవ్వరూ దీనిని వాడలేదు. శైలికి సన్నిహిత అర్థములు గల శబ్దములు రీతి, శయ్య అనునవి కలవు. ఆ శబ్దములనైనను విశేషార్థములలో వాడెదరుగాని సాధారణార్థములో వాడరు."[2] అనేదానికి అలంకార శాస్త్రాలనుంచి దాఖలాలు, కావ్యాల నుంచి ఉదాహరణలు చూపి నాగళ్ల గురుప్రసాదరావుగారు ప్రాచీన అలంకారికులు 'రీతి' అను పదానికి పర్యాయ పదమని, ఆంగ్ల పదం స్టైల్ నుంచి ఉత్పన్నమైనది కాదని ఋజువు చేశారు.[3]

ఆధునిక సాహిత్యకారులు శైలిని రెండుగా విభజించారు. 1 భావశైలి, 2 భాషాశైలి. ఊహాటంగా తోచే రంగురంగుల భావ జాలం భావశైలి. బాహాటంగా తోచే వర్ణ, పద,

..............................

2 లక్ష్మీకాంతం, పింగళి. పలనాటి వీరచరిత్రకు పీఠిక. విశాలాంధ్ర, 52 పుట.
3 గురుప్రసాదరావు, నాగళ్ల. శైలి. తెలుగు విద్యార్థి, అక్టోబరు, 1979, 29 పు.

పదబంధ ప్రయోగ విన్యాసం భాషాశైలి. [4] ప్రాసలమూసలతో భావ శైలి పదాల గారడీలతో పైపైమెరుగులతో సాగిపోతూ ఉంటుంది.

మనిషికి పేరు _ చెట్టుకు వేరు
రాజుకు వూరు - కంసాలికి కారు
ఉండాలోయ్, ఉండాలి

- తాతయ్య

ప్రౌఢ సాహిత్య శైలి కంటే బాల సాహిత్య భాషా శైలి సరళంగా ఉంటుంది.

గుల్ల మెక్కెదనమ్మ గుల్లమెక్కెదనే
గుల్ల మెక్కి దేశమెల్ల తిరిగిదనే!
బలికి పోయెదనమ్మ బలికి పోయెదనే
పుత్తికా లెన్నెన్నొ పత్తు కెల్లెదనే

- కమ్మిశెట్టి వెంకటేశ్వరరావు

తెలుగు పాపా రావె, పూలు గొనిపోవె
పూజనీయులు వీరు పూజించి పోవె

- మధురాంతకం రాజారామ్

ఈ విధమైన సరళశైలిని పిల్లలు బాగా ఆదరిస్తారు భాషాశైలిని పిల్లలు ఆనందిస్తారు అర్థసౌందర్యంకంటే ధ్వని మాధుర్యానికి పిల్లలు ముచ్చట పడతారు ముగ్ధులౌతారు ఈ మృదుమధురమైన శైలిలో ఉన్న కావ్యాలే చిరకాలంగా మనమధ్య నిలచిఉన్నాయి.

ఛందస్సు - అలంకారాలు

భారతీయుల దృష్టిలో తెలుగు కావ్యాలు గద్యం, పద్యం, చంపువు - అని మూడు

..........................

4 రామారెడ్డి ముకురాల బాల సాహిత్యం - తెలుగు రచనాశైలి. రాసిన ప్రతి.

విధాలుగా ఉన్నాయి "గద్యతె ఉచ్చతె అనేవ ఇతి గద్యమ్'' – అను వ్యుత్పత్తిని బట్టి వచనంలో రాసిన కావ్యం గద్యం అనవచ్చు "పద్యతే అనేవ ఇది పద్యమ్" అనే వ్యుత్పత్తిని బట్టి పద్యంలో విషయ నివేదనంతోబాటు గతి అవసరమైనట్లు కనుపిస్తుంది ఈ గతి సమకూర్చేసాధనం ఛందస్సు గద్య, పద్యాల కలగలుపు చంపువు కావ్య రచనకు ఛందస్సు ప్రాణం పద్యమైన గేయమైనా, గీతమైనా – ఛందోబద్ధమై ఉన్నట్లయితే, అది కొన్ని పరిధులకు సెబద్ధమై, క్షమశిక్షణతో నడిచే సైనికుడిలాగ నడకసాగిస్తాయి లెక్క ప్రకారము నడుస్తాయి అందుచేతనే ఏ ఇతర భాషలకంటే ఛందోబద్ధమైన తెనుగు కవిత – తేనెలూరుతుంది' అనే ప్రశస్తి పొంది ఉంది.

సృష్టిలో తొలి శ్లోకం క్రౌంచ మిధున సంయోగ సందర్భంలో శోకతప్తహృదయు డైన వాల్మీకి మహర్షి చెప్పిందే నంటారు. దాన్ని వారి శిష్యులు –

సమాక్ష రై శ్చతుర్భిర్యః
పాదైర్గీతో మహర్షి ణా

అని చెప్పుకొన్నారు ఇది సమాక్షరాలను గలిగి, నాలుగు పాదాలు కలిగి మహర్షిచేత పాడబడింది. కనుకనే అది పాదబద్ధము, అక్షర సమమూ, తంత్రీలయ సమన్వితమూ అయిన తేజోపుంజం అయింది

కవిత్వానికి ఛందస్సు అవసరమా లేదా అనే అంశంమీద పాశ్చాత్య అలంకారికులలో సాహిత్యవేత్తలలో సుదీర్ఘమైన చర్చ జరిగింది.[5] కార్లయిల్ అను పండితుడు "కవిత్వం ఛందోబద్ధమై ఉండాలనీ, సంగీతాత్మకమై యుండునని యనుట ప్రాచీనుల సామాన్య విభాగమే అయినప్పటికి అందు తగినంత అర్థమున్నదని"[6] వారి అభిప్రాయం ఆ తర్వాత కోర్థోప్ మొదలైన వారు ఛందస్సు అవసరాన్ని బలపరిచారు.

..............................

5 For my own part I find considerable meaning in the old vulgar distinction of poetry being metrical having music in ,it. Carlyle.

6 Poetry is the art of prodising pleasure by the Just expression of imagination, thought and feeling in metrical language Corthope

కోలేరిడ్జి దృష్టిలో కవితా రచనకు ఛందస్సుకు సంబంధం లేదని చెబుతూ "ఉన్నత స్థాయికి చెందిన కవిత్వం ఛందో విహితంగా ఉండవచ్చునని"[7] చెప్పారు అరిస్టాటిల్ పద్యంలో రాసినంత మాత్రాన ఏది కవిత్వం కాదనీ, కవిత్వానికి పద్యం గుర్తింపబడిన అనుబంధం మాత్రమే"[8] నని ఆయన అభిప్రాయం

పైన వివరించిన భిన్నాభిప్రాయాలను తరవిడి చెప్పినట్లయితే కవిత్వం ఛందస్సహితం గాను, ఛందోరహితంగానూ కూడ ఉండవచ్చనీ – కవిత్వం ఛందోబద్ధంగా ఉండడం సంప్రదాయమనీ, సహజ ధర్మమనీ నిర్ణయం తీసుకోవచ్చు.

బాల సాహిత్యంలో గూడ ఛందస్సులోనూ, ఛందస్సు లేకుండాను చాల కావ్యాలు వచ్చాయి. బాల సాహిత్యంలో ప్రకృతికీ మనస్సుకు అవినాభావ సంబంధం ఉంది ప్రకృతికి శ్రుతి,లయఉన్నవి ఈరెంటికీ బద్ధమై ప్రకృతి నడుస్తూ ఉంటుంది. పసిపిల్లలు పుట్టినది మొదలు ప్రకృతికి సన్నిహితంగా ఉంటారు. ప్రకృతి గతికి అనుగుణంగా వారి శరీరం స్పందిస్తూ ఉంటుంది. అందువలన ప్రకృతికి సహజగుణాలైన శ్రుతి – లయలకు అనుగుణంగా ఉండే సాహిత్యం ప్రయోజనకారి అవుతుంది. బాల సాహిత్యంలో ఆటలాడుతూ ఉన్నట్లుగా ఉండే 'ఆటవెలది' ఛందస్సులో పద్యా లవతరించాయి.

చేత వెన్నముద్ద చెంగల్వ పూదండ
బంగారు మొలతాడు పట్టుదట్టి
సందిట తాయతులు సరిమువ్వ గజ్జెలు
చిన్ని కృష్ణా నిన్ను చేరికొలుతు

ఈ పద్యాన్ని పిల్లలు ఎంతో ఆనందంతో చదువుతారు. ఇలాగే పిల్లలకు సులువుగా నడిచే 'ద్విపద' నడక కూడ తకతకిట – తకతకిట' అనే ఐదు అక్షరాలు తాళానికి ఒదిగి ఉండడం వలన మంచి గమకం, ఊపు కలిగిస్తుంది.

..............................

7 Poetry of the highest kind may exist without metre.
Colritze

8 Verse is no guarantee of poetry but a recognised adjunct of it.
– Aristotle

గోరంత దీపమ్ము కొండలకు వెలుగు
గోపాలకృష్ణమ్ము గోవులకు వెలుగు
మాడంత దీపమ్ము మేడలకు వెలుగు
మహారాజు అబ్బాయి మాకళ్ల వెలుగు

ఇవేకాదు దసరా పద్యాలు కూడ 'ద్విపద' రూపంలోనే అల్లుకున్నాయి. పిల్లలు గిలకలను చేతబట్టి, బుక్కా గుండా బాణాలను వదలుతూ —

అయ్యవారికి చాలు ఐదు వరహాలు
పిల్లవాళ్లకు చాలు పప్పు బెల్లాలు

అనే మకుటంతో ఎన్నో పద్యాలు చదువుతారు చిత్రమేమంటే ఈ పద్యాలను పద్యాలవలె చదవక పాటలా పాడుతారు. పాటకు కావాల్సినంత 'ఊపు' 'పట్టు' ద్విపదలో విరివిగా చోటుచేసుకున్నది ఇలాగే తేటగీతలు, కందాలు, రగడలు — కూడ బాల సాహిత్యంలో విరివిగా ఉన్నాయి.

కాగా పసిపాపలకు, పిల్లలకు అనువుగా ఉండే సాహిత్యం, అవసరం ఉండనేఉంది. అందుకోసం రచయితలు మాత్రా ఛందస్సును, ప్రాసలను క్రమాలంకార విధానాన్ని అనుసరించారు. నిజానికి బాల సాహిత్యంలో ఈ రకమైన ప్రక్రియలే అధికారికంగా ఉన్నవి. ఏవో కొన్ని మాత్రలను లెక్కకు తీసుకోవడం, ఆ లెక్క ప్రకారం మాటలను కూర్చుకోవడం, అదేవిధంగా గేయాన్ని పూర్తిగా నడపడం ఇందులోని ప్రక్రియ। సాధారణంగా రెండు, నాలుగు, ఆరు, ఎనిమిది పది — ఇలా సరిసంఖ్యతో కూడిన మాత్రలతో రాసిన గేయాలే బాల సాహిత్యంలో విరివిగా చోటు చేసుకున్నాయి. లెక్కలలో 'ఆ వృత్తాలకు ఇవి' బాగా వొదిగి, పాడుకొనడానికి కూడ వీలుగా ఉంటాయి కనుక — ఈ విధమైన రచనలనే ఎక్కువగా రచించారు.

చందమామ రావె! జాబిల్లి రావె
కొండెక్కి రావె! కోటివేలు తేవె

ఇది నాలుగు మాత్రల ఛందస్సు — ఇలాగే

గుడు గుడు గుంచం, గుండే రాగం
పావడ పట్టుం — పడిగే రాగం
చెమ్మ చెక్క, చేరడేసి మొగ్గ
అట్లు పొయ్యంగ, ఆరగించంగ

ఈ విధానంలో సాగిన గేయాలు 'తారంగం – తారంగం' 'తోడు పాయసంతోడు' 'ఏనుగమ్మ ఏనుగు' – మొదలైన గేయాలు అనేకం ఉన్నాయి.

ఇక 'ప్రాస' విధానం బాలసాహిత్యంలో ఎన్నో వంపు సొంపులను నింపింది. ప్రథమాక్షరం ప్రాస, లేక ద్వితీయాక్షరం ప్రాస, లేక రెండున్నూ కావచ్చు–అత్యక్షరం, పదం ప్రాస కావచ్చు. ప్రాస ఉండడంవల్ల పదానికి అందం వస్తుంది. నోట పట్టడం సులువు అవుతుంది చటుక్కున కంఠతా వస్తుంది ప్రథమాక్షర ప్రాసతో పాటు మాత్రా ఛందస్సులో సాగిన–

ఉత్తముని పేరేమి ఊరు పేరేమి
సత్య పురుషులగన్న సాధ్వి పేరేమి?
బావా బావా పన్నీరు బావను పట్టుక తన్నేరు
వీధి వీధికి తిప్పేరు వీసెడు గుద్దులు గుద్దేరు

బాల గేయాలు అసంఖ్యాకంగా ఉన్నాయి. మాత్రా ఛందస్సులోనే అంత్యప్రాసను అనుసరించిన గేయాలు అనేకం లేకపోలేదు.

బండోయమ్మ బండి, బండికి కుచ్చులు తెండి
సుబ్బారాయుడి పెండ్లి, చూచి వత్తము రండి

చెన్నపట్నం చెరుకు ముక్క
నీకో ముక్క, నాకో ముక్క

చిట్టి పొట్టి కాయ, సీమ నెల్లికాయ
గోడపుచ్చకాయ, గొబ్బినెల్లకాయ

పిల్లలకు భాషలోని పదాలు పరిచయం కావడం, వారిలో ఉత్సాహం పెరగడం, ఉల్లాసంగా ఉండడం ఈ గేయాల లక్ష్యం. ప్రతి పదానికి అర్థం ఉండాలనీ, అర్థం తెలియాలనే ఆశయం నాటి రచయితకు లేదు. ఈ ఆశయంతో రాసిన గేయాలలో ప్రాసను తప్పనిసరిగా ఆశ్రయించవలసి వస్తుంది. ప్రాసలలో ఒకే సారూప్యం గల పదాలు ఉంటాయి. అలా ఉంటేనే అది ప్రాస అవుతుంది. కాగా, బాల సాహిత్యంలో 'ప్రాస' స్థానం అద్వితీయం, అత్యవసరమూ అవుతున్నది.

పిల్లలకు విశేషంగా ఆసక్తిని కలిగించే సాహిత్య ప్రక్రియలలో 'క్రమాలంకార' సాధనాన్ని మించినది మరొకటి లేదేమోననిపిస్తుంది–ఒకే 'పదం' పదే పదే పదంలోగాని,

పాటలోగాని ఆ(మేడితం కావడం వలన రచనకు సొబగు సమకూరుతుంది. అట్టిది ఆకర్షణీయంగా ఉండడమేగాక, అర్థంలో చమత్కారం, మనసును ఆకట్టుకోవడం వంటి సత్ఫలితాలు లభిస్తాయి. పోతన భాగవతంలో –

పలికెడిది భాగవతమఁట
పలికించు విభుడు రామభద్రుండఁట నేఁ
బలికిన భవహరమగునఁట
పలికెద వేరొండుగాథ పలుకఁగ నేలా.

పద్యంలో 'పలుకు' శబ్దంపలుకు గిలుకులు, కూర్చిన శోభ ఇంతా అంతాకాదు. ఏడిద కామేశ్వరరావుగారు –

తాత వంటి తాత లేడు
గాంధి తాత వంటి తాత
తాత తాత అని పిలువగ
తాత అతడె గాంధి తాత

లో 'తాత' పదం పునరావృతమైనందున గేయానికి మంచి ఊపూ, తూగూ వచ్చాయి. ఈ ప్రక్రియలోనే గొలుసు విధానంలో గేయం సాగిపోతే –కొన్ని పదాలు ముచ్చట గొలుపుతూ ముడిపాలు చిందిస్తాయి.

కంచికి పోతావ కృష్ణమ్మా–ఆ
కంచి వార్తలేమి కృష్ణమ్మా
కంచిలోన ఉ ది అవ్వ–ఆ
అవ్వ పెట్టు నాకు బువ్వ–
బువ్వఉన్నదిగాని, కృష్ణమ్మా, నీకు
పప్పు ఎక్కడిదోయి కృష్ణమ్మా–
కోమటి ఇచ్చును అప్పు–ఆ
అప్పు పెట్టును నాకు–పప్పు

ప్రశ్నోత్తరాల రూపంలో సాగిపోయే ఈ పాటలలో పదాలు రెండు మూడు సార్లు దొర్లడమ్–తద్వారా, ప్రశ్నకు ప్రత్యుత్తరం దొరకడం–ఆపదాల కూర్పు చివరికంటూ

పూర్తికావడం-క్రమాలంకార ప్రక్రియలో ఒక పద్ధతి. దీనిని ఎంతో దీక్షితులుగారు మరింత సొంపుగా ఉపయోగించారు.

తువ్వాయి తువ్వాయి ఏమి తువ్వాయి
తువ్వాయి తువ్వాయి మంచి తువ్వాయి
తువ్వాయి మెళ్ళోన ఏమి ఉన్నాయి
తువ్వాయి మెళ్ళోన మువ్వలున్నాయి
తువ్వాయి కాళ్ళలో ఏమి ఉన్నాయి
తువ్వాయి కాళ్ళలో పరుగులున్నాయి '

ఈ విధంగా బాల సాహిత్యంలో పదాల పలుకులు, ఆవృత్తి విన్యాసాలు- అపారంగా బయలుదేరి ప్రాచీన ఆధునిక బాల సాహిత్యాన్ని సర్వదా పరిపుష్టం చేశాయి.

ఒక విధంగా చూస్తే బాల సాహిత్యంలో 'ఛందస్సు' అలంకార ప్రక్రియకే ఎక్కువ ప్రాధాన్యం ఉన్నట్లు అనిపిస్తుంది. కేవలం 'అలరించేది అలంకారం' కాకుండా ప్రయుక్త విషయానికి వన్నె తెచ్చేది అలంకారమైనది ఈ అలంకారాలు, ఆమ్రేడితాలు, మాత్రా ఛందస్సులు పిల్లలను గిలిగింతలు పెడతాయి. వారి మనస్సులను ఆనందంతో ఓలలాడిస్తాయి. పిల్లలను మనస్తత్వంలాగ, పిల్లల సాహిత్యం కూడ కొంత స్వతంత్ర భావపూరితము, స్వేచ్ఛాభావ శోభితమై, పిల్లలలాగే ఆడుతూ, పాడుతూ ముందుకు గెంతుతూ ప్రవర్తిల్లింది నేటికీ దినదిన ప్రవర్ధమానంగా వెలుగొందుతూ ఉన్నది.

## సంగీతం

తెలుగువారి సంగీత సంప్రదాయాలకు భరతుని నాట్యశాస్త్రం, మతంగుని 'బృహద్దేశి, శారఙ్గదేవుని' సంగీత రత్నాకరం ఆధార గ్రంథాలు. నందికేశ్వరుని అభినయ దర్పణం' తెలుగు దేశంలోనే రచింపబడినట్లు చెప్పబడుతూంది. శారఙ్గదేవుడు-

గీతం వాద్యం తథా నృత్యం
త్రయం సంగీత ముచ్యతే

అని' సంగీత రత్నాకరం' లో చెప్పాడు. గీతం, వాద్యం,నృత్యం, యీ మూడూ కలిస్తే సంగీతం అవుతాయని, అది హృద్యమంగా ఉంటుందని వారి భావన. ఈ సంగీతానికి మూలం సృష్టి. అది శ్రుతి బద్ధమైనది. లయబద్ధమైనది ప్రకృతి సహజమైన యీ

శ్రుతి లయ ప్రకృతిలోని ప్రతిజీవికి పుట్టుకతోనే అబ్బుతుంది పంచభూతాత్మకమైన యీ ప్రకృతి గమనమంతా క్రమబద్ధంగా నడుస్తుంది. సృష్టి, స్థితి, లయ — యీ మూడు కార్యాలు క్రమ విహితంగా ప్రవర్తిస్తాయి. క్రమబద్ధమైన ఆ ప్రవర్తనే శ్రుతి, లయ అంటాడు సంగీత పితామహుడు పురందరదాసు.

పసిపాపల గుండెలకు లయ ఉన్నట్లే పాప కంఠస్వరానికి కూడ శ్రుతిఉంది. ఈ రెండూ ప్రకృతి ప్రసాదించినవే. పసితనంలో పాపలు ప్రకృతికి చాల సన్నిహితంగా ఉంటారు. ఆ సాన్నిహిత్యం పాప ఎదుగుతున్న కొలదీ పలుచబడుతుంది. ఆస్థానంలో స్వయం వ్యక్తిత్వం చోటు చేసుకుంటుంది. ఇది ప్రకృతి సహజం.

ఈ సహజ లక్షణాన్ని ఆలంబనం చేసుకొని పూర్వులు కొన్ని ప్రయోగాలు చేశారు పసిపాప నడులకు, నానుడులకు, ముద్దుముద్దు తొక్కు పల్కులకు, నడకలకు అతి సమీపంలో ఉండే — ఏకతాళం ఖండగతినీ — ఈ రెంటినీ దృష్టిలో పెట్టుకొని ఆగతులకు సరిపడు మాటలను కూర్చిపెట్టారు. తాళాలను ఈవిధంగా అమర్చుకున్నట్లే రాగాలను కూడ ఎంచుకున్నారు అట్టి వాటిలో మోహనరాగాన్ని ముందు పేర్కొనవచ్చు.[9] ఈ రాగానికి స్వర స్థానాలు తక్కువ.

సరిగపదసా సాదపగరిసా ఈ రాగాన్ని అనడానికి ఎక్కువ శ్రమ ఉండదనీ—ఏమాత్రం ప్రయత్నించినా అనగలుగతారనీ వారు ఊహించారు. అట్లే ఎక్కువ ఇబ్బందిలేని రాగాలను కూడ మరికొన్నిటిని అనగా — జంఝుటీ, అసావేరి, ఓలహరి, బహుదారి మొదలైనవి.

ఈ రాగాలలో ఛాయలలో ఏక ఖండతాళాలకు అనుగుణంగా పదక్రమాన్ని నడిపినట్లయితే బాలలకు సన్నిహిత మౌతాయని వారు ప్రయోగాలు చేశారు.

చేత వెన్న ముద్ద —— చెంగల్వ పూదండ
బంగారు మొలతాడు – పట్టుదట్టి
చెమ్మ చెక్క చారడేసి మొగ్గ
అట్లు పొయ్యంగ ఆరగింపంగ
వానా వానా వల్లప్ప
వాకిలి తిరుగు చెల్లప్ప

..............................

9 ఆదిశేషువు, హరి. జానపదగేయ వాఙ్మయ పరిచయము. గుంటూరు, నవ్య విజ్ఞాన ప్రచురణలు, 1967. 341 పు.

మొదలైన గేయాలన్నీ రాగాలకు, తాళాలకు ఒదిగి నడిచేవే. ఇంకా చిత్రమేమంటే– ఈ గేయాలు పాడేటప్పుడు రాగం ఛాయమాత్రంగానే సాగుతుంది. లయ మాత్రం కొంత బింకంగా నడుస్తుంది.

బాలగేయాలయెడ ఈ 'రాగాలు' దోబూచులాడినట్లు ఉన్నా – పిల్లల కోసం తల్లులు పాడే పాటల్లో రాగవరుసలు నిండు రూపంలో ఉంటాయి. అట్టి పాటలో లాలిపాటలు, జోలపాటలు ముఖ్యమైనవి.

కస్తూరి రంగ రంగా
కావేటి రంగ రంగా
రామలాలీ మేఘశ్యామలాలీ
జో అచ్యుతానంద
జోజో ముకుంద

మొదలైన పాటలకు అమర్చిన రాగాలు అతిసున్నితమైనవి. క్రమబద్ధమైనవి: ఎక్కువ తికమకలు లేనివి కనుకనే శతాబ్దాలు దాటినా ఆ రాగాలు జీవాన్ని కోల్పోలేదు. ఆ రాగాలు, వాటి ఛాయలు పసి హృదయాలకు ఎంత సున్నితమైనవో–పాడే వారికి తెలుస్తుంది. ఆ లాలిపాటలు పాడినంత మాత్రాన పిల్లలు ఇట్టే నిద్రపోగలగడం గమనిస్తే ఆరాగ ఛాయలశక్తి ఎటువంటిదో అర్థమౌతుంది. నాట్యభైరవి రాగంలో నెల్లూరు ప్రాంతంలో – ఏడ్చే పిల్లలను ఓదార్చేందుకు –

ఉళుళూ ఆయీ ఆయీ ఆపదలుగాయి
చిన్నవాళ్లను గాయి శ్రీరంగ శాయి

అని పాడినపుడు ఆపాటలో మాధుర్యానికి పిల్లలు నిద్రపోతారు. అంతేగాదు–శతాబ్దాల తరబడిగా చూస్తే – అట్టి నిండైన రాగఛాయలు, గమనం, మాధుర్యంగల ఫణితులు మరికొన్ని రాలేదు. అంటే–ఆ రాగాలను, ఫణితులను నిర్ణయించిన పెద్దల ప్రతిభ ప్రస్ఫుట మౌతుంది.

ఇట్లే "శిశుర్వేత్తి, పశుర్వేత్తి
వేత్తి గానరసం ఫణిః" పాముల విషయం కూడా!

నాగస్వరం పాడితే నాగులకు నిద్ర
జోలల్లు పాడితే పాపలకు నిద్ర —— జో, జో, జో

అని తల్లులు పాడతారు. ఆ నాగస్వరం ఎట్టిదో - ఆ రాగం అలాటిది. మేళి - మోళి అనబడే రాగంలో నాగస్వరం బుర్రలోంచి వచ్చేధ్వని - అపూర్వమైనది ఆ బుర్ర ధ్వనికి- ఆ రాగానికి - ఆ పాట గమనానికి - అనుపమ సంయోగం కుదిరింది - కనుక నే నాగస్వరం అజరామరమై నిలిచింది. దానికదే గొప్పనాదం అయింది. అలాటిది మరొకటి పుట్టే అవకాశం లేనంత గొప్పది అయింది పిల్లలకు తల్లులకు పాములకు మాత్రమేగాదు. పశువులకు అట్టి ధ్వనులు, రాగాలు ఏర్పడిపోతాయి. వేణువు ధ్వని పశువులను ఆకర్షించినంతగా మరొక ధ్వని ఆకిర్షింపలేదు బాలకృష్ణుడు మురళి చేతబట్టి ఆలపిస్తే - ఆవులన్నీ, ఆయన చుట్టూచేరి నిలబడి నెమరు వేస్తుంటాయి

ఆనాడేగాదు - ఈనాడు కూడ పల్లెపట్టులలో - అనగా ఒకంత నాగరిక ప్రపంచానికి దూరంగా ఉండే పల్లెతావుల్లో వేణువులాంటివే పొడుగాటి మురళి ఊదుతూ పశువులను కాస్తుంటారు గొడ్లకాపరులు. ఆ వేణువు ధ్వని తరంగాలు వినగానే ఎక్కడి వక్కడ మేస్తూవున్న పసువులు పరుగుతో చక్కావస్తాయి ఆ రాగం, ధ్వని అంత సమ్మోహన మైనది.

ఇలాగ కొన్ని రాగాలు, కొన్ని తాళాలు, గతులు, నడకలు - బాలలకు, తల్లులకు, పసవులకు, పాములకు నిర్దిష్టమై ఉన్నాయి. ఆ రాగఛాయలు ఎంతో అనుభవ ఫలితాలు! వీటిని బాల గేయాలకు, ఛాయామాత్రంగా అమర్చి, బాల గేయాలను భాసురము, అమరముగా తీర్చిదిద్ది మన కిచ్చిపోయారు పెద్దలు -

అందుకే అవి చిరంజీవులు, చిరస్మరణీయాలు, బాల గీతాలకు వెలుగు దివ్వెలు.

## సంస్కృతి

తెలుగు తనమే తెలుగు సంస్కృతి తెలుగు వారి ఆచారాలు, పాటలు, అలనాట్లు, కట్టుబాట్లు, కళలు, పండుగలు - పబ్బాలు, నగలు - నాణ్యాలు, కట్టు-బొట్టు-యివన్నీ కలిస్తే తెలుగు వారి జీవిత విధానం వ్యక్తమౌతుంది అదే తెలుగు సంస్కృతి అని స్థూలంగా చెబుతారు. పండిత జవహర్‌లాల్ నెహ్రూ సంస్కృతి పై చేసిన ఒక ప్రసంగంలో సంస్కృతిని 'నిర్వచించడం కష్టమని' చెబుతూ 'అదొక అపదృశమైన శక్తి అనీ, అశేష ప్రభావాల ముక్తాఫలం అనీ, జాతితోబాటు దానికి చెందిన ప్రతి వ్యక్తికీ విలక్షణమిచ్చే ఒక దివ్య ప్రతిభావిశేషం సంస్కృతీ, అనీ - నిర్వచించారు సంగ్రహంగా. వారి సోదరి విజయలక్ష్మీ పండిట్‌గారు భారతీయ విద్యాభవన్ వారి ఆహ్వానంపై 'మన సంస్కృతి' పై రాజాజీ యిచ్చిన మూడు ఉపన్యాసాలుగల సంపు

టానికి తొలిపలుకు రాస్తూ ఆత్మనిగ్రహం సాధించిన అలవాటే, సంస్కృతి అన్న రాజాజీ మాటలను వివరిస్తూ మానసికంగా, దైహికంగా మానవుని అవసరాలు తీరిన పిదప అతని మూర్తి మత్వానికి గౌరవ సౌరభాలను సంతరించేది సంస్కృతి[10] అంటారు. ఒక ప్రసిద్ధ పత్రికా సంపాదకుడు ఆంధ్రప్రభ సంపాదకీయంలో 'జీవితానికున్న విస్తృతి, దానికున్న వైవిధ్యం, దానికున్న విలక్షణత్వం సంస్కృతికి కూడ ఉన్నది. కాబట్టే సంస్కృతిని నిర్వచించడం కష్టం అయితే ఏది జాతి జీవితానికి విలువ నిస్తుందో, వైశిష్ట్యాన్ని కూర్చుతుందో దానిని సంస్కృతిగా భావించవచ్చునేమో' [11] అని ముగిస్తారు. వాస్తవానికి ఒక జాతి ప్రజానీకం సంపూర్ణ చరిత్రే సంస్కృతి చరిత్ర'[12] అంటారు. ఖండవల్లి లక్ష్మీరంజనంగారు. ఏమైనా జాతి జీవితానికి విలువ వెలుగునిచ్చేది, విశిష్టత చేకూర్చేదీ సాహిత్యమే అది పెద్దల సాహిత్యం కావచ్చు. బాల సాహిత్యం కావచ్చు సంస్కృతీ ప్రసార విషయంలో ఆ తేడాలేదు

విద్యాబుద్ధులను, సంప్రదాయాలను నేర్పడంలో తెలుగు తల్లులు వారికి వారే సాటి. ముక్కుపచ్చలారని దశలో తల్లి పాపకు ఎవరెవరి యెడ భక్తి ప్రపత్తులు ప్రదర్శించాలో ఇలా తెలియజేస్తుంది

లాలను పోసీ, పాలను తావీ
జోలను పాడీ, అమ్మకు జే జే
నడువగ చూచీ అడిగినవన్నీ
తడియక ఇచ్చే నాన్నకు జే జే
మాటలు నేర్పే, పాటలు నేర్పే
ఆటలు నేర్పే, గురువుకు జే జే

బిడ్డ మరికాస్త ఎదిగాక బిడ్డ చదువు కోవాలని కలలు కంటూ –

.............. ..............

10 రాజగోపాలాచారి, చక్రవర్తి. మన సంస్కృతి. మద్రాసు, సంస్కృతి ప్రచురణ, 1934

11 ఆంధ్రప్రభ 17-11-1955 సంపాదకీయం

12 లక్ష్మీరంజనం, ఖండవల్లి; బాలేందుశేఖరం, ఖండవల్లి ఆంధ్రుల చరిత్ర సంస్కృతి, కర్నూలు, బాలసరస్వతీ బుక్ డిపో, 1957. 11 పు.

చదువుకో నాయన్న! చదువుకో తండ్రీ!
చదువుకొంటే నీకు సౌఖ్యమబ్బేను

అంటుంది ఇది తెలుగు తల్లి సంప్రదాయం. తరతరాలుగా తెలుగు కుటుంబాలలో అనూచానంగా వస్తున్న ఆచారం.

తెలుగు వారికి ఇష్టమైన పండుగ సంక్రాంతి. ఆసమయంలో గంగిరెద్దులవాళ్లు ఊరూర తిరుగుతారు వాళ్లు బసవన్నను ఉద్దేశిస్తూ —

బాబుగారికీ దణ్ణం పెట్టు, పత్తిగింజలు పెడతారంటు
కాసులు మువ్వలు కడతారంటు
పట్టు శాలువలు కప్పేదరంటు
డూ డూ డూ బసవన్న

అంటూ పాడతారు తెలుగువారి సంస్కృతిక జీవనంలో సంక్రాంతి వేడుకలు విశిష్టమైనవి. తెలుగు తల్లులు పాడే పాటలలో వైద్య విషయాలు నిక్షిప్తంగా ఉన్నాయి.

కలువ రేకులవంటి నీకన్నులకును
కాటుకలు పెడితే నీకు అందమ్ము

అంటుంది తల్లి. కాటుక తీర్చిదిద్దేది సరదా కోసం కాదు. అందం కోసమూ కాదు. దిష్టి తగలదనే భ్రమా కాదు. కాటుక వలన నేత్రవ్యాధులైన దుర్మాంసాలు, కండ్లకలక, కంటనీరు కారుట, పుసి రావు. అందుచేత తెలుగుతల్లి విధిగా బిడ్డకు కాటుక పెడుతుంది. కాటుకలోని రహస్యం తెలుగు తల్లికే తెలుసు. ఇలాగే-

కాళ్లాగజ్జి కంకాలమ్మా
వేపాచెక్కా వెలగా మొగ్గా ....

జీర్ణం జీర్ణం వాతాపి జీర్ణం
గుర్రాల్ దిన్న గుగ్గిళ్లరిగి....

మొదలైన గేయాలలో వైద్య రహస్యాలు ఇమిడి ఉన్నాయి. ఇది తెలుగు పిల్లల పాటల ప్రత్యేకత తెలుగువారి సంప్రదాయం.

సరసాలకో, విరసాలలో తెలుగువారికి ఒక ప్రత్యేకత ఉంది. పాట పాడుతూ బావనో, వదిననో, మరిదినో ఆటపట్టించడం, ఆనందించడం తెలుగు పిల్లలకే చెల్లు.

వదినగారూ మీరు వాసిగలవారు
వండబోయినచోట కుండ నా కేరు

బావగారూ మీరు ప్రతిభ గలవారు
నిండిన్న సభలోను పిండి బొక్కెరు

అబ్బాయి తలమీద గోరింక
చెప్పకు చెప్పకు చెడుపాప

అత్తవారింటికి కొత్తల్లుడొస్తేను
కొత్త సున్నము దెచ్చి మెత్తరమ్మ

ఇలాటి పాటలెన్నో తెలుగు వారి కుటుంబజీవనాన్ని ఉద్దీపనం చేస్తాయి. తుష్టినీ, పుష్టినీ చేకూర్చుతాయి.

కుటుంబజీవనంలో తెలుగువారికున్న అనుబంధం, ఆప్యాయత, నమ్రత మరే ప్రాంతం వారికీ ఉండవేమో. తెలుగువారి కోడలు పుట్టింటికి వెళ్లే ముందు భర్త అనుజ్ఞతోబాటు అత్తమామల అక్క- బావల అనుమతి తీసుకునే వినయ సంపన్నమైన ఆచారం గురించి-

కలవారి కోడలు - కలికి కామాక్షి - అనే

గేయంలో తెలియ వస్తుంది. బిడ్డ పెద్దయ్యాక అనుసరించి, మర్యాద పాటించి కుటుంబ గౌరవం కాపాడవలసిన విషయాలు చిన్నప్పుడే నూరిపోస్తారు పెద్దలు. ఇది మన ఆచారం. ఇలాటి ఉదాహరణలు శతాధికంగా లభిస్తాయి. ఈ గేయాలన్నీ తరతరాలుగా వస్తున్న మన సంస్కృతీ సంపద. కనుక మన ఆచారాలు, అలవాట్లు అందు మిళితమై ఉన్నాయి.

ఐతే బాల సాహిత్యంలో నేడు నిలిచిఉన్న కథలు, నవలలు, నాటికలు నలభై-యాభై సంవత్సరాల లోపువే. ప్రధానంగా అవి బాలలు ఆనందంగా చదువుకోడానికి ఉద్దేశించినవి. 'ఎంగేజ్' చేయడానికి రాయబడ్డవి కనుక అందు రంగురంగుల, మేలి జిలుగుల వింత సోయగాలే తప్ప, సాంస్కృతీ సుమ సౌరభాల గుబాళింపులు పెద్దగా కానరావు జనపదుల నోట నిలిచిన తరతరాల బాల గేయాలు పొందిన ప్రచారం. నేటి కథలు, నాటికలు బాలలోకంతో ప్రత్యేకంగా ఒక శైలితో, భాషతో గుర్తింపు పొందలేదు.

సంస్కృతం గూడ దేశవ్యాప్తంగా గ్రంథరూపంగా నిలచిన సర్వసంపన్నమైన భాష ప్రజలమధ్య వాడుకలో లేని కారణంగా రాజ్యాంగం గుర్తించలేదు. "అయి నప్పటికీ అది దేశవ్యాప్తంగా విస్తరించి దేశం అంగీకరించిన భాష...[2] సంస్కృత భాషలో వాఙ్మయం ప్రధానంగా పెద్దలకు ఉద్దేశించినది. పిల్లలను దృష్టిలో ఉంచుకొని 'బాలసాహిత్యం' అనే నవీనదృక్పథంలో నాడు-నేడూ గల రచనలు బహు తక్కువ. ఈ పరిస్థితి మరికొన్ని భాషలకూ ఉంది. తగినంత బాలసాహిత్యం కలిగి అధిక సంఖ్యాకులచే మాట్లాడబడే భాషలలో హిందీ ప్రముఖమైనది

కనుకనే హిందీని భారత ప్రభుత్వం రాజభాషగా గుర్తించింది. నేడు హిందీ పేరుతో పిలువబడే భాష ప్రజ, అవధీ, భోజపురి, మైథిలీ, మాలవీ, రాజస్థానీ, బుందేల్ ఖండీ మొదలైన పదునెనిమిది మాండలికాల సమ్మేళనం. కనుక యీ భాషలో పిన్నలకు, పెద్దలకు సంబంధించిన అపారమైన జానపద సాహిత్య సంపద కలదు. తొలిసారిగా రాజాశివ ప్రసాద్ సితారే హింద్ 1845 లో పిల్లల కోసం పాఠ్య గ్రంథాలు రాశారు. వారే పిల్లలలో మనోవికాసం పెంపొందించడానికి పంచతంత్ర హితోపదేశ కథలు, కథాసరిత్సాగరం ప్రచురించడానికి తోడ్పడ్డారు. ఆ తర్వాత భారతేందు హరిశ్చంద్ర 187?-1900 ప్రాంతంలో వీరు పాఠ్య పుస్తకాలేగాక పిల్లల కోసం ప్రత్యేకంగా పురాణ గాథలు, పురాణ పాత్రలతో గూడిన బాలల నాటికలు రచించారు. అంతేగాక వీరు బాల బోధిని అనే మాసపత్రికను నడిపారు. వీరు బాల సాహిత్యానికి ఎనలేని సేవ చేసినందునే వీరిని హిందీ బాలసాహిత్య వైతాళికుడం టారు[3] పిదప పేర్కొనదగిన వారు మహావీర ప్రసాద్‌గారు బాలరామాయణ్, బాల మహాభారత్, బాల భాగవత్, పాండవ వివాహ మొదలైన గ్రంథాలు రాసి తరువాతి తరాన్ని ఉత్తేజపరిచారు. ఆ దశలో మైథిలీ శరణ్ గుప్త, రామకుమార్ వర్మ, గులాబ్ రాయ్, కామతా ప్రసాద్ గురు ఈ యుగంలో బాలసాహిత్య సృష్టి చేశారు. ఈ యుగంలోనే బాలహితకర్, ఛాత్రహితైషీ, బాలప్రభ, మానిటర్, విద్యార్థీ, బాలమనో రంజన్, శిశు, బాలసఖ, బాలక్-మున్నగు బాలల పత్రికలు వెలిశాయి 1945లో

..............................

2 Kunhan Raja. Survey of Sanskrit Literature, Bombay, Bharatiya Vidya Bhavan, 1962. P 282.

3 విజయ రాఘవరెడ్డి, పోలి- ఉత్తర భారత బాలసాహిత్యము, 1977. సంచిక - 250 పు.

అప్పటి వరకు వెలువడిన బాల సాహిత్యానికి సమగ్ర సూచీ తయారు చేయబడింది అదే సంవత్సరం బాలసాహిత్యంపై పరిశీలనాత్మక వ్యాసాలకు నాంది జరిగింది.

భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చాక హిందీ బాల సాహిత్యంలో గణనీయమైన అభివృద్ధి జరిగింది దీన్ని వికాస యుగం అంటారు ఈ యుగంలో ప్రాథమిక పాఠశాలల సంఖ్య బాగా పెరగడంతో బాల సాహిత్య అవసరం హెచ్చింది. భారత ప్రభుత్వం, నేషనల్ బుక్ ట్రస్ట్, చిల్డ్రిన్స్ బుక్ ట్రస్ట్, జ్ఞాన భారతి మొదలైన సంస్థలు పిల్లల కోసం వందల సంఖ్యలో పుస్తకాలను ప్రచురించారు ఐతే హిందీలో వచ్చిన అధిక భాగం పుస్తకాలు పిల్లల కథలు, గెయాలు, వీటిలో శారదామిశ్రగారి నిలపారి మంగల్ గ్రహమే రజయా' రమేశ్‌వర్మగారి 'సుందరీ గ్రహకీయాత్రా' రాతు ప్రకాశ్ శీల్‌గారి సముద్ర మే సౌదిన్, మెలారామ్‌వత్‌గారి చాంద్ కీ యాత్రా రాకూర్‌దత్‌గారి బాగ్ కీ ఘర్ బాగ్ మొదలైన ప్రసిద్ధమైన కథాసంపుటాలు, మౌలిక నవలలో కృష్ణచందర్ గారి ఘర్‌గోప్ కా సప్న, భూప్ నారాయణ్ దీక్షిత్‌గారి ఖర్ ఖర్ దేవ్, మనోహర్ చౌహన్‌గారి జాదూగర్ కబీర్, హరేకృష్ణదేవ సారే గారి చందమామా దూరే కే బాగా ప్రచారంలోకి వచ్చాయి. హిందీలో బాలల కోసం తగినన్ని నాటికలు, నాటకాలు రాలేదు. మంగళ సక్సేనా, మిమలా లూత్రా. ఆనంద ప్రకాశజైన్, విష్ణుప్రభాకర్, ప్రభృతులు ప్రదర్శన యోగ్యమైన కొన్ని నాటికలను రచించారు ఆ తర్వాత పిల్లలు బాగా ఆదరించిన రచనలు జీవిత చరిత్రలు, బాలకృష్ణ, యాదవేంద్ర చంద్రజైన్, రాష్ట్రి బంధు నారాయణ దత్తా పాండే జై ప్రకాశ్ భారతి, బాబూ రామ్ జోషీ సందేశాత్మ తమూ, ప్రబోధాత్మకమూ ఐన జీవిత చరిత్రలను రాశారు.

పిల్లలలో విజ్ఞాన వికాసాలను పెంపొందించే నిమిత్తం రాజ్‌పాల్ అండ్ సన్స్ వారు 'విశ్వవిజ్ఞాన కోశ్' ను పది సంపుటాలను సచిత్రంగా ప్రచురించారు ఇది ప్రామాణికమైన విజ్ఞాన సర్వస్వం. గత పాతికేళ్ల కాలంలో వచ్చిన ఉత్తమ రచనలలో 100 గేయాలను, 100 నాటికలను, 100 కథలను 12 నవలలను సంకలనాలుగా హరేకృష్ణ దేవసారే ప్రచురించారు. ఇది హిందీ బాల సాహిత్యంలో బృహత్తర ప్రయత్నం ఇటీవలి కాలంలో హిందీ బాల సాహిత్యంపై విమర్శాత్మక గ్రంథాలు కొన్ని వచ్చాయి. హరేకృష్ణ దేవసారే, మస్తరామ్ కపూర్, రాష్ట్రిబంధు, జ్యోతిస్వరూప్ ప్రసాద్ గారలు విశ్వవిద్యాలయాలలో సిద్ధాంతవ్యాసాలను సమర్పించి 'డాక్టరు' పట్టా పుచ్చుకున్నారు ఈ ఏడు వెలువడిన హరేకృష్ణ దేవసారే సంపాదకత్వంలో 'బాల సాహిత్య రచనా ఔర్ సమీక్ష' మంచి విమర్శనాత్మక గ్రంథం. తెలుగు వారైన బాల

శౌరిరెడ్డి, పోలి విజయ రాఘవరెడ్డిగారలు హిందీ బాల సాహిత్యంలో గొప్ప కృషిచేసి ప్రభుత్వ బహుమతులను కూడ అందుకున్నారు

ఇంగ్లీషు

ఆంగ్ల భాష సంపన్నమైనది. సమగ్రమైనది భాషలో, భావంలో, వస్తువులో, చిత్రణలో, ముద్రణలో, అలంకరణలో, వింతవింత హొయలతో విప్పారి విరబూచినది. కాలమానాల, దూరతీరాల అవధులు లేక విస్తరించి విశ్వజనీనమైన భాషగా విశ్వవ్యాప్తి చెందింది ఆంగ్ల దేశంలో పిల్లలు చాలకాలందాకా పెద్దల కోసం సులభ శైలిలో రాసిన డేనియల్‌డిఫో రచన రాబిన్‌సన్ క్రూసో, జొనథన్ స్విఫ్టు రచన గలివర్ ట్రావెల్స్, వాషింగ్‌టన్ ఇర్వింగ్ రచన రిప్‌వాన్ వింకిల్ మొదలైన వాటిని విధిలేక చదివి ఆనందించేవారు. బాలలకోసం ప్రత్యేకంగా రాసిన పుస్తకాలు దాదాపు 17 వ శతాబ్దం అంతందాకా లేవనే చెప్పాలి. పిల్లల అవసరాలు, సరదాలు వేరే ఉంటాయని, వాళ్ళకోసం ప్రత్యేకంగా పుస్తకాలు రాయాలని మొట్టమొదట గుర్తించిన వాడు జాన్ న్యూబరీ (1713 - 1763). ఆయన రాసిన అటిల్ ప్రెట్టి పాకెట్ బుక్ (1744) విశేష ప్రజాదరణ పొందింది. ఇందులో పిల్లలు ఆనందించే జానపద గాథలు, వీర గాథలూ ఉన్నందున వేలంవెర్రిగా జనం దీనిని కొన్నారు. చదివారు. ఆ తర్వాత థామస్ డే, అనా లెటియా బర్బాల్డ్, సారా కిర్బీ టిమ్మర్ రచనలు కొంత ప్రచారమయ్యాయి.

పందొమ్మిదో శతాబ్దంలో ఛార్లెస్ ల్యాంబ్, మేరీ మార్తా షేర్వుడ్, జాన్ టెయిలర్, హన్స్ ఆండర్సన్ (1824-1876) థామస్ హుగ్స్ (1822-1896) వాషింగ్‌టన్ ఇర్వింగ్ (1783 - 1859) లూయిస్ కరోల్ (1932-1898) మొదలైనవారు ప్రసిద్ధమైన రచనలు చేశారు. ఈ శతాబ్దంలో మేరీ మాపే డాడ్జి (1831 - 1905), హోవర్డు పైల్ (1853 - 1911) మార్క్ ట్వేన్ (1835-1910) మొదలైన గొప్ప రచయితలు బాలసాహిత్యంలో పసిడి పంటలు పండించారు.[4] వీరుగాక శాస్త్రీయ గ్రంథాలు, దేశచరిత్రలు, జీవిత చరిత్రలు, వివిధ విషయాలు వివరించే విజ్ఞాన సర్వస్వాలు ఎన్నో వచ్చాయి బాలసాహిత్యాన్ని సంపన్నం చేశాయి ఇదంతా బ్రిటన్, అమెరికా తదితర దేశాలలో ఆంగ్ల భాషకు పట్టిన అదృష్టం.

..............................

4 Children's Literature From Encyclo paedia Britannica. Vol.4 p.224.

ఇటీవలి కాలంలో కేథరిన్ బార్. సిల్వియా కాస్సెడీ, డేవిడ్ మార్క్స్, లూనా కాథోన్ పిల్లలకోసం మంచి రచనలు చేశారు. ఎడ్వర్డు డోల్చే రచన "స్టోరీస్ ఫ్రమ్ ఇండియా" (1961) భారతీ సంస్కృతీ సంపదలను వివరించే ఉత్తమగ్రంథం[6] ఇలాగే భారతదేశంలో నదీనదాలను వివరించే మరొక ప్రశస్త రచన విన్‌ఫ్రెడ్ బ్రెన్ గారి ఇండియా లాండ్ ఆఫ్ రివర్సు (1966), పిల్లల వేషభాషలు, ఆచార వ్యవహారాలు, పండుగలు పాటలు వివరించే రచన సుమన చందవార్కార్ ఛిల్డ్రెన్ ఆఫ్ ఇండియా (1971) ప్రశస్త రచన.

విదేశాలలో అచ్చయిన పుస్తకాలను అనుసరించి భారత దేశంలో బాలల పుస్తకాల రచన, ప్రచురణ ముఖ్యంగా ఆంగ్లగ్రంథాల విషయంలో ఇటీవలే ప్రారంభమైనది. ఇండియా బుక్ హౌస్‌వారు లెట్ అజ్ నో ఇండియా, "అండర్ స్టాండింగ్ సైన్స్" సిరీస్‌ను ఉత్తమస్థాయిలో ప్రచురించారు. చిల్డ్రన్స్ బుక్ ట్రస్ట్ చిత్రరచనలో, ముద్రణలో దాదాపు నూరు ఉత్తమ గ్రంథాలను ముందుగా ఆంగ్లంలో ప్రచురించి, ఆ తర్వాత వాటికి హిందీ, తమిళ, బెంగాలీ, మలయాళ అనువాదాలను కొన్నిటికి తెచ్చింది. పిల్లలను ఎక్కువగా ప్రేమించిన జవహర్‌లాల్ నెహ్రూ పేర నేషనల్ బుక్ ట్రస్ట్ "నెహ్రూ బాల పుస్తకాలయ" పేరుతో నూరు పుస్తకాలను భారతీయ భాషలన్నిటిలో ప్రకటించే పథకం స్వీకరించి చాలభాగం పూర్తి చేసింది. రచనలో, రేఖాచిత్రాల రచనలో, ముద్రణలో ఈ పుస్తకాలు ఉన్నత ప్రమాణాలతో వెలసిల్లుతున్నాయి అంతేగాక భారత ప్రభుత్వ ప్రచురణ విభాగం, రత్న భారతి, వికాస్, థామస్ మొదలైన సంస్థలు ఆంగ్ల బాలసాహిత్యాన్ని ప్రోత్సహిస్తున్నాయి. ఇంగ్లీషు భారతదేశంలో అన్ని రాష్ట్రాలలో విద్యా విషయికంగా ప్రచారంలో ఉన్న భాషగనుక ఈ భాషలోని ప్రచురణకు తగినంత ఆదరం ఉంది.

## ఉత్తర భారత భాషలు

### బెంగాలీ

బాల సాహిత్యం బెంగాలీ భాషలో ఫలపుష్ప భరితమైన నందనోద్యానవనంగా భాసిల్లింది. విశ్వకవి రవీంద్రనాథ టాగూరు, బుద్ధ దేవబోస్, సత్యజిత్‌రాయ్

..............................

6. Children's Books on India, New Delhi, Educational Resources Centre, 1976.

మున్నగు జగత్ ప్రసిద్ధులు బాలసాహిత్య వీధులలో అడుగిడి జీవితం ప్రారంభించారు. "పిల్లలను మభ్యపెట్టడానికి బెంగాలీ తల్లులు పాడే జోలపాటలోని రాగమాధురి నన్నెంతో పరవశుణ్ణి జేస్తాయి. అప్పటికి అవి నన్ను ఒక అలౌకిక ప్రపంచానికి తీసుకు వెడతాయి." అని రవీంద్రనాథ ఠాగూరు బెంగాలీ బాలసాహిత్యంలోని పద లాలిత్యాన్ని ప్రశంశిస్తారు.

క్రైస్తవ మత ప్రచారకుల సంస్థ పందొమ్మిదవ శతాబ్ది ప్రారంభంలో బాలసాహిత్య ప్రచురణకు పూనుకొని, సలహాల నిమిత్తం ఈశ్వర చంద్ర విద్యాసాగర్, రాధా కాంతదేవ మున్నగు సభ్యులతో ఒక సంఘాన్ని నియమించింది. ఆ సంఘ సూచనల ప్రకారం వెలువడిన వాటిలో 'ఉపదేశకథ' ముఖ్యమైనది.

ఆ తర్వాత గతశతాబ్ది తుదిదశలో వెలువడిన రచనలలో తారాచంద్రదత్ గారి మనోరంజన్ ఇతిహాస్, హితోపదేశ్, జ్ఞానచంద్రిక, ఈశ్వర చంద్ర విద్యాసాగర్ రచన వేతాల పంచశతి, కధామాల, ఆఖ్యాన మంజరి – బహుళ ప్రచారాన్ని అందు కున్నాయి దానికితోడు ఆదినాలలో కేశవ చంద్ర సేన్ సంపాదకత్వంలో వెలువడిన బాలక్ బంధు ప్రమోద చరన్ సేన్ సంపాదకత్వంలో వచ్చిన 'సఖా' రామానంద చటర్జీ నేతృత్వంలో బయలుదేరిన 'ముకుల్' పత్రికలు బాలసాహిత్య అభివృద్ధికి రాచబాట వేశాయి.

ఇరవై శతాబ్ది ప్రారంభంలో అవనీంద్రనాద ఠాగూరు, రవీంద్ర ఠాగూరు బాల సాహిత్య రంగంలో ప్రవేశించారు గద్యం కూడ పద్యంలాగే సంగీత మధురిమలతో ఉండే కొత్తశైలిలో అవనీంద్రనాథ ఠాగూరు గారు రజ కహినీ, శకుంతల, ఖిరేర్ పుతీల మొదలైన రచనలు, రవీంద్రనాథఠాగూర్ ఖేల్‌ఖేలశిరు, ముకుట, డాక్‌ఖర్, హాస్య కౌముది – మున్నగు విఖ్యాత రచనలుచేసి నవీన బెంగాలీ బాల సాహిత్యానికి మార్గ దర్శకులైనారు. వారు చూపిన మార్గంలో సర్వశక్తి సంపన్నులైన దక్షిణరంజన్ మిత్రమజుందార్, సత్యచరణ్ చక్రవర్తి, జోగింద్రనాథ్ సర్కార్ గేయాలను, హేమేంద్రకుమార్‌రాయ్, సురేంద్ర మోహన్ ముఖర్జీ కథలను, ఖోజేంద్రనాథ్ బెనర్జీ, జోగేంద్రనాథ్ గుప్త చరిత్ర రచనలను చేసి బెంగాలీ బాలసాహిత్యాన్ని సర్వ సమృద్ధం చేశారు. ప్రేమేంద్రమిత్ర, క్షితీంద్ర నారాయణ భట్టాచార్య వైజ్ఞానిక కల్పనా సాహిత్యాన్ని రచించారు. జోగింద్రనాథ గుప్త శిశుభారతి పేరుతో బాల విజ్ఞాన సర్వస్వాన్ని ప్రచురించారు. పిల్లల నాటికలకు బెంగాలీ భాష పెట్టింది పేరు. సమర్

చటర్జీ నాటకరంగంలో అనేక కొత్త ప్రయోగాలను చిల్డ్రిన్స్ లిటిల్ థియేటర్ ద్వారా చేశారు అఖిల నియోగి సపనబరో ప్రేమేంద్ర మిత్ర ప్రశంశాత్మకమైన నాటికలను రాశారు.

ఇపుడు బెంగాలీలో పిల్లల పత్రికలు అపారంగా వెలువడుతున్నాయి వాటిలో ఉప సందేశ్, శిశు భారతి, సుకతార, రామ్‌ధున్, ఝులిమిలి మొదలైనవి బహుళ ప్రచారాన్ని అందుకున్నాయి బాలసాహిత్యం రచన, రేఖాచిత్రణ, ముద్రణ – అన్ని రంగాలలో అభివృద్ధి చెందిన భాషలలో బెంగాలీ బాలసాహిత్యం ప్రముఖమైనది.

మరాఠీ

స్వాతంత్ర్యానికి పూర్వం వెలువడిన మరాఠీ బాలసాహిత్యం పెద్దగా లేదు. బొంబే ఎడ్యుకేషన్ సొసైటీ పూనుకొని క్రైస్తవ మత ప్రచారకులు కొందరు – బాలగోష్ఠి, బోధకథ, బాల మిత్ర – మున్నగు పుస్తకాలను ప్రచురించారు. మొదటి ప్రపంచ యుద్ధం తర్వాత బాలలకోసం 'ఆనంద బాలపత్రిక' వెలువడింది. ఆ పత్రికలో గోవింద ఆప్టే, హరినారాయణ ఆప్టే మున్నగువారి రచనలు ప్రచురింప బడేవి. ఈ పత్రికకు వచ్చిన ఆదరణతో బాలోద్యాన్, ఖచ్చోంకా మాసిక్, ఖేలోధ్యాన్ –యిత్యాది బాలపత్రికలు వెలిశాయి.

ఈ తరుణంలో మహారాష్ట్ర ప్రభుత్వం బాలల రచనాలయాలను నిర్వహించి బాలల రచయితలను బాగా ప్రోత్సహించింది. ఈ ఉత్సాహంతో వి డి కరండికర్, మంగేశ్ మండుగోంకర్, లీలాభగత్, తారాబాయి మోదక్, మాధురీరాజా లయబద్ధమైన గేయాలను రాశారు మాలతీ దండేకర్, కావేరి కార్వే, తారాబాయి మధోక్, వి. కె నెరూర్ కర్ బాలలకోసం చక్కని కథలను రాశారు. డి. యన్. శ్రీకేజీ యధునాథ్ తట్టీ, ఎస్ ఆర్. దేవకే, అరవింద తట్ కే, యం.వి. గోఖలే బాలల కోసం జీవిత చరిత్రలను రాశారు.

మరాఠీ నాటకి రంగం ప్రసిద్ధమైనది. అందు పిల్లల నాటికా విభాగం తక్కువది గాదు పి.కె ఆత్రే రాసిన నాటకం 'గురుదక్షిణ' బహుళ ప్రచారమైనది. యన్.జి. తమండ్కర్, రత్నాకర్ మట్కారీ, శుక్ల, సుధా కాణ్కర్ భాలే చంద్ ఖడే, అనంత కర్నేకర్ బాలలకు ప్రదర్శన యోగ్యము, వినోద – ప్రమోదాత్మకమైన నాటికలను రాశారు ఒ కేల్కర్, గజానన్ క్షీర్‌సాగర్, పి. జి విద్యాలయ, కిశోర్ బాపట్ మొదలైన రచయితలు ప్రత్యేకంగా విజ్ఞానశాస్త్ర రంగంలో గణనీయమైన రచనలు

చేశారు ఈ సందర్భంలో మరాఠీ బాలకుమార్ సాహిత్య సమ్మేళన్ చేస్తున్న కృషి బహుధా ప్రశంసనీయమైనది. ఈ సంస్థ ఉత్తమ గ్రంథాలను ప్రచురించడమేగాక "బుక్‌క్లబ్బు"...లు పెట్టి పుస్తకాల అమ్మకాన్ని, చదివే అలవాటును ప్రోత్సహించింది. దీనికి ప్రోత్సాహకరంగా, ప్రభుత్వం బాలల గ్రంథాలకు బహుమతులివ్వడం, కొన్ని బాల పత్రికలకు - వాటి ప్రత్యేక సంచికలకు గ్రాంటు యివ్వడం, రాష్ట్రమంతటా గల గ్రంథాలయాలకు బాలసాహిత్యం సరఫరా చేయడం మున్నగు ప్రశంసాత్మకమైన విధానాలద్వారా బాలసాహిత్యం మరాఠీ భాషలో బాగా అభివృద్ధి చెందింది.

## ఉర్దూ

ఇతర భాషలవలె ఉర్దూలోనూ పంచతంత్ర కథలు, జానపద కథలు బాగా ప్రచారంతో ఉన్నాయి ఆ స్థితిలో కొత్త పద్ధతిలో తొలిసారిగా బాలసాహిత్యాన్ని ఉర్దూలో సృష్టించిన కవి నజీర్ అహ్మద్. "ఈతడు తన కూతుకి, కుమారునకు నాలుగు పేజీలు పాఠ్య విషయాలను రాసి యిచ్చి వారిచే చదివించేవాడు. కూతురు రాసిచ్చిన కాపీకి "మిరాతుల్ ఉరూస్" (వధూదర్పణం) అని పేరు పెట్టి, ఆడపడుచుగా, కోడలుగా స్త్రీ నిర్వహించవలసిన విధులనందు తెలిపారు కొడుకు పేరు 'చండ్‌పంద్'. ఇందు జీవన సమస్యలను పురుష డెదుర్కొనుటకు ఉపయోగించు విషయములు తెలిపెను." ఈ రచనలు తొలితరంలో బిడ్డలను బాగా ఆకర్షించాయి.

అప్పటివరకు భావుకత్వం, రసదృష్టి ఎక్కువగా నున్న వాచకాల స్థానంలో ఇస్మాయిల్ మరాఠీ వాస్తవదృక్పథాన్ని పెంపొందించే వాచకాలు రాశారు. బాలసాహిత్య ప్రగతికి జీవితాన్ని అంకితంచేసిన ఇతణ్ణి "బచ్చోంకా ఇస్మాయిల్" అని అంటారు.[7] ఇతని వాచకాలు బాలసాహిత్య మంటే అభిరుచిని పిల్లలకు కలిగించాయి. ఇస్మాయిల్ రచనల ప్రభావం వలన కొత్తరచయితలు రంగంలోకి వచ్చారు. లాహోర్ నుంచి పిల్లలకోసం 'మస్తూజ్‌లీ' అనే బాలల పత్రిక ప్రారంభమైనది. ఔరంగాబాద్‌నుంచి 'అతాలీఖ్' అనే పత్రిక వెలువడింది. "పుట్టుకతో ఎవరూ రచయితలు కారు. వారికి తగిన తర్ఫీదు నిచ్చి, వారిలో అణగిఉన్న శక్తిని ప్రజ్వలింపజేయాలి." అనే నమ్మకం మీద బాలల బాలికల రచనలను వారిచేతే దిద్దించి అచ్చువేసేది. ఇదొక నూతన ప్రయోగం.

..............................

7 సౌజిదా, జీనత్. బాలసాహిత్యానికి జీవితం అంకితం చేసిన ఉరుదూ మహాకవులు, 1977 సంచిక, 205 పు.

మహాదార్శనికుడు, కవి మహమ్మద్ ఇక్బాల్ బాలలకోసం 'సారే జహా సే అచ్ఛా యే హిందూస్థాన్ హమారా' వంటి ప్రసిద్ధ దేశభక్తి గేయాలు రాశారు. భారత మాజీ రాష్ట్రపతి జాకీర్ హుస్సేన్ తొమ్మిదో ఏట అకాల మరణం చెందిన తనబిడ్డ రుకైయా రెహనా పేరిట ఆమెకు తాను చెప్పిన తీరులో ఎన్నో కథలు రాశారు. "అబ్బూ ఖా కి బక్రీ ఔర్ దూస్‌రీ కహానియా" జాకీర్ హుస్సేన్ రచనలలో ప్రసిద్ధి చెందిన గ్రంథం. "దేశభక్తి, దైవభక్తి, మానవభక్తినీ ప్రచారం చేసే ఈ కథలు మానవ జీవనంలోని మంచికి అద్దముపట్టి, భంగ్యంతరంలో పెద్దలకు నీతిని బోధించును. ఈ కథలు నిర్మలమైన సరోవరమువలె చల్లని జీవదానము చేయును" వీరుగాక షఫీయుద్దీన్ నయ్యరు, అధర్ ఫర్ వేజ్, అఖ్బర్ అఫ్సర్, అతిపున్నీసా బేగం, జీనత్ సాజితా ప్రసిద్ధిపొందిన ఉర్దూ బాలసాహితీ వేత్తలు. వీరి రచనలను ఉరుదు బాలలచే ఆదరింపబడుతున్నాయి.

## గుజరాతీ

ప్రాచీన సాహితీ వైభవం మెండుగా గలది గుజరాతీ వాఙ్మయం. దానికి దీటైనది బాలవాఙ్మయం. గుజరాతీల చరిత్ర, నాగరికత, వీరోచిత గాథలు తెలిపే గేయాలు జానపద సాహిత్యంలో అపారంగా ఉన్నాయి. ఆ పునాది పైనే నవీన బాల సాహితీ సౌధనిర్మాణం జరిగింది. గుజరాతీ వాఙ్మయ వైతాళికుడు, కవి పిల్లలకోసం తొలిసారిగా గేయాలను రచించారు. వారి ననుసరించి నర్శింహారావుగారు నవలారామ్, ఖబర్దార్, లలిత మొదలైన గేయకావ్యాలను రాశారు. హెచ్. జి అన్జారియాగారు మధుబిందు 1915 గేయాలను ప్రచురించారు ఆకాలంలో ప్రసిద్ధ గుజరాతీకవి బాలల కోసం రెండు గేయ సంకలనాలను ప్రచురించారు. మరికొందరు ఉత్సాహవంతులు దాదాపు అరవై సంవత్సరాల క్రితం బాలలకోసం కుమార్, బాల్‌జీవన్, బాలమిత్ర మొదలైన పత్రికలను ప్రారంభించారు. ప్రసిద్ధ దిన పత్రికలు బాలల శీర్షికలను ప్రవేశ పెట్టాయి.[8]

భారత స్వాతంత్ర్య సంగ్రామంలో గాంధీజీ అడుగుపెట్టాక-ఆ ప్రభావం గుజరాతీ బాల వాఙ్మయంపై పడింది. గుజరాతీ విద్యాపీఠ, నవజీవన్ కార్యాలయం,

..............................

8. Soni, Ramanlal. Juvenile Literature in Gujarati, 1974 Conference. 14 p.

సస్తా సాహిత్య, బాలవినోద– మొదలైన సంస్థలు–కాకా కాలేల్కర్, గిజుభాయి, హంస మెహతా, నట్వర్‌లాల్ మౌళ్వి–మొదలైన రచయితల ద్వారా దేశభక్తి, అహింస మొదలైన ప్రబోధ రచనలను ప్రచురించాయి. రతిలాల్‌నాయక్ శాస్త్రీయ కాల్పనిక రచనలు చేశారు. విద్యాగుప్త మౌర్య 'ఆకాశయాత్ర' మొదలైన విజ్ఞాన శాస్త్ర రచనలు చేశారు.

జగత్‌రామ్ దవే, యశ్వంతి పాండ్యా, శ్రీధరని, లీలాబెన్ మంగళదాస్, రామ్‌లాల్ సోనీ బాలల కోసం మంచి నాటికలను రాశారు. ప్రసిద్ధులయిన కవులు, జాతీయ నాయకుల, శాస్త్రవేత్తల జీవిత చరిత్రలను బాలాజీ దేశాయి, జుకుల్‌భాయి, మనుబెన్ గాంధీ, మగన్‌భాయి మొదలైన వారు రాశారు.

బాలల పత్రికలకు గుజరాత్ ప్రసిద్ధి ఇచటగల బాలల పత్రికలు మరే భాషలో లేవు బాలజీవన్, కుమార్, గాండీవ, బాలసందేశ్, జగ్‌మగ్, రసరంజన్, రమకణు, బాలమిత్ర–మున్నగునవి కొన్ని పత్రికలు. వీటిలో జగ్‌మగ్, బాలసందేశ్ వార పత్రికలు ఈ పత్రికలు సంఖ్యలో మాత్రమే ఎక్కువ ప్రమాణాలు తక్కువ"[9] మొత్తం మీద గుజరాతీ బాలవాఙ్మయం ఇటీవలి కాలంలో బాగా అభివృద్ధి చెందుతూంది అది నాణ్యతలో గూడ అభివృద్ధి సాధించినపుడు మరింత ప్రయోజనకరంగా ఉండగలదనడంలో సందేహం లేదు.

## కాశ్మీరీ

ప్రపంచంలోకి ఎత్తైన హిమాలయ సానువుల పరిసర ప్రాంతాలలో జమ్మూ, కాశ్మీర్ రాష్ట్రం శోభాయమానంగా విలసిల్లుతూ ఉంటుంది. ప్రజల భాష కాశ్మీరీ. జానపద కళాసంపదకు నిలయం. రమణీయమైన ప్రకృతి, పక్షులు, వారి జానపద గేయాలలో ప్రతిబింబిస్తూ ఉంటుంది. వారి నమ్మకాల ప్రకారం "హూమా" అనే పక్షి సంపదకు చిహ్నం గుడ్లగూబ మంత్ర తంత్రాలకు చిహ్నం. చిలుక చతురతకు చిహ్నం. ఈ పక్షులపై పిల్లలు ఎన్నో పాటలు పాడుకొంటారు. విదేశీ విద్వాంసులు

..............................

9 "It must however be added here, that through the bulk of work published in these dailies and weeklies is mounting higher the total literary merit is not so high".
Ibid, 17 p.

రెవరెండ్‌నోల్స్, సర్ అరుల్ స్టేన్ పిల్లల పాటలను, కథలను, సామెతలను అపారంగా సేకరించి భద్రపరిచారు.[10]

స్వాతంత్ర్య ప్రాప్తి వరకు కాశ్మీరీ భాషలో పిల్లలకోసం ప్రత్యేకంగా రచనలు రాలేదని చెప్పాలి. 1955లో భారత ప్రభుత్వం ఏర్పరచిన పోటీల ప్రోత్సాహం వలన కొన్ని రచనలు వచ్చాయి. వాటిలో బహుమతుల నందుకొన్న శంభునాథ్ భట్ గారి "బాల్‌యార్" ఎస్. ఎన్. కౌల్‌గారి "మార్చాపి పిన్‌త ఛాంచీ పూత్, ఎస్. ఎల్. సాధుగారి "డాన్ క్విక్ సెట్" మొదలైనవి చెప్పుకోదగినవి. ఈ రచనలకు వచ్చిన ఆదరాన్ని పురస్కరించుకొని ఫజిల్ కాశ్మీరీ, నాజీ మన్వార్, జేతార్ కిష్ణ రాహ్‌బార్ మొదలైన కవులు కాశ్మీరీ బాలగేయాలను రచించారు.[11] శ్రీనగర్‌లోని ఆకాశవాణి కేంద్రం బాలసాహిత్యానికి చక్కని అవకాశం ఇచ్చింది.

ఏమైనప్పటికీ కాశ్మీరీ భాషలో బాలసాహిత్యం తగినంతగా అభివృద్ధి చెందలేదు. ఇచట లిపి ఒక పెద్ద ప్రతిబంధకం. ఇంతకాలమూ కాశ్మీరీ భాషను ఉర్దూ, లిపిలోనే రాసేవారు. ఇటీవల కాశ్మీరీ భాషకు ప్రత్యేక లిపి ప్రభుత్వ సహకారంతో ప్రవేశ పెట్టబడింది. కొత్త లిపి ఇంకా బాగా ప్రచారంలోకి రాలేదు. కొత్త లిపిలో వాచకాలు వచ్చాయి. బోధన ప్రారంభమైనది. త్వరలో బాలసాహిత్యంలో రచనలు రాగలవని ఆశింపబడుతున్నది

ఒరియా

మనకు సమీపంలోని ఒరిస్సా దేశంలోని బాలసాహిత్యానికి నూరేళ్ళ పైబడిన చరిత్ర ఉంది. అంతకు ముందుగా ప్రచారంలోగల జానపద బాలసాహిత్యాన్ని గోపాలచంద్ర ప్రహరాజ శిశుగీతాలు, గేయగీతాలు, క్రీడాగీతాలు అని మూడు భాగాలుగా విభజించి ప్రచురించారు "పదవాక్య పునరుక్తులతో పిల్లల మనస్తత్వానికి సరియగు సరళ శైలిలో నున్న ఈ సాహిత్యం పిల్లలను ఆటపాటలకు ప్రేరేపించుటే గాక వారి మానసిక వికాసానికి ఎంతైనా దారితీస్తూ వచ్చింది." ఆధునిక బాలసాహిత్య నిర్మాతలలో గోప

..............................

10 Kaul, S. N. Juvenile Literature in Kashmiri. Bhuvaneswar All India Juvenile Literary Conference, 1974, 23 p.

11 Sadhu, S. L. Children's Literature in Kashmiri. Bhuvaneswar, All India Juvenile Literary Conference, 1974. 29 p.

బంధుదాసు ప్రముఖులు. వీరు ఈసపు కథలు, హితోపదేశకథలు, గ్రిమ్స్ కథలు చక్కని వచన రచనలో రాసి పిల్లల ఆదరాభిమానాలను చూరగొన్నారు. ఆతర్వాత కాళిందీ చరణ పాణిగ్రహి ఒరియా బాలసాహిత్య భాండాగారాన్ని సమృద్ధి పరిచారు. వారి సమకాలికులైన గోపాల్ చంద్ర ప్రహరాజ్ ప్రాచీన జానపద కథలను ఉత్కళ కహానీ పేరుతో ప్రచురించారు. ఆ తర్వాత సత్యాబ్దగారి పంచశకాన్, పండిత నీలకాంత గారి పిలాంక రామాయణ, పిలాంక మహాభారత మొదలైన రచనలు బాలసాహిత్య ప్రగతికి మార్గం చూపాయి.

చింతామణి ఆచార్య గారి కృషిఫలితంగా ఒరియాలో పంచామృత అనే బాలల పత్రిక 1918లో వెలువడింది. ఆ తర్వాత బాలకృష్ణ కార్‌గారి నేతృత్వంలో 1931 నుంచి జహనామాము అనే పత్రికా ప్రచురణ ప్రారంభమైంది. వారి సంపాదకత్వాన శిశు సంఖాలీ పేరుతో తొలి విజ్ఞాన సర్వస్వం వెలువడింది 1920 – 47 మధ్య కాలంలో అనేక మంది రచయితలదృష్టి బాలసాహిత్యం వైపుకు మరలింది.[12] వారిలో గోదావరిశ్ మహాపాత్ర, ఉద్యానాధ్ సారంగి, కిృష్ణ చంద్రకార్, ఉపేంద్ర త్రిపారీ మొదలైన వారు ముఖ్యులు. భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చాక ఒరియా బాలవాఙ్మయంలో చెప్పుకోదగిన అభివృద్ధి వచ్చింది. ఆర్. కె నందా సంపాదకత్వంలో సంసార (1951), బి. కనుంగో సంపాదకత్వాన శిశు సంపద్ (1954), రామ్ ప్రసాద్ మహంతీ సంపాదకత్వంలో మీనా బజార్ (1956) మొదలైన పత్రికలు వెలువడ్డాయి.[13] అత్యంత ప్రజాదరణ పొందిన దిన పత్రికలు–ప్రజాయత, మాతృభూమి, కళింగ, సమాజ్–బాలల శీర్షికలను ప్రవేశపెట్టి బాలసాహిత్యాన్ని ప్రోత్సహించాయి[14] ఈ ఉత్సాహంతో ఉపేంద్ర త్రిపారీ, ఉదయనాధ్ సారంగ, జగన్నాథ్ మెహంతీ, కుంజ బేహారీదాస్, బంచనిధిదాస్, రామ్ప్రసాద్ మెహంతీ మొదలైన వారు గేయ సాహిత్యాన్ని కిృష్ణచంద్రకార్, ధానేశ్వర్ సత్పతి, ఉద్యానాధ్ సరంగి, జి. ఎ. ధాల్, దుర్గా ప్రసన్న పాట్నాయక్, అంతరాసు మిశ్ర మొదలైన

..............................

12 విజయరాఘవరెడ్డి, పోలి. ఉత్తరభారత బాలసాహిత్యము, 1977 బాలల మహాసభ సంచిక. 241 పు.

13 Nanda, Bamakrunaha Growth of Children's Literature in Oriya Bhubhneswar, All India Juvenile Literagy Conference, 1974. 41p.

14. Mohanty, J. B. A Survey of Juvenile Literature in Oriya (Ibid) 44 p.

వారు కథావాఙ్మయాన్ని పరిపుష్టంచేశారు. లక్ష్మీకాంత మహాపాత్ర, బినోద్‌కనుంగో గోకులానంద మహాపాత్ర విజ్ఞాన శాస్త్రంలో చక్కని రచనలు చేశారు. ఈ విధమైన ఉత్తమ రచనలతో ఒరియా బాలసాహిత్యం బాలల మధ్య మంచి ప్రచారంలో ఉంది.

### అస్సామీ

మనదేశపు సరిహద్దున ఉన్న రాష్ట్రం అస్సాం. ఇది ప్రధానంగా గిరిజన ప్రాంతం. సమంగా లేనిది గనుక 'అసమము' అస్సాం అంటారట. దీని ప్రాచీన నామం 'కామ రూపం' మంత్రతంత్రాలకు ప్రసిద్ధిగాంచినది. గిరిజనులు, వెనుకబడిన వారు ఎక్కువగా ఉంటారుగనుక వీరి తాలూకు జానపద సాహిత్యం అపారంగా ఉంటుందన డంలో సందేహంలేదు. విద్యా వ్యాసంగాలు పెద్దగాలేని ప్రాంతం గనుక జానపద సాహిత్యం మౌఖికంగానే నిలిచిపోయింది అచ్చయినది స్వాతంత్ర్యానంతరానికి ఏమీ లేదని చెప్పాలి. ఆ తర్వాత బాలసాహిత్యానికి కొంత ప్రోత్సాహం లభించింది. ఔత్సాహవంతులు అరుణోదయ మాస పత్రికను ప్రారంభించారు. అందులో బాల సాహిత్యానికి ప్రత్యేక విభాగం కేటాయించడం వలన బాలసాహిత్య ప్రగతికి సుగమ మార్గం ఏర్పడింది. ఈ పత్రికద్వారానే "బాయిబలేర్ సాధు, అఫ్రికర్ కోంబర్, మాపురి ఛో బాలి, ఈగలర్ బాహ" మున్నగు ప్రసిద్ధ రచనలు ప్రచురింప బడ్డాయి ప్రాచీనకాలం నుంచీ అస్సాంలో దేవతల కథలు, రాజులకథలు, మంత్రతంత్ర కథలు చాలహెచ్చు. అందు కనుగుణంగా బాలసాహిత్యంలో "నిమాతికన్య, సపోన్‌కు వారి, పరీర్ దేశర్, అంజిమణి, రాణి హిమాణి, పింపిం పరువార్ మొదలైన కథలు అనేకం వచ్చాయి. లోక ప్రియ గోపీనాధ్ బర్‌దలై, శహద్ కనకలత-మొదలైన త్యాగమూర్తుల జీవిత చరిత్రలు బాలలకోసం రచింపబడి వారిలో దీప్తిని, స్ఫూర్తిని ప్రసాదించాయి. మయినా పారిజాతం, చమనీయ సాహిత్యసంస్థ, చమనీయ శిల్ప సాహిత్య సంస్థ మొదలైన సాహిత్య సంస్థలు, దీపక్, నతునబేలీ-మున్నగు బాలల పత్రికలు అస్సామీ బాలసాహిత్యాభివృద్ధికి గొప్పగా కృషిచేశాయి.

### పంజాబీ

ఏవో కొన్ని జానపద గేయాలు, కథలు తప్ప ఈ శతాబ్దానికి పూర్వం తెలుగులో బాలసాహిత్యం లేదనేచెప్పాలి. ఈ శతాబ్ది తొలి పాదంలో మాస్టర్ కరణసింహ గంగావాలా ఒక విప్లవాత్మకమైన మార్పును తెచ్చిపెట్టారు వీరు చూపిన మార్గంలో పంజాబీ బాలలకోసం బాలక్ (1934), బాలసందేశ్ (1942) మొదలైన పత్రికలు వెలుగులోకి వచ్చాయి. ఈ పత్రికలే బాలసాహిత్య అభివృద్ధికి దోహదం కల్పించాయి.

కాలికశలో జ్ఞానీ లాలసింహ గుజరావాలా బాలలకోసం 15 పుస్తకాలను ప్రచురించి మార్గదర్శకులయ్యారు. ధనవంత సింహ సీతల్ ఒక్క చేతిమీదుగా బాలల కథలు, నవలలు, జీవిత చరిత్రలు నూరుకు పైచిలుకు రాశారు. ఆ తర్వాత గురుబక్ సింగ్ ప్రీతలారీ, పూలన్ రానీ, అజిబ్ ఛిచేర్కర్, గురుదయార్ సింగ్ ఫూల్, జగదీశ్ సింగ్, దేవ్‌దత్ గోపాల్ బాలలకోసం పంజాబీలో మంచి రచనలు చేశారు.[15] 1963లో పంజాబీ ప్రభుత్వ విద్యాశాఖ బాలసాహిత్యంలో శిక్షణాలయాన్ని నిర్వహించింది పోటీలు జరిపి బహుమతులను అందించింది. ఈ రెండు సంఘటనలు పంజాబీ బాల సాహిత్య ప్రగతికి తోడ్పడ్డాయి. దీనితో గురుదయాల్ సింగ్, కుల దీప్ సింగ్ సౌధీ, హరిందర్ సింగ్, బాల్‌జిత్ సింగ్ బాలి, జె.ఎస్. బావా, భూపాల్, తారాలోచన్ సింగ్, మోహిందర్ సింగ్ ఔసింగ్— మొదలైన యువరచయితలు కొత్త పద్ధతిలో రచనలు చేసి పలువురి ఆదరాభిమానాలను చూరగొన్నారు.

1967లో గురుగోవింద సింగ్ మూడవ శత జయంతి జరిగింది. ఆ సందర్భంలో గురుగోవిందసింగ్ ఫౌండేషన్ బాల సాహిత్య అభివృద్ధికి ఒక పథకాన్ని తయారు చేసింది. ఈ పథకం ప్రకారం జగదీశ్‌సింగ్ 3–5 వయసుగల పాపలకు, గురుదయాల్ సింగ్ ఫూల్ 6–8 వయసుగల పిల్లలకు, షెమ్‌షేర్ సింగ్ 9–11 వయసుగల పిల్లలకు, నరీందర్‌సింగ్ 12–14 వయసుగల పిల్లలకు అనువైన రచనలు చేశారు. 1969లో గురునానక్ శత జయంతి జరిగినప్పుడు కూడ కొంత బాల సాహిత్యం వెలు వడింది. పంజాబీ విశ్వవిద్యాలయంలోని భాషా విభాగం కొన్ని పుస్తకాలను ప్రచురించింది. ఇటీవలి కాలంలో బాలల రచనలు వయసుల వారీగా రాసే విధానం ప్రవేశపెట్టబడింది. శాస్త్రీయమైన యీ నూతన ప్రయోగంలో డాక్టర్ జస్వత్‌గిల్, గురుదయాల్ ఫూల్, గూడియన్ సింగ్ మొదలైన వారు యీ రంగంలో చెప్పుకో దగిన కృషిచేశారు.

## సింధీ

జగత్ప్రసిద్ధి చెందిన సింధు నాగరికత, సంస్కృతులకు ప్రతీకగా సింధీ సాహిత్యం అభివృద్ధి చెందింది. బాలసాహిత్య అభివృద్ధికి బ్రిటీషు పాలకులు తగిన దోహదం చేశారు. ప్రచారంలో ఉన్న పిల్లల కథలను పాఠ్య గ్రంథాలలో చేర్చారు

..............................

15 Phul, G. S. Children's Literature in Panjabi, Bhuvaneswar. All India Juvenile Literary Conference, 1974. 51 p,

పదునెనిమిదవ శతాబ్ది తుది పాదంలో, పంతొమ్మిదవ శతాబ్దంలో పంచతంత్ర కథలకు, యితర పక్షుల, జంతువుల కథలకు మంచి ఆదరణ లభించింది

దయారామ్ గిడుమల్, సాధుహరినంద, కోరుమల్ చంద్రమల్ మొదలైన వారు పిల్లలకోసం సాంఘికపరమైన కథలు రాసి కథాసాహిత్యానికి నాంది పలికారు. ఖేరుమల్ మహర్ చంద్ బాలలకు నీతిపరమైన గేయాలను లయబద్ధంగా రాశారు. బాలల మనస్తత్వాన్ని ఎరిగిన కిషన్‌చంద్ బెస్వాన్ పిల్లలకోసం బాలగేయాలురాసి బాల సాహిత్య ప్రగతికి మార్గదర్శకుడైనాడు. దాదాసేవక్ భోజ్‌రాజ్ మొత్వాని సింధీ బాలసాహిత్యచరిత్రలో మరపురాని వ్యక్తి. వారు బాల్యాంజీబారీ పేరుతో ఒక బాలానంద సంఘాన్ని గుల్షాన్ పేరుతో బాలల మాసపత్రికను స్థాపించారు ఆ తర్వాత చందులాల్ జైసింఘానీ పూల్ మల్హా పేరుతో కొత్త పత్రికను, లార్ ఖానా, భగవాన్ సదారంగని బాలక పత్రికను స్థాపించారు. ఈ పత్రికలు బాలసాహిత్య ప్రగతికి దారిచూపాయి.[16] ఆ తర్వాత మేరామ్ వాస్వానీగారి రచనలు బాలరామాయణం, బాల భారతం బహుళ ప్రచారాన్ని అందుకున్నాయి. గోవర్ధన్ గియాల్ బాలలకోసం గేయాలనేగాక అనేక విషయాలపై రచనలు చేశారు. భారత ప్రభుత్వ బహుమతి పొందిన రచనలు–పరసురామ్ జియాగారి "బాగ్‌బహర్" కె.జె. గోజియా గారి జ్యోతి దీపక్‌చంద్ తిలోక్‌చంద్ జవహర్ దర్శన్ దయార్ ఆశాగారి "మేకుందర ము్కియాన్" బాలలలోకం బాగా ప్రసిద్ధి చెందాయి పిల్లలకు నీతిబోధ చేయడానికి పి.బి. చంద్వాని, గోపాల్‌దాస్ జయమిత్ర మంచి రచనలు చేశారు.

## దక్షిణ భారత భాషలు

### తమిళం

అత్యంత ప్రాచీనమైన చరిత్ర కలిగిన భాష తమిళం. ఈ భాషలో వందలాది సంవత్సరాలనుంచి పెద్దల రచనతో బాటు సరళమైన భాషలో పిల్లల రచనలు చోటు చేసికొని ఉన్నాయి ఆ ప్రభావం బాలసాహిత్యం దశదిశల అభివృద్ధి చెందడానికి తోడ్పడింది. ఇతర దక్షిణ భారత భాషలవలె తమిళంలో కూడ

..............................

16 Asha, Dayal, Progress of Children's Literature in SINDHI Language. Bhuvaneswar, All India Juvenile Literary Conference, 1974. p. 56.

